# ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనలో కమ్యూనిస్టు పార్టీ మహోజ్వల పాత్ర




పరకాల పట్టాభి రామారావు

(స్వాతంత్ర్య సమరయోధులు,

కమ్యూనిజం పత్రిక సంపాదకులు)



ప్రచురణ

సంఘమిత్ర ప్రచురణలు

విజయవాడ

Sanghamitra Publications - 4 August 2001

# Glorious role of the Communist Party in the Andhra National Renaisance Movement

by

**Parakala Pattabhi Rama Rao**

Freedom Fighter, Editor The Communism

*Rs. 50/-*



**ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనలో**
**కమ్యూనిస్టు పార్టీ మహోజ్వల పాత్ర**

**పరకాల పట్టాభి రామారావు**

స్వాతంత్ర్య సమరయోధులు, కమ్యూనిజం మాసపత్రిక సంపాదకులు

**వెల రు. 50/-**

ప్రతులకు : ప్రచురణకర్త, **పరకాల అహల్యాదేవి**
సంఘమిత్ర ప్రచురణలు, 32-13-53-7/ఎ, జర్నలిస్టుకాలనీ, మొగల్రాజపురం
విజయవాడ-520 010. ఫోన్ : 474635
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**, విజ్ఞాన్‌భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 500 001.
**విశాలాంధ్ర బుక్‌హౌస్**, విజయవాడ, విశాఖపట్నం, కాకినాడ, గుంటూరు, అనంతపురం, హనుమకొండ, తిరుపతి

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్, చంద్రంబిల్డింగ్స్, విజయవాడ-4. ఫోన్ : 430302

# మా తండ్రి దివ్యస్మృతికి . . .



**పరకాల వెంకట సూర్యనారాయణగారు**

**(1894 - 1952)**

చిలకమర్తి లక్ష్మీనరసింహం, మొక్కపాటి నరసింహశాస్త్రి, అడవి బాపిరాజు మున్నగు మహనీయులు చదివిన పురాతన నర్సాపురం టైలర్ స్కూలులో మా తండ్రి పరకాల వెంకట సూర్యనారాయణగారు విద్యనభ్యసించారు. జాతీయోద్యమ అభిమానులుగా హిందీ అభ్యసించారు. ఆయుర్వేద వైద్యులుగా ప్రజలకు సేవ చేశారు. మా యింటిపై జాతీయ జండాతోపాటు కమ్యూనిస్టు పార్టీ ఎర్రజండాను నేను, నా సోదరుడు రమణరావు ఎగురవేసినప్పుడు సహృదయతతో సమ్మతించినవారు. 1948-52 తీవ్ర నిర్బంధ కాలంలో మా సోదరులిద్దరము ఏ క్షణంలోనైనా పోలీసు కాల్పులకు గురి అయ్యే ప్రమాదకర పరిస్థితుల్లో తీవ్ర మనస్థాపానికి గురియై చివరకు ఆ దిగులుతోనే సకాలంలో తగు వైద్యం చేయించుకోక క్యాన్సర్ వ్యాధితో 1952లో అకాలమృతిచెందారు. వారి దివ్యస్మృతికి ఈ గ్రంథం సమర్పిస్తున్నాను.

# దేశభక్తి గేయం

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్!

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటు పడవోయ్
తిండి కలిగితె కండగలదోయ్!
కండకలవాడేను మనిషోయ్!!

దేశాభిమానం నాకు కద్దని
ఒట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని ఏదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్!

స్వంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్

చెట్ట పట్టాల్ పట్టుకొని దే
శస్థులంతా నడువవలెనోయ్,
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్!

మతం వేరైతేను ఏమోయ్?
మనసు లొకటై మనుషులుంటే
జాత మన్నది లేచి పెరిగీ
లోకమున రాణించునోయ్!

- మహాకవి గురజాడ అప్పారావు
(1910)

# విషయసూచిక

**మూడవ భాగం**



**నాల్గవ భాగం**



**అయిదవ భాగం**



**ఆరవ భాగం**

# మనవి మాట

ఇది 1942-48 నాటి చరిత్ర.

నేటికి అర్ధశతాబ్దం పైబడిన నాటి చరిత్ర.

నవయుగాంధ్ర నిర్మాతలు కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి, కొమర్రాజు లక్ష్మణరావు ప్రభృతులు ప్రారంభించిన ఆంధ్ర జాతీయ పునరుజ్జీవ నోద్యమాన్ని నాటి కమ్యూనిస్టు పార్టీ కొనసాగించడానికి మహత్తర కృషిచేసిన నాటి చరిత్ర.

స్వాతంత్ర్య సమరంతోబాటు సాంఘిక, సాహిత్య, సాంస్కృతిక రంగాలలో కమ్యూనిస్టు ఉద్యమం ఆంధ్రదేశంలో అపూర్వమైన విప్లవం తీసుకొనివస్తున్న నాటి చరిత్ర.

బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగించిన స్వాతంత్ర్య సమర అంతర్భాగంగా ఫ్యూడల్ జమీందారీ, భూస్వామ్య విధానాలకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన పోరాటాలు సాగిస్తూ మార్క్సిస్టు సిద్ధాంత అవగాహనతో, చారిత్రక గతితార్కిక భౌతికవాద దృష్టితో సువిశాల జాతీయ విముక్తి పోరాటంగా దీనిని పెంపొందించాలని ఆంధ్రదేశ కమ్యూనిస్టు పార్టీ ఉద్యమించిన నాటి చరిత్ర. చారిత్రక పరిశీలనావశ్యకత దృష్ట్యా దీనినిప్పుడు ద్వితీయదలిచాను.

1938-1948 మధ్య తూర్పు గోదావరి జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరుగా, అటు పిమ్మట పశ్చిమ గోదావరి జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరుగా, జిల్లా యువజన సంఘ కార్యదర్శిగా, జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శివర్గ సభ్యునిగా ఈ ఉద్యమాలలో నావంతు పాత్రను నిర్వహించాను. "నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ధారవోశాను" అన్నట్లుగా ఆనాటి ఆంధ్ర జాతీయ పునరుజ్జీవన కృషిలో నేను కూడా భాగస్వామిగా వున్నాను.

1943 తెనాలి అభ్యుదయ రచయితల సంఘ ప్రథమ మహాసభకు మా జిల్లా ప్రతినిధిగా, అంటే అరసం సంస్థాపక సభ్యులలో ఒకరుగా, అటుపిమ్మట మా జిల్లాలో అరసం, ప్రజానాట్యమండలి నిర్మాతలలో ఒకరుగా కృషి చేశాను. 1944లో బెజవాడలో జరిగిన అభ్యుదయ రచయితల ద్వితీయ మహాసభ ప్రతినిధిగా, జాతీయ మహాకవి చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి స్వీయచరిత్ర ప్రచురణ, సన్మానసభల్లో పాల్గొనే భాగ్యం నాకు కల్గింది. 1944 మే నెలలో వీరేశలింగం వర్ధంతి సభలకు నాంది పలికిన సంయుక్త విజ్ఞాపనకర్తలలో నేనూ ఒకరిని. గురజాడ, గిడుగు, కొమర్రాజు తదితర మహనీయుల వర్ధంతులు నిర్వహించినవారిలో ఒకరిని. స్వతఃసిద్ధంగా నాటక రచయితను కాకపోయినా, ఆనాటి మహోద్యమాల ప్రేరణతో విద్యార్థి, యువజన మహిళా రంగాలను ప్రభావితం చేసే నాటికలు "వడపోత", "భావిపౌరుడు", "వెలుగులోకి", "నాటుమంత్రసాని" మొదలైన నాటికలు, "మరణఘోష" లాంటి గేయాలు రచించడమేకాక, ఈ నాటకాలలో ముఖానికి రంగులు పులుముకొని ఆనాటి కొందరు కమ్యూనిస్టు ప్రముఖులవలెనే నేను కూడా తాత్కాలికంగానైనా రంగస్థలం ఎక్కినవాణ్ణి.

అలాగే ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమంలో స్వర్ణయుగం నెలకొల్పిన చరిత్రాత్మకమైన 1947 మద్రాసు నాల్గవ అభ్యుదయ రచయితల మహాసభలో పాల్గొని ఆనాటి మద్రాసు నగరాన్ని ఉర్రూతలూపి, పరవశింపజేసిన ప్రజానాట్యమండలి సాంస్కృతిక ప్రదర్శనలకు నేను కూడా సాక్షీభూతంగా ఉన్నాను.

ఆనాటి ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమంలో కమ్యూనిస్టు ఉద్యమం నిర్వహించిన

మహోజ్వల పాత్రను, ఆనాటి స్వీయానుభవాలను అక్షరబద్ధం చేయకపోతే అవి చరిత్రగర్భంలో కలిసిపోయే పరిస్థితిలో, ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర మూడవ భాగానికి (1942-48)ఆనాటి విద్యార్థి, యువజనోద్యమ చరిత్రలతోపాటు, ఆనాటి సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ చరిత్రను కూడా వ్రాసే ప్రయత్నంలో సేకరించిన విపుల సమాచారాన్ని ఈ గ్రంథరూపంలో ఈనాటి తరంవారికి సవినయంగా వినమ్రతతో అందించుతున్నాను.

అర్ధశతాబ్ద కాలంనాటి అనుభవాలను జ్ఞప్తికితెచ్చుకోవడంలో, ఆనాటి ప్రజాశక్తి వారపత్రిక, దినపత్రిక, అంతకుముందు పార్టీ పత్రిక నవశక్తి మొదలైనవాటినుండి సేకరించిన సమాచారంలో తేదీలలో ఏవైనా పొరపాటులు దొర్లితే వాటిని నేను సరిదిద్దుకోగలను.

పార్టీ చరిత్ర మూడవ భాగానికి ఈ రంగాల చరిత్ర వ్రాయవలసిందని ప్రేరణయిచ్చిన రాష్ట్ర కమ్యూనిస్టు నాయకులు, రైతు ఉద్యమ నిర్మాతలుఅయిన కామ్రేడ్ వై.వి. కృష్ణారావుగారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. అలాగే తుమ్మల సాహిత్యం గ్రంథంనుండి, సుందరయ్యగారి "తెలంగాణా పోరాట అనుభవాల"నుండి, వారి రచనలనుండి, శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారి "ఆంధ్ర ప్రజానాట్యమండలి" గ్రంథంనుండి, తెలంగాణా సాయుధ పోరాటనేత రావి నారాయణ రెడ్డిగారి స్వీయ చరిత్ర "నా జీవనపథం"నుండి, నార్ల చిరంజీవి, మహీధర రామమోహనరావు, డాక్టర్ వకుళాభరణం రామకృష్ణగార్ల ప్రసంగ వ్యాసాలనుండి, లేఖలనుండి సందర్భానుసారంగా వివిధ విషయాలను ఉటంకించాను. అందుకు కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమాన్ని కొనసాగించిన కమ్యూనిస్టు పార్టీ కృషికి 1948 అనంతరం నాటి కాంగ్రెస్ ప్రభుత్వం సాగించిన దారుణ దమనకాండ ఫలితంగా తీరని విఘాతం ఏర్పడింది. 48-52 మధ్య ఈ అగ్నిపరీక్షకు తట్టుకొని బయటపడిన కమ్యూనిస్టు పార్టీకి 1952 జనరల్ ఎన్నికలలో ఆంధ్ర ప్రజలు ఘనవిజయం చేకూర్చి పాలకవర్గానికి తగు గుణపాఠం చెప్పారు.

అయితే అదే సమయంలో 1948-52 మధ్య తాను అనుసరించిన అతివాద దుస్సాహసిక విధానాలను గుర్తించి ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం ఆత్మవిమర్శ చేసుకొంది. అలాగే మళ్ళీ 1955 మధ్యంతర ఎన్నికలలో అవలంబించిన ఒంటెత్తు పోకడల ఫలితంగా పొందిన తీవ్ర నష్టాన్ని కూడా గుర్తించి ఆత్మవిమర్శ చేసుకొంది. ఈ విషయాలను కూడా ఈ గ్రంథంలో ప్రస్తావించాను.

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమం ఆనాటి చారిత్రక పరిణామాల నుండి తగు గుణపాఠాలు తీసుకొని నేటి విప్లవ దశకనుగుణ్యంగా తన రాజకీయ సిద్ధాంత, విధానాలను రూపొందించుకొని, అసంపూర్తిగా మిగిలిపోయిన ఆంధ్ర జాతీయ పునరుజ్జీవన కర్తవ్యాలను "విశాలాంధ్రలో ప్రజారాజ్య" సంస్థాపన కర్తవ్యాలను నెరవేర్చుతుందని ఆశించుదాం.

ఒకనాటి ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమ వైభవాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని ఆ స్ఫూర్తిని తిరిగి అందుకొనడానికి ఈ గ్రంథం తోడ్పడగలదని ఆశించుతున్నాను. భావితరాలవారికి, చరిత్ర పరిశోధకులకు ఇందులో సమాచారం ఉపకరించగలదని ఆశిస్తున్నాను.

ఇట్లు,
భవదీయుడు
**పరకాల పట్టాభి రామారావు**
స్వాతంత్ర్య సమరయోధుడు
కమ్యూనిజం పత్రిక సంపాదకుడు

విశాలాంధ్ర
విజయవాడ
ఆగస్టు 15, 2001

## మొదటి భాగం

# ఉపోద్ఘాతం

స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజం స్థాపన లక్ష్యంగా రాజకీయ కార్యక్రమాలతోపాటు, ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనానికి కమ్యూనిస్టు పార్టీ బహుముఖంగా కృషి గావించింది.

ఆంధ్ర జాతీయ పునర్వికాసానికి మూలపురుషులైన కందుకూరి, గురజాడ, గిడుగు, కొమర్రాజు లక్ష్మణరావుగార్లు, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో నడిపిన మహోద్యమాల్ని కమ్యూనిస్టు పార్టీ కొనసాగించింది. జాతీయోద్యమ సత్సంప్రదాయాలను నిలబెట్టడానికి కమ్యూనిస్టు పార్టీ పూనుకుంది.

1942-43లో కమ్యూనిస్టు పార్టీ మొట్టమొదటిసారిగా బహిరంగంగా పనిచేయడానికి అవకాశం రాగానే స్త్రీ సముద్ధరణకు విస్తృతమైన ప్రాతిపదికపై మహిళా ఉద్యమాన్ని, యువకులను ఆదర్శపౌరులుగా తయారుచేయడానికి యువజన ఉద్యమాన్ని నిర్మించడానికి పూనుకుంది. ఆంధ్రుల ప్రాచీన కళారూపాలైన బుర్రకథ, వీధిభాగవతం మొదలైనవి పునరుద్ధరించి నూతనమైన ఇతివృత్తాల ద్వారా ప్రజలలో దేశభక్తిని, సాంఘిక చైతన్యాన్ని, విజ్ఞాన ప్రబోధాన్ని కల్గించడానికి పూనుకుంది. కిరాయి నాటకాలతోను, పౌరాణిక నాటకాలతోను విసుగెత్తిన ప్రజలకు, వాస్తవిక ప్రజాజీవితాన్ని చిత్రించే నాటకాలను ప్రదర్శించుటకు ప్రజానాట్యమండలిని ఏర్పరచింది. అదేవిధంగా సాహిత్యరంగంలో ప్రగతి మార్గాన్ని తొక్కిన అభ్యుదయ రచయితల సంఘానికి ఎంతో చేయూత ఇచ్చి తీర్చిదిద్దింది. ఈ విధంగా సాంఘిక సాంస్కృతిక రంగాలలో ఈ కాలంలో ఎంతో సంచలనం తీసుకురాగల్గింది.

బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం మున్నగు దురాచారాలకు వ్యతిరేకంగా పోరాడి స్త్రీ పునర్వివాహాలను జరిపించడానికి, అవినీతిని - లంచగొండితనాన్ని నిర్మూలించడానికి, ఆనాడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఎంత ప్రతిఘటనను ఎదుర్కోవలసివచ్చిందో, ఈ దశలో కమ్యూనిస్టు ఉద్యమం కూడా అంత ప్రతిఘటనను అభివృద్ధి నిరోధకుల నుండి ఎదుర్కోవలసివచ్చింది.

వీరేశలింగం, గురజాడ, గిడుగు, లక్ష్మణరాయ వర్ధంతులను పెద్దయెత్తున జరిపి, వారి ఆశయాలను గురించి ప్రచారం చేయడంతో వీరిని కమ్యూనిస్టులు తమ పార్టీ ప్రచారానికి ఉపయోగించుకుంటున్నారని ఆనాటి ప్రతీపవర్గాలు ప్రచారం చేశాయి. వాస్తవం ఏమిటంటే కమ్యూనిస్టులైన ప్రతివారు స్త్రీలకు విద్యా-విజ్ఞానాలు కల్గించడం, వితంతువులను వివాహమాడటం, వర్ణాంతర వివాహాలను చేసుకోవడం, కట్నాలు లేకుండా వివాహాలు చేసుకోవడం, ఆడంబరాలను తగ్గించి పూలదండల పెళ్ళిళ్ళు చేసుకోవడం మున్నగు సంస్కరణ పద్ధతులను స్వయంగా ఆచరించి, ఆదర్శవంతంగా ఉండటానికి శతథా కృషి చేశారు. ఇటువంటి సంస్కరణ వివాహ

పద్ధతులను అమలుజరపడానికి తల్లిదండ్రులతో పేచీలు పడవలసినప్పటికీ, సనాతనులు ఎన్నో ఇబ్బందులు పెట్టినప్పటికీ కమ్యూనిస్టులు వెనుదీయలేదు. జాతీయోద్యమ కాలంలో కాంగ్రెసు మహిళలు పికెటింగులు జరిపినప్పుడు, జైళ్ళకు వెళ్ళినప్పుడు రౌడీలు-సంఘు వ్యతిరేక శక్తులు ఏవిధంగా అల్లరిచేసేవారో కమ్యూనిస్టు పార్టీకి చెందిన స్త్రీలు ధైర్యంగా సభలకు వచ్చినప్పుడు, ప్రచారానికి వెళ్ళేటప్పుడు అన్ని బాధలు పడవలసివచ్చేది.

జాతీయోద్యమ కాలంలో స్త్రీలలో వచ్చిన చైతన్యం-సంస్కరణ భావాలు, పట్టణ-మధ్యతరగతుల వరకే పరిమితం అయిపోతే, పురాతన కట్టుబాట్లకు, సంప్రదాయాలకు కోటలనదగిన గ్రామీణ ప్రాంతాలలో స్త్రీలకు చైతన్యం కల్గించడం కమ్యూనిస్టు పార్టీ చేసిన మహోత్కృష్ట కార్యమని చెప్పవచ్చు. 1944లో విజయవాడలో జరిగిన అఖిల భారత రైతు మహాసభకు 20 వేలమంది స్త్రీలు హాజరయ్యారు. బహుశా ఇంతమంది స్త్రీలు ఒక సభలో పాల్గొనడం అప్పటికీ ఇప్పటికీ అదేనేమో!

రాత్రి పాఠశాలలు, వయోజన విద్య, గ్రంథాలయాలు, తాలింఖానాలు, ఆటల పోటీలు, సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా గ్రామీణ-పట్టణ యువకులలో కమ్యూనిస్టు పార్టీ అపూర్వమైన మార్పు తీసుకొనివచ్చి వారిలో దేశభక్తి, సంఘసంస్కరణాభిలాష కల్గించింది. ఎంతోమంది తమ పూర్వ జీవితంలోని చెడు వర్తనలను వదలి ఆదర్శ ప్రజాసేవకులయ్యారు.

సహపంక్తి భోజనాలు జరిపితే వీరేశలింగంగారి కాలంలో కులంలో వెలివేసేవారు. ఆనాడు అది విప్లవం. వర్ణ వివక్షతను నిర్మూలించాలన్న దీక్షతో కమ్యూనిస్టు పార్టీ సభ్యులు, యువజన మహిళా సంఘాలవారు పట్టుదలతో పనిచేసి అటువంటి పట్టింపులులేకుండా చేశారు. అస్పృశ్యత నివారణకు గాంధీజీ ఉద్యమం ప్రారంభించారు. కూమ్యూనిస్టు తమ యిళ్ళలోకి హరిజనులను రానివ్వడం, వారు నీరు తెచ్చియిస్తే తాగడం మున్నగు కార్యక్రమాల ద్వారా గ్రామసీమలలో అస్పృశ్యతా నివారణకు పూనుకున్నారు. ఇందుకు ఎన్ని అడ్డంకులను ఎదుర్కోవలసివచ్చినా వారు వెనుదీయలేదు. ఇది ఈనాడు చాలా చిన్న విషయంగా కనబడవచ్చు కాని ఆ రోజుల్లో అందుకు తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కోవలసివచ్చేది.

ఈ విధంగా కమ్యూనిస్టు పార్టీ, ఫ్యూడల్ సమాజ కట్టుబాట్లను, అభివృద్ధి నిరోధక సంప్రదాయాలను నిర్మూలించడానికి పెద్దయెత్తున పోరాటం సాగించి సాంఘిక సంస్కరణలను తీసుకొనివచ్చింది. సమాజంలో సగభాగంగా ఉండే స్త్రీలు విద్యా-విజ్ఞానాలు పొందాలనీ, ఆర్థిక స్వాతంత్ర్యం సంపాదించాలనీ, అప్పుడే వారి పరాధీనస్థితి తొలగుతుందనీ వారిలో చైతన్యం కలిగించింది. యువజన సంఘాల ద్వారా యువకులలో, బాల సంఘాల ద్వారా బాల బాలికలలో దేశభక్తిని, అభివృద్ధికర భావాలను తీసుకొనివచ్చింది.

సాహిత్యరంగంలో, సాంస్కృతిక రంగాలలో వీరేశలింగం, గురజాడలు ప్రవేశపెట్టిన సంప్రదాయాలను కమ్యూనిస్టు పార్టీ కొనసాగించింది. "దేశమును ప్రేమించుమన్నా" అని మహాకవి గురజాడ వ్రాసిన దేశభక్తి గేయానికి అనన్య ప్రచారం తెచ్చింది. సమాజ శ్రేయస్సును కాంక్షించటమే

సాహిత్యం, కళల పరమావధి అనే భావం రచయితలలో కల్గించడానికి ప్రయత్నించింది. అభ్యుదయ రచయితల సంఘంవారు వీరేశలింగం, గురజాడ, గిడుగు, చిలకమర్తి మున్నగువారి రచనలను బహుళ ప్రచారంలోకి తీసుకొనివచ్చారు. వర్థంతి ఉత్సవాలు జరిపించి, జీవిత చరిత్రలను ప్రచురించారు. యువరచయితలు అనేకమంది ముందుకు వచ్చేటట్టు చేశారు. సాహిత్యంలో ప్రజాయుగానికి నాందీ ప్రస్తావన చేయడంలో కమ్యూనిస్టు పార్టీ ఎంతగానో తోడ్పడింది.

సాహిత్యరంగంలో వచ్చిన ఈ మార్పులో భాగంగా నాటకరంగంలో, సాంస్కృతికరంగంలో కూడా తీసుకునిరావడానికి కమ్యూనిస్టు పార్టీ కృషి చేసింది. ప్రజల కష్టాలను, ఉన్నతస్థితికి పోవాలనే వారి వాంఛను, వారి ఆశలను, ఆశయాలను చిత్రించే నాటకాలను రచియింపజేసి ప్రజానాట్య మండలి ద్వారా ప్రదర్శించారు. పరివర్తన, ముందడుగు, మాభూమి నాటకాలు ఈ రంగంలో అపూర్వ సంచలనాన్ని తీసుకొనివచ్చాయి. ఇవి కళాకారుల మెప్పుపొందాయి.

గ్రామ గ్రామాన ప్రజానాట్యమండలి శాఖలు ఏర్పడ్డాయి. యువ కళాకారులు ఎంతోమంది ఉద్భవించారు. ఈ నాటకాలతోపాటు బుర్రకథ, జముకుల కథ మొదలైన ఆంధ్ర ప్రాచీన కళారూపాలను పునరుద్ధరించిన ఘనత కమ్యూనిస్టు పార్టీకుంది. ఈ సాంస్కృతిక ప్రదర్శనలు ప్రజలలో ఎంతో విజ్ఞాన ప్రబోధాన్ని, రాజకీయ చైతన్యాన్ని కల్గించాయి. వేలు - లక్షలుగా ఈ ప్రదర్శనలకు ప్రజలు హాజరయ్యేవారు. మూఢనమ్మకాలపై, సాంఘిక దురాచారాలపై ఈ విచిత్ర వేషాలు వ్యంగ్యాత్మక విమర్శను సాగించుతూ, ఆ విధంగా ప్రజలలో ఎంతో ప్రబోధం కల్గించాయి.

కీ॥శే॥ కొమర్రాజు లక్ష్మణరావుగారు తమ విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ద్వారా విజ్ఞానదాయకమైన గ్రంథాలను, జాతీయాభిమానాన్ని పెంపొందించే రచనలను ఏ విధంగా ప్రచురించి ప్రబోధం కల్గించారో - అదే విధంగా ప్రజాశక్తి ప్రచురణలు, విశాలాంధ్ర ప్రచురణలు ఆ ఆదర్శాన్ని కొనసాగించాయి.

ఈ అన్ని సాంఘికోద్యమాల ఫలితంగా కమ్యూనిస్టు పార్టీ తెలుగుదేశంలో అంతకుముందు ఎన్నడూ లేనంత సాంఘిక చైతన్యాన్ని కల్గించింది. అజ్ఞానానికి, మూఢనమ్మకాలకు, అభివృద్ధి నిరోధక సాంఘిక కట్టుబాట్లకు మూలకేంద్రాలుగా ఉండే గ్రామీణ ప్రాంతాలలో ఇందువలన ఒక పెద్ద సాంఘిక చైతన్య స్రవంతి ఉద్భవించింది.

ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనానికి ఈ సాంఘిక చైతన్య స్రవంతి ఎంతగానో దోహదం చేసింది.

## 2

## విస్మృతిలో పడిపోయిన వీరేశలింగం, గురజాడలు

1940 దశకంనాటికి ఆంధ్రదేశంలో కందుకూరి, గురజాడలను యించుమించు మరిచిపోయే పరిస్థితులు వచ్చాయి. గురజాడ 1915లో మృతిచెందారు. వీరేశలింగంగారు 1919లో

కనుమూశారు. రెండు మూడు దశాబ్దాల కాలం గడిచిపోయేసరికి వీరు నడిపిన ఉద్యమాలను ప్రజలు మరిచిపోయే స్థితి ఏర్పడింది. చంద్ర రాజేశ్వరరావుగారు ఒక సభలో చెప్పినట్లు "కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు మున్నగువారి గురించి అసలు అందరూ మరిచిపోయిన స్థితిలో, ఏ కాలేజీలోనైనా కందుకూరి వీరేశలింగంగారు ఎవరంటే చెప్పలేని స్థితి ఏర్పడింది. నవయుగాంధ్ర వైతాళికుల రచనలను ఆ విధంగా పాతిపెట్టేయడం జరిగింది." (చంద్రం సంస్మరణ సభ, 1974 ఆగస్టు 22వ తేదీ, విజయవాడ)

వీరేశలింగం, గురజాడల సాంఘిక, సాహిత్య ఉద్యమాల ఊసు తెరమరుగుకావడానికి మరొక పరోక్ష కారణం కూడా దారితీసిందని చెప్పవచ్చు. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా 1905-1907 వందేమాతరం ఉద్యమం, గాంధీజీ నాయకత్వాన 1919-1922 సహాయ నిరాకరణోద్యమం, 1930-32 ఉప్పు సత్యాగ్రహోద్యమాలు ఆంధ్రదేశంలో ఉవ్వెత్తుగా స్వాతంత్ర్య పోరాట వెల్లువను తీసుకువచ్చాయి. వందలు, వేలుగా స్త్రీ, పురుషులు, పట్టణ గ్రామీణ ప్రజలు ఈ సామ్రాజ్యవాద వ్యతిరేక స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు. అందరి దృష్టి ప్రధానంగా స్వాతంత్ర్యోద్యమంవైపు మళ్ళింది. సాంఘిక సంస్కరణల ఉద్యమంవైపు దృష్టి తగ్గింది. ముందు రాజకీయ స్వాతంత్ర్య సాధన - తర్వాత సంఘ సంస్కరణల సంగతి అనే భావం ఏర్పడింది. రాజకీయ సభలతోపాటు సాంఘిక సభలు కూడా జరిపే సంప్రదాయం వెనుకపట్టు పట్టింది. అయితే జాతీయోద్యమ సంరంభంలో పరోక్షంగా కొన్ని ముఖ్యమైన సామాజిక మార్పులు కూడా రాకపోలేదు. ఎప్పుడూ ఘోషాలో మ్రగ్గిపోతూ ఇల్లు దాటి బైటికిరాని స్త్రీలు, వంటింటికి పడకటింటికి పరిమితమైపోయిన స్త్రీలు తొలిసారిగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని బైటికి వచ్చారు. కల్లు అంగళ్ళవద్ద, విదేశీ వస్త్ర దుకాణాలదగ్గర పికెటింగ్‌లలో పాల్గొన్నారు. సత్యాగ్రహాలు చేసి జైళ్ళకు వెళ్ళారు. ఆ విధంగా వారిలో రాజకీయ చైతన్యం వచ్చింది. అంతవరకు సభలకు సమావేశాలకు రాని స్త్రీలు - నిషేధించబడిన రాజకీయ సభలకు అధ్యక్షత వహించే స్థితికి కూడా ఎదిగారు. దువ్వూరి సుబ్బమ్మ వంటి వితంతువులు కూడా ఉద్యమాలలోకి వచ్చారు. స్త్రీవిద్య, వితంతు పునర్వివాహాలు, అస్పృశ్యతా నివారణ, కులాంతర వివాహాలు మున్నగునవి వ్యాప్తిచెంది జాతీయోద్యమ ప్రభావంలో మరికొంత ముందంజవేశాయి.

## కమ్యూనిస్టు పార్టీ భుజస్కంధాలపై పడిన చారిత్రక కర్తవ్యం

అయితే 1919-22, 1930-32 పోరాటాలు జరిగిన తరువాత, రాజకీయ స్వాతంత్ర్య సాధనతోబాటు, సాంఘిక సంస్కరణల సమస్య మళ్ళీ ఎజెండాలోకి వచ్చింది. అసంపూర్తిగా నిలిచిపోయిన ఫ్యూడల్ సాంఘిక, సాంస్కృతిక ఉద్యమాలను తిరిగి కొనసాగించవలసిన చారిత్రక కర్తవ్యం ముందుకు వచ్చింది. ఈ చారిత్రక కర్తవ్యాన్ని ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం తన భుజస్కంధాలకు ఎత్తుకుంది. నవయుగాంధ్ర నిర్మాతలు, ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమ

వైతాళికులు అయిన కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి, కొమర్రాజు లక్ష్మణరావుగార్ల వారసత్వాన్ని స్వీకరించి, ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం వారి వర్ధంతులను పెద్దయెత్తున రాష్ట్ర వ్యాపితంగా జరిపించింది. వారి జీవిత చరిత్రలను, వారి రచనలను పునర్ముద్రించి తిరిగి ఆంధ్ర ప్రజలకు అందజేసింది.

## హితకారిణి సమాజంవద్దకు కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధి వర్గం

వీరేశలింగం రచనలను పునర్ముద్రించడానికి, వారి ప్రహసనాలను ప్రదర్శనయోగ్యంగా ఎడిట్ చేయడానికి అనుమతి సంపాదించడానికై వీరేశలింగంగారి ఆస్తులపై, వారి రచనలపై యాజమాన్యం కలిగివున్న హితకారిణి సమాజంవారి వద్దకు ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ ఒక ప్రతినిధి వర్గాన్ని రాజమండ్రి పంపింది. ఆనాడు ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి వహించిన మార్క్సిస్టు మేధావులు, కమ్యూనిస్టు నాయకులు శ్రీ పులుపుల శివయ్య, శ్రీ మాకినేని బసవపున్నయ్యగార్లు 1944 మే నెలలో - రాజమండ్రి వెళ్ళారు. హితకారిణి సమాజం కార్యదర్శి శ్రీ పెద్దాడ సుందర శివరావుగారిని కలుసుకొని వీరేశలింగంగారు వివిధ సాంఘిక సమస్యలపై వ్రాసిన 12 ప్రహసనాలను పునర్ముద్రించడానికి వ్రాతమూలకంగా వారినుండి అనుమతి సంపాదించారు. వీరేశలింగంగారి సమకాలికులు, వారి అనుయాయులలో జీవించి వున్న వ్యక్తి శ్రీ కనుపర్తి శ్రీరాములుగారిని సందర్శించి వీరేశలింగంగారి అవసానదశలో ఆఖరి దశాబ్దంలో పడిన కష్టాలగురించి, వారి చివరి రచనల గురించి ఎంతో విలువైన సమాచారం సేకరించారు. పంతులుగారి ఆనందోద్యాన వనం, వితంతు శరణాలయం, వీరేశలింగం దంపతుల సమాధులు వారిచే నిర్మించబడిన హైస్కూలు మున్నగువాటిని శివయ్య, బసవపున్నయ్యగార్లు సందర్శించి బెజవాడ తిరిగివచ్చారు.

(రాజమండ్రిలో పంతులుగారు - పి.వి.|శివయ్యగారి వ్యాసం -
వీరేశలింగం వర్ధంతి సంచిక 1944 మే 27)

# 3

# వీరేశలింగం వర్ధంతి సభలకై విజ్ఞప్తి

1944 మే 27వ తేదీన వీరేశలింగం 25వ వర్ధంతిని ఆంధ్రదేశమంతటా జరిపించడానికి పూర్వరంగంగా కమ్యూనిస్టు పార్టీ చేసిన సన్నాహం ఇది. ఆనాడు గ్రామగ్రామాన వీరేశలింగం వర్ధంతి జరుపవలసిందిగా ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘాలు, యువజన సంఘాలు, మహిళా సంఘాలు, అభ్యుదయ రచయితల సంఘం, నవ్య సాహిత్య పరిషత్తు, హితకారిణి సమాజం సంయుక్తంగా ఒక విజ్ఞప్తి చేశాయి. ఆ విజ్ఞప్తి చేసినవారు, విజ్ఞప్తి పూర్తిపాఠం వివరాలు ఇవి :

"కందుకూరి వీరేశలింగం పంతులుగారు, 1919 మే 27వ తేదీన పరమపదించారు. ఈ మే 27 నాటికి 25 సంవత్సరాలు గడిచిపోయాయి.

"వీరేశలింగం పంతులుగారు ఆంధ్రుల జీవితంలోని మూఢనమ్మకాలను, అజ్ఞానంతో

నిండిన ఆచారాల్ని పటాపంచలు గావించడానికి ఆంధ్ర భాషకు పదును పెట్టారు. మెరుగులు దిద్దారు. ఆంధ్ర సాహిత్యానికి అనేక కొత్త రూపాలతో అలంకారాలను సమకూర్చారు. సంస్కార విద్యకు, విజ్ఞానాభివృద్ధికి మార్గదర్శకులయ్యారు. ఆంధ్ర మహిళాలోకానికి వారు చేసిన సేవ మరువరానిది. పునర్వివాహాలు జరిపించారు. స్త్రీ విద్యా ప్రాప్తికి ప్రోత్సాహమిచ్చారు. అనాథ స్త్రీలకు ఆశ్రయం కల్పించారు. ఆంధ్ర మహిళల జీవన వ్యవస్థలో నూతన వికాసాన్ని కల్పించారు.

"ఆంధ్రదేశమంతటా" వీరేశలింగంగారి వర్ధంతి జరుపడానికి పూనుకొందాం. పంతులుగారికి - ఆయన నిర్మించిన సంప్రదాయాల్ని ముందుకు తీసుకుపోవడానికి ఆనాడు ఊరేగింపులు చేయాలి. సభలు జరపాలి. ఆయన నిర్మించిన సంస్కారోద్యమాన్ని, మహిళా ఉద్యమాన్ని, సారస్వతోద్యమాన్ని జాతీయ స్వాతంత్ర్యోద్యమాని కండగా ఉండే ఒక మహోద్యమంగా చేస్తామని ప్రతిజ్ఞ తీసుకోవాలి."

## ఈ సంయుక్త విజ్ఞాపన చేసినవారు

"శ్రీ పెద్దాడ సుందర శివరావు, కార్యదర్శి, హితకారిణి సమాజం; శ్రీ తెలికచర్ల వెంకటరత్నం, కార్యదర్శి, నవ్య సాహిత్య పరిషత్తు; శ్రీ చదలవాడ పిచ్చయ్య, కార్యదర్శి, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం; శ్రీ తమ్మారెడ్డి సత్యనారాయణ, కార్యదర్శి, రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్; శ్రీ పరకాల పట్టాభి రామారావు, కార్యదర్శి, పశ్చిమ గోదావరి జిల్లా యువజన సంఘం; శ్రీమతి పరకాల అహల్యాదేవి, కార్యదర్శిని, పశ్చిమ గోదావరి జిల్లా మహిళాసంఘం; శ్రీ తాతినేని ప్రకాశరావు, కార్యదర్శి, కృష్ణాజిల్లా యువజన సంఘం; శ్రీమతి వెల్లంకి అన్నపూర్ణమ్మ, కార్యదర్శిని, కృష్ణాజిల్లా మహిళా సంఘం; శ్రీ ఎం.వి. సుబ్బారావు, కార్యదర్శి, గుంటూరు జిల్లా యువజన సంఘం; శ్రీమతి టి. సావిత్రి, గుంటూరు జిల్లా మహిళా సంఘ కార్యదర్శిని.

(ప్రజాశక్తి వారపత్రిక 3-5-1944)

అంతకుముందే ప్రజాశక్తి వారపత్రికలో మద్దుకూరి చంద్రశేఖరరావుగారు వీరేశలింగంగారిపై ఒక సమగ్ర వ్యాసం వ్రాశారు. వీరేశలింగం బాల్యం, విద్యార్థి దశ, విద్యార్థి నాయకుడుగా సమ్మె చేయించడం, ఉపాధ్యాయ దశ, సంఘ సంస్కర్తగా ఆంధ్ర సారస్వతానికి యుగపురుషుడుగా శతాధిక గ్రంథ రచన, ఆయన నిర్మించిన వివిధ సంస్థలు మున్నగు విశేషాలు చంద్రంగారు తెలిపారు. "వీరేశలింగంగారు "జమీందారీ యుగపు సంప్రదాయాలనే సంకెళ్ళతో కునారిల్లుతున్న ఆంధ్ర సంస్కృతికి పునరుజ్జీవం పోశారు. ఒక నూతన శకం నిర్మించారు. రాయసం వెంకట శివుడుగారన్నట్లు వీరేశలింగంగారు నవీనాంధ్ర దేశమునకు, ఆంధ్ర వాఙ్మయానికి యుగ పురుషుడు" - అని చంద్రంగారు తమ వ్యాసంలో తెలిపారు. బహుశా వీరేశలింగంగారి మరణానంతరం ఆంధ్ర సాహితీరంగంలో ఆయనపై యింత సమగ్రమైన వ్యాసం వెలువడలేదు.

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం మే 27వ తేదీ వర్ధంతి సమయానికి "యుగ పురుషుడు వీరేశలింగం" అను ఒక ప్రత్యేక సంచికను 1/4 డెమ్మీ సైజులో ప్రచురించింది.

## ఆంధ్రదేశమంతటా వీరేశలింగం వర్ధంతి సభలు

రాజమండ్రిలో వీరేశలింగంగారి తోటలోనే 1944 మే 27న వర్ధంతి సభలు జరిగాయి. పంతులుగారి అనుచరుడు రాయసం వెంకట శివుడుగారు అధ్యక్షత వహించారు. శ్రీ విస్సా అప్పారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, మహీధర జగన్మోహనరావు, పిలకా గణపతిశాస్త్రి తదితరులు పాల్గొన్నారు. "పంతులుగారు యధార్థవాది కనుక వాస్తవికతను ప్రహసనాలలో కనబరిచారు. అందుచేతనే వారు ప్రజా యుగకర్త కాగలిగారు" అని కృష్ణశాస్త్రిగారు అన్నారు. పంతులుగారి పటాన్ని మంగళవాయిద్యాలతో వూరంతా వూరేగించారు. వీరేశలింగం హైస్కూలులో వీరేశలింగం అనుచరులు కామరాజు హనుమంతరావుగారి అధ్యక్షతన సభ జరిగింది. వీరేశలింగం ప్రహసనాలను ప్రదర్శించారు.

కాకినాడలో జరిగిన సభకు శ్రీ ముద్దు కృష్ణ అధ్యక్షత వహించారు. సి.వి.కె. రావు తదితరులు పాల్గొన్నారు.

నెల్లూరులో బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతను, వర్ధంతి సభ జరిగింది. ఒరుగంటి వెంకట సుబ్బయ్య, ఆమంచర్ల గోపాలరావుగార్లు పాల్గొన్నారు.

బెజవాడలో వర్ధంతి సభకు పంతులుగారి శిష్యులు, అనుచరులు డాక్టర్ ఆచంట లక్ష్మీపతిగారు అధ్యక్షత వహించారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ, మాడభూషి వెంకటాచారి తదితరులు పాల్గొన్నారు.

కాటూరులో జరిగిన సభకు కాటూరి వెంకటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

ఏలూరులో జరిగిన సభకు సుప్రసిద్ధ కాంగ్రెస్‌వాది ఆత్మకూరి గోవిందాచారి అధ్యక్షత వహించారు. వివిధ జిల్లాల్లో సుమారు వందచోట్ల వీరేశలింగం వర్ధంతి సభలు జరిగాయి. ఆ విధంగా వీరేశలింగంగారి స్మృతిని, వారి మహత్తర కృషిని ఆంధ్ర ప్రజానీకానికి కమ్యూనిస్టు ఉద్యమం జ్ఞప్తికి తెచ్చింది.

# 4

# 1940-43 మధ్యకాలంలో తొలి అభ్యుదయ రచనలు-రచయితలు

"అభ్యుదయ రచయితల సంఘం నిర్మాణయుతంగా ఏర్పడక పూర్వం 1940-43 మధ్యకాలంలో కమ్యూనిస్టు రచయితలు ప్రజాశక్తి వారపత్రికలో అభ్యుదయ రచనలు ప్రచురించుతూ వచ్చారు. 1942 జూన్ 17వ తేదీ ప్రజాశక్తి పత్రికల్లో "అన్యాయాన్ని ఎదిరిస్తాం - స్వాతంత్ర్యం సంపాదిస్తాం, విప్లవవీరులమూ, భారత పుత్రులమూ, సమధికోత్సాహులమూ, శాంతి - సభ్యతల నంతంచేసే, రాక్షస దౌర్జన్యం - ప్రపంచమంతయు భస్మంచేసే హిట్లర్ ఫాసిజము ధ్వంసం చేస్తాం, దగ్ధం చేస్తాం, గోరీ కడతాం, హిట్లరును" అనే కవిత "హితైషి"

అనేవారు రచించారు. వీరెవరో ప్రముఖ రాజకీయ నాయకులే. అప్పటి యిలాంటి రచనలలో కవితా గుణాత్మకత తక్కువగా ఉన్నప్పటికీ, సారళ్యమూ, స్పష్టతా, నవీన కాంతి ధావళ్యమూ మెండుగా కనిపిస్తాయి.

అదే పత్రిక 1942 జులై 1వ తేదీ సంచికలో జి. కోటయ్య అనేవారు "ఫాసిస్టు ప్రళయాగ్ని ప్రజ్వరిల్లిందండి - ప్రజలందరము మేలుకోవాలి, తూర్పు దీవుల మధ్య తలలెత్తిన జ్వాల - కాలాగ్ని కీలయై నాలుకలు చాచినది. కనుమూసితే మోసమోయీ, మనమిపుడు కలిసి పనిచేయవలెనోయీ'' అనే పాట రచించారు. తెలుగు ఏలపాట బాణీలో సాగిన, జానపద గేయానికి సన్నిహితంగా ఉన్నదీ గేయం.

1942 జులై 4వ తేదీ ప్రజాశక్తిలో కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ ఎం.ఎ. అనే పూర్తి పేరుతో సీనియర్‌గారు ఒక బుర్రకథ రచించారు. దీనికి వీరు బొబ్బిలి పాట వరుస అంటూ బ్రాకెట్లో సూచించారు. అభ్యుదయ సాహిత్యోద్యమ తొలి రోజులలో తెలుగులో వచ్చిన మొట్టమొదటి బుర్రకథ యిదేనని చెప్పవచ్చు. కంభంపాటివారు రచించిన మకుటం మన యావత్తు బుర్రకథల ప్రక్రియనూ, యిప్పటికీ విడువకపోవడం గమనార్హమైన సంగతి. "జయము, జయము, మన ప్రజాశక్తులకు జయము, దిగ్విజయము'' ఈ పల్లవి తదుపరి కాలంలో, సుంకర సత్యనారాయణగారు విరివిగా పరిపోషించిన బుర్రకథ ప్రక్రియలన్నింటికీ ఉపయుక్తం కావడం విశేషం. సుంకరవారి కష్టజీవి, అల్లూరి సీతారామరాజు, కందుకూరి వీరేశలింగం, రాణి రుద్రమ వంటి బుర్రకథలు ఈ ప్రక్రియలో శిఖరాయమానమనదగిన క్లాసిక్స్!'' ప్రచార గేయంగా మార్గదర్శకమైందనడంలో సందేహం లేదు. ఈ శాఖను సుంకరవారు అభివృద్ధిచేయగా, ప్రజానాట్యమండలి కళాకారులు నాజర్, మిక్కిలినేని, కర్ణాటి లక్ష్మీనరసయ్య ప్రభృతులు విశేష ప్రచారం కల్గించగా, నేటి జాతీయ జీవనాధారంలో బుర్రకథ ఒక ప్రధాన సాంస్కృతిక రూపంగా నిలిచిపోయింది.

1942 జులై 29వ తేదీ ప్రజాశక్తిలో కామ్రేడ్ మహీధర రామమోహనరావు "ప్రబోధము" అనే మార్చింగ్ సాంగ్ జైలునుండి రచించి ప్రజాశక్తికి పంపారు. "ముందు నడూ, వేగ నడూ మృత్యు భీతి వదలవోయ్! క్రూర ఫాసిస్టు మూక ఉరికి వచ్చు చున్నదోయ్'' అనే పల్లవితో పాతిక పదాల వరకు సాగిన చక్కని పాట యిది.

అలాగే 1942 ఆగస్టు 5వ తేదీ ప్రజాశక్తిలో శ్రీ అయ్యపు వెంకటకృష్ణయ్య "రారా తమ్ముడా రణరంగానికి - రాక్షసత్వమును నిర్మూలింపగ'' అనే మకుటంతో చక్కని గేయం ప్రచురించారు. కాకినాడ, విశాఖలపై జపాను ఫాసిస్టులు బాంబులు కురిపించడాన్ని ప్రస్తావించారు.

కామ్రేడ్ కె.వి. కొండలరావు "శ్రీ రంగ రంగ రంగా'' అనే పాట మాదిరి పాట ఒకటి ప్రచురించారు.

ఇవన్నీ ఉత్తమ అభ్యుదయ గేయ రచన కోసం చేసిన అన్వేషణా ప్రయత్నాలనీ, 1943

నుండి సంఘటిత శక్తిగా రూపొందిన, అభ్యుదయ రచయితల సంఘంలోని ప్రముఖ కవులు సలిపిన కవితా కృషికి కరదీపాలవంటివనీ స్పష్టంగా చెప్పుకోవచ్చు ... చారిత్రక అవసరాన్ని సచేతనంగా నెరవేర్చిన క్రియాశీల పురోగమనాన్ని మనమీ తొలినాటి రచనల ద్వారా పోల్చుకోగలుగుతాం.

1940 దశకంలో అభ్యుదయ కవులుగా ప్రఖ్యాతులైనవారు, అనిసెట్టి సుబ్బారావు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, ఆంజనేయ ప్రసాద్, ధనకుదరం వెంకటాచారి, మాడభూషి వెంకటాచారి, పులుపుల వెంకట శివయ్య, తుమ్మల వెంకట్రామయ్య, ప్రయాగ కోదండరామశాస్త్రి, చదలవాడ పిచ్చయ్య, సుంకర సత్యనారాయణ, కోగంటి గోపాలకృష్ణ, ఆరుద్ర, ఆవంత్స సోమసుందర్, కె.వి. రమణారెడ్డి, రెంటాల గోపాలకృష్ణ నార్ల చిరంజీవి, గంగినేని వెంకటేశ్వరరావు ప్రభృతులు ఎందరో ఉన్నారు.

(ఆవంత్స సోమసుందర్ స్మృతులు)

ఆ కాలంలో ప్రసిద్ధిపొందిన శ్రీశ్రీ గేయం “లే లే లే రష్యా” 4-11-1942వ తేదీ ప్రజాశక్తిలో ప్రచురింపబడింది. ఫాసిజంపై సోవియట్ సాధిస్తున్న విజయానికి ప్రపంచ ప్రజలందరూ హర్షిస్తున్న, ఆహ్వానిస్తున్న అంశాన్ని యిది వివరించింది.

## 5

## కమ్యూనిస్టు పార్టీ మహాసభల వేదికలపైనుండి సాంస్కృతిక కార్యక్రమాలు

అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి ఏర్పడక పూర్వంనుండి కమ్యూనిస్టు పార్టీ మహాసభల వేదికలమీద సాంస్కృతిక కార్యక్రమాలు విధిగా ప్రదర్శించబడుతూండేవి.

1943 జనవరిలో బొంబాయిలో అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ మహాసభ జరిగింది. ఆ సభకు ఆంధ్రదేశం తరపున ఒక వైజ్ఞానిక దళం హాజరై ఆంధ్ర జాతీయ కళారూపాలను ప్రదర్శించి గొప్ప మన్ననలను పొందింది.

బొంబాయిలో కమ్యూనిస్టు పార్టీ ప్రథమ కాంగ్రెస్ మహాసభలో వివిధ రాష్ట్రాల వైజ్ఞానిక దళాలు ప్రదర్శనలిచ్చాయి. వారిలో ఆంధ్ర వైజ్ఞానిక దళం అత్యుత్తమంగా గుర్తించబడి ఎర్రజెండా బహుకృతి పొందింది.

ఈ దళానికి శ్రీ ముక్కామల నాగభూషణంగారు నాయకులు. వీరు గాయకుడు, నటుడు మాత్రమే కాక ప్రముఖ రైతు నాయకుడు, సాహితీవేత్త కూడా.

ఆంధ్ర వైజ్ఞానిక దళం ప్రదర్శించిన కళారూపాలు, 1) భజనలు, కోలాటాలు లాంటి సమిష్టి నృత్యాలు 2) బుర్రకథ, పిచ్చిగుంటల కథలాంటి జానపద రూపాలు 3) బైరాగి, కోయ, గొల్ల, మాదిగ వేషాలు - వున్నాయి.

భజనలలో సుంకర సత్యనారాయణ రచించిన, “మిట్టిపడే హిట్లరయ్యా, ఏటికే ఎదురీదు

నిండిన ఆచారాల్ని పటాపంచలు గావించడానికి ఆంధ్ర భాషకు పదును పెట్టారు. మెరుగులు దిద్దారు. ఆంధ్ర సాహిత్యానికి అనేక కొత్త రూపాలతో అలంకారాలను సమకూర్చారు. సంస్కార విద్యకు, విజ్ఞానాభివృద్ధికి మార్గదర్శకులయ్యారు. ఆంధ్ర మహిళాలోకానికి వారు చేసిన సేవ మరువరానిది. పునర్వివాహాలు జరిపించారు. స్త్రీ విద్యా ప్రాప్తికి ప్రోత్సాహమిచ్చారు. అనాథ స్త్రీలకు ఆశ్రయం కల్పించారు. ఆంధ్ర మహిళల జీవన వ్యవస్థలో నూతన వికాసాన్ని కల్పించారు.

"ఆంధ్రదేశమంతటా'' వీరేశలింగంగారి వర్ధంతి జరుపడానికి పూనుకొందాం. పంతులుగారికి - ఆయన నిర్మించిన సంప్రదాయాల్ని ముందుకు తీసుకుపోవడానికి ఆనాడు వూరేగింపులు చేయాలి. సభలు జరపాలి. ఆయన నిర్మించిన సంస్కారోద్యమాన్ని, మహిళా ఉద్యమాన్ని, సారస్వతోద్యమాన్ని జాతీయ స్వాతంత్ర్యోద్యమాని కండగా ఉండే ఒక మహోద్యమంగా చేస్తామని ప్రతిజ్ఞ తీసుకోవాలి.''

## ఈ సంయుక్త విజ్ఞాపన చేసినవారు

"శ్రీ పెద్దాడ సుందర శివరావు, కార్యదర్శి, హితకారిణి సమాజం; శ్రీ తెలికచర్ల వెంకటరత్నం, కార్యదర్శి, నవ్య సాహిత్య పరిషత్తు; శ్రీ చదలవాడ పిచ్చయ్య, కార్యదర్శి, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం; శ్రీ తమ్మారెడ్డి సత్యనారాయణ, కార్యదర్శి, రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్; శ్రీ పరకాల పట్టాభి రామారావు, కార్యదర్శి, పశ్చిమ గోదావరి జిల్లా యువజన సంఘం; శ్రీమతి పరకాల అహల్యాదేవి, కార్యదర్శిని, పశ్చిమ గోదావరి జిల్లా మహిళాసంఘం; శ్రీ తాతినేని ప్రకాశరావు, కార్యదర్శి, కృష్ణాజిల్లా యువజన సంఘం; శ్రీమతి వెల్లంకి అన్నపూర్ణమ్మ, కార్యదర్శిని, కృష్ణాజిల్లా మహిళా సంఘం; శ్రీ ఎం.వి. సుబ్బారావు, కార్యదర్శి, గుంటూరు జిల్లా యువజన సంఘం; శ్రీమతి టి. సావిత్రి, గుంటూరు జిల్లా మహిళా సంఘ కార్యదర్శిని.

(ప్రజాశక్తి వారపత్రిక 3-5-1944)

అంతకుముందే ప్రజాశక్తి వారపత్రికలో మద్దుకూరి చంద్రశేఖరరావుగారు వీరేశలింగంగారిపై ఒక సమగ్ర వ్యాసం వ్రాశారు. వీరేశలింగం బాల్యం, విద్యార్థి దశ, విద్యార్థి నాయకుడుగా సమ్మె చేయించడం, ఉపాధ్యాయ దశ, సంఘ సంస్కర్తగా ఆంధ్ర సారస్వతానికి యుగపురుషుడుగా శతాధిక గ్రంథ రచన, ఆయన నిర్మించిన వివిధ సంస్థలు మున్నగు విశేషాలు చంద్రంగారు తెలిపారు. "వీరేశలింగంగారు "జమీందారీ యుగపు సంప్రదాయాలనే సంకెళ్ళతో కునారిల్లుతున్న ఆంధ్ర సంస్కృతికి పునరుజ్జీవం పోశారు. ఒక నూతన శకం నిర్మించారు. రాయసం వెంకట శివుడుగారన్నట్లు వీరేశలింగంగారు నవీనాంధ్ర దేశమునకు, ఆంధ్ర వాఙ్మయానికి యుగ పురుషుడు'' - అని చంద్రంగారు తమ వ్యాసంలో తెలిపారు. బహుశా వీరేశలింగంగారి మరణానంతరం ఆంధ్ర సాహితీరంగంలో ఆయనపై యింత సమగ్రమైన వ్యాసం వెలువడలేదు.

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం మే 27వ తేదీ వర్ధంతి సమయానికి "యుగ పురుషుడు వీరేశలింగం'' అను ఒక ప్రత్యేక సంచికను 1/4 డెమ్మీ సైజులో ప్రచురించింది.

## ఆంధ్రదేశమంతటా వీరేశలింగం వర్ధంతి సభలు

రాజమండ్రిలో వీరేశలింగంగారి తోటలోనే 1944 మే 27న వర్ధంతి సభలు జరిగాయి. పంతులుగారి అనుచరుడు రాయసం వెంకట శివుడుగారు అధ్యక్షత వహించారు. శ్రీ విస్సా అప్పారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, మహీధర జగన్మోహనరావు, పిలకా గణపతిశాస్త్రి తదితరులు పాల్గొన్నారు. "పంతులుగారు యధార్థవాది కనుక వాస్తవికతను ప్రహసనాలలో కనబరిచారు. అందుచేతనే వారు ప్రజా యుగకర్త కాగలిగారు" అని కృష్ణశాస్త్రిగారు అన్నారు. పంతులుగారి పటాన్ని మంగళవాయిద్యాలతో వూరంతా వూరేగించారు. వీరేశలింగం హైస్కూలులో వీరేశలింగం అనుచరులు కామరాజు హనుమంతరావుగారి అధ్యక్షతన సభ జరిగింది. వీరేశలింగం ప్రహసనాలను ప్రదర్శించారు.

కాకినాడలో జరిగిన సభకు శ్రీ ముద్దు కృష్ణ అధ్యక్షత వహించారు. సి.వి.కె. రావు తదితరులు పాల్గొన్నారు.

నెల్లూరులో బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతను, వర్ధంతి సభ జరిగింది. ఒరుగంటి వెంకట సుబ్బయ్య, ఆమంచర్ల గోపాలరావుగార్లు పాల్గొన్నారు.

బెజవాడలో వర్ధంతి సభకు పంతులుగారి శిష్యులు, అనుచరులు డాక్టర్ ఆచంట లక్ష్మీపతిగారు అధ్యక్షత వహించారు. శ్రీ విశ్వనాధ సత్యనారాయణ, డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ, మాడభూషి వెంకటాచారి తదితరులు పాల్గొన్నారు.

కాటూరులో జరిగిన సభకు కాటూరి వెంకటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

ఏలూరులో జరిగిన సభకు సుప్రసిద్ధ కాంగ్రెస్‌వాది ఆత్మకూరి గోవిందాచారి అధ్యక్షత వహించారు. వివిధ జిల్లాల్లో సుమారు వందచోట్ల వీరేశలింగం వర్ధంతి సభలు జరిగాయి. ఆ విధంగా వీరేశలింగంగారి స్మృతిని, వారి మహత్తర కృషిని ఆంధ్ర ప్రజానీకానికి కమ్యూనిస్టు ఉద్యమం జ్ఞప్తికి తెచ్చింది.

# 4

# 1940-43 మధ్యకాలంలో తొలి అభ్యుదయ రచనలు-రచయితలు

"అభ్యుదయ రచయితల సంఘం నిర్మాణయుతంగా ఏర్పడక పూర్వం 1940-43 మధ్యకాలంలో కమ్యూనిస్టు రచయితలు ప్రజాశక్తి వారపత్రికలో అభ్యుదయ రచనలు ప్రచురించుతూ వచ్చారు. 1942 జూన్ 17వ తేదీ ప్రజాశక్తి పత్రికల్లో "అన్యాయాన్ని ఎదిరిస్తాం - స్వాతంత్ర్యం సంపాదిస్తాం, విప్లవవీరులమూ, భారత పుత్రులమూ, సమధికోత్సాహులమూ, శాంతి - సభ్యతల నంతంచేసే, రాక్షస దౌర్జన్యం - ప్రపంచమంతయు భస్మంచేసే హిట్లర్ ఫాసిజము ధ్వంసం చేస్తాం, దగ్ధం చేస్తాం, గోరీ కడతాం, హిట్లరును" అనే కవిత "హితైషి"

అనేవారు రచించారు. వీరెవరో ప్రముఖ రాజకీయ నాయకులే. అప్పటి యిలాంటి రచనలలో కవితా గుణాత్మకత తక్కువగా ఉన్నప్పటికీ, సారళ్యమూ, స్పష్టతా, నవీన కాంతి ధావళ్యమూ మెండుగా కనిపిస్తాయి.

అదే పత్రిక 1942 జులై 1వ తేదీ సంచికలో జి. కోటయ్య అనేవారు "ఫాసిస్టు ప్రళయాగ్ని ప్రజ్వరిల్లిందండి - ప్రజలందరము మేలుకోవాలి, తూర్పు దీవుల మధ్య తలలెత్తిన జ్వాల - కాలాగ్ని కీలయై నాలుకలు చాచినది. కనుమూసితే మోసమోయీ, మనమిపుడు కలిసి పనిచేయవలెనోయీ" అనే పాట రచించారు. తెలుగు ఏలపాట బాణీలో సాగిన, జానపద గేయానికి సన్నిహితంగా ఉన్నదీ గేయం.

1942 జులై 4వ తేదీ ప్రజాశక్తిలో కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ ఎం.ఎ. అనే పూర్తి పేరుతో సీనియర్‌గారు ఒక బుర్రకథ రచించారు. దీనికి వీరు బొబ్బిలి పాట వరుస అంటూ బ్రాకెట్లో సూచించారు. అభ్యుదయ సాహిత్యోద్యమ తొలి రోజులలో తెలుగులో వచ్చిన మొట్టమొదటి బుర్రకథ యిదేనని చెప్పవచ్చు. కంభంపాటివారు రచించిన మకుటం మన యావత్తు బుర్రకథల ప్రక్రియనూ, యిప్పటికీ విడువకపోవడం గమనార్హమైన సంగతి. "జయము, జయము, మన ప్రజాశక్తులకు జయము, దిగ్విజయము" ఈ పల్లవి తదుపరి కాలంలో, సుంకర సత్యనారాయణగారు విరివిగా పరిపోషించిన బుర్రకథ ప్రక్రియలన్నింటికీ ఉపయుక్తం కావడం విశేషం. సుంకరవారి కష్టజీవి, అల్లూరి సీతారామరాజు, కందుకూరి వీరేశలింగం, రాణి రుద్రమ వంటి బుర్రకథలు ఈ ప్రక్రియలో శిఖరాయమానమనదగిన క్లాసిక్స్!" ప్రచార గేయంగా మార్గదర్శకమైందనడంలో సందేహం లేదు. ఈ శాఖను సుంకరవారు అభివృద్ధిచేయగా, ప్రజానాట్యమండలి కళాకారులు నాజర్, మిక్కిలినేని, కర్ణాటి లక్ష్మీనరసయ్య ప్రభృతులు విశేష ప్రచారం కల్గించగా, నేటి జాతీయ జీవనాధారంలో బుర్రకథ ఒక ప్రధాన సాంస్కృతిక రూపంగా నిలిచిపోయింది.

1942 జులై 29వ తేదీ ప్రజాశక్తిలో కామ్రేడ్ మహీధర రామమోహనరావు "ప్రబోధము" అనే మార్చింగ్ సాంగ్ జైలునుండి రచించి ప్రజాశక్తికి పంపారు. "ముందు నడూ, వేగ నడూ మృత్యు భీతి వదలవోయ్! క్రూర ఫాసిస్టు మూక ఉరికి వచ్చు చున్నదోయ్" అనే పల్లవితో పాతిక పదాల వరకు సాగిన చక్కని పాట యిది.

అలాగే 1942 ఆగస్టు 5వ తేదీ ప్రజాశక్తిలో శ్రీ అయ్యాపు వెంకటకృష్ణయ్య "రారా తమ్ముడా రణరంగానికి - రాక్షసత్వమును నిర్మూలింపగ" అనే మకుటంతో చక్కని గేయం ప్రచురించారు. కాకినాడ, విశాఖలపై జపాను ఫాసిస్టులు బాంబులు కురిపించడాన్ని ప్రస్తావించారు.

కామ్రేడ్ కె.వి. కొండలరావు "శ్రీ రంగ రంగ రంగా" అనే పాట మాదిరి పాట ఒకటి ప్రచురించారు.

ఇవన్నీ ఉత్తమ అభ్యుదయ గేయ రచన కోసం చేసిన అన్వేషణా ప్రయత్నాలనీ, 1943

నుండి సంఘటిత శక్తిగా రూపొందిన, అభ్యుదయ రచయితల సంఘంలోని ప్రముఖ కవులు సలిపిన కవితా కృషికి కరదీపాలవంటివనీ స్పష్టంగా చెప్పుకోవచ్చు ... చారిత్రక అవసరాన్ని సచేతనంగా నెరవేర్చిన క్రియాశీల పురోగమనాన్ని మనమీ తొలినాటి రచనల ద్వారా పోల్చుకోగలుగుతాం.

1940 దశకంలో అభ్యుదయ కవులుగా ప్రఖ్యాతులైనవారు, అనిసెట్టి సుబ్బారావు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, ఆంజనేయ ప్రసాద్, ధనకుదరం వెంకటాచారి, మాడభూషి వెంకటాచారి, పులుపుల వెంకట శివయ్య, తుమ్మల వెంకట్రామయ్య, ప్రయాగ కోదండరామశాస్త్రి, చదలవాడ పిచ్చయ్య, సుంకర సత్యనారాయణ, కోగంటి గోపాలకృష్ణ, ఆరుద్ర, ఆవంత్స సోమసుందర్, కె.వి. రమణారెడ్డి, రెంటాల గోపాలకృష్ణ, నార్ల చిరంజీవి, గంగినేని వెంకటేశ్వరరావు ప్రభృతులు ఎందరో ఉన్నారు.

(ఆవంత్స సోమసుందర్ స్మృతులు)

ఆ కాలంలో ప్రసిద్ధిపొందిన శ్రీశ్రీ గేయం "లే లే లే రష్యా" 4-11-1942వ తేదీ ప్రజాశక్తిలో ప్రచురింపబడింది. ఫాసిజంపై సోవియట్ సాధిస్తున్న విజయానికి ప్రపంచ ప్రజలందరూ హర్షిస్తున్న, ఆహ్వానిస్తున్న అంశాన్ని యిది వివరించింది.

# 5

# కమ్యూనిస్టు పార్టీ మహాసభల వేదికలపైనుండి సాంస్కృతిక కార్యక్రమాలు

అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి ఏర్పడక పూర్వంనుండి కమ్యూనిస్టు పార్టీ మహాసభల వేదికలమీద సాంస్కృతిక కార్యక్రమాలు విధిగా ప్రదర్శించబడుతూండేవి.

1943 జనవరిలో బొంబాయిలో అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ మహాసభ జరిగింది. ఆ సభకు ఆంధ్రదేశం తరపున ఒక వైజ్ఞానిక దళం హాజరై ఆంధ్ర జాతీయ కళారూపాలను ప్రదర్శించి గొప్ప మన్ననలను పొందింది.

బొంబాయిలో కమ్యూనిస్టు పార్టీ ప్రథమ కాంగ్రెస్ మహాసభలో వివిధ రాష్ట్రాల వైజ్ఞానిక దళాలు ప్రదర్శనలిచ్చాయి. వారిలో ఆంధ్ర వైజ్ఞానిక దళం అత్యుత్తమంగా గుర్తించబడి ఎర్రజెండా బహుకృతి పొందింది.

ఈ దళానికి శ్రీ ముక్కామల నాగభూషణంగారు నాయకులు. వీరు గాయకుడు, నటుడు మాత్రమే కాక ప్రముఖ రైతు నాయకుడు, సాహితీవేత్త కూడా.

ఆంధ్ర వైజ్ఞానిక దళం ప్రదర్శించిన కళారూపాలు, 1) భజనలు, కోలాటాలు లాంటి సమిష్టి నృత్యాలు 2) బుర్రకథ, పిచ్చిగుంటల కథలాంటి జానపద రూపాలు 3) బైరాగి, కోయ, గొల్ల, మాదిగ వేషాలు - వున్నాయి.

భజనలలో సుంకర సత్యనారాయణ రచించిన, "మిట్టిపడే హిట్లరయ్యా, ఏటికే ఎదురీదు

చుంటివి" అనే పాట అశేష హర్షధ్వానాలు పొందింది.

కోలాటంలో కాట్రగడ్డ హనుమాయమ్మ ఎంతో లాలిత్యాన్ని ప్రదర్శించారు.

బుర్రకథలోని కథావస్తువు జపాన్ ఫాసిస్టులను నమ్మరాదు సుమా అనే హెచ్చరిక. భాషా సంబంధమైన ప్రతిబంధకంవల్ల ఇతర రాష్ట్రాలవారు ఇందులోని కథను పూర్తిగా గ్రహించలేక పోయినా, కళారూపాన్ని ఎంతో అభినందించారు.

కోయవాని వేషంలో కోగంటి గోపాలకృష్ణయ్య అత్యద్భుత ప్రతిభ ప్రదర్శించారు. భాషావరోధాన్ని అధిగమించి, వారి అభినయం యావన్మంది ప్రేక్షకులను ఆకట్టుకున్నది.

ఆహార సమస్యను వస్తువుగా, పిచ్చిగుంటలవాని కళారూపంలో కోసూరి పున్నయ్య ప్రదర్శించారు.

ఉర్దూలో కామ్రేడ్ మఖ్దుం రచించిన 'జంగ్ మై జంగ్ ఆజాద్' అనే పాటను మహారాష్ట్రకు చెందిన మామావరేర్కర్ బృందం పాడింది. స్టాలిన్ పిలుపు అనే రష్యన్ గేయానికి మఖ్దుం చేసిన ఉర్దూ అనువాదం కూడా విశేషాదరణ పొందింది.

ఆంధ్ర వైజ్ఞానిక దళంలో ఈ క్రింది వారు పాల్గొన్నారు.

ముక్కామల నాగభూషణం, కోగంటి గోపాలకృష్ణయ్య, కోసూరు పున్నయ్య, సి. సుబ్బారావు, యస్.వి.కె. ప్రసాద్, డాక్టర్ రాజారావు, మన్నె నాగభూషణం, కొండేపూడి లక్ష్మీనారాయణ, తమ్మారెడ్డి సత్యనారాయణ, మానికొండ సూర్యావతి, కాట్రగడ్డ మనుమాయమ్మ, టి. సావిత్రి, సి. సావిత్రి, యం. శారద, వి. అన్నపూర్ణమ్మ, బాబు, మిక్కిలినేని, మాచినేని, చదలవాడ, పెరుమాళ్ళు, కోసూరు పున్నయ్య లాంటివారు ఈ శిబిరంలో శిక్షణపొందారు. బొంబాయి మహాసభలో ప్రదర్శనలిచ్చి అప్పటికే ప్రసిద్ధిచెందిన కోగంటి గోపాలకృష్ణయ్య, కోసూరు పున్నయ్యగారలు యువకులకు వివిధ కళారూపాలలో శిక్షన యిచ్చారు.

1943 జులైలో విజయవాడలో జరిగిన ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ మూడవ మహాసభ సందర్భంలో జింఖానా గ్రౌండ్స్‌లో పెద్ద బహిరంగసభ జరిగింది.

ఆ మహాసభలో కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి పెక్కు కళారూపాలను ప్రదర్శించింది. గుంటూరుకు చెందిన నాజర్, మొట్టమొదటిసారిగా ఆ మహాసభలోనే, 'మాస్కో పొలిమేరలోన మారణ యంత్రాలు నిలిపి' అను గేయాన్ని ఉత్తేజకరంగా ఆలపించారు. ఆ పిమ్మట నాజర్ సుప్రసిద్ధ బుర్ర కథాకారుడుగా రూపొందారు.

ఆ తర్వాత కాలంలో ఆంధ్ర ప్రజానాట్యమండలి, ఫాసిస్టు వ్యతిరేక ప్రచారంలో ప్రముఖ పాత్రను వహిస్తూ కళను ప్రజాసేవకు వినియోగించే నూతన సాంప్రదాయాన్ని ప్రవేశపెట్టడం ద్వారా, ఆంధ్ర నాటకరంగంలోనే ఒకమూల మలుపును ప్రవేశపెట్టింది.

1941 తర్వాత ఏర్పడిన బహిరంగ ప్రచార అవకాశాలను వినియోగించుకొని, గ్రామాలలోనూ పట్టణాలలోనూ అభ్యుదయ రచయితల సంఘాల నేర్పరచే కర్తవ్యాన్ని కమ్యూనిస్టు పార్టీ చేపట్టింది.

1943 ఫిబ్రవరి 13, 14 తేదీలలో తెనాలిలో జరిగిన ప్రథమ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ తర్వాత ఆంధ్రదేశంలో అభ్యుదయ రచయితల ఉద్యమం మహోత్సాహంగా ముందుకు సాగింది.

వైజ్ఞానిక ప్రచారం, అభ్యుదయ సాహిత్య వ్యాప్తి లాంటివి ఆనాడు విద్యార్థి యువజన వేదికల నుండి సాగుతూ ఉండేవి.

ఈ కృషిని ముందుకు కొనిపోతూ అదే సంవత్సరం ఆంధ్ర ప్రజానాట్యమండలి ఏర్పడ్డది. అంతకు ముందు 1943 మార్చిలో కృష్ణాజిల్లా యువజన సంఘ ఆధ్వర్యాన దివి తాలూకా, కొడాలిలో ఫాసిస్టు వ్యతిరేక శిక్షణా శిబిరం జరిగింది.

# 6

# రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘ నిర్మాణం సన్నాహాలు

1943 ఫిబ్రవరి, 13, 14 తేదీలలో తెనాలిలో మొదటి ఆంధ్ర రాష్ట్ర అభ్యుదయ రచయితల మహాసభ జరుపడానికి ఆనాడు సాహిత్యరంగంలో అభివృద్ధికర భావాలు కల్గిన రచయితలందరి తోడ్పాటుతో సన్నాహక సంఘం సమావేశం జరిగింది.

ఈ సంఘంలో శ్రీ చదలవాడ పిచ్చయ్య, శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు, శ్రీ తుమ్మల వెంకట్రామయ్య, శ్రీ తాపీ మోహన్‌రావుగార్లు కన్వీనర్లుగా నియమించబడ్డారు.

1942 డిసెంబరు 4వ తేదీన తెనాలిలో మహాసభ ఆహ్వానసంఘం ఏర్పర్చడానికి సన్నాహక సమావేశం జరిగింది. శ్రీ జి.వి. కృష్ణారావుగారి అధ్యక్షతన జరిగిన ఈ సన్నాహక సమావేశంలో శ్రీ పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి, త్రిపురనేని గోపీచంద్ మొదలైనవారితో ఆహ్వాన సంఘం ఏర్పడింది.

అప్పటికింకా అభ్యుదయ రచయిత - అభ్యుదయ రచయితల సంఘం అనే మాటలు రూపుదిద్దుకోలేదు. ప్రజాశక్తిలో ప్రచురించబడిన వార్తలో (ప్రోగ్రెసివ్ రైటర్స్) మహాసభ అనే ఇంగ్లీషు పదమే వాడబడింది. ఆ సన్నాహక సమావేశం ఆమోదించిన ప్రణాళికలో అభివృద్ధికర రచయితలు అనే మాట వాడారు. ఈ ప్రణాళిక ఆ తర్వాత రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘ నిర్మాణానికి, ఆశయాల నిర్వచనకు ప్రాతిపదిక వేసింది. తెనాలి సన్నాహక సంఘ సమావేశ వివరాలు యివి :

అఖిల భారత ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్ వారిచే ఆంధ్ర శాఖ ఏర్పరచుటకు కన్వీనరుగా నియమించబడినవారిచే మహాసభ తెనాలిలో జరుపుటకు నిర్ణయించబడి 4-12-1942న తెనాలిలో జి.వి. కృష్ణారావుగారి అధ్యక్షతన జరుపబడిన సమావేశంలో ఈ క్రింది తీర్మానములు ఆమోదించబడినవి.

1. ఆంధ్ర రాష్ట్ర ప్రోగ్రెసివ్ రైటర్స్ మహాసభ తెనాలిలో 1943 జనవరి రెండవ వారంలో జరుపుటకు నిర్ణయించారు. తరువాత ఫిబ్రవరికి మార్చబడింది. ఈ క్రింది వారిని ఆహ్వాన

సంఘ కార్యనిర్వాహక వర్గ సభ్యులుగా ఎన్నుకుంటూ మరి కొందరిని చేర్చుకొనే అధికారం యిచ్చారు.

1. పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి (అధ్యక్షులు) 2. రావి అమ్మయ్య (ఉపాధ్యక్షులు) 3. చదలవాడ పిచ్చయ్య (కార్యదర్శి) 4. త్రిపురనేని గోపీచంద్ (సహాయక కార్యదర్శి) 5. సోమయాజుల నీరజరావుగారు.

ఆహ్వానసంఘ సభ్యత్వ రుసుం రూపాయికి తక్కువ లేకుండా ఉండాలి. మహాసభ నాటికి ప్రోగ్రెసివ్ రచనలను ఒక సంపుటంగా ఆహ్వానసంఘం తరపున ప్రకటించాలని తీర్మానించారు.

ఈ సందర్భంలోనే ప్రకటించిన ప్రణాళికలో ఆశయాలను ఇలా తెలిపారు.

## ప్రణాళిక

"భారతీయ సామాజిక జీవితంలో తీవ్రమైన మార్పులు జరుగుతున్నవి. అభివృద్ధి నిరోధకత్వం క్షీణించి, అవసాన దశలో వున్నప్పటికీ పూర్తిగా నశించలేదు. పైపెచ్చు తన అస్తిత్వాన్ని నిలబెట్టు కోవడానికి విశ్వప్రయత్నాలు చేస్తూ వుంది. పౌరాణిక సంస్కృతీ కాలం గడిచిన తరువాత భారతీయ సారస్వతం, యదార్థ జీవితాల నుంచి తప్పించుకొనిపోయి వినాశకరమైన ధోరణి అవలంబించింది. తర్వాత సాహిత్యం వాస్తవిక సంఘటనలను విసర్జించి నిరాధారమైన ఆధ్యాత్మికవాదం, ఊహాజనిత ఆదర్శవాదాన్ని పట్టుకొని వేళ్ళాడింది. తత్ఫలితంగా భారతీయ సారస్వతం శుష్కించి, నీరసించి, కడకు చాదస్తాలతోనూ, తప్పుడు ఆదర్శాలతోనూ నిండిపోయింది.

"మన సమాజంలో జరుగుతున్న మార్పుల్ని గుర్తించి వాటి అభివృద్ధిని ప్రతిబింబింపజేసే సాహిత్యాన్ని సృష్టించడం భారతీయ రచయితల విధి. సారస్వతంలో శాస్త్రీయమైన హేతువాదాన్ని చొప్పించి దేశంలో ఉన్న అభివృద్ధికర శక్తులకు చేయూత ఇవ్వాలి. కుటుంబజీవితం, సమాజము, మతం, సెక్యులరిజం, యుద్ధం మొదలైన సమస్యలమీద వ్రాయబడ్డ రచనలో కనబడే అభివృద్ధి నిరోధకత్వాన్ని అరికట్టాలి. కుల, మత కక్షలు, జాతి విద్వేషం, వర్గ దోపిడీ ... వీటిని పురిగొల్పే వ్రాతల్ని ప్రతిఘటించాలి. ఈ బాధ్యతను నిర్వర్తించడానికి భారతీయ రచయితలు, సాహిత్య విమర్శనా దృష్టిని అలవరచుకొని పెంపొందించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

నేటివరకు సారస్వతం, తదితర కళలు ఛాందసవర్గాల చేతులలో నలిగి మలినమవుతున్నవి. వాటిని వారి ఆధిపత్యం నుండి తప్పించడం, ప్రజా సముదాయానికి సన్నిహితపరచడం, జీవిత యదార్థ్యాన్ని ఉన్నదున్నట్లుగా కనబరిచే శక్తివంతమైన సాధనాలుగా జేయడం ఇవి ఈ సంఘం యొక్క ప్రధానోద్దేశ్యాలు.

భారతీయ నాగరికతలోని ఉత్తమ సాంప్రదాయాలకు వారసులమని నొక్కి చెబుతూ, మన దేశంలోని అభివృద్ధి నిరోధకత్వాన్ని అన్ని విధాలా విమర్శిస్తాము. మన దేశం ఒక నూతన జీవితాన్ని లక్ష్యంగా పెట్టుకొని పాటుపడుతూ వుంది. అందుకు తోడ్పడే ప్రతీ విషయాన్ని వెలిబుచ్చడం ద్వారానూ, నూతన రచనల ద్వారానూ ప్రోత్సహిస్తాము. ఇందుకు వలసిన దేశీయ, విదేశీయ,

విజ్ఞాన సంపదను వినియోగించుకుంటాము. మన భారతీయ సారస్వతం ఆకలి, దారిద్ర్యం, రాజకీయ బానిసత్వం సాంఘికంగా వెనుకబడటం మొదలైన జీవిత ప్రధాన సమస్యల్ని చర్చించాలని విశ్వసిస్తున్నాము.

ఆచారాన్ని, వ్యవస్థల్ని, హేతువాదంతో పరిశీలించడానికిన్ని, కార్యాచరణకు ప్రోత్సహించి, సంఘటనా శక్తిని అలవరిచి మార్పులు తేవడానికిన్ని తోడ్పడే విమర్శనా భావాన్ని మనలో ఉత్తేజింపచేసే ప్రతి వ్రాతను అభివృద్ధికరమైనదిగా భావిస్తూ, దానిని స్వీకరిస్తున్నాము.

## ఆశయాలు

1. వివిధ ప్రాంతాలలో రచయితల సంఘాల్ని స్థాపించడం, సమావేశాల ద్వారానూ, సాహిత్య ప్రచురణ ద్వారానూ, వివిధ సంఘాల పనిని సమన్వయించడం, రాష్ట్ర సంఘానికి, స్థానిక సంఘాలకు మధ్య సన్నిహిత సంబంధాలను ఏర్పరచడం, ఈ సంఘం యొక్క ప్రధాన లక్ష్యాలకు, ఆదర్శాలకు హాని కలుగకుండా వుండే లక్ష్యాలు గల యితర సంస్థలతో సహకారం చేయడం.

2. మన రాష్ట్రంలోని అన్ని ముఖ్య నగరాలలోనూ, జిల్లాలవారీగానూ ఈ సంఘం యొక్క శాఖలను ఏర్పరచడం.

3. అభివృద్ధికర సాహిత్యాన్ని ప్రచురించడం, ఈ విధంగా భారతీయ స్వాతంత్ర్యోద్యమానికి, నూతన సమాజాభివృద్ధికి పాటుపడటం.

4. అభ్యుదయాభివృద్ధికర రచయితల లాభ, క్షేమాలను కాపాడటం.

5. ఆలోచనా స్వాతంత్ర్యం, అభిప్రాయ స్వాతంత్ర్యం, స్వేచ్ఛా ప్రచార హక్కును రక్షించడానికి పోరాడటం.

6. రచన మనమాశించే దివ్య భవిష్యత్తుకు దారితీసేదిగా చేయడం.

ఆంధ్ర శాఖ కన్వీనర్లు : 1) చదలవాడ పిచ్చయ్య 2) శ్రీరంగం శ్రీనివాసరావు 3) తుమ్మల వెంకట్రామయ్య 4) తాపీ మోహనరావు.

- ప్రజాశక్తి వారపత్రిక, 16-12-1942

## రాష్ట్ర అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభ

1943, ఫిబ్రవరి 13, 14 తేదీలలో ప్రథమ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ తెనాలిలో జరిగింది.

సుప్రసిద్ధ సాహితీవేత్త పరిశోధకులు అయిన తాపీ ధర్మారావుగారు సభకు అధ్యక్షత వహించారు. ఉత్తేజకరమైన తమ ప్రసంగంలో వారిలా అన్నారు :

"పూర్వ కవులు తమ రొట్టెమీద నేతిబొట్టులేదే అని ఏడ్చారు ... అష్టైశ్వర్యాలతో తులతూగే విలాసపురుషులను గురించి రాశారు ... ఈనాడు ప్రజాస్వామ్యం మహాశక్తి ... ప్రపంచంలో ఎటు చూసినా భిన్న భిన్న శక్తులకు పోరాటం కనబడుతున్నది. శతాబ్దంలో రావలసిన మార్పు ఒక్క క్షణంలో కనబడుతున్నది..."

మహాసభకు వివిధ జిల్లాల నుండి ప్రతినిధులు వచ్చారు. పెక్కుమంది యువ రచయితలు, శ్రీ ముక్కామల నాగభూషణం, సెట్టి ఈశ్వరరావు, చావలి రామచంద్రరావు, వట్టికొండ విశాలాక్షి, పరకాల పట్టాభి రామారావు ప్రభృతులు తమ గేయాలు చదివి వినిపించారు.

సాంప్రదాయ కవిపండితులైన ఏటుకూరి వెంకట నరసయ్య, జమ్మలమడక మాధవరాయశర్మ లాంటివారు సభలకు హాజరై శుభసందేశాలు ఇచ్చారు.

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం, ఈ మహాసభ అనంతరం ఏర్పడ్డది. శ్రీ చదలవాడ పిచ్చయ్య కార్యదర్శిగా, ప్రచురణల సంపాదకవర్గంగా, తాపీ ధర్మారావు, తుమ్మల వెంకట్రామయ్య, చదలవాడ పిచ్చయ్యగారలు ఎన్నికయ్యారు.

ఫాసిజాన్ని ఓడించి, ప్రపంచ వ్యాపితంగా ప్రజాతంత్రశక్తులు విజయం పొందాలని, అప్పుడు ఉపవాసవ్రతంలో ఉన్న గాంధీజీని బ్రిటీషు ప్రభుత్వం వెంటనే విడుదలచేసి, జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచవలసిందిగా బ్రిటీషు ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ తీర్మానాలు ఆమోదించారు.

అభ్యుదయ సారస్వత ఉత్పత్తికి తగిన కాగితం సౌకర్యాలు కలిగించవలసిందిగా ప్రభుత్వాన్ని మహాసభ కోరింది. రాష్ట్రమంతటా జిల్లా అభ్యుదయ రచయితల సంఘాలు ఏర్పరచాలని తీర్మానించింది. ఆంధ్రలో అభ్యుదయ రచయితల ఉద్యమం ఈ మహాసభ అనంతరం ఉత్సాహంతో ముందుకు సాగింది.

(ప్రజాశక్తి 24-2-1943 సంచికలో తాపీ మోహనరావుగారి వ్యాసం ఆధారంగా)

## సాంస్కృతిక ప్రదర్శనలకు శిక్షణ

1942లో జపాన్ దాడి ప్రమాదం ఏర్పడిన దృష్ట్యా రాష్ట్రంలో ఈ ప్రమాదాన్ని ఎదుర్కోడానికి, దేశ స్వాతంత్ర్యం నిలబెట్టుకోడానికి ప్రజలకు తర్ఫీదు యిచ్చేందుకు ప్రజాసేవకులను తయారుచేసే కార్యక్రమాన్ని కమ్యూనిస్టు పార్టీ తలపెట్టింది. యువజన, విద్యార్థి సంఘాల ద్వారా ప్రజా రక్షణ శిబిరాలను నడిపింది. 1942 మే, జూన్ నెలల్లో ఇటువంటి శిక్షణా శిబిరాలు కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాల్లో జరిగాయి. ఈ శిక్షణా శిబిరాలలోనే సాంస్కృతిక ప్రదర్శనలు ద్వారా ప్రజలకు ఈ సందేశాన్ని అందజేయడానికి తొలి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

తొలిసారిగా రాష్ట్రంలో కృష్ణాజిల్లా గండిగుంటలో జరిగిన శిబిరంలో పాటలు, బుర్రకథలు, నాటకాలు, విచిత్ర వేషాలు (ఫ్యాన్సీ డ్రస్‌లు) మున్నగు ప్రచార పద్ధతులలో జయప్రదంగా శిక్షణ యిచ్చారు. శిబిరానికి వచ్చిన విద్యార్థులు వారంతట వారే పాటలు, బుర్రకథలు వ్రాసుకొని సమిష్టిగా నేర్చుకొన్నారు. దీని ఫలితంగా 15 సెంటర్లలో ప్రజానురంజకంగా ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం కొనసాగించారు. పైన పేర్కొన్న విచిత్రవేషాలలో మాదిగ వేసం, గొల్లసుద్దులు మొదలైనవి కూడా రూపొందించడానికి వీరు కృషి చేస్తున్నారు. బిచ్చగాళ్ళు, అన్నా-చెల్లెలు, కోయవాడు, బుడబుక్కల, పకీరులు మొదలైన విచిత్రవేషాలను రూపొందించడం జరిగింది.

గుంటూరు జిల్లా మహిళా వైజ్ఞానిక శిబిరంలో కూడా సమిష్టిగా పాటలు పాడటం

నేర్చుకున్నారు.

కృష్ణాజిల్లా యువజన విజ్ఞాన ప్రచారదళం విజయవాడ తాలూకా ముస్తాబాదులో విజ్ఞాన శిక్షణా శిబిరం నెలకొల్పారు. 1942 జూన్ 15వ తేదీన జరిగిన బహిరంగసభలో "అజేయ చైనా" "మాతృభూమి" అనే నాటకాలు ప్రదర్శించారు. గొల్ల చాకలి మున్నగు విచిత్రవేషాల ద్వారా జపాన్ వ్యతిరేక ప్రచారం చేశారు. మూడవ ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు మహాసభ జులై 8-15 తేదీలలో (8 రోజులు) విజయవాడలో జరిగింది. ఈ సభలో వివిధ జిల్లాల వైజ్ఞానిక దళాలమధ్య పోటీ ప్రదర్శనలు జరిగాయి. అప్పటికే వివిధ జిల్లా కమ్యూనిస్టు పార్టీ మహాసభలు జరిగాయి. ఈ సభలో మొదటగా వైజ్ఞానిక ప్రదర్శనలు యిచ్చారు. రాష్ట్ర మహాసభకు బాగా తర్ఫీదు పొంది వచ్చారు.

కృష్ణాజిల్లా కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ మహాసభ బెజవాడలో 1942 జూన్ 28, 29, 30 తేదీలలో జరిగింది. ఈ సభ నాటికే వైజ్ఞానిక ప్రదర్శనలలో బాగా తర్ఫీదు పొంది ప్రదర్శనలు యిచ్చారు.

పశ్చిమ గోదావరిజిల్లా కమ్యూనిస్టు మహాసభ 1942 జులై 1, 2, 3 తేదీలలో ఏలూరులో జరిగింది. 3వ తేదీన వైజ్ఞానిక ప్రదర్శనలలో 30 మంది కమ్యూనిస్టు యువతీ యువకులు పాల్గొన్నారు. బుర్రకథ, ఫకీరు, కోయ తదితర వేషాల ద్వారా ఆహార సమస్య, జపాన్ దాడి ప్రమాదం తదితర సమస్యలపై ఈ విచిత్ర వేషాలు వేసి ఎంతగానో ఆకర్షించారు.

గుంటూరు జిల్లా కమ్యూనిస్టు మహాసభ జులై 1, 2, 3 తేదీలలో తెనాలిలో జరిగింది. 6,000 మంది హాజరైన బహిరంగ సభలో రాత్రి 11 గంటల నుండి తెల్లవారుజామున 3 1/2 గంటల వరకు వైజ్ఞానిక ప్రదర్శనలు జరిగాయి. మరువరాని దృశ్యం కాకుమాను - చింతలసెట్టి వారి బుర్రకథ "చుక్కాని కాడ మోజోషి బాబుండాడు" అనే పడవ పాట "జాయంగే కయ్యూరు జాయంగే" కోలాటం ఆహార సమస్యా పరిష్కారాన్ని చూపే అన్నా చెల్లెలు పాట (బ్రహ్మపట్నం పోదామంటే చీకటేమిర అన్నయ్యా! వరుస) చైనా యోధుల బుర్రకథ (లక్ష్మీకాంతారావు ఇది లక్ష్మీకాంత మోహన్ అయి ఉండాలి) మహిళామణులచే టాన్యా బుర్రకథ, చింతల సోది, నాజర్ గొల్లసుద్దులు, కామ్రేడ్ మహబూబ్ ఫకీరు వేషంలో చెప్పిన రష్యా - జర్మనీ యుద్ధమూ ప్రజలను పరమానంద పరవశులను చేశాయి. కళాకారులకు అప్పటికప్పుడు అనేక బహుమతులు ప్రేక్షకుల నుండి వచ్చాయి.

బెజవాడలో జరిగిన రాష్ట్ర కమ్యూనిస్టు మహాసభలో కృష్ణా - గుంటూరు జిల్లాల వైజ్ఞానిక దళాలు పోటాపోటీలుగా వైజ్ఞానిక ప్రదర్శనలు యిచ్చాయి.

మహాసభ ప్రారంభంలో "వేగరావోయ్ కార్మిక! వేగరావోయ్ కర్షక! కలసి మెలసి పలుకవోయ్! అరుణ పతాకకు జై" అనే సమిష్టిగానం ఉత్తేజకరంగా ప్రదర్శించారు. ఈ సభలో ఆ తరువాత వివిధ జిల్లా దళాలు యిచ్చిన వైజ్ఞానిక ప్రదర్శనలు చూచి మహాసభకు సౌహార్ద్ర ప్రతినిధులుగా

వచ్చిన మలబారు కామ్రేడ్ తిరువంబయ్యియారు, "మీరు ప్రదర్శించిన వైజ్ఞానిక కార్యక్రమం నుండి ప్రతి రాష్ట్ర పార్టీ నేర్చుకోవలసిన విషయాలెన్నో ఉన్నాయి" అన్నారు. శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారు తమ సందేశంలో "11వ తేదీన పార్టీ ఆధ్వర్యాన ర్యాలీ, వైజ్ఞానిక ప్రదర్శనలు చూసి, కమ్యూనిస్టు పార్టీ ప్రజల విశ్వాసాన్ని ఎలా చూరగొన్నదో చూసి ఉప్పొంగిపోయాను. అవి నా జీవితానికి ఉత్సాహాన్నిచ్చాయి" అన్నారు.

## అభ్యుదయ రచయితల ఉద్యమ వ్యాప్తి

తెనాలి ప్రథమ రాష్ట్ర మహాసభ అనంతరం రాష్ట్రంలో వివిధచోట్ల అభ్యుదయ రచయితల సంఘాలు ఏర్పడ్డాయి.

1943 ఏప్రిల్ 18వ తేదీన ఏలూరులో స్థానిక అభ్యుదయ రచయితల సంఘం ఆధ్వర్యాన బహిరంగ సభ జరిగింది. అనేకమంది రచయితలు పురప్రముఖులు వచ్చారు. మొట్టమొదట సెట్టి ఈశ్వరరావుగారు (విజయనగరం) ఉపన్యసిస్తూ వీరేశలింగం, గిడుగు, గురజాడ వారల ఆశయాలను పైకి మననం చేస్తూ కొందరు పెడదోవలు త్రొక్కి దేశ కాల పాత్రలతో సంబంధం లేకుండా నేటి మన సాహిత్యరంగంలో ఉష్ట్రపక్షి విధానాన్ననుసరించుతున్నారని విమర్శించారు. అభివృద్ధి నిరోధక సాహిత్యాన్ని తిరస్కరించాలనీ, అభ్యుదయ సాహిత్యాన్ని ప్రోత్సహించడం మన విధి అని అన్నారు.

తరువాత ఒక స్థానిక రచయిత సిపాయి మీద, హిట్లరిజం మున్నగు విషయాలమీద, సభికుల హృదయాలను వూగించే రచనలను చదివి వినిపించారు. శ్రీ జి. కోటయ్య, శ్రీ పరకాల పట్టాభి రామారావుగార్లు తమ రచనలను ఎంతో ఉత్తేజంగా చదివి వినిపించారు.

శ్రీ అత్తలూరి సర్వేశ్వరరావు ఉపన్యసిస్తూ సాహిత్యం, సంఘం నుండి ఉత్పత్తి అయ్యేదేనని, అభ్యుదయ రచయితల నమ్మిక అన్నారు. గత ప్రపంచ యుద్ధం తరువాత అభ్యుదయ రచయితలు తమ సాహిత్య కృషిలో సాధ్యమైనంత వరకు ప్రజా సన్నిహితంగా ఉండాలని ప్రయత్నిస్తున్నారని చెప్పారు. వీరిలో గొప్ప రచయితలు లేకపోవచ్చుగాని నవ్య కవులకంటే వీరి దృక్పథం ఎంతో విశాలమైందని అన్నారు. తరువాత శ్రీ తాపీ మోహనరావు ఉపన్యసిస్తూ సమాజ ఉపయోగం కోసమే సాహిత్యాది కళలు పుట్టాయి. అభ్యుదయ రచయితలు సమాజాభివృద్ధికి, దివ్య భవిష్యత్తుకు దారితీయడానికి సారస్వతాన్ని ఒక ముఖ్య సాధనంగా తయారుచేయ సమకట్టారని అన్నారు. శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు మాట్లాడుతూ ఇరవై సంవత్సరాలకు పూర్వం, ఆంధ్ర సారస్వత సంఘం, పూర్వ గ్రాంథిక భాష, నేటి గ్రంథాలలో కూడా వుండాలనే వాదిస్తున్నారనీ, సభ్య సాహిత్య పరిషత్తు భావానికి అనుకూలమైన వ్యవహారిక భాషను బలపరచి కొత్తదారి తొక్కిందని అన్నారు. మానవ సంఘంలో ఒడిదుడుకులను సామాన్య భాషలో ప్రతిబింబింప జేయాలనీ అదే సాహిత్య కళ, సంఘోన్నతికై తోడ్పడే ఉత్తమ కళ అన్నారు.

మరునాడు మధ్యాహ్నం, సాయంత్రం రచయితల గోష్టి జరిగింది. శ్రీ సింగరాచార్య, శ్రీ

సామవేదం జానకీరామశర్మ మొదలైనవారు తమ రచనలను చదివి వినిపించారు. వీరిద్దరూ సభ్యులుగా చేరారు.

వీరులపాడు : 1042 ఏప్రిల్ 22వ తేదీ రాత్రి వీరులపాడు గ్రామంలో నందిగామ తాలూకా అభ్యుదయ రచయితల సంఘ యాజమాన్యాన బహిరంగసభ జరిగింది. సభకు శ్రీ వాసిరెడ్డి భాస్కరరావుగారు అధ్యక్షత వహించారు. వట్టికొండ రామకోటయ్యగారు తాము రచించిన "కరువు" అన్న గేయం చదివి వినిపించారు. చావ రామలింగయ్య, సుంకర సత్యనారాయణ, ఎన్.వి. సుబ్బారావు, శ్రీమతి వట్టికొండ విశాలాక్షిగార్లు తమ గీతాలను ఎంతో ఉత్తేజకరంగా చదివి వినిపించారు. శ్రీ సెట్టి ఈశ్వరరావు, పి.వి. శివయ్య, చదలవాడ పిచ్చయ్యగార్లు సారస్వతం విధులు, ఇంతవరకు తెలుగు సారస్వతం ఏయే పోకడలు పోయిందీ చెప్పారు. తమ చుట్టూ వున్న సమాజాన్ని విడిచి కవి ఎక్కడికోపోతే తన ధర్మాన్ని మరచినవాడవుతాడనీ, కవి ఎప్పుడూ సమాజం ముందుండి మార్గదర్శకుడుగా ఉండాలనీ, ఆ ఆశయంతోనే అభ్యుదయ రచయితల సంఘం పనిచేస్తుందని అన్నారు.

ఏలూరులోనూ, వీరులపాడులోనూ జరిగిన సభలు వానిలో కనబడిన ఉత్సాహం అభ్యుదయ రచయితల ఉద్యమానికి గొప్ప భవిష్యత్తును తెలుపుతుంది.

అంతకు ముందు 4-4-43వ తేదీన నందిగామ తాలూకా అభ్యుదయ రచయితల ప్రథమ సమావేశం కొణత మాత్మకూరులో శ్రీ వట్టికొండ రంగయ్యగారి అధ్యక్షతన జరిగింది. మొత్తం 20 మంది సభ్యులలో 17గురు హాజరయ్యారు. ఈ సంవత్సరానికి చావ రామలింగయ్య కార్యదర్శి, సుంకర సత్యనారాయణ, వట్టికొండ రామకోటయ్య, వాసిరెడ్డి భాస్కరరావు, చావ నారాయణరావు గారలు కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. శ్రీ వట్టికొండ రంగయ్య, చావ రామలింగయ్య సంపాదకత్వంలో లిఖిత మాసపత్రికను నడుప నిశ్చయించారు.

రాజమండ్రిలో ఆంధ్ర అభ్యుదయ రచయితల ప్రథమ సమావేశం శ్రీ శివరావుగారి అధ్యక్షతన జరిగింది. శివరావు, కామేశ్వరభట్టు, మామిడి అప్పారావుగార్లు తమ రచనలు చదివి వినిపించారు. స్థానిక అభ్యుదయ రచయితల సంఘానికి శ్రీ మామిడి అప్పారావును అధ్యక్షులుగా, అయ్యగారి నరసింహారావును కార్యదర్శిగా ఎన్నుకొన్నారు. లిఖిత పత్రికను నడుపుటకు తీర్మానించారు.

## అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభ

అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభ బొంబాయిలో 1943 మే 22వ తేదీ నుండి 25వ తేదీ వరకు జరిగింది. దేశమంతట నుండి 150 మంది ప్రతినిధులు వచ్చారు. ఆంధ్ర నుండి ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి శ్రీ చదలవాడ పిచ్చయ్య, సెట్టి ఈశ్వరరావు, వట్టికొండ రంగయ్య, బాలగంగాధర తిలక్, ముక్కామల నాగభూషణం మొదలైనవారు హాజరయ్యారు. తెలుగు భాషాశాఖ అధ్యక్షులుగా శ్రీ తాపీ ధర్మారావుగారు,

ప్రజానాట్యమండలి ప్రతినిధిగా డాక్టర్ రాజారావు సభలో పాల్గొన్నారు.

మహాసభను శ్రీ హరీంద్రనాథ్ చటోపాధ్యాయ ప్రారంభించారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ కె.ఎ. అబ్బాస్ స్వాగతోపన్యాసం చేశారు. మహారాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘాధ్యక్షులు కామ్రేడ్ ఎస్.ఎ. డాంగే, ఉర్దూ భాషా శాఖ అధ్యక్షులు జోష్ మలిహాబాదీ, కన్నడ శాఖ అధ్యక్షులు జితుభాయ్ మెహతా, సత్యేంద్రనాథ్ మజుందార్ (ఆనంద బజార్ పత్రిక మాజీ సంపాదకులు) ప్రొఫెసర్ జాగీర్ తమ తమ భాషలలో అభ్యుదయ సాహిత్యాలు, అభివృద్ధి నిరోధక సాహిత్యంతో ఎలా ఘర్షణకు వచ్చాయో వివరిస్తూ, సాహిత్యం అభ్యుదయ సంప్రదాయాన్ని స్వీకరించవలసిన ఆవశ్యకతను వివరించారు.

తెలుగు భాషా శాఖాధ్యక్షులు శ్రీ తాపీ ధర్మారావుగారు తమ అధ్యక్షోపన్యాసంలో ఆంధ్ర భాషా చరిత్ర ఆరంభమైన నాటినుండి నేటివరకు అభ్యుదయకరమైన పోకడలకు ఆటంకాలు ఎలా కలిగాయో వివరించారు. పాత విషయాలపట్ల మూఢ విశ్వాసం, స్వార్థం మొదలైన గుణాలు సాహిత్యంలో అభివృద్ధిని ఎలా నిరోధిస్తాయో చెప్పారు.

25వ తేదీ రాత్రి కవితా గోష్ఠి జరిగింది. మలిహాబాది, సాగర్, సజామీ, సుజాజ్, నరేంద్ర శర్మ, మగ్దూం మొహిద్దీన్ మొదలైన ప్రఖ్యాత కవులు పాల్గొన్నారు.

అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభతోపాటు, భారత ప్రజా నాటకరంగంవారు కూడా బొంబాయిలో తమ సమావేశాన్ని జరిపారు. బెంగాలీ, ఇంగ్లీషు, మరాఠీ, హిందూస్థానీ భాషల్లో చక్కని ఏకాంక నాటకాలు ప్రదర్శించారు. ఆంధ్ర శాఖ నిర్మించడానికి సమర్థుడైన యువనటుడు డాక్టర్ రాజారావును నియమించారు.

అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘ ప్రధాన కార్యదర్శిగా శ్రీ సజ్జాద్ జహీర్, సహాయ కార్యదర్శులుగా విష్ణుదేవ్ (బెంగాల్), కె.ఎ. అబ్బాస్ (బొంబాయి), కోశాధికారి మామావారేర్కర్ (బొంబాయి), కార్యవర్గంలో హీరేన్ ముఖర్జీ, ఎస్.కె. ఆచార్య, ఆర్.ఎ. బకులేశ, ఎస్.ఎ. డాంగే, రాంబిలాస్ శర్మ, నరేంద్ర శర్మ, మగ్దూం, డాక్టర్ అబ్దుల్ అలీం, అనంత కనేకర్, భోగలాల్ గాంధీ, చదలవాడ పిచ్చయ్య, ప్రొఫెసర్ జాగీర్దార్, శక్తిదాసన్, సుబ్రహ్మణ్యం, డాక్టర్ జాన్ సింగ్ ఎన్నుకోబడినారు.

(ప్రజాశక్తి 9-6-1943)

## ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ సంచిక

తెనాలిలో జరిగిన ప్రథమ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ అనంతరం - మహాసభ ఆహ్వాన సంఘం, కన్వీనర్స్ సమిష్టి సంపాదకత్వాన మహాసభ ప్రత్యేక సంచిక ప్రచురించబడింది. మహాసభ అధ్యక్షుల, ఆహ్వాన సంఘ కార్యదర్శుల ఉపన్యాసాలు, మహాసభ తీర్మానాలు, సంఘ ప్రణాళిక, సంఘ నిర్మాణ సూత్రాలు ఈ సంచికలో వున్నాయి.

అభ్యుదయ సారస్వతం ఎలా వుండాలి? సారస్వత సమాలోచన, ఫాసిస్టు ప్రతికూల సాహిత్యం

అనే వ్యాసాలు, పునఃప్రతిష్ఠ, కవి-సంస్కృతి విప్లవం, ఓ కవీ! నవ కవి, కవి కర్తవ్యం అనే గేయాలు, ప్రస్తుత సమాజానికి అభ్యుదయ మార్గాన్ని చూపాలంటే సారస్వతం ఎలాంటి పాత్ర నిర్వహించాలి? మున్నగు విషయాలు విపులంగా తెలియజేస్తూ ఆంధ్ర సారస్వత రంగానికి ఒక నూతన పంథాను తెలియజేస్తున్నాయి. సంచిక కావలసినవారు ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ కార్యాలయం, తెనాలి అని వ్రాయాలని ఈ సంచికపై ప్రజాశక్తి సమీక్షలో తెలుపబడింది.

(17-3-43 ప్రజాశక్తి)

# 7

# అరసం ద్వితీయ మహాసభ

# చిలకమర్తివారికి అఖండ సన్మానం

1944 డిసెంబరు 29-31వ తేదీల్లో ఆంధ్ర అభ్యుదయ రచయితల ద్వితీయ మహాసభ బెజవాడలో జరిగింది. సభ రెండవ రోజున ఆంధ్ర జాతీయకవి చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి స్వీయచరిత్ర బహూకరణ మహోత్సవం జరిగింది. రామమోహన్ గ్రంథాలయం హాలులో జరిగిన ఈ సభకు అభ్యుదయ రచయితల ద్వితీయ మహాసభాధ్యక్షులైన తెలికిచర్ల వెంకటరత్నంగారే అధ్యక్షత వహించారు. వేదికపై చిలకమర్తివారిని పడకకుర్చీలో ఆశీనులను చేశారు. అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘ ప్రధాన కార్యదర్శి సజ్జాద్ జహీర్, నవ్య సాహిత్య పరిషత్ అధ్యక్షులు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు, నవ్యాంధ్ర సాహిత్యవీధుల కర్త ఆచార్య కూరుగంటి సీతారామయ్యగారు, ప్రజాసాహిత్య కోవిదుడు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు, వైతాళికుల సంకలనం సంపాదకుడు ముద్దు కృష్ణ, ఆంధ్ర యూనివర్శిటీ సిండికేట్ సభ్యులు, దామెర్ల ఆర్ట్ గ్యాలరీ ట్రస్టు కార్యదర్శి శ్రీ విస్సా అప్పారావుగారు వేదికపై ఆశీనులయ్యారు. సభాధ్యక్షులు శ్రీ తెలికచర్లవారు మాట్లాడుతూ "సంఘ సంస్కరణలోను, సారస్వత క్షేత్రంలోను అభ్యుదయ మార్గాలను తీర్చిదిద్దిన చిలకమర్తివారి స్వీయచరిత్రను ప్రకటించడం ద్వారా ఆంధ్రదేశానికి మహోపకారం చేశారు ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘంవారు" అని అభినందించారు.

శ్రీ విస్సా అప్పారావుగారు ఈ స్వీయ చరిత్ర ప్రచురణ పూర్వచరిత్రను తెలియజేశారు. "నేను, రాయసం వెంకట శివుడుగారు చిలకమర్తివారిని స్వీయచరిత్ర వ్రాయవలసిందిగా కోరాము. 75 యేండ్లు దాటిన వృద్ధాప్యంలో వారు శ్రమకోర్చి తమ స్వీయచరిత్ర వ్రాశారు. వీరేశలింగంగారి వర్ధంతి సభ జరిపే సందర్భంలో ఆంధ్ర రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘంవారు నా దగ్గరకు వచ్చినప్పుడు ప్రసంగవశాన శ్రీ చిలకమర్తివారి "స్వీయచరిత్ర వ్రాయించామనీ, కాయితాల కరువువల్ల దాని ప్రకటన ఆలస్యమైపోతున్నదనీ వారితో అన్నాను. దాదాపు నాలుగు వందల పేజీలు గల యీ గ్రంథాన్ని ఒక్క నెలరోజులలోగానే అచ్చువేయించిన ప్రజాశక్తి సంపాదకులనూ, అభ్యుదయ రచయితల సంఘంవారిని అభినందిస్తున్నాను" అన్నారు.

## మూడు తరాలవారు పాల్గొన్న సన్మానసభ

నవ్యసాహిత్య పరిషదధ్యక్షులు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు మహాకవిని సమాశ్వాసిస్తూ, "పంతులుగారి సారస్వతం, రసాంచితమై కావ్యత్వము నందినది. వీరేశలింగంగారి రచనకన్న వీరి రచన కాంతా సమ్మితమైన లాలిత్యముతో ధర్మబోధ చేస్తుంది. శ్రీ విస్సా అప్పారావుగారి తరంవారూ, నా తరంవారూ, మా తరువాత తరంవారూ, మూడు తరాలవారు యీ సన్మానంలో పాల్గొనడం ముదావహం" అన్నారు. శ్రీ ముద్దుకృష్ణగారు "నా జీవితంలో ఏవైనా ఉదాత్తమైన ఆశయాలు కుదురుకుంటే అవి చిలకమర్తివారి కృషి ఫలితమే" నన్నారు. శ్రీమతి గుడుపూడి ఇందుమతీదేవి, శ్రీమతి అత్తిలి స్వరాజ్యలక్ష్మిగార్లు చిలకమర్తివారి రచనలకు తాము ఏ విధంగా ఉత్తేజం పొందిందీ తెలిపారు. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, "ఈ కళాప్రపూర్ణుని సత్సాంప్రదాయం మూడు తరాలకేగాదు, ఐదు కాదు, ఎన్ని తరాలకైనా పవిత్రమైనది, అనుసరణీయమైనదే! అది పాతబడేది కాదు!" అన్నారు.

చదలవాడ పిచ్చయ్యగారు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి సారస్వత కృషీ, సంఘ సంస్కరణదీక్షా, ఆంధ్రుల జీవితాన్ని సర్వతోముఖంగా తీర్చిదిద్దిందనీ, వారి దేశభక్తి వీరేశలింగంగారికన్నా పటువై, ఆంధ్రులను స్వాతంత్ర్య పోరాట మార్గంలోకి దింపిందనీ, అట్టి మహనీయుని "స్వీయచరిత్ర"ను ప్రచురించే అవకాశం కలిగినందుకు అభ్యుదయ రచయితల సంఘం ధన్యమనీ చెప్పారు. అనంతరం పిచ్చయ్యగారు మహాకవి, కళాప్రపూర్ణ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారిని పుష్పమాలాలంకృతులనుచేసి, దుశ్శాలువను గప్పి, వస్త్ర తాంబూలాదులనిచ్చి, బంగారు పేరుతో ముద్దులొలికే "స్వీయచరిత్ర"ను సమర్పించారు. సభామండపం "శ్రీ చిలకమర్తికి జై" "అభ్యుదయ రచయితల సంఘానికి జై" అనే నినాదాలతో ప్రతిధ్వనించింది.

శ్రీ చిలకమర్తి మహాకవి, బహూకృతులకు ప్రత్యుత్తరమిస్తూ, "నా కిప్పుడు 78 ఏండ్లు. నా కేసు యమధర్మరాజు కోర్టుకు పోయి చాల దినములైంది. హిట్లరు కలిగించిన యుద్ధంవల్ల యమధర్మరాజుకు పని ఎక్కువైంది. అందువల్ల నా కేసు హియరింగుకు రాకుండా వెనుకబడ్డది. ఆ పిలుపుకు వేచివున్నాను. ఈలోపున నా "స్వీయచరిత్ర"ను వ్రాయడానికి ధనంగూడ యిచ్చి ప్రోత్సహించిన విస్సా అప్పారావుగారికీ, రాయసం వెంకటశివుడుగారికి కృతజ్ఞుడను. **నేను బ్రతికివుండగా యీ గ్రంథం అచ్చువుతుందని నేను తలచలేదు. గ్రంథమచ్చొత్తించి, దీనిపై రాగల లాభం, రు. 750/-లను నాకిచ్చి, యీ సన్మానాన్ని యింత వైభవంగా జరిపిన అభ్యుదయ రచయితల సంఘాన్ని కృతజ్ఞతాపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను."** అని అన్నారు.

- 10-1-1945, ప్రజాశక్తి

అభ్యుదయ రచయితల సంఘం జరిపిన ఈ ఘన సన్మానం, చిలకమర్తి స్వీయచరిత్ర ప్రచురణ, అందుకు జరిగిన కృషి నేటి తరం వారికి తెలియడం అవసరం. స్వీయచరిత్రకు

నాటి అరసం కార్యదర్శి శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు వ్రాసిన పరిచయ వాక్యాలు, శ్రీ చిలకమర్తివారు స్వయంగా వ్రాసుకొన్న అవతారిక ఎంతో ఆసక్తిదాయకమైనవి. శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు చిలకమర్తివారి స్వీయచరిత్రకు పరిచయ వాక్యాలు వ్రాస్తూ ఇలా అన్నారు :

## "చిలకమర్తివారి స్వీయచరిత్ర ఎందుకు ప్రచురించాం?"

"కళాప్రపూర్ణ" చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు తెలుగు సాహిత్యానికి, సంఘ సంస్కరణోద్యమానికి, నాట్యరంగానికి చేసిన సేవ అపారం. ఆంధ్రప్రజల అభ్యుదయానికి తోడ్పడే అనేక గ్రంథాలను వారు రచించారు. "కళాప్రపూర్ణ"నిచే వ్రాయబడిన 'గయోపాఖ్యాన' నాటకం ప్రజారంజకమై మరి యే యితర తెలుగు గ్రంథం ఖర్చుకానన్ని యెక్కువ ప్రతులు - సుమారు లక్ష దాకా - ఖర్చుపడింది. వారు రచించిన 'రాజస్థానకథావళి', 'మహాపురుషుల జీవితాలు' వంటి గ్రంథాలు తెలుగునాటి యువకులలో దేశభక్తి, ఉత్సాహాలను రేకెత్తించి, జాతీయోద్యమానికి విశేషంగా దోహదం చేశాయి. కీర్తిశేషులైన కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించిన సంఘ సంస్కరణోద్యమానికి, లక్ష్మీనరసింహంగారు సహాయంగా నిలబడి, హితకారిణీ సమాజ అధ్యక్షులుగా ఎంతోకాలం సేవచేశారు. గాంధీజీ భారత రాజకీయరంగంలోకి రాకముందే "కళాప్రపూర్ణుడు" హరిజన బాలురకు చదువు చెప్పేందుకు 'రామమోహన పాఠశాల'ను నడిపారంటే, వారి సంస్కారాభిమానం ఎంత గాఢమయిందో మనకు విదితమవుతుంది.

## 50 యేండ్ల ఆంధ్ర ప్రజా ఉద్యమానికి ప్రతిబింబం

"ఒకమాటలో చెప్పాలంటే, లక్ష్మీనరసింహంగారు ఆంధ్ర ప్రజాభ్యుదయానికి కృషిచేసిన మహాపురుషులలో ఒకరు. వారి స్వీయచరిత్రమును ప్రకటించడానికి తోడ్పడగలిగినందులకు "ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం" ఎంతో గర్వపడుతూంది.

"కళాప్రపూర్ణుని జీవితగాథ చదువుతూంటే, యీనాడు ప్రజాసేవకు పూనుకొని పనిచేస్తున్నవారందరికి ఉద్వేగం కలుగుతుంది. అర్ధశతాబ్దానికి పూర్వం ఆ రోజులలో, తెలుగుభూమిలో ప్రజల విజ్ఞానాభివృద్ధికి విత్తులు నాటిన మహనీయులు ఎన్ని కష్టాల నెదుర్కోవలసివచ్చిందో మనకు బోధపడుతుంది. వారు ఏర్పరచిన సత్సాంప్రదాయాలను జీర్ణంచేసికొని, తెలుగు సాహిత్య ఉద్యానవనాన్ని పెంపొందించవలసిన బాధ్యత సాహిత్య సేవకులందరిపైన వుంది. **లక్ష్మీనరసింహంగారి "స్వీయచరిత్రము" 50 యేండ్ల ఆంధ్ర ప్రజా ఉద్యమాన్ని ప్రతిబింబించుతూంది.** చదువుతూంటే ఆ రోజులలోని సమాజ పరిస్థితులు బోధపడతాయి. మనం నేర్చుకోవలసిన గుణపాఠాలు, అనుభవాలు ఎన్నో కన్పించుతాయి.

"ఈ సందర్భంలో మేమొక విషయం స్పష్టపరచవలసివుంది. అభ్యుదయ రచయితల సంఘం వ్యవహారిక భాషలో గ్రంథరచన జరగాలని నమ్ముతూంది. ప్రజాసామాన్యానికి విద్య సులభంగా నేర్పడానికి వ్యవహారిక భాష అవుసరమని చెప్పిన స్వర్గీయ గిడుగు రామమూర్తి పంతులుగారి ఆశయాన్ని బలపరుస్తూంది. ఆంధ్రాభ్యుదయానికి పునాదివేసిన స్వర్గీయ కందుకూరి

వీరేశలింగం పంతులుగారు, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు సులభమైన శైలిలో గ్రంథాలు వ్రాసి ప్రజల కెంతో సేవ చేశారు. కాని వారు గ్రాంధిక భాషావాదాన్ని బలపరచారు. ఆంధ్ర వాఙ్మయ నిర్మాతలుగా వారికున్న పలుకుబడివల్లనే విశ్వవిద్యాలయాలలో, పాఠశాలలలో గ్రాంథికభాషనే ఉపయోగించాలనే నిర్ణయానికి రావడానికి కారణమయింది. కాని క్రమంగా వ్యవహారిక భాషకే వ్యాప్తి జరిగింది. దాదాపు పత్రికలన్నీ వ్యవహారిక భాషనే విశేషంగా వాడుతున్నాయి. తరవాత వీరేశలింగంగారు వ్యవహారిక భాషా ఉద్యమానికి సానుభూతి చూపారు.

## వినమ్రతతో విభిన్నాభిప్రాయం

"ఈ పుస్తకంలో కూడా శ్రీ లక్ష్మీనరసింహంగారు గ్రాంధిక భాషావాదులను సమర్థించుతూ వ్రాశారు. శ్రీ లక్ష్మీనరసింహంగారికి వినమ్రులవుతూ, మేము వ్యవహారిక భాషావాదులమనీ, వారి గ్రాంధికవాదానితో ఏకీభవించలేమనీ విన్నవించుకుంటున్నాము. వీరేశలింగంగారి, లక్ష్మీనరసింహంగారి సులభశైలి ప్రజాభ్యుదయానికి ఎలా తోడ్పడిందో గ్రహించుతూ, యింకో అడుగు ముందంజవేసి, ప్రజాసామాన్యానికి సులభంగా విజ్ఞానాభివృద్ధి చేకూరడానికి వ్యవహారిక భాషావాదాన్ని బలపరుచుతున్నామని స్పష్టపరుస్తున్నాము.

"శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు స్వీయచరిత్రను పూర్తిగా వ్రాశారని, అచ్చు వేయవలసివుందని మాకు తెలియగానే అందరం కృషిచేయ పూనుకొన్నాము. ఈ యుద్ధపురోజులలో కాగితపు కరువు పుస్తక ప్రకటనకు ఎంత ఆటంకంగా ఉన్నదో అందరు ఎరిగిన విషయమే. మేము కోరినంతనే "ప్రజాశక్తి ప్రచురణాలయం"వారు ఈ గ్రంథ ప్రచురణకు తమ సంసిద్ధత తెలిపారు. తమకున్న కాగితం 'కోటా'లో కొంతభాగం యిందుకు వినియోగించడానికి అంగీకరించారు. వారి సహాయంవలన వెంటనే ప్రకటించడం సాధ్యపడింది. అంతేగాదు, ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితల మహాసభనాటికి ఈ పుస్తకాన్ని అందచేయగలిగారు. ఇలా సాయపడినందులకు ప్రజాశక్తి ప్రచురణాలయంవారికి మా అభివందనాలు. "స్వీయచరిత్రము" ప్రకటించడానికి మాకు అవకాశమిచ్చిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారికి మరొకసారి మా నమస్కృతులు" అని చదలవాడ పిచ్చయ్యగారు తమ పరిచయ వాక్యాలను ముగించారు. (28-12-1944)

## చరిత్రలు : దేశాభ్యుదయం - చిలకమర్తివారి అవతారిక

తన స్వీయచరిత్ర ఎందుకు వ్రాయ సంకల్పించారో చిలకమర్తివారు చెప్పిన విషయాలు ఎంతో ఆసక్తిదాయకమైనవి. వారు "తమ అవతారిక"లో ఇలా అన్నారు.

"చరిత్రలు దేశాభుదయమునకు తోడుపడును. కావున దేశచరిత్రలు మిక్కిలి యవశ్యములు. బహుపురుషుల చరిత్రలుగలసి దేశచరిత్రలగును. కాబట్టి జీవితచరిత్రలు మిక్కిలి యవశ్యములు. మహాపురుషుల చరిత్రములు శ్రద్ధతో వ్రాసినవారున్నపక్షమున యవి యువజనులకు నాదర్శములుగా నుండును. ఒకరి చరిత్రము మరియొకరు వ్రాసినపక్షమున వ్రాయవలసిన

విషయములు సమగ్రముగా లభింపవు. అందుచేత నెవరి చరితము వారే వ్రాసుకొన్న పక్షమున విషయములన్నియు సంపూర్ణముగా నుదాహరించుట కవకాశముండును.

"కాని స్వీయచరిత్రములలో నొక లోపముండవచ్చును. పురుషుడు తన చరిత్రము వ్రాసుకొన్నపుడు తన యుత్తమగుణములనేగాని దుర్గుణములను వెల్లడింపడు. ఒకరి చరిత్ర మరియొకరు నిష్పక్షపాతముగా వ్రాయుట తటస్థించెనేని కథానాయకుని సుగుణములతోపాటు దుర్గుణములనుగూడ జిత్రించును. స్వీయచరిత్రములు వ్రాసుకొన్నవారిలోగూడ కొందరు స్వీయలోపములను నిశ్శంకముగా వెల్లడింతురు. అట్టి మహనీయులు జగంబున నరుదుగ నుందురు. అట్టి మహనీయుడు గాంధీ మహాత్ము డొక్కడే.

"ఘనకార్యములుచేసిన మహాపురుషులు పరులకు మార్గదర్శకములుగా నుండుటకై తమ చరిత్రలు తప్పక వ్రాయవలయును. మహాత్మ గాంధీగారు, జవహరలాలు నెహ్రూగారు మొదలగువారు ఉత్తమ జీవితములు జీవించి స్వార్థత్యాగులై లోకోపకార పరాయణులగుటచే నట్టివారి జీవితము లమూల్యములు. మన యాంధ్రదేశమున మొట్టమొదట స్వీయచరిత్రము వ్రాసుకొన్నవారు మహనీయులైన రావుబహదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు. ఆ మహాపురుషుని చరిత్రమంతయు స్వార్థత్యాగముతోడను, లోకోపకారకమైన ఘనకార్యములతోడను నిండియున్నది. కావున వారి స్వీయచరిత్రము నిశ్చయముగా నాంధ్ర సారస్వతమున కలంకారమై యాంధ్రజనులకు మార్గదర్శకమై యున్నది.

"శ్రీ వల్లూరి సూర్యనారాయణగారుగూడ స్వీయచరిత్రము వ్రాసుకొనిరి. ఆయన తన యార్జించిన విత్తమంతయు విద్యాసంస్థ కిచ్చియుండుటచే నాయన చరితముగూడ ప్రశంసనీయమే.

"నా మిత్రులైన రాయసము వేంకటశివుడుగారు చిన్ననాటనుండియు బుద్ధిమంతులై సత్ప్రవర్తనము గలిగి నుపాధ్యాయపదవిలో నుండి, కట్టకడపట నెల్లూరులోని వెంకటగిరి మహారాజాగారి కళాశాలకు ప్రధానాచార్యులై, "జనానా" పత్రిక మొదలగు కొన్ని పత్రికలు నడిపి, స్త్రీలకుపయోగించు గ్రంథములనేకములు రచియించి, గుంటూరుల్ో కొన్ని వేల రూపాయలు ఖర్చుపెట్టి, ధర్మార్థముగా నొక మందిరము గట్టించి, ప్రజలకు నప్పగించిన యుదార పురుషుడగుటచే, వారి "యాత్మకథ"గూడ శ్లాఘనీయమై యున్నది.

## "స్వీయచరిత్ర నేనెందుకు వ్రాశాను?"

"ఆ స్వీయచరిత్రముల ముందట నావంటివాని స్వీయచరిత్రము దివిటీ ముందర దీపమువలె నుండునని నే నెరుగుదును. అయినను నేల వ్రాయవలసివచ్చినదన్న, నేతద్వృత్తాంతము వినిపించెద వినుడు.

"1928వ సంవత్సరము మార్చినెలలో నా షష్టిపూర్త్యుత్సవమునకు రాజమహేంద్రవరము దయచేసినపుడు, మునగాల రాజాగారగు శ్రీ రాజా నాయని వెంకటరంగారావు బహదూరువారు,

నా స్వీయచరిత్రము వ్రాయవలసినదని నాతో నొక్కి చెప్పిరి. పిమ్మట వీరేశలింగోన్నత పాఠశాలలో సహోపాధ్యాయులును, నాకు మిత్రులునైన యడవి శంకరరావుగారు నా స్వీయచరిత్రము వ్రాయవలసినదని నా మేనల్లునిచేత పలుమారులు వర్తమానమంపుటయేగాక, వారు నన్నుగలసికొన్నప్పుడెల్లను జెప్పుచువచ్చిరి. ఏ విధమైన ఘనకార్యములు చేసియెరుగని నావంటి సామాన్యుని చరిత్రము లోకమున కేమి యుపకరించుననని, నే నా ప్రయత్నముచేయక చిరకాల మూరకొంటిని. కాని యైదారు మాసముల క్రిందట నాకు బాల్యమితులైన రాయసము వెంకటశివుడుగారును, చిరకాల మిత్రులైన విస్సా అప్పారావుగారును నడుమనడుమ మా యింటికివచ్చి నా స్వీయచరిత్ర వ్రాయుమని హెచ్చరించుచు వచ్చిరి. వారుభయులు నన్ను పలుమారులు గ్రంథమెంతవరకు వ్రాసినారని యడుగుచు వచ్చిరి. నే నారంభించలేదని నాలో నేను సిగ్గుపడుచు పలుమారులు వారికి చెప్పితిని. ఆరంభించకపోవుటకు గారణమేమని వెంకటశివుడుగారు నన్ను నొక్కియడిగిరి. వెంకటశివుడుగారు నాకు సహోధ్యాయులును, బాల్యమిత్రులు నగుటచే సందేహము విడిచి యిట్లు చెప్పితిని :

## ఆర్థిక బాధల మధ్య మనస్థిమితం లేని దుస్థితిలో . . .

"అయ్యా నాకు శ్రీ పిఠాపురము మహారాజావారు పరమదయాళులై నెలకు ముప్పది రూపాయలు జీతమిచ్చుచున్నారు. నామీద ననేకు లాధారపడి యుండుటచే నా కా సొమ్ము చాలక యెన్నో చిక్కులు పడుచుంటిని. నే నంధుడను, నితర శరీర దౌర్బల్యము గలవాడనగుటచే నా కన్నపానాదులు సమకూర్చుటకును, నన్నావలకు నీవలకు దీసికొనివెళ్ళుటకును మనుష్యులు కావలెనుగదా? వారిని నేను పోషింపక తప్పదుగదా? నాకు రాజమహేంద్రవరములో స్వంత యిల్లు లేకపోవుటచే గాపురమున్న యింటికి నద్దె నీయవలెనుగదా? అందుచేత నాకు సొమ్ము చాలక మనస్థిమితము లేదు. నిర్విచారముగా నిర్మలమైన మనస్సుతో వ్రాయవలసిన గ్రంథము చిక్కులలోబడి మనస్థిమితములేని నేనెట్లు వ్రాయగలను? నాకు నెల కరువది రూపాయ లుండినగాని నెల గడువదు. అందుచేతనే వ్రాయజాలను క్షమింపుడు." ఆ పలుకులు విని శ్రీ వేంకటశివుడుగారు "తక్కిన ముప్పది రూపాయలు మీకు వచ్చునట్లు మే మేర్పాటు చేసెదము. గ్రంథ మారంభింపుడు" అని చెప్పి వెడలిరి. నేను సంవత్సరాదివెళ్ళిన మరునాడనగా చిత్రభాను సంవత్సర చైత్రశుద్ధ విదియనాడు (18-3-1942) ఉదయమున నా స్వీయచరిత్రమును నా గుమాస్తాచేత వ్రాయింప నారంభించితిని. వెంకటశివుడుగారును, అప్పారావుగారును నా కప్పటినుండియు నెలకు ముప్పది రూపాయలచొప్పున యిచ్చుచున్నారు.

"ఆహాహా! వారి దేశాభిమానము నే నేమని వర్ణింతును. వారికి నామీద గల దయ యెంతని చెప్పుదును? వారి స్వార్థత్యాగమేమని కొనియాడుదును? నావంటివాని స్వీయచరిత్ర లేనిచో లోకమునకేమి లోపమువచ్చును? ఈ యుదారచిత్తులిరువురుగూడ నంత పట్టుపట్టి కష్టార్జితమైన స్వంత సొమ్ము ఖర్చుపెట్టి, నాకు వ్రాయుటకు గావలసిన కాగితము సైతము నిచ్చి, నాచే నీ

గ్రంథమేల వ్రాయింపవలెను? మహారాజుగారిచ్చునట్టి ముప్పదిరూపాయలకు తోడుగ నీ పరమాప్తులు బంపినట్టి ముప్పదిరూపాయలతో మనస్థిమితముగలిగి నీ గ్రంథము వ్రాసి పూర్తిచేయగలిగితిని.

## జపాను బాంబుదాడులు : కాకరపర్రుకు మకాం మార్పు

“నేనయిదవ యేప్రియలువరకు రాజమహేంద్రవరములోనుంటిని. జపానువారి దాడివలన విశాఖపట్టణమునకును, కాకినాడకును బట్టినగతియే, రాజమహేంద్రవరము విడిచి పడమటిగోదావరిజిల్లాలో తణుకు తాలూకాలోని కాకరపర్రు గ్రామము వెళ్ళితిని. అక్కడ నాముఖ్య బంధువులు నాకు బసయిచ్చి, నన్ను నా కుటుంబమును నాదరించుచున్నారు. రాజమహేంద్ర వరములోనుండగా నాగుమాస్టారైన ఐనపర్తి సత్యనారాయణగారిచేత నూటతొంబదియైదు పుటలు వ్రాయించితిని. కాకరపర్రు వెళ్ళిన తరువాత మిగిలిన మొత్తముమీద గ్రంథము వ్రాతప్రతిలో రమారమి యెనిమిది వందల పుటలైనది. నా చరిత్ర యింత పెద్దదిగ నుండునని నేనారంభమున ననుకొనలేదు.

“స్వీయచరిత్రలు వ్రాయువారికి వారివారి దినచర్యా గ్రంథములు (Diary) నితర సహాయములు నుండును. నే నంధుడనగుటచే నట్టి దినచర్యాగ్రంథములు వ్రాయలేకపోతిని. కాబట్టి యీ గ్రంథము వ్రాయుటకు పూర్తిగ పరమేశ్వరుడు నాకిచ్చిన జ్ఞాపకశక్తి యొక్కటే నాధారముగాని, లిఖితపూర్వకమైన యాధారముగాని మరి యే యితర సహాయముగాని లేదు. జ్ఞాపకశక్తినిబట్టి డెబ్బది సంవత్సరముల చరిత్ర వ్రాయవలసివచ్చుటచే నచ్చటచ్చట ప్రమాదములుండిన నుండవచ్చును. కొన్ని విషయములు మరచియుండవచ్చును. తేదీలు నెలలు పొరపాటుగ తప్పులుపడి యుండవచ్చును. బుద్ధిపూర్వకముగా నేనేమియు నసత్యములు వ్రాయలేదు. పొరపాటులున్న పక్షమున పాఠకమహాశయులు క్షమింతురుగాక!

“ఇంత పెద్ద గ్రంథమచ్చుపడునని ధైర్యము నాకులేదు. ఈశ్వరునేనమ్మి గ్రంథము వ్రాసి పూర్తిచేసితిని. ఈ గ్రంథము 18-3-1942వ తేదీన ప్రారంభించి 12-7-1942వ తేదీన ముగించితిని. మొత్తముమీద నీ గ్రంథము వ్రాయుటకు రమారమి నాలుగు మాసముల యిరువది నాలుగు దినములుపట్టెను. నాకిపుడు డెబ్బదియైదవ సంవత్సరము జరుగుచున్నది. ఇంత వార్ధక్యములో నాకు పూర్తియైన జ్ఞాపకశక్తిని, నోపిక, నారోగ్యము నిచ్చి నాచే నీ గ్రంథము రచియింపజేసిన పరమేశ్వరునకు నేను శతసహస్ర వందనము లాచరించుచున్నాను.

నా స్వీయచరిత్రము వ్రాయుమని నన్ను నిర్బంధించిన నేరమునకు నేను శ్రీ రాయసము వెంకటశివుడుగారికిని, శ్రీ విస్సా అప్పారావుగారికిని ధనదండనము విధించినాను. ఆ జరిమానా వారు నాకు వాయిదాలమీద నెల నెలకు జెల్లించుచున్నారు. గ్రంథము వ్రాయుట ముగిసినను వారు నాకు 1943వ సం॥ అక్టోబరు వరకు యీ సహాయము చేసిరి. నేరము జేసినవారికి శిక్ష ననుభవింపక దప్పునా? ఆ యుదార పురుషుల కిరువురకు నా కృతజ్ఞతాపూర్వ కాశీర్వచనములు

చేసి గ్రంథము ముగించుచున్నాను. పరమేశ్వరుడు వారికి, వారి కుటుంబములకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యముల నిచ్చుగాక. (చిలకమర్తి లక్ష్మీనరసింహం, కాకరపఱ్ఱు, 12-7-1942, చిత్రభాను సం॥ నిజజ్యేష్ఠ బహుళ అమావాస్య భానువారం.)

## అరసం కృషికి చిలకమర్తి జేజేలు

అవతారికతోబాటు "మరొకమాట" పేరుతో ఆనాడు అభ్యుదయ రచయితల సంఘం గావించుతున్న కృషికి చిలకమర్తివారు ఎంతగానో ప్రశంసించుతూ ఇలా అన్నారు :

"ఈ స్వీయచరిత్రము వ్రాయుట ముగిసిన పిదప నిదియెట్లు ముద్రింపబడునాయని నేను విచారించుచుంటిని. కాగితము ధర చాల హెచ్చినది. ఆ ధర చూడగ నీ గ్రంథ మింతలో ముద్రింపబడునని తోచదు. నాచే గ్రంథము వ్రాయించిన శ్రీ విస్సా అప్పారావుగారును, శ్రీ రాయసం వెంకటశివుడుగారును దీని ముద్రణమును గురించి యాలోచించుచునే యుండిరి.

"ఇట్లుండగ కొన్ని మాసములక్రిందట, దీని ముద్రణమునకై యొక దారి పొడగట్టినది. అది కేవల మీశ్వరప్రేరితమేయని నా విశ్వాసము. అది యేదన, ఆంధ్రదేశమున నిటీవల "నాంధ్రాభ్యుదయ రచయితల సంఘమ"ను పేర నొక యపూర్వసంఘము నెలకొలుపబడినది. దాని కేంద్రస్థానము బెజవాడ. దాని కాంధ్రదేశమున బెక్కు మండలములలో శాఖలున్నవి. ఈ సంఘములో వందలకొలది సభ్యులున్నారు. ఈ సంఘము యొక్క ముఖ్యోద్దేశమేమనగ, నాంధ్రాభ్యుదయమునకై పాటుపడినవారి జయంతులు జరుపుట, వారి గ్రంథము లచ్చువేయించి, ఆయా గ్రంథములను, వారి వారి జీవితములను ప్రజలకు పరిచయముజేసి, ప్రజలయొక్క దృక్పథము వాకర్షించి, దేశాభ్యుదయమునకు పాటుపడునట్లు చేయుట. ఈ సంకల్పముతో శ్రీ రావుబహదూరు కందుకూరి వీరేశలింగముగారియొక్కయు, శ్రీ గురజాడ అప్పారావుగారి యొక్కయు, శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి యొక్కయు జయంతులను బలుతావులయందు జరిపి, సంచికల నచ్చువేయించి, వారు జేసిన దేశసేవను, భాషాసేవను జగద్విదితము జేసిరి.

"ఈ సంఘము మహోన్నతాశయములతోడను, నుదారభావములతోడను, స్వార్థత్యాగులైన యువకులచే స్థాపింపబడి జరుపబడుచున్నది. ఇందులో ననేక గ్రంథరచయితలు, భాషాభిమానులు గలరు. దీని యాశయములు పరిశుద్ధములు, ప్రశంసనీయములు నగుటచే లోకమున వీరికి పలు విధముల సహాయము గలుగుచున్నది. బెజవాడలోనున్న రాష్ట్రీయ సంఘ కార్యదర్శి ప్రస్తుతము చదలవాడ పిచ్చయ్యగారను యువకుడు.

ఒకనాడు కాకరపఱ్ఱులో నా బసలో నే నుండగ ఈ సంఘ సభ్యుడైన నాగభైరవ శివరామ కృష్ణయ్యగారను యువకుడు నావద్దకు వచ్చి యీ సంఘమును గురించి నాకుఁజెప్పి, యీ సంఘమువారు నాకు గుంటూరులో సన్మానముచేయ దలచినారనియు, నా దేహారోగ్యమెట్లున్నదో చూచి, నాతో ప్రసంగించి నా స్థితిని తెలుసుకొని రమ్మని తన్ను తమ రాష్ట్రీయ సంఘ కార్యదర్శి శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు పంపినారనియు నాతో చెప్పిరి.

## ముందుగానే అందజేయబడిన రాయల్టీ

“అప్పుడు ప్రసంగవశమున శివరామకృష్ణయ్యగారు “మీరు వ్రాసిన క్రొత్త గ్రంథము లేవైనగలవా” యని ప్రశ్నించిరి. అప్పుడు నా స్వీయచరిత్రను గురించిన వృత్తాంతము చెప్పితిని. అంతట తమ సంఘమువారా స్వీయచరిత్ర నచ్చువేయించు సంకల్పము గలదనియు, నా సంగతి కార్యదర్శియైన శ్రీ పిచ్చయ్యగారితో మాటలాడి నాకు తెలియజేయుదుమనియు, జెప్పి వెడలిపోయిరి. ఆ తరువాత స్వీయచరిత్ర మచ్చువేయించుటకు నిశ్చయించుకొని, శుద్ధప్రతి నిమ్మనికోరిరి. ఈ సంఘముయొక్క పూర్వాపరములు మాకు తెలియకపోవుటచే నేనును, నా మిత్రులును దీనిని గురించి యాలోచించుటలో గొన్ని దినము లాలస్యమైనది. ఈ గ్రంథము నచ్చువేయించి ముద్రణమునకగు ఖర్చులు మొదలగునవి పోను, మిగిలిన లాభము నాకిచ్చివేయుదుమని వాగ్దానముజేసి, యంచనప్రకారము ముందుగనే రాబోవు లాభముక్రింద రు. 750లు నాకు వారి కార్యదర్శి శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు స్వయముగ దెచ్చి యిచ్చిరి.

“ఇదిగాక, నా కీ సంఘమువారు గుంటూరులో సన్మానము చేయదలచిరి. కాగితము దొరకని యీ దుర్దినములలో వ్రాతలో సుమారెనిమిది వందల పుటలుగల పెద్ద గ్రంథమును కొన్ని వేల రూకలు ఖర్చుపెట్టి యీ సంఘమువా రచ్చువేయించుటకు కారణమేమన, వారికిగల గాఢమైన దేశాభిమానము, భాషాభిమానము, సారస్వతమునందుగల తీపియునని చెప్పవలెను. అదియుంగాక, నే నీ గ్రంథమును వారి కిచ్చుటలో నాలస్యము జేసినప్పటికిని లెక్కచేయక, వారికిగల తక్కువ వ్యవధిలో నీ గ్రంథము నచ్చువేయించి సమ్మానమునాటికి సిద్ధముచేయుటలో యీ సంఘమువారికి గల కార్యదీక్ష, స్వార్థత్యాగము, ప్రజాసేవయందుగల యాసక్తి, వర్ణనాతీతమని చెప్పకతప్పదు.

## అరసంవారు ప్రచురించి ఉండకపోతే . . .

“లోకములో నెట్టి ఘనకార్యములైనను యువకులే సాధింపగలరనియు, దేశాభ్యుదయమును గూర్చిగాని, సారస్వతమును గూర్చిగాని ప్రజలను గురించిన యే కార్యముగాని, కాలానుసారముగ బయలుదేరిన యువకులవల్లనే సాధింపబడుననియు, దేశమును, సారస్వతమును మరి యే యితర సంస్థనుగాని యువకులే ముందుకు నడిపింతురనియు, మొట్టమొదటినుండియు నా యాశయము. నా జీవితమంతయు నెట్టి యాశయములతోను, యెట్టి స్వతంత్రేచ్ఛతోను గడిపితినో యట్టి యాశయములు గలిగిన యువక సంఘమువల్ల నీకార్యము సాధింపబడి, నా స్వీయచరిత్ర మచ్చుపడినందుకు సంతసించుచున్నాను. ఈ సంఘమువారియొక్క సహాయములేని పక్షమున నా స్వీయచరిత్ర మింతలో నచ్చుపడక యుండెడిది. కాబట్టి యీ సంఘ సభ్యులకును, వారి కార్యదర్శిగారైన చదలవాడ పిచ్చయ్యగారికిని, వారికి దోడుపడిన యింక ననేక మహనీయులకును, నేను కృతజ్ఞతాపూర్వ కాశీర్వచనములు చేయుచున్నాను. ఇట్టి పరిశుద్ధాశయములు, స్వార్థత్యాగులు గల సంఘములు పెక్కులు బయలుదేరి,

దేశాభ్యుదయమునకు దోడుపడుగాక! పరమేశ్వరుడు వారి ప్రయత్నములు సఫలము చేయుగాక! (ఆంధ్ర ప్రజాసేవకుడు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, కాకరపఱ్ఱు, 22-12-44)

చిలకమర్తివారి స్వీయచరిత్ర వెలుగుచూడడానికి జరిగిన ఈ కథ నంతనూ చదివితే ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం, దానివెనుక కమ్యూనిస్టు పార్టీ ఎంత చరిత్రాత్మక కర్తవ్యం ఆనాడు నిర్వహించాయో వేరే చెప్పనక్కరలేదు.

## గుంటూరులో చిలకమర్తికి అఖండ సన్మానం

1944 డిసెంబరు 30న బెజవాడలో ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల ద్వితీయ మహాసభ సందర్భంలో సన్మానసభ తరువాత 1945 ఫిబ్రవరి 26వ తేదీన గుంటూరు ఎ.సి. కాలేజీలో చిలకమర్తివారికి అఖండ సన్మానం జరిగింది. సభకు కొండా వెంకటప్పయ్యగారు అధ్యక్షత వహించారు. గుంటూరు అభ్యుదయ రచయితల సంఘం తరఫున దేశిరాజు కృష్ణశర్మగారు సన్మాన పత్రం సమర్పించారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రసంగించారు. పాత సంస్కృతి పునాదులపై కొత్త నిర్మాణాలను గావించుతూ దేశానికి, భాషకు అభ్యుదయ రచయితలు సేవచేయాలని చెబుతూ చిలకమర్తివారికి సన్మానం జరుపుతున్నందుకు వక్తలు అభినందించారు.

గుంటూరు చిలకమర్తివారి సన్మానసభ కన్వీనింగ్ కమిటీ సభ్యులు ఎవరో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఆనాటి జాతీయోద్యమ ప్రముఖులు, సాహితీవేత్తలందరూ ఈ సన్మానానికి సన్నాహం చేశారు. సర్వశ్రీ కొండ వెంకటప్పయ్య, ఉప్పులూరి వెంకట పున్నయ్య, నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు, బారిష్టర్ జి.వి. చౌదరి, ఉన్నవ గోపాలకృష్ణయ్య, దామరాజు పుండరీకాక్షుడు, కూర్మా వేణుగోపాలస్వామి, తెలికిచర్ల వెంకటరత్నం, మల్లంపల్లి సోమశేఖరశర్మ, మారేమండ రామారావు, వావిలాల సోమయాజులు, పత్తిపాటి అంకమ్మచౌదరి, దేశిరాజు కృష్ణశర్మ, ప్రయాగ కోదండరామశాస్త్రిగార్లు వీరిలో ఉన్నారు. సన్మానసభకు దిగవల్లి శివరావు, తుమ్మల సీతారామమూర్తిగార్లు సందేశాలు పంపారు.

## కన్యాశుల్కం నాటకం ప్రదర్శన

బెజవాడలో అభ్యుదయ రచయితల సంఘ రెండవ మహాసభ సందర్భంలో కన్యాశుల్కం నాటకంలో కొన్ని ముఖ్య ఘట్టాలను ప్రదర్శించారు. హనుమంతరాయ గ్రంథాలయంలో ఈ నాటకాన్ని ప్రదర్శించింది మామూలు నటులుకాదు. కమ్యూనిస్టు నాయకులు, ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమ ఆద్యులలో ఒకరైన కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)గారు. రామప్ప పంతులు వేషం వేశారు. రాష్ట్ర ట్రేడ్ యూనియన్ నాయకులు, మహిళా సంఘ నాయకురాలు జోశ్యభట్ల సత్యనారాయణ - సుబ్బమ్మ దంపతులు అగ్నిహోత్రావధానులు - భార్య వెంకమ్మ వేషాలు, బుచ్చమ్మ పాత్ర డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబగారి మరదలు (వినాయకరావుగారి భార్య) శ్రీమతి పద్మ వేశారు. గిరీశం ప్రధాన పాత్ర డాక్టర్ రాజారావు, లుబ్ధావధానులు డాక్టర్ కుప్పా

వెంకట్రామశాస్త్రి, లుబ్ధావధానులు కుమార్తె వితంతు యువతి వేషం కొండపల్లి కోటేశ్వరమ్మ, వెంకటేశం వేషం మాచినేని వెంకటేశ్వరరావు వేశారు. మధురవాణి పాత్ర ఒప్పించడం చాలా కష్టం. అందుకు కూచిపూడి భాగవతుల యువకుని తెచ్చారు. అలాగే బ్రాహ్మణ బోడెమ్మ పాత్ర కూడా ఎవరో కూచిపూడివారిని తీసుకువచ్చారు. సౌజన్యరావు పాత్ర అచ్చమైన సౌజన్యమూర్తి తుమ్మల వెంకట్రామయ్యగారు ధరించారు. కుప్పా వెంకట్రామశాస్త్రిగారు నాటకాన్ని ఎడిట్ చేసి డైరెక్టు చేశారు.

ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే అతి కొద్ది సమయంలో 15 రోజుల వ్యవధిలో పాత్రల పోర్షన్‌లు చదివి రిహార్సల్స్ వేసి, కన్యాశుల్కం నాటకం అభ్యుదయ రచయితల మహాసభ సందర్భంలో ఏమైనాసరే ప్రదర్శించా లనే పట్టుదల, దీక్షలతో కమ్యూనిస్టు పార్టీ అగ్ర నాయకులు, పత్రికా సంపాదకులతో సహా ఆనాడు ముందుకు వచ్చారు. (మహాసభకు ప్రతినిధిగా వచ్చిన ఈ గ్రంథ రచయితకు ఆనాడు ఈ నాటకాన్ని చూసి ఆనందించే భాగ్యం కలిగింది) ఎన్నడూ నాటకరంగం ముఖంచూసి ఎరగనివారు, ముఖానికి రంగులు పూసుకోవడం ఎరగనివారు, కమ్యూనిస్టు నాయకులుగా, ప్రజా ఉద్యమ నాయకులుగా, పత్రికాధిపతులుగా ఉన్నవారు, మహిళా ఉద్యమ నాయకురాండ్రు (అందులో సంసార స్త్రీలు నాటకాలు వేయడానికి రంగస్థలంమీదకు రావడం అతి తప్పుగా భావించే రోజులలో) ఈ నాటకాన్ని ప్రదర్శించారంటే కమ్యూనిస్టు ఉద్యమం ఆనాడు ఎంత సామాజిక చైతన్యాన్ని, ఎంత గొప్ప సామాజిక మార్పును, సాంస్కృతిక పునరుజ్జీవనను తీసుకువచ్చిందో వేరే చెప్పనక్కరలేదు. మహాసభకు వచ్చిన మహాపండితులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారితో సహా మహారచయితలు, సాహితీ ప్రముఖులు ఎంత నివ్వెరపోయారో చెప్పనక్కరలేదు. తెల్లవార నాల్గు గంటలవరకు క్రిక్కిరిసిన హాలులో ఒక్కరూ వెడలలేదు.

అలాగే 1943లో తెనాలిలో జరిగిన అభ్యుదయ రచయితల సంఘ ప్రథమ మహాసభ సందర్భంలో "ఇంగా" అనే సోవియట్ నాటకాన్ని (సోవియట్ స్త్రీ జీవితం) అభ్యుదయ రచయితల సంఘ ప్రముఖులు శ్రీ తుమ్మల వెంకట్రామయ్య, మొ॥వారు ప్రదర్శించారు. అందులో జోశ్యభట్ల సత్యనారాయణ, సుబ్బమ్మ దంపతులే కథానాయకీ నాయకుల వేషాలు వేసి బాగా ఒప్పించారు.

## 8

## ప్రపంచ ప్రఖ్యాత దామెర్ల రామరాయ చిత్రకళా ప్రదర్శనం

విజయవాడలో వైభవంగా జరిగిన అభ్యుదయ రచయితల ద్వితీయ మహాసభ సందర్భంలో ఆంధ్ర జాతీయ కవి చిలకమర్తివారి స్వీయచరిత్ర ప్రచురణ, వారికి సన్మానముతోబాటు ప్రఖ్యాత ఆంధ్ర చిత్రకారుడు దామెర్ల రామరాయ చిత్రకళా ప్రదర్శన ఏర్పాటుచేయబడింది. (29-12-1944) శ్రీ అడవి బాపిరాజుగారు ఈ ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు.

శ్రీ దామెర్ల రామారావు 1897లో రాజమండ్రిలో జన్మించారు. రాజమండ్రి ఆర్ట్స్ కాలేజీ ప్రిన్సిపల్ కూర్డ్లే దగ్గర చిత్రకళను అభ్యసించారు. తరువాత 1916లో బొంబాయిలోని స్కూల్ ఆఫ్ ఆర్ట్సులో శిక్షణ పొందారు. అజంతా, ఎల్లోరా కళాకేంద్రాలను సందర్శించారు. అజంతా శిల్పాలు, అమరావతి శిల్పాలు అచ్చమైన ఆంధ్ర శిల్పాలని ఆయన గ్రహించారు. రాజమండ్రిలో "ఆంధ్ర స్కూల్ ఆఫ్ ఇండియన్ ఆర్ట్" అను సంస్థను స్థాపించారు. వరదా వెంకటరత్నం, చేమకూర సత్యనారాయణ, శ్రీమతి సత్యవాణి (రామారావుగారి భార్య), బుచ్చి కృష్ణమ్మ (రామారావుగారి సోదరి) మున్నగువారు ఆయన దగ్గర శిక్షణ పొందారు. దామెర్ల రామారావు 1926 ఫిబ్రవరి 6వ తేదీన మశూచి వ్యాధితో తన 27వ యేట అకాలమరణం పొందారు.

1922-25 మధ్య మూడేళ్ళలోనే 160 తైలవర్ణ చిత్రాలు, 150 నీటిరంగుల చిత్రాలు రెండు వందలలో మూడు వందలో అసంపూర్ణ చిత్రాలు గీసి 27 యేళ్ళ చిన్నవయస్సులోనే కనుమూసిన దామెర్ల రామరాయ చిత్రకళలో నూతనాధ్యాయాన్ని తెరిచాడని శ్రీ బాపిరాజుగారు తమ ప్రసంగంలో అన్నారు. ఆయన రచించిన చిత్రాలు స్వభావసిద్ధంగా ఉంటాయని, ఆయన వేసిన "సిద్ధార్థ రాగోదయము", "నవవధువు", "అలంకరణ" అన్న చిత్రాలు - చిత్రజగత్తుకే అలంకారమని అన్నారు. ఈ చిత్రకళా ప్రదర్శనను ఏర్పాటుచేసిన అభ్యుదయ రచయితల సంఘంవారిని బాపిరాజుగారు అభినందించారు.

అంతర్జాతీయ ఖ్యాతిపొందిన దామెర్ల రామరాయ చిత్రకళా ప్రదర్శన జరపడంద్వారా ఆనాడు అభ్యుదయ రచయితల సంఘం, కమ్యూనిస్టు పార్టీలు చిత్రకళలో వాస్తవికతను ప్రవేశపెట్టిన ఈ గొప్ప ఆంధ్ర చిత్రకారుని, మళ్ళీ ఆంధ్ర ప్రజానీకానికి గుర్తుచేసింది. దామెర్లవారి చిత్రకళా ప్రదర్శనశాల ఏర్పరచడానికి విస్సా అప్పారావుగారు విశేషకృషి చేశారు. రాజమండ్రిలో ప్రస్తుతం దామెర్ల రామరాయ చిత్రాల గ్యాలరీని ప్రభుత్వం నిర్వహిస్తూంది. కాని అనేక చిత్రాలు దెబ్బతిన్నాయని, సరియైన విధంగా నిర్వహణ లేదని పలు విమర్శలు ఉన్నాయి.

అభ్యుదయ రచయితల సంఘం, నవ్యసాహిత్య పరిషత్తు చేసిన విజ్ఞప్తి ఫలితంగా గుంటూరులో కూడా దామెర్ల రామరాయ వర్ధంతిసభ జరిగింది. దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు సభను ప్రారంభించారు. శ్రీ దేశిరాజు కృష్ణశర్మగారు మాట్లాడుతూ, "అజంతా, ఎల్లోరాల తరువాత దామెర్ల రామరాయ చిత్రాలలోనే ఉత్తమ కళా సంప్రదాయాలను చూడగల్గామని అన్నారు.

రాజమండ్రిలో జరిగిన రామరాయ వర్ధంతి సభలో ఆయన సోదరి బుచ్చి కృష్ణమ్మగారు మాట్లాడుతూ రామరాయ చిత్రకళలో ఉన్న గొప్పతనం జాతీయతలో వుందనీ, బొంబాయిలో చిత్రకళను రామరాయగారు అభ్యసించారనీ, ఒకసారి రాష్ట్ర గవర్నరు యిచ్చిన విందుకు విద్యార్థులందరూ సూటు బూటులు వేసుకొని వెడితే రామరాయ అచ్చమైన ఆంధ్రుడివేషంలో పంచకట్టు, చెప్పులతో హాజరయ్యారనీ, ఈ జాతీయతే ఆయన చిత్రకళలో ప్రతిబింబించిందని అన్నారు. శ్రీ కవికొండల వెంకట్రావుగారు రామరాయని సహజసిద్ధమైన చిత్రకళా రీతిని ప్రశంసించారు.

బెజవాడలో జరిగిన రామరాయ వర్ధంతి సభలో శ్రీ ముద్దు కృష్ణ మాట్లాడుతూ "రవీంద్రనాథ టాగూరు, నందలాల్ బోసు, అజంతా మొదలైన చిత్రాలను పరిశోధించి, ప్రాచ్యకత యొక్క ప్రాశస్త్యాన్ని చాటుతున్న రోజులలో రామరాయ కుంచెపట్టి ప్రాచ్య-పాశ్చాత్య కళారీతులలోని ఉత్తమ అంశాలను సమన్వయం చేశాడని అన్నారు.

ఏలూరు, పామర్రు, భీమవరం, మండపేట మొ॥చోట్ల కూడ దామెర్ల రామరాయ వర్ధంతి సభలు జరిగాయి. దామెర్లవారు చిత్రకళలో తీసుకొనివచ్చిన మార్పులు సర్వత్రా ప్రశంసలు పొందాయి.

# 9

# ధర్మవరం - గురజాడల వర్ధంతి సభలు

1945లో నవంబరు 30వ తేదీన ధర్మవరం కృష్ణమాచార్యులు, గురజాడ అప్పారావుగార్ల వర్ధంతి సభలను జరుపవలసిందిగా నవ్య సాహిత్య పరిషత్తు తరపున శ్రీ తెలికిచర్ల వెంకటరత్నం, అభ్యుదయ రచయితల సంఘం తరపున శ్రీ తుమ్మల వెంకట్రామయ్య, ప్రజానాట్యమండలి తరపున డాక్టర్ జి. రాజారావుగార్లు ఒక సంయుక్త ప్రకటన చేశారు. ఈ ప్రకటన ఫలితంగా ఆంధ్రదేశమంతటా ఈ ఇరువురి వర్ధంతి సభలు జరిగాయి.

బెజవాడలో అభ్యుదయ రచయితల సంఘాధ్వర్యాన స్థానిక రామమోహన్ గ్రంథాలయంలో శ్రీ పాటిబండ మాధవశర్మగారి అధ్యక్షతన, కృష్ణమాచార్యులుగారి 33వ వర్ధంతి సభ 18-12-44న జరిగింది. తెలుగు వాఙ్మయంలో విషాదాంత నాటకాలను అందించినవారిలో కృష్ణమాచార్యులు గారే ప్రథములనీ, ప్రబంధాలకు నవీన నాటకాలకు మధ్య సంధియుగంలో ఆచార్యులవారు యుగకర్త అనీ, మాధవశర్మగారన్నారు. శతావధాని దోమా వెంకటస్వామి గుప్త, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగార్లు ఆచార్యులవారి రచనా అభినయ కౌశలాన్ని ప్రశంసించారు.

గుంటూరు థియసాఫికల్ లాడ్జిలో జరిగిన కృష్ణమాచార్యులవారి వర్ధంతి సభ అభ్యుదయ రచయితల సంఘం, సారస్వత సమితి సంయుక్త యాజమాన్యాన జరిగింది. శారదా నికేతన్ ప్రధానాచార్యులు శ్రీ వావిలాల సోమయాజులుగారు అధ్యక్షత వహించారు. శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, శ్రీ లక్కరాజు సూర్యనారాయణ, శ్రీ పిల్లలమర్రి హనుమంతరావు, శ్రీ పాతూరి రామశాస్త్రిగార్లు ఆచార్యులవారి రచనా వైశిష్ట్యాన్ని ప్రశంసిస్తూ ఆంధ్ర నాటకరంగం ఎంత అభివృద్ధిచెందుతున్నదీ తెలియజేశారు. అనంతరం ఆంధ్రవిశ్వవిద్యాలయం విద్యార్థులు ఆచార్యుల వారిగౌరవార్థం ప్రతాపరుద్రీయంలోని రెండు రంగాలను ప్రదర్శించారు.

అంతర్వేనిపాలెం (తూర్పుగోదావరి)లో రాజోలు తాలూకా అభ్యుదయ రచయితల సంఘం ఆధ్వర్యాన ధర్మవరం కృష్ణమాచార్యులవారి వర్ధంతి సభ జరిగింది. నాట్యకళోపాసకులు శ్రీ ధనలక్ష్మినాయుడుగారు అధ్యక్షత వహించారు. శ్రీ ఎస్.ఆర్. దంతులూరి, శ్రీ అల్లూరి

వెంకట్రామరాజుగార్లు ఆచార్యులవారి రచనా ప్రతిభను ప్రశంసిస్తూ మాట్లాడారు.

## గురజాడ అప్పారావు వర్ధంతి సభలకు సన్నాహాలు

గురజాడ అప్పారావుగారి వర్ధంతి 1944 నవంబరు 30వ తేదీన జరుపడానికి సన్నాహంలో భాగంగా "మహాకవి, మహాపురుషుడు గురజాడ అప్పారావు" అను శీర్షికతో 25-10-44 ప్రజాశక్తి వారపత్రికలో శ్రీ సెట్టి ఈశ్వరరావుగారు ప్రప్రథమంగా ఒక వ్యాసం వ్రాశారు. సెట్టి ఈశ్వరరావు గారు విజయనగరం వాస్తవ్యులు సెట్టి నరసింహం పండిత కుటుంబానికి చెందినవారు. ప్రజాశక్తి వారపత్రిక సహసంపాదకులుగా చిరకాలం పనిచేశారు. ముఖ్యంగా సాహిత్యరంగంలో విశేషకృషి చేసినవారు.

"కాలాన్ని అతిక్రమించిన సాంప్రదాయాలను సంకెళ్ళుగా పరిణమించిన పాత సంప్రదాయాలను త్రెంచుకొని తెలుగు సాహిత్యానికి నూతన చైతన్యాన్ని, నూతన స్వాతంత్ర్యాన్ని నూతన వికాసాన్ని ప్రసాదించిన మహాకవి గురజాడ అప్పారావుగారు - ఆయన కవిత్వం ఎంత నిరాడంబరంగా ఉంటుందో, అంత సమర్ధుని బాణంలాగ సూటిగా తన లక్ష్యాన్ని చేరుతుంది. నిరాడంబరత్వంలో సౌందర్యం సృష్టించడం ఆయన కవిత్వ స్వభావం" అని గురజాడవారి రచనలను సెట్టి ఈశ్వరరావుగారు విశ్లేషించారు.

ఆ తరువాత అదే శీర్షికతో సెట్టి ఈశ్వరరావుగారు ఒక చిన్న పుస్తకం రచించారు. గురజాడవారి దేశభక్తి గేయాన్ని అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి బహుళ ప్రచారంలోకి తీసుకొనివచ్చాయి. దానికి ఒక మంచి శ్రావ్యమైన స్వరకల్పన చేయించి ప్రతీ సభలోను పాడసాగారు.

## దేశభక్తి గేయం విశిష్టత

మద్దుకూరి చంద్రశేఖరరావుగారు "గురజాడ దేశభక్తి గేయం ఏ దేశానికి, ఏ జాతికి, ఏ కాలానికి పరిమితంకాని ఒక అంతర్జాతీయ గేయం వంటి"దని వ్యాఖ్యానించారు. "ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు"లో అన్న వ్యాసంలో చంద్రంగారు వ్రాసిన మాటలు ఇవి :

"... అన్నిటిని మించినది గురజాడ అప్పారావుగారి దేశభక్తి అనే గేయం దాని ఒక్కొక్క పాదం ఒక్కొక్క ముత్యం వంటిది. ఈ గేయం ఒక్కటిచాలు అప్పారావుగారిని అమరజీవిని చేయడానికి. భారతదేశంలో అనేక జాతీయ గీతాలు వచ్చాయి. కాని వాటిలో దేనికీ అప్పారావుగారి గీతంలోని భావగాంభీర్యం లేదు. బంకిం చంద్రుని "వందేమాతరం" గాని, రవీంద్రుని "జనగణమన" గాని, ఇక్బాల్ "హిందూస్థాన్ హమారా" గాని "దేశమును ప్రేమించుమన్నా" గీతానికి ఏ మాత్రం పోలికకు రాలేవు. "నరుల చెమటను తడిసి మూలం ధనం పంటలు పండవలెనోయ్" అంటూ మానవుల కష్టంనుంచే సర్వమూ ఉత్పత్తి అవుతాయని ఎంత చక్కగా చెప్పారో చూడండి" అని శ్రీ చంద్రంగారు ఈ గేయాన్ని ఉగ్గడించారు.

గురజాడ దేశభక్తి గేయంలోని ఇటువంటి విప్లవాత్మక భావాలు ఆయన వ్రాయలేదని,

కమ్యూనిస్టులే వ్రాసి ఆయన నోట బెట్టారని ఆ రోజులలో విపరీతమైన వ్యతిరేక ప్రచారం జరిగింది. అట్టి పరిస్థితుల్లో సెట్టి ఈశ్వరరావుగారు విజయనగరం వెళ్ళి గురజాడవారి కుమారుడు శ్రీ రామదాసుగారిని కలిసి గురజాడ డైరీలు, వ్రాత ప్రతులు, లేఖలు మొ॥ వన్నీ తీసుకొనివచ్చి, ఆయన చేతివ్రాతతో ఉన్న దేశభక్తి గేయాన్ని పట్టుకొని వచ్చి తాను వ్రాసిన "మహాకవి - మహాపురుషుడు గురజాడ అప్పారావు" పుస్తకంలో బ్లాక్‌చేయించి (అప్పటికి ఫోటోస్టాట్ లేదు) మరీ వేశారు. ఈ విషయాన్నే కీ॥శే॥ కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావుగారు చంద్రంగారి స్మారకసభలో చెప్పారు. ఆయన చెప్పిన మాటలు :

"1943లో వారి రచనలన్నింటిని (వీరేశలింగం, గురజాడ మొ॥) బైటికి తీశాం. వీరేశలింగంపంతులుగారి జీవితచరిత్ర ప్రహసనాలు, వారి ఉత్తమమైన నాటకాలు తిరిగి బైటికి తీసుకొనివచ్చాం. అట్లాగే గురజాడ అప్పారావుగారి ముత్యాలసరాలు, కన్యాశుల్కం అందరికీ తెలుసు. కాని ఆయన వ్రాసిన ముత్యాలసరాల గురించి జనబాహుళ్యం అందరికీ తెలియదు. అయితే సాహితీవేత్తలకు తెలుసుననుకోండి. వాటిని తీసి చూస్తే మాకందరికీ చాలా ఆశ్చర్యం వేసింది. **ఏవి కమ్యూనిస్టు సిద్ధాంతాలని మేము అనుకుంటూ వచ్చామో అవి సూచనప్రాయంగా గురజాడ అప్పారావుగారు వ్రాసినవి చక్కగా అందరికీ అర్థమయ్యేటట్టున్నాయి. అవన్నీ మేము అచ్చువేస్తే ఆ రోజుల్లో కొన్ని వ్యాఖ్యానాలు కూడా వచ్చాయి. ఆ రోజుల్లో బహుశా జన్మభూమి అనుకుంటాను. ఆ పత్రికలో "అసలు యివన్నీ అప్పారావుగారు వ్రాశారా? ఆయన ఏవో కొన్ని వ్రాస్తే కమ్యూనిస్టులు వాళ్ళ యిష్టంవచ్చినట్లు ఇవన్నీ కల్పించి వ్రాశారు" అని వ్రాసిపడేశారు."**

**- విజయవాడలో చంద్రం స్మారకోపన్యాసం, 1974 ఆగస్టు 22, విశాలాంధ్ర**

## గురజాడ వర్థంతి సభలు

నవ్య సాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శులు చేసిన విజ్ఞప్తి ననుసరించి ఆంధ్రదేశమంతటా 1944 నవంబరు 30వ తేదీ గురజాడ అప్పారావు వర్థంతి సభలు విజయవంతంగా జరిగాయి.

"అప్పారావు మహాకవి, మహాపురుషుడు. ముందుచూపే గాని వెనక్కు పోవాలనేవాడుకాదు. ఇలాంటి మహాపురుషులను స్మరించడానికి పూనుకొన్న అభ్యుదయ రచయితల సంఘాన్ని అభినందిస్తున్నాను" అంటూ గిడుగు సీతాపతిగారు బెజవాడలో జరిగిన వర్థంతి సభను ప్రారంభిస్తూ అన్నారు. వాఙ్మయం సంఘ చరిత్రకు దర్పణంగా ఉండాలని అప్పారావుగారు అనేవారనీ, ఆయన ఆధునిక నాటక రచనకు, పద్యరచనకు పితామహుడని శ్రీ సీతాపతి ప్రశంసించారు.

"వీరేశలింగం, అప్పారావు, రామమూర్తిగార్లు వ్యక్తులుకాదు, ఉద్యమాలు. గురజాడ యుగకర్త, మహాకవి అని కాకినాడలో అరసం ఆధ్వర్యాన జరిగిన వర్థంతి సభలో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు గురజాడకు జోహారు లర్పించారు.

గుంటూరులో జరిగిన వర్ధంతి సభలో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు మాట్లాడుతూ, "అప్పారావుగారి వ్యవహారికోద్యమం, సక్రమమైనది గనుకనే నానాటికి అభివృద్ధి చెందుతున్నది. ప్రజలను దృష్టిలోపెట్టుకుని ప్రజాశ్రేయస్సుకోసం రచనలు సాగించాలి" అని గురజాడవారి రచనలలోని ఉత్కృష్టతను ఉగ్గడించారు. నవ్య సాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘాధ్వర్యాన జరిగిన ఈ సభలో దేశిరాజు శ్రీకృష్ణశర్మ, శ్రీ ముదునూరు వెంకటేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు.

తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురంలో జరిగిన వర్ధంతి సభలో శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు మాట్లాడుతూ "అప్పారావుగారు ఈ యుగానికి ఒక విశిష్టమూర్తి. వీరు బీజప్రాయంగా అన్నింటికి దిద్దిన వరవళ్ళే ఈనాడు నవ్య సాహిత్య మహా సంస్థలై వర్థిల్లినాయి అన్నారు. రాజమండ్రిలో జరిగిన వర్ధంతి సభకు అధ్యక్షత వహించిన శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు మాట్లాడుతూ "జీవభాషలోనే రచనలు సాగించాలని గిడుగు రామమూర్తిగారు ఒక విప్లవం లేవదీశాడు. అప్పారావుగారు దానిని ముందుకు నడిపి సృష్టిచేశారు. **ఈనాటికైనా ఆయనను ఆంధ్రులు గుర్తించినందుకు ధన్యులు**" అన్నారు. జీవభాష (Spoken word)కై అప్పారావుగారి కృషి గురించి పిలకా గణపతిశాస్త్రి, జనమంచి కామేశ్వరరావుగార్లు మాట్లాడారు. శ్రీ రామాచారి నాట్యమండలివారు "కన్యాశుల్కం"లోని కొన్ని దృశ్యాలను ప్రదర్శించారు. ఇలాగే సారస్వతోపన్యాసకులు, భాషాభిమానులు పాల్గొన్న సభలు ఏలూరు, పచ్చలతాడిపర్రు, మదనపల్లి అంతర్వేదిపాలెం, విజయనగరం, హైద్రాబాద్‌లలో జరిగాయి. (13-12-44 ప్రజాశక్తి)

### గురజాడ చిత్రపటావిష్కరణ

కాకినాడ విజ్ఞానమండలి ద్వితీయ వార్షికోత్సవ సందర్భంలో 17-12-44న శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి అధ్యక్షతన పి.ఆర్. కాలేజీ భవనంలో గురజాడ అప్పారావుగారి చిత్రపటాన్ని ఆవిష్కరించారు. అధ్యక్షులు మాట్లాడుతూ, అప్పారావుగారు రచించిన ముత్యాలసరాలు, కన్యాశుల్కం మొదలైనవి చదువుతూంటే కొత్త కొత్త రుచులూరుతూ, ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని కల్గిస్తాయని అన్నారు. శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి మాట్లాడుతూ గురజాడవారు ప్రజాజీవితాన్ని వాస్తవ రూపంలో కళ్ళకు కట్టినట్లు చిత్రించారన్నారు.

# 10

# కొమర్రాజు లక్ష్మణరావుగారి వర్ధంతి

జులై 13వ తేదీన (1945) కొమర్రాజు లక్ష్మణరావుగారి వర్ధంతి జరుపవలసిందిగా నవ్య సాహిత్య పరిషత్తు కార్యదర్శి శ్రీ తెలికిచర్ల వెంకటరత్నం, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి శ్రీ తుమ్మల వెంకట్రామయ్య సంయుక్తంగా చేశారు. (1945 జులై 11, ప్రజాశక్తి) ఆ విజ్ఞాపనలో ఇలా తెలిపారు.

"శ్రీ లక్ష్మణరావుగారు సంస్కృతాంధ్ర, మహారాష్ట్ర, ఆంగ్లేయ, హిందీ, గుజరాతీ, బెంగాలీ, తమిళ, కన్నడ భాషలలో పండితులై, సర్వతోముఖమైన ఆ పాండిత్యాన్ని మాతృభాషాభివృద్ధికి వినియోగించారు. మహారాష్ట్ర భాషలోని యీయన ఉత్కృష్టశైలి మహారాష్ట్ర పండితుల ప్రశంసలకు పాత్రమైనది. ఈ మహాపురుషుడు ఆంధ్రజాతికి జీవగర్ర అయినాడు. ఆంధ్ర విజ్ఞానానికి ఆటపట్టు అయినాడు.

నాగరిక జాతులన్నీ తమ జాతీయ జీవనానికీ, అభ్యుదయానికీ తోడ్పడే సర్వతోముఖమైన వాఙ్మయాలను పెంపొందించుకొనడం చూచి, మన ఆంధ్రభాషలో కూడా ప్రజల దైనందిన జీవితాన్నీ, భావి కళ్యాణాన్నీ దృష్టిలోపెట్టుకొని ఉత్తమ వాఙ్మయానికి పూనుకున్నాడు. 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' పేరిట చారిత్రక, రాజకీయార్థిక, సాంఘిక శాస్త్రములు, చారిత్రక నవలలు, మహాపురుషుల జీవితాలు, ఇతర భాషలలోని ఉత్తమ గ్రంథాల అనువాదాలు సుమారు 40 గ్రంథాలు వెలువరించారు. నవీన విజ్ఞానాన్ని ప్రజల్లో వ్యాపింపజేయడానికి శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి అధ్యక్షతను 'విజ్ఞాన చంద్రిక పరిషత్తు' అనే పరీక్షా సంఘాన్ని ఈయన స్థాపించాడు. అనేక కేంద్రాలలో పరీక్షలు జరిపి, ఉత్తీర్ణులకు పతకాలు, బహుమానాలు, యోగ్యతాపత్రాలు యిచ్చేవారు.

శ్రీ లక్ష్మణరావుగారు "ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం" ద్వారా చేసిన సేవను ఆంధ్రజాతి ఎన్నటికీ మరువజాలదు. వీరి సుప్రసిద్ధ రచనలు - శివాజీ చరిత్రము, హిందూ మహాయుగం, మహమ్మదీయ మహాయుగం, లక్ష్మణరాయ వ్యాసావళి.

"ఇంతేకాక, వీరు ఉత్తమ దేశభక్తులు, స్వదేశీ దీక్షాపరులు. 1907లో జరిగిన కృష్ణాజిల్లా రాజకీయ మహాసభలో "స్వరాజ్యం, స్వదేశీ, జాతీయవిద్య, పరిష్కారం" - ఇవే యీనాటి చతుర్వేదాలని వ్రాసిన వీరి వ్యాసం ఆదర్శప్రాయమైంది.

"మాతృభాషాసేవలో, దేశసేవలో నిమగ్నుడై నిరంతర కృషివల్ల ఆరోగ్యం చెడి, 1923 జులై 13వ తేదీన 46వ యేటనే అకాలమరణానికి ఈయన లోనైనాడు. ఇలాంటి మహాపురుషులను సంస్మరించడంద్వారానే, వారి అడుగుజాడల్లో పురోగమించడంద్వారానే మన జాతి ఒక నూతనోజ్జీవనం పొందుతుంది.

"కాన, శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి వర్థంత్యుత్సవం నవ్య సాహిత్య పరిషత్సభ్యులు, అభ్యుదయ రచయితలు కలిసి యితర సారస్వత సంఘముల సహకారంతో ఆంధ్రదేశమంతటా జరుపవలెనని ప్రార్థన." తెలికిచర్ల వెంకటరత్నం (కార్యదర్శి, నవ్య సాహిత్య పరిషత్తు), తుమ్మల వెంకట్రామయ్య (కార్యదర్శి, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం).

ఆహ్వాన సంఘంలో శ్రీయుతులు అయ్యదేవర కాళేశ్వరరావు, పెద్దిభొట్ల వీరయ్య, ఆచంట లక్ష్మీపతి, తాపీ ధర్మారావు, పాటిబండ మాధవశర్మ, కానూరి వీరభద్రేశ్వరరావు, చదలవాడ

పిచ్చయ్య, మద్దుకూరి చంద్రశేఖరరావు, మాడపాటి హనుమంతరావు, రాయసం వెంకట శివుడు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, ప్రొ. మామిడిపూడి వెంకట రంగయ్య, అయ్యంకి వెంకట రమణయ్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, ఆదిరాజు వీరభద్రరావు, పిలకా గణపతిశాస్త్రి, శివశంకరశాస్త్రి, అడవి బాపిరాజు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఆచంట రమణమ్మ, కొమర్రాజు అచ్చమాంబ, కాంచనపల్లి కనకమ్మ, పుట్టపర్తి శ్రీనివాసాచార్య, కొమర్రాజు వినాయకరావు మొ॥వారున్నారు.

"విజ్ఞానచంద్రిక వెదజల్లిన కొమర్రాజు లక్ష్మణరావు" పేరుతో ఉభయ భాషాప్రవీణ కానూరి వీరభద్రరావుగారు నాటి ప్రజాశక్తి వారపత్రిక (6-7-44)లో పెద్ద వ్యాసం వ్రాశారు.

"సర్వకాల పూజ్యుడు లక్ష్మణరావు" అన్న శీర్షికతో ప్రజాశక్తి వారపత్రిక రాష్ట్రమంతటా జరిగిన కొమర్రాజు లక్ష్మణరావు వర్ధంతి సభల వార్తలను ప్రకటించింది.

బెజవాడలో జరిగిన సభకు బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షత వహించారు. అయ్యదేవర కాళేశ్వరరావు, కట్టమంచి రామలింగారెడ్డి మొదలైన 33గ్గురు ప్రముఖులు గల కమిటీ ఆధ్వర్యంలో ఈ సభ జరిగింది. విశ్వనాథ సత్యనారాయణ, డాక్టర్ ఆచంటి లక్ష్మీపతి తదితరులు పాల్గొన్నారు. అభ్యుదయ రచయితల సంఘాధ్వర్యాన గుంటూరులో జరిగిన వర్ధంతి సభలో మారేమండ రామారావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, కూర్మా వేణుగోపాలస్వామి మున్నగువారు పాల్గొన్నారు. కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణగార్లు సందేశాలు పంపారు.

నందిగామలో జరిగిన సభకు అయ్యదేవర కాళేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

రాజమండ్రిలో అభ్యుదయ రచయితల సంఘాధ్వర్యాన జరిగిన సభకు శ్రీ విస్సా అప్పారావుగారు అధ్యక్షత వహిస్తూ "తిలక్, భండార్కర్‌లు మహారాష్ట్రకు ఎలా నూతన పంథా చూపించారో అలాగే లక్ష్మణరావుగారు ఆంధ్రదేశానికి కొత్త మార్గం చూపారు. మల్లంపల్లి సోమశేఖరశర్మ, రాయప్రోలు సుబ్బారావు, వేటూరి ప్రభాకరశాస్త్రి మొదలైనవారు నేడు చరిత్ర పరిశోధనలు చేయగల్గుతున్నారంటే లక్ష్మణరావుగారి శిక్షణయే కారణమని" అన్నారు. శ్రీ నండూరి బంగారయ్య, మహీధర జగన్మోహనరావు, రాయసం వెంకటశివుడుగార్లు సభలో పాల్గొన్నారు.

నిడదవోలులో కాశీపట్నం కొండయ్యగారి అధ్యక్షతన జరిగిన సభలో లక్ష్మణరావుగారి సమకాలికులు నిడదవోలు వెంకట్రావుగారు, శ్రీ కస్తూరి సూర్యప్రకాశరావు, శ్రీ మీరా మొ॥వారు పాల్గొన్నారు.

హైద్రాబాద్‌లో శ్రీ లక్ష్మణరావుగారు స్థాపించిన శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయంలో జరిగిన సభకు వారి సమకాలికులు ఆదిరాజు వీరభద్రరావుగారు అధ్యక్షత వహించారు. 15 సంస్థల ఆధ్వర్యాన ఈ సభ జరిగింది.

వరంగల్‌లో జరిగిన వర్ధంతి సభలో అడవి బాపిరాజుగారు పాల్గొన్నారు. రాజరాజనరేంద్ర భాషానిలయంలో జరిగిన సభకు మాదిరాజు రామకోటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

# 11

# విశ్వదాత నాగేశ్వరరావుగారి వర్ధంతి

నవ్య సాహిత్య పరిషత్తు అభ్యుదయ రచయితల సంఘం, విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావుగారి వర్ధంతిని ఏప్రిల్ 11వ తేదీన ఆంధ్రప్రదేశ మంతటా జరుపవలసిందిగా విజ్ఞప్తి చేశాయి. విశ్వదాత తమ సర్వస్వాన్ని ఆంధ్ర జాతీయ వికాసానికి, జాతీయోద్యమానికి ధారపోశారని సంయుక్త ప్రకటనలో తెలిపారు. ప్రకటన ఇలా ఉంది :

"శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు తన జీవిత సర్వస్వాన్ని ఆంధ్రుల విజ్ఞానానికి, జాతీయ జీవన వికాసానికి ధారపోసిన 'విశ్వదాత'. ఆంధ్ర ప్రజలలో జాతీయ చైతన్యాన్ని రేకెత్తించే సాహిత్యాన్ని ప్రోత్సహించి, దానికొక నిర్మాణ రూపాన్నిచ్చిన భాగ్యశాలి. ఉత్తమ నాటకాల ద్వారా ప్రజాప్రబోధానికి ముందంజ వేసిన నటకాగ్రేసరుడు, సూత్రధారుడు. భారత స్వాతంత్ర్యోద్యమంతోపాటు ఆంధ్రోద్యమాన్ని కూడా శిరసావహించిన దేశోద్ధారకుడు.

"ఈ మహాపురుషుడు 1867 మే 15వ తేదీన కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, ఎలకుర్రు అగ్రహారంలో జన్మించారు. చిన్నతనంలోనే సంస్కృతం చదివారు. తరువాత ఆంగ్లవిద్య నభ్యసించారు.

కొన్నాళ్ళు కలకత్తాలోను, బొంబాయిలోను పెద్ద పెద్ద వర్తకులవద్ద పనిచేసి పొందిన అనుభవాన్ని వినియోగించుకొని, ఆంధ్ర వ్యాపారసంస్థలకు ఆదర్శప్రాయమైన అమృతాంజన డిపోను స్థాపించారు.

విద్యార్థి దశలోనే బందరులో హిందూ థియేటరును స్థాపించిన ఈ కళాప్రియుడు, ప్రభుత్వ దాస్యాన్ని ఇచ్ఛగించక స్వతంత్ర జీవనాన్ని అలవరచుకున్న ఈ స్వాతంత్ర్య ప్రియుడు, 1908లో బొంబాయినుండి, 'ఆంధ్ర వారపత్రిక'ను వెలువరించారు. మన పూర్వుల మహత్తరమైన సంస్కృతినంతా విస్మరించి, విదేశ దాస్యాంధకారంలో తెన్నుగానక పరితపిస్తున్న ఆంధ్రలోకానికి క్రొత్తవెలుగులు చూపారు. స్వాతంత్ర్య పతాకనెత్తారు. తరువాత 1914లో ఆంధ్ర వారపత్రికను దినపత్రికగా మార్చి, మద్రాసునుండి ప్రకటించి, క్రిందటి మహాయుద్ధకాలంలో ఆంధ్రుల విజ్ఞానానికి, జాతీయ వికాసానికీ వీరు చేసిన సేవ అపూర్వం. ఆంధ్రుల లలితకళలకు ప్రత్యేక పత్రిక కావాలనే అంశాన్ని ప్రప్రధమంగా గుర్తించి 1924లో 'భారతి' మాసపత్రికను స్థాపించారు. జాతీయోద్యమానికి, ఆంధ్రోద్యమానికి, కళాభ్యుదయానికి యీ పత్రికలు చేసిన సేవ ఆంధ్రులకు చిరపరచితం. ఇంతేగాక ఆంధ్ర గ్రంథమాలను స్థాపించి బహువిషయాలమీద బహుగ్రంథాలను వ్రాయించి ప్రకటించి, ఆంధ్ర సారస్వతానికి శ్రీ పంతులుగారు ఎంతగానో తోడ్పడ్డారు. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు తలపెట్టిన 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము'ను చేపట్టి కొంతవరకు నిర్వహించారు.

వీరు కేవలం సారస్వత కళావిషయాలలో కృషిచేయడమేకాక, ప్రఖ్యాత జాతీయ నాయకులై, ఆంధ్ర జాతీయతకు రూపురేఖలు తీర్చిదిద్దిన మహాపురుషులు. 1930 ఉప్పుసత్యాగ్రహం రోజుల్లోను, 1932 శాసనోల్లంఘన కాలంలోను శ్రీ నాగేశ్వరరావుగారు స్వాతంత్ర్య యోధులకు మార్గదర్శకులై ప్రభుత్వ నిర్బంధానికి గురియైనారు.

ఈ కళావేత్త, కళాపోషకుడు, కళాప్రపూర్ణుడు, దేశసేవకుడు 1938 ఏప్రిల్ 11వ తేదీన తన భౌతిక జీవితాన్ని ముగించారు. వీరి జీవితాదర్శాలను సంస్మరించుకొని, వీరి ఉత్తమ జాతీయ సాంప్రదాయాలను అలవరచుకొని, ఆంధ్రజాతి ఎంతో అభ్యుదయం చెందవలసివున్నది.

కనుక శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావుగారి సప్తమ వర్ధంత్యుత్సవాన్ని నవ్య సాహిత్య పరిషత్సభ్యులూ, అభ్యుదయ రచయితలూ, తదితర సాహిత్య సమితులతోను, సంఘములతోను కలిసి ఆంధ్రదేశమంతటా ఏప్రిల్ 11వ తేదీని జయప్రదంగా జరపవలెనని ప్రార్థన."

తెలికిచర్ల వెంకటరత్నం, కార్యదర్శి, నవ్య సాహిత్య పరిషత్తు; తుమ్మల వెంకటరామయ్య, కార్యదర్శి, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం.

ఆంధ్రదేశం నలుమూలలో జరిగిన విశ్వదాత వర్ధంతి సభలలో నాటి పలువురు ప్రముఖులందరూ పాల్గొన్నారు.

# 12

# గిడుగు రామమూర్తి వర్ధంతి సభలు

అభినవ వాగనుశాసనుడు గిడుగు రామమూర్తిగారి వర్ధంతి సభలకు సన్నాహంగా శ్రీ పులుపుల వెంకట శివయ్యగారు "గ్రాంథిక భాషావాదుల పాలిట పిడుగు-గిడుగు" అన్న శీర్షికతో గిడుగువారి వ్యవహారిక భాషా ఉద్యమ వివరాలన్నింటితో ఒక వ్యాసం వ్రాశారు. (17-1-1945, ప్రజాశక్తి) శివయ్యగారు తమ వ్యాసం ఇలా ప్రారంభించారు :

"15-1-1940న మద్రాసులో తెలుగు పత్రికా సంపాదకులు, రచయితలు కూడిన సభలో, మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారిచ్చిన తుది సందేశంలో తుది వాక్యాలు యివి : "స్వరాజ్యం కావాలంటున్నాము. ప్రత్యేకాంధ్ర రాష్ట్రంకోసం చిక్కుపడుతున్నాం. ప్రజాస్వామిక పరిపాలన కోరుతున్నాము. ఇటువంటి పరిస్థితుల్లో మన ప్రజలకు సామాన్య జనులకు ఏ భాషద్వారా జ్ఞానం కలుగజేయవలసి ఉంటుందో ఏ భాషలో గ్రంథ రచన చేయవలసి వుంటుందో ఆలోచించండి."

"ఇది వారి జీవితమే యిచ్చిన సందేశం అంటూ, శ్రీ శివయ్యగారు - విశాఖజిల్లాలో ముఖలింగానికి రెండు మైళ్ళ దూరంలో ఉన్న పర్వతాలపేట అనే గ్రామంలో గిడుగు రామమూర్తిగారు జన్మించిన 1863 సంవత్సరంనాటి భారతదేశ రాజకీయ పరిస్థితులు, జాతీయ కాంగ్రెస్ ఆవిర్భావం, ఆంధ్రలో వీరేశలింగం సంస్కరణోద్యమం మొదలైన విశేషాలతో కూడిన

పూర్వరంగాన్ని వివరించారు. గిడుగు రామమూర్తిగారి వ్యవహారిక భాషా ఉద్యమ వివిధ దశలను తెలిపారు. గిడుగువారు 1940లో కనుమూశారు. గిడుగువారి వర్థంతిని 22-1-45న ఆంధ్రదేశమంతటా జరపాలని అభ్యుదయ రచయితల సంఘం, నవ్య సాహిత్య పరిషత్తులు యిచ్చిన విజ్ఞప్తి ఫలితంగా పలుచోట్ల సభలు జరిగాయి.

"జాతికి మధురభాషను ప్రసాదించిన పుణ్యమూర్తి శీర్షికలో గిడుగు రామమూర్తి వర్థంతి సభల వివరాలను ప్రజాశక్తి (7-2-45) ప్రకటించింది.

సికింద్రాబాద్‌లో జరిగిన సభలో శ్రీ అడవి బాపిరాజుగారు, శ్రీ భాస్కర్ల సూర్యనారాయణ మూర్తిగారు, బెజవాడలో జరిగిన సభలో శ్రీ ముద్దు కృష్ణగారు, రామమూర్తిగారి కుమారుడు గిడుగు సీతాపతిగారు, గుంటూరులో జరిగిన సభలో శ్రీ తెలికిచర్ల వెంకటరత్నంగారు, శ్రీ శివశంకరశాస్త్రిగారు, తెనాలిలో జరిగిన సభలో శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు, చదలవాడ పిచ్చయ్యగారు, ఢిల్లీలో జరిగిన గిడుగు వర్థంతి సభలో ఢిల్లీ ఆంధ్ర ప్రముఖులు పాల్గొన్నారు.

వీరులపాడు, విశాఖపట్నం, రాజమండ్రి, రామచంద్రపురం, మదనపల్లి, భీమవరం మొదలైనచోట్ల కూడా వర్థంతి సభలు జరిగాయి.

గిడుగు సీతాపతిగారు రచించిన "గిడుగు రామమూర్తి జీవితచరిత్రము" ప్రజాశక్తి ప్రచురణాలయంవారు ప్రచురించి విడుదల చేశారు. (వెల 0-4-0 "గ్రాంథిక భాషావాదుల పాలిట పిడుగు, సవరభాషవాగనుశాసనుడు, సామాన్య ప్రజలకు విజ్ఞానం కలుగజేయాలనీ, అట్టి విజ్ఞానం వారిలో దేశభక్తిని పెంపొందించాలనీ ఎలుగెత్తి చాటాడు గిడుగు రామమూర్తి. అట్టి దేశభక్తుని, భాషా విప్లవకారుని, ఉత్తమ ఆంధ్రుని జీవితచరిత్ర, ఆయన సాధన తెలుసుకోవాలంటే గిడుగువారి జీవితచరిత్ర చదవండి" అని ప్రచురణాలయం తమ ప్రకటనలో తెలిపింది.

ఈవిధంగా నవయుగాంధ్ర నిర్మాతల వర్థంతి సభలను పెద్ద ఎత్తున జరిపించుట ద్వారా విస్మృతిలో పడిపోయిన వారి జీవితచరిత్రలను, వారి కృషిని ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం ఆంధ్ర ప్రజల ముందుంచి గొప్ప చారిత్రక కర్తవ్యాన్ని నిర్వర్తించింది.

## 13

## మద్రాసు ఆంధ్రులనుర్రూతలూగించిన సాంస్కృతిక ప్రదర్శనలు

1945 నవంబరు 3, 4 తేదీలలో ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ ప్రారంభోత్సవం జరిగింది. ఆ సందర్భంలో ప్రదర్శించిన ముందడుగు నాటకం, వీరేశలింగం, బెంగాల్ క్షామం బుర్రకథలు, పంటసిరి, పాములవాడు నృత్యాలు, హిట్లరు పరాజయం వీధిభాగవతం మద్రాసు ఆంధ్రుల నుర్రూతలూగించి పారవశ్యంలో ముంచాయి. ఆంధ్ర ప్రజానాట్యమండలి గుంటూరు, కృష్ణా జిల్లా శాఖలు ఈ సాంస్కృతిక ప్రదర్శనలు యిచ్చాయి.

(14-11-45, ప్రజాశక్తి)

"దీపావళి ప్రతియేటా వస్తోంది, కాని ఈ సంవత్సరం మద్రాసు ఆంధ్రులు దీపావళిని నిజమైన ఆనందంగా జరపగల్గారు" అన్న వాక్యాలతో ఆనాటి ప్రజాశక్తి విలేకరి ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ మద్రాసు శాఖ ప్రారంభోత్సవం, ఆనాటి సాంస్కృతిక ప్రదర్శనల గురించి వ్రాసినది చదివితే ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనానికి ఆనాడు కమ్యూనిస్టు ఉద్యమం ఎంత గొప్ప కృషి చేసిందో తెలుస్తుంది. అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి మద్రాసులోని మేధావివర్గాలు, సాహితీవేత్తలు, కళాకారులు, పాత్రికేయులు, పరిశోధకులు, జడ్జీలు, విద్యార్థులను ఎలా, ఎంతగా కదిలించి ఉత్తేజితులను చేసిందో స్పష్టమవుతుంది.

మద్రాసు నగరం ఆంధ్ర ప్రజలు నివసించే ప్రదేశానికి కొంచెం దూరంగా ఉన్నా ఆంధ్ర సంస్కృతీ కార్యకలాపాలకు మద్రాసు కేంద్రంగా లేకపోలేదు. తరతరాలుగా నివసిస్తున్న ఆంధ్రులెందరో మద్రాసులో వున్నారు. లాయర్లు, డాక్టర్లు, యాక్టర్లు, సినిమా డైరెక్టర్లు, వర్తకులు, పత్రికాధిపతులు, జర్నలిస్టులు, పరిశోధకులు, జడ్జీలు, విద్యార్థులు, రేడియో గాయకులు - ఇలా ఎందరెందరో మద్రాసులో నివశిస్తున్నారు. ముఖ్యంగా దిన, వార, మాస పత్రికలెన్నో ఇక్కడనుండే వెలువడుతున్నాయి. అందుచే ఒక తెలుగు నాటక ప్రదర్శనమో, ఒక తెలుగు సాహిత్యోపన్యాసమో, గోష్టియో జరిగిందంటే ఆనాడు ఆంధ్రుల కెంతో ఉత్సాహంగా ఉంటుంది.

కాని ఈనాడు ఆంధ్రదేశంలో సామాజికంగాను, రాజకీయంగాను, సాంస్కృతికంగాను జరుగుతూన్న మార్పులు మద్రాసు ఆంధ్రులలో చాలామందికి తెలియవు. కొందరీ మార్పులను గురించి వింటున్నా, ఇతర రాజకీయ పక్షాలమీద వుండే దురభిప్రాయాలవల్ల నమ్మలేకుండా ఉంటున్నారు. అందుచే, ఆంధ్ర ప్రజానాట్యమండలి (గుంటూరు, కృష్ణా శాఖలు) వారి ప్రదర్శనలు వారికి కనులు విప్పినట్లయింది. ఈ ప్రదర్శనలకు బాధ్యులయిన రచయితలు, నటకులు, కళావేత్తలు, సామాన్య రైతు, కూలీ, మధ్యతరగతి కుటుంబాల నుండి వచ్చినవారే ఐనా, ప్రజా ఉద్యమాలతో సంపర్కం ఉండటంవల్ల ప్రజల జీవితాన్ని, ఆశయాలను, ఆశలను అవగాహన చేసుకొని ఆకళింపు చేసుకొన్నవారవుటచేత మద్రాసు ఆంధ్రుల హృదయాలను ఇంతగా చూరగొనగల్గారు.

## "ఎన్నాళ్ళకు ఇలాంటి నాటకం చూడగల్గాం?"

3వ తేదీన 'ఆంధ్ర ప్రజానాట్యమండలి' కృష్ణా దళంవారు 'ముందడుగు' నాటకం ప్రదర్శించారు. వి.పి. హాలు క్రిక్కిరిసిపోయింది. రచయితలు, పండితులు, విమర్శకులు, గాయకులు, నటులు, దర్శకులు, పుర ప్రముఖులు ఎందరో వచ్చారు. నాటక ప్రదర్శనానంతరం 'ఎన్నాళ్ళకు ఇలాంటి నాటకం చూడగల్గాం' అని ప్రతివారూ తమ సంతసాన్ని వెలిబుచ్చారు. ఒక ప్రొఫెసర్‌గారు తను 7 1/2 గంటలకు (నాటకం 6 గంటలకు ప్రారంభమయింది) ఒక మిత్రునికి అపాయింట్‌మెంట్ ఇచ్చాననీ, అందుచే చివరివరకూ ఉండలేననీ, అందుకు క్షమించమనీ ఆర్గనైజరును కోరారు. కాని ఆద్యంతం నాటక ప్రదర్శనంలో లీనమైపోయి తమ

మిత్రుని సంగతే మరచిపోయారు. ఇలా చెప్పాలంటే ఎన్నో ఘటనలున్నాయి.

నాటక ప్రదర్శనానంతరం "ఆంధ్రప్రభ" సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావుగారు మాట్లాడారు. వెంకటేశ్వరరావుగారు, నాటక రచనలో - ముఖ్యంగా ఏకాంక నాటికల విషయంలో - ప్రత్యేక కృషి గావించుతున్నారు. ఇంతేగాక రైతుకుటుంబాలనుండి వచ్చి, రైతు జీవితంతో సన్నిహితులైన వీరు, జమీందారీ రైతు జీవితాన్ని చిత్రించే ఈ నాటకంపై వెలిబుచ్చిన అభిప్రాయాలకు ప్రత్యేకత వుంది. వెంకటేశ్వరరావుగారిలా అన్నారు.

"ఒక్క మాటలో చెప్పాలంటే ఈ నాటకం ఎంతో ఉత్తమంగా వుంది. ఆంధ్రదేశంలో నాట్యకళను ఒక ఉత్తమ స్థాయికి తీసుకురావాలని నా ఆశ. ఈ విషయంలో, ముఖ్యంగా నాటక రచనలో, నేను కొంతవరకు కృషిచేస్తున్నాను. ఇప్పుడీ నాటక ప్రదర్శనాన్ని చూచాక ఆ ఆశ ఫలించుతుందని విశ్వసిస్తున్నాను. ఈ దళంవారెంతో ప్రతిభతో నాటకాన్ని ప్రదర్శించారు.

ఇక సూచనలు కూడ చేయమని చెప్పారు గాబట్టి, ఒక విషయం చెబుతాను. నాటకాలలో రంగాలు, అంకాలు చిన్నవిగా ఉంటే బాగుంటుందని నా అభిప్రాయం. ఈ నాటకంలో రంగాలు చిన్నవిగానే ఉన్నాయి. అయినా ఈనాటి పరిస్థితుల్లో చిన్న నాటికలు అవసరమనుకొంటాను. మరొక విషయం, మనం గావించే ప్రచారం ఇతివృత్తంలోను, సన్నివేశాలలోనే గర్భితమై ఉండాలని నా అభిప్రాయం. మరొకసారి ఈ నాటకాన్ని మద్రాసు పౌరులకు చూపించాలని కోరుతున్నాను."

తర్వాత విస్సా అప్పారావుగారు మాట్లాడారు. అప్పారావుగారు సంస్కారి, కళాప్రియుడు, శాస్త్రవేత్త. దామెర్ల రామరాయ చిత్రసంపదను కాపాడుతూ, వారి స్మారక భవనానికి ప్రయత్నిస్తున్న కళారాధకులు. ప్రస్తుతం మద్రాసు యూనివర్శిటీలో పనిచేస్తున్నారు. వారిలా సెలవిచ్చారు:

"ఈ నాటక ప్రదర్శనం ఎంతో చక్కగా ఉంది. నటకులందరూ అభినందించదగినవారు. ముఖ్యంగా అచ్చయ్య, శాంతమ్మ పాత్రధారులను మరచిపోలేం. గ్రామ జీవితం అంతా ఈ వేదికమీదకు తెచ్చారా - అనిపిస్తుంది." పిమ్మట ఆంధ్ర మహాసభ నాటక శాఖా కార్యదర్శి గోపాలాచారిగారు మాట్లాడారు. "ఇన్నేళ్ళుగా మా హాలులో అనేక నాటకాలు వేస్తూవచ్చారు. కాని ఇలాంటి ప్రదర్శనం ఎన్నడూ చూడలేదు. ఈ నటకుల ప్రతిభ ఎంతో కొనియాడతగినది" అన్నారు. ఇంతేగాదు, నాట్యరంగంలోను, నాటక రచనలోనూ అనుభవమున్న అనేకమంది పెద్దలు, "ఇప్పటిదాకా మేమాశించుతున్న నాటకం ఈనాటికి చూడగల్గేం. కొన్ని స్వల్ప విషయాలు సూచించవలసినవి ఉన్నవనుకోండి. అయినా మన నాట్యకళను ఇదెంతో ఉన్నత స్థితికి తీసుకుపోయింది" అని సంభాషణలలో తెలియజేశారు.

నాల్గవ తేదీన ఆంధ్ర మహాసభ హాలులో జనం క్రిక్కిరిసిపోయారు. స్థలం చాలలేదు. ఇంతవరకు ఆ హాలులో ఇంతమంది ఆంధ్రులు రావడం ఈ ప్రదర్శనానికే - అని అన్నారు కొందరు. బుర్రకథలు, నాట్యం, వీధిభాగవతం - ఇవన్నీ 5 గంటలు జరిగినా ఒక్కరూ కదిలినవారు లేరు. మొదటిరోజు వలెనే పండితులూ, విమర్శకులూ, రచయితలూ, పత్రికాధిపతులూ,

జర్నలిస్టులూ, గాయకులూ, ఇతర పురప్రముఖులూ విచ్చేశారు. గిడుగు సీతాపతి, డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు, నారాయణరావు, సూర్యకుమారి, గూడవల్లి రామబ్రహ్మం, నీలంరాజు శేషయ్య మొదలగు నాట్యకళారాధకులూ, కళాపోషకులూ ప్రేక్షకలోకంలో వున్నారు. అన్నిటికన్న ముఖ్యం ముగ్గురు బ్రిటిషు సైనికులు ఆసాంతం ఈ ప్రదర్శనను జూచి భాష అర్థంకాకపోయినా, భావం గ్రహించి సంతృప్తిపడ్డారు. అందులో ఒకరిని ఒక మిత్రుని ఇంటివద్ద కలిసికొనడం తటస్థించింది. "నిన్న రాత్రి మీ 'హిట్లరు పగనం' ప్రదర్శనం చూశాను. అద్భుతంగా ఉంది" అంటూ అభివందనా లిచ్చాడు.

ప్రదర్శనలతోపాటు గోపాలంగారు (గుంటూరు) "తెలుగోడా" అన్న పాటను ఫిడేలుమీద పాడి ప్రేక్షకులను ఉర్రూతలూగించారు.

## ప్రముఖుల అభిప్రాయాలు

ప్రదర్శనాలపై తమ అభిప్రాయాలను అనేకమంది ప్రముఖులు వెలిబుచ్చారు.

డాక్టర్ టి. శంకరశాస్త్రిగారు (కర్నూల్) ఇలా అన్నారు. "ఈనాటి ప్రదర్శనలను ఇంతమంది శ్రద్ధాభక్తులతో వినడం అపూర్వం. డాక్టర్లు ఎన్ని ఇంజక్షన్లిచ్చినా కదలని ప్రజలు వీరిచ్చే ఇంజక్షన్లతో కదులుతున్నారు. ఆంధ్రోద్యమం అంటే ఉత్సాహం, ఆవేశం కలిగించే వీరి ప్రతిభ కొనియాడాలి. ఇవి ఆంధ్రకళలకు ఎంతో ఉపకారం చేస్తున్నాయి. "బెంగాలు కథ వ్రాసి చెప్పిన యువకుడు మహమ్మదీయుడు. సాహిత్యం, సంగీతం రెండూ ఉన్నాయి ఈ కథలో. ఇతని ప్రతిభ కొనియాడదగింది. మన కళలిలా ఔన్నత్యం పొందితే, త్వరలోనే రాష్ట్ర సిద్ధి పొందుతామని ఆశిస్తాను."

సుప్రసిద్ధ సినిమా డైరెక్టర్ గూడవల్లి రామబ్రహ్మంగారు ఇలా మాట్లాడారు.

"డాక్టర్‌గారు చెప్పినదాంతో అన్ని విధాల ఏకీభవిస్తాను. వీరి ప్రబోధ ప్రచారాల్ని గురించి నేను వేరే చెప్పనక్కరలేదు. ప్రజా హృదయాన్ని చూరగొనుటలో, ప్రజాశక్తులను సమకూర్చుటలో వీరి ప్రదర్శనలెంతో అద్భుతంగా పనిచేస్తున్నాయి. వీరి కృషికి నే నభినందించుతున్నాను. వీరి కెట్టి సహాయమైనా చేయడానికి నేను సిద్ధంగా వున్నాను. అద్భుతంగా సాహితీ సంగీతాలను ఏకీభవింపజేసి మహత్తర ప్రదర్శనలిచ్చారు. ఇందుకు వారి నభినందించుతున్నాను. ఇలాంటి మార్గాన్ని సినిమాలో ప్రవేశపెట్టడానికి ప్రయత్నించుతాను.

ప్రసిద్ధిచెందిన డాక్టరూ యాక్టరూ అయిన శ్రీ గోవిందరాజుల సుబ్బారావుగారిలా ప్రసంగించారు.

## నాజర్‌ను కౌగలించుకొని . . .

"హృదయం ఎంతో పొంగి వుంది. ఏం చెప్పాలో తెలియడంలేదు. నిన్నటి నాటకం చూడలేదు. గొప్ప అవకాశం పోగొట్టుకొన్నానని తలుస్తున్నాను. పాత నాటకాలూ, పాత సరుకు పోయి కొత్త నాటకాలూ కొత్త నటులూ రావాలి. మమ్మల్ని ఇంకా నాటక వేదికమీద ఉంచారంటే చూడండి

మనం ఎంత వెనుకబడ్డామో? (నవ్వు) నన్నిలా మాట్లాడించినది నిన్నటి 'ముందడుగు' ప్రదర్శనమే. నాయనలారా, మళ్ళా ఆ నాటకం మరొకసారి వేసి చూపండి. ఇదివరకు మా తెనాలిలో ఏవో బుర్రకథలు చెబుతూంటే ఏవో అనుకునేవాణ్ణి. కాని ఇవాళటి ప్రదర్శనం మరచిపోను. వండర్‌ఫుల్‌గా వుంది. (గిరీశం జ్ఞాపకం వచ్చి నవ్వు) అసలు బుర్రకథలకన్న, వీరు మన బుర్రలలో కెక్కించిన కథ చాలా ప్రాముఖ్యం. ఏడీ నాయనా ఆ నాజరు. (నాజరును కౌగలించుకొని అభినందించారు.) ఇతడు దుఃఖరసం వొప్పించేటప్పుడు మళ్ళీ గుంటూరు ప్రసాదరావు హరిశ్చంద్ర పాత్రధారణం జ్ఞాపకం వస్తోంది. ఇంత గొప్పగా బుర్రకథ చెప్పడం నా జన్మలో వినలేదు.''

నిడదవోలు వెంకట్రావుగారు పండితులూ, పరిశోధకులు. ఇలాంటి బుర్రకథలు వినడం తమకిదే ప్రథమ పర్యాయం అనీ, తమ ఆనందానికి పరిమితి లేదనీ సెలవిచ్చారు.

సుప్రసిద్ధ సినిమా నటకులు నారాయణరావుగారు హరీంద్రనాథ చటోపాధ్యాయ చెప్పినటుల 'కళ ప్రజల కొరకన్నది' ఇందులో ద్యోతకమౌతున్నదని అన్నారు. బుషీవాలీలో చాలాకాలం ప్రిన్సిపాల్‌గా పనిచేసిన జి.వి. సుబ్బారావుగారు కూడ, ప్రదర్శనలను కొనియాడారు.

పండితుడూ, పరిశోధకుడూ, నటుడూ అయిన శ్రీ గిడుగు సీతాపతిగారిలా సెలవిచ్చారు.

"అభ్యుదయ రచయితలు పెద్ద యంత్రం కనిపెట్టారు. అదే బుర్రకథ. ప్రజలలో నూతన భావాలు కల్గించడానికి, ఉద్బోధ చేయడానికి ఇదెంతో ఉపయోగకారి అవుతుంది. దీనివల్ల విజ్ఞానం, దేశభక్తి ప్రబోధింపబడుతూంది. ప్రజలకు తమ శక్తి తెలిసికొనేటట్లు కార్యోత్సాహులను చేస్తోంది. తుంబుర తీగెలు మోగుతోంటే, మన హృదయ తంత్రు లుర్రూత లూగుతున్నాయి. అన్ని రసాలను ప్రదర్శించారు. దీనిలో మహదానందం కల్గింది. అభ్యుదయ రచయితలూ, ప్రజాశక్తి కార్యాలయంవారూ ఇలాంటి వాఙ్మయం ప్రచురించుతున్నందుకు అభివందనాలు.''

మద్రాసులో, ఆంధ్ర అభ్యుదయ రచయితల పట్టణశాఖ ప్రారంభ సందర్భంలో జరిగిన సాహిత్య చర్చలు, వైజ్ఞానిక ప్రదర్శనాలు భారతదేశంలో ఆంధ్ర కళలు సముచిత స్థానం సంపాదించుకో గలవని ఋజువుచేశాయి. ఇట్టి అపూర్వ ప్రదర్శనలు చూపినందుకు కొనియాడని ఆంధ్రు లెవ్వరూ కనిపించలేదు.

## "కవి ప్రజలతో చేయికలిపి ముందడుగు వేయాలి"

### మద్రాసులో అభ్యుదయ రచయితల సంఘ ప్రారంభోత్సవం నాటి విశేషాలు

"ప్రజా సాహిత్యం కావాలంటూ పాటుబడేవారు అనేక రకాల వారుండవచ్చును. అధికంగా సంస్కృత పదాలు ఉపయోగిస్తే సామాన్య ప్రజకి బోధపడదు కనుక సాహిత్య భాష వాడుక భాష అవాలని వాదించేవారు ప్రజాసాహిత్యంకోసం పాటుపడేవారే. సాహిత్యం ఇన్నాళ్ళూ మొత్తానికి పట్నాలకే అంటిపెట్టుకొని ఉందేకాని పల్లెటూళ్ళకి పోలేదని విచారించి పల్లె జీవితాన్ని సాహిత్యంలోకి తీసుకువచ్చే వాళ్ళూ ప్రజాసాహిత్యవాదులే. సాహిత్యం ఇంతవరకు ముఖ్యంగా ధనికులనే ఆశ్రయించి, ధనికులనే పొగిడి, ధనికుల జీవితాలకే ప్రాముఖ్యతనిచ్చి, వారి సమస్యలే దీర్ఘ

సమస్యలుగా భావించి, వాటిలోనే మునిగి తేలిందని సిగ్గుపడి, ఇప్పటికైనా సాహిత్యం బీదల సమస్యలను పాటించాలనీ, బీదల జీవితాలను వర్ణించాలనీ చెప్పడం ప్రజాసాహిత్యం కోసం పాటుపడడమే. కవి కళ్ళుమూసుకొని తనలోతాను దహించుకుపోతూ లోకమే లేనట్టు తన గురించీ, చిన్న చిన్న దుఃఖాలను గురించీ కవిత్వం వ్రాయం నిజమైన విలువ గల సాహిత్యం కాదని వాదించేవారూ ప్రజా సాహిత్యం యొక్క విలువ గ్రహించినవారే" అని ఆంధ్ర అభ్యుదయ రచయితల మద్రాసు శాఖా ప్రారంభోత్సవ సమయంలో, సభాధ్యక్షత వహించిన శ్రీ బుర్రా వెంకటసుబ్రహ్మణ్యంగారు ఉపన్యసించారు.

సభ చెన్నపురి ఆంధ్ర మహాసభ హాలులో 1945 నవంబరు 4న జరిగింది. శ్రీమతి డి. హేమలతాదేవి బి.ఎ., బి.యి.డి.గారి బృందం "దేశమును ప్రేమించుమన్నా" అన్న గేయం మధురంగా పాడారు.

నవంబరు 3, 4 తేదీలలో జరిగిన యీ సారస్వత సరుభలకు, వైజ్ఞానిక ప్రదర్శనలకు ప్రముఖ రచయితలు, కళావేత్తలు, సారస్వత ప్రియులు, విమర్శకులు, పండితులు, విద్యార్థికులు విచ్చేశారు. చర్చలలో పాల్గొన్నారు.

మొదటి రోజున ప్రారంభంలో మల్లవరపు విశ్వేశ్వరరావుగారు మద్రాసులో అభ్యుదయ రచయితల సంఘ స్థాపనను గురించి వివరించారు. తర్వాత అధ్యక్షులు శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యంగారు పై విధంగా మాట్లాడారు.

అధ్యక్షులు తమ ఉపన్యాసంలో ఇంకా ఇలా అన్నారు : "ప్రజా సాహిత్యం పేరిట సాహిత్యం ఈ కొత్త మార్గాలను తొక్కడం చాలా శ్రేయస్కరమే. చికాకు ఎక్కడ వస్తుందంటే, సామాన్య ప్రజకి బోధపడని సాహిత్యం సాహిత్యమే కాదంటేను. ఇంతేగాక కొందరిలో వ్యాప్తమైయున్న మరికొన్ని సందేహాలను వెలిబుచ్చారు.

శ్రీశ్రీ మాట్లాడుతూ "భావం, భాష, సంఘం వీటికి అవినాభావ సంబంధం వుంది. వీటిలో ఏది ముందు ఏది వెనకా అన్న తికమక అవసరంలేదు. ఆకారానికి తగిన అంతస్సు వుంటేనే సాహిత్యం రాణిస్తుంది. చెప్పే విధానానికి, విషయానికి అమరిక వుండాలి. రచన శస్త్రం లాంటిది. దాని నుపయోగించే పద్ధతినిబట్టి ఫలితం వుంటుంది. రచనవల్ల ఉపయోగమూ, ఉపదేశమూ ఉండాలని అభ్యుదయ రచయితలు కోరుతున్నారు."

తర్వాత చదలవాడ పిచ్చయ్యగారుపూర్వ సాహిత్యంలోని ఔన్నత్యాన్ని గ్రహించి, పూర్వసంస్కృతిలోని ఉత్తమ సాంప్రదాయాలను అలవర్చుకొని, అభివృద్ధి నిరోధకతను నిరాకరిస్తూ కృషిచేయుట తమ ఆశయమన్నారు. సారస్వతాన్ని ప్రజాజీవితంతో సన్నిహితపరచి రచన సాగించాలన్నారు. అందుకనే తాము వీరేశలింగం, గురజాడ మొదలగు యుగపురుషుల సందేశాలను ప్రజలకు అందజేస్తున్నామన్నారు. సాహిత్యం ఎలా పరిణతి చెందుతూవచ్చిందీ తెల్పి, అభ్యుదయ రచయితల సంఘంలో వివిధ రాజకీయాభిప్రాయాలవారున్నారని,

ఉండవచ్చునని తెల్పారు. రాజకీయ సాంఘిక ఉద్యమాలు సారస్వతంపై కల్గించిన ప్రభావాన్ని వివరించారు.

పిమ్మట తుమ్మల వెంకటరామయ్యగారు ఇలా మాట్లాడారు : "అభ్యుదయ రచయితల సంఘంలో మానవ అభ్యుదయ లక్ష్యసిద్ధికై కృషిచేసేవారంతా ఉండవచ్చును. రచయితలలో వైవిధ్యం ఉండవచ్చు. అంతేగాదు, దిమ్మెసకొట్టిన కడ్డీలా అందరూ ఉండాలని మా అభిప్రాయం కాదు. వైవిధ్యం చర్చ ఉన్నప్పుడే హేతువాదం పురోగమనం వుంటుంది. ఏకలక్ష్యంతో పనిచేసేవారంతా దీనిలో ఉండవచ్చు. పూర్వంలోని ఔన్నత్యం గ్రహించకపోతే ఈనాడు మనమీ స్థితిలో వుండము. ఆకలి కవిత్వం మాత్రం వ్రాయాలని, ప్రేమ కవిత్వం వ్రాయకూడదని అభ్యుదయ రచయిత లంటారనడం హాస్యాస్పదం. రచయిత అన్నవాడు అనేక సన్నివేశాలలో, అనేకమంది వ్యక్తుల మనఃప్రవృత్తులను చిత్రించుతాడు. అందుచేత ఈ రసం అవసరం, ఆ రసం అనవసరం అని అనరు. ప్రజలను ఉత్తేజపరిచి చైతన్యవంతులుగా చేయటమే, ప్రజలకు కళాభిరుచి కల్గించి వారి అంతస్సును పెంపొందించుటే మా ఆశయం."

"తాత్కాలిక ప్రయోజనాలను తీర్చే సారస్వతం శాశ్వతకాలం నిలవదు" అనే భయాన్ని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు వెలిబుచ్చారు.

అధ్యక్షులు మొదటిరోజు సమావేశం ముగించుతూ "రచయితలకు స్వేచ్ఛ కావాలి. వారి నెవరూ ఆజ్ఞాపించరాదు. స్వతంత్రంగా తమ అనుభవాలను, రచనలలో స్వచ్ఛందంగా వ్రాయాలి" అని తెలిపారు.

ఆనాటి రాత్రి, అభ్యుదయ రచయితలు వ్రాసిన "ముందడుగు" నాటకాన్ని, ప్రజానాట్య మండలివారు ప్రదర్శించారు. అభ్యుదయ రచన అంటే ఏమిటో, కళ ఏ ఉన్నత స్థాయికి పోవాలని వీరాశించుతున్నారో, ఈ నాటకం తెలియజెప్పింది. వాదోపవాదాలకన్నా, ఈ ప్రదర్శనం ఒక సుహృద్భావం ఏర్పరిచింది, అభ్యుదయ రచయితల సంఘమంటే, సందేహాలూ, అనుమానాలూ ఉన్నవారికి.

## రెండవ రోజున

నాజరు దళంవారు మధురాతి మధురంగా దేశభక్తి నుద్బోధించే జాతీయ గీతాలను పాడారు.

మద్రాసు యూనివర్శిటీలో అధ్యాపకులుగా వున్న శ్రీ నిడదవోలు వెంకటరావుగారు, ప్రాచీన వాఙ్మయంలో జానపద వాఙ్మయానికి గల ఉత్తమ స్థానాన్ని వివరించారు. ఈనాడు జానప రూపాలను అభ్యుదయ రచయితలు సముద్ధరించడం ప్రశంసనీయమన్నారు. 'పాత కొత్తల మేలు కలయికతో అభ్యుదయ రచయితలు ముందుకు పోవా'లని ఆశీర్వదించారు.

కె. కృష్ణమూర్తిగారు (ఇంజనీరు) మాట్లాడుతూ ఇలా అన్నారు : "అన్ని యుగాల్లోనూ సారస్వతం ప్రజాజీవితాన్ని ప్రతిబింబించిందనడం సాహసం. ఉదాహరణకు ప్రబంధయుగం తీసుకోండి. వరూధిని కనురెప్పలు మూయడం, చెమర్చడం - మొదలైనవి కవి భౌతిక ప్రపంచంలో

నుంచి పూర్తిగా ఎగురలేడని తెలియజేస్తుందేగాని, ప్రజా జీవితాన్ని ప్రతిబింబింపజేయడంలేదు. కవి సాహిత్యానికి, ప్రజాజీవితానికి సంబంధం కలిగివుండాలనే దృష్టితో ప్రబంధ కవులు వ్రాయలేదు. శృంగార నైషధాన్ని అత్తరువులమ్మే సెట్టికి అంకితమిచ్చిన శ్రీనాధునికంటె, "ఇమ్మనుజేశ్వరాధముల"ను లెక్కచేయని పోతన ధిక్కారం మాకు ఆదర్శం.

"భావకవుల వ్యక్తిగత మనోవేదన, ప్రజా బాహుళ్య వేదనను ప్రతిబింబించిన పక్షంలో ప్రజల నుద్దేశించి కవి, "మీరు మనసారగా ఏడ్వనీరు నన్ను" అని తన అసమ్మతిని చూపవలసిన అవసరం లేదు.

"అభ్యుదయ రచనల వుద్దేశ్యం ఒక్క కవిత్వాభ్యుదయమే అని కాదు. అంతటితో అది నిలిచిపోవాలనీ కాదు. విశాలాంధ్ర కళ్యాణ వైభవాభ్యుదయాన్నే మేం కోరుతున్నాం. కవి ప్రజలతో చేయికలిపి ముందడుగు వేయటమే మా ఆశయం" అని అన్నారు.

## రచయిత - సమాజం

తర్వాత పచ్చయ్యప్ప కళాశాలలో అధ్యాపకులుగా ఉన్న డి.వి.ఎ.యస్. నారాయణరావుగారు ఇలా మాట్లాడారు : "రచయిత సమాజంలో ఒక భాగం. అతడు వ్రాసేది సమాజం కోసం. సమాజం మార్పుచెంది వృద్ధిపొందుతుంటే, ఆ మార్పును అడ్డకుండా ప్రోత్సహించే రచయిత అభ్యుదయ రచయిత. మార్పును శాయశక్తులా నిరోధించేవాడు అభ్యుదయ నిరోధకుడు ... అయితే, మార్పు అభివృద్ధి పరిణామములను గుర్తించే అభ్యుదయ రచయితలు, ప్రస్తుత పరిస్థితులను సరిదిద్దడానికి ఒకే మార్గం సూచించాలని మేము అనడంలేదు. వేర్వేరు మార్గాలు సూచించవచ్చు. మార్పు అవసరమని గ్రహించి ఒక నూతన మార్గాన్ని సూచించుతున్నారు గనుక వీరంతా ఒక వేదికపై ఉండవచ్చు. దైనందిన సమస్యలపై వ్రాసే కవిత్వం కొందరు ప్రచారం అవదా అని భయపడుతున్నారు. పుట్టగానే బిడ్డ కెవ్వుమని కేకవేస్తున్నాడంటే, ఆకలి వేస్తుందని ప్రచారం చేస్తున్నాడు. నేనీ వ్యాసం చదువుతున్నానంటే నా అభిప్రాయాలు నల్గురికీ తెలియాలనే. లేకపోతే నా కీ శ్రమ ఎందుకు. తను నమ్మిన నీతిని ప్రచారం చేయడం రచయిత ధర్మం ... రాజకీయాలలో ప్రచారం అనేమాటకు కొంత దోషం అంటగట్టబడింది. కాని ప్రజల ప్రస్తుత స్థితిగతులను విశ్లేషించి, చిత్రించి పరిష్కార మార్గాలను సూచించుతూ జరిపే ప్రచారమే దోషరహితమైనది. ప్రజా సమస్యలకు పరిష్కార మార్గాన్ని చిత్రించే ధర్మం నుండి 'ప్రచారమనే మిషతో తప్పుకోడం ఎస్కేపిజం' అవుతుంది ..." అని అన్నారు.

శ్రీ వాసిరెడ్డి రాధాకృష్ణమూర్తిగారు విద్యార్థులు అభ్యుదయ రచనలో కృషి చేయాలన్నారు.

తర్వాత ఆంధ్రప్రభ సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావుగారు 'కొత్తగడ్డ' అనే ఏకాంకి నాటికను చదివి వినిపించారు. రైతు కుటుంబంలో పాత కొత్త తరాల ఘర్షణను చిత్రిస్తూన్న చక్కని నాటిక ఇది.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు మాట్లాడుతూ నన్నయకు పూర్వం కూడా తెలుగు

సాహిత్యమున్నదన్నారు. ఒక్కొక్క మత సాంఘిక ప్రభావాలవల్ల, సారస్వతంలో ఎలా ప్రౌఢ కవితకు జానపద కవితకూ ఘర్షణ వచ్చిందో, ప్రజా సాహిత్యాన్ని అణచివేయడానికి ప్రయత్నాలు ఎలా జరిగాయో తెలియచేశారు.

శ్రీశ్రీ మాట్లాడుతూ, వయస్సులోనూ, కవితలోనూ వృద్ధులయినవారు, ముందుకు పోయే యువకులను నిరోధించకూడదన్నారు. వృద్ధాప్యంలో లాలిత్యం, హందాలను అలవర్చుకొని అభ్యున్నతికై కృషి చేసేవారిని ప్రోత్సహించాలన్నారు.

జలసూత్రం రుక్మిణినాథశాస్త్రిగారిలా మాట్లాడారు :

"వ్యష్టి జీవిత విధానంలోనుండి సమిష్టి జీవిత విధానంలోకి మారుతున్నాం. నా బాధ, నా సుఖం లోక సుఖం లోక బాధ ఒకనాడు అయితే, లోక బాధ నా బాధ, లోకపు సుఖం నా సుఖం ఈనాడు. 'కళ'కు విలువలూ, కొలతలూ అవసరాలనుబట్టి అనేక కారణాలనుబట్టి మారుతూంటాయి.

ప్రచారానికీ కళకూ అనాదినుంచీ పెద్ద పేచీ ఉంటూనే వున్నది. కళ ప్రచారం అవుతుంది. ప్రచారం మాత్రం కళ కాదు. ఏది ప్రచారమో కళో యిట్టే తెలిసిపోతుంది. తాత్కాలిక సమస్యలను గురించే వ్రాస్తాం. ఒక్కొక్క సమస్య తీరిందంటే కొంత గుండెమీంచి బరువు తీరినట్లు. ఈ సంఘం తాత్కాలిక సమస్యలకోసమే పాటుబడుతుంది. సామాజిక సమస్యలను తృణీకరించి సమాజానికి అందకుండా రచించడం అపసవ్యమైన సాహిత్యమార్గం. సమస్యలను వివరించడంతో కాక, వివరించి సాహిత్య సంపన్నంగా వ్యాఖ్యానించి మానవ ప్రవృత్తుల్ని మార్చటంకోసం పాటుపడడం మన మార్గం" అని చెప్పి ముగించారు.

## సందేహాలు తీరినవి

"నిన్న నేను చెప్పిన సందేహాలన్నీ తీరినవి. రాజకీయాలంటే మైలగా నేను భావించడములేదు. ఈ సంఘంలో ఏ రాజకీయ పక్షానికి చెదినవారున్నా, సాహిత్యాన్ని ప్రజలను మనస్సులో పెట్టుకొని పనిచేయాలి" అని అధ్యక్షులు శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యం తమ తుది పలుకులలో తెలిపారు.

శ్రీ గోపాలంగారి రాష్ట్రగీతం ఆలపించుటతో సభ ముగిసింది. సాయంత్రం, వివిధ నృత్యాలు, బుర్రకథలు, పాటలతో వైజ్ఞానిక ప్రదర్శనలు జరిగాయి. అవి పలువురి ప్రశంసలు పొందాయి. మద్రాసు శాఖకు కార్యనిర్వాహక వర్గాన్ని ఎన్నుకొనుటతో సభ ముగిసింది.

## మద్రాసు శాఖ ప్రజానాట్యమండలి స్థాపన

ఆనాడు ప్రజానాట్యమండలి మద్రాసు శాఖ ఎటువంటి ప్రముఖులతో ఏర్పడిందో చూస్తే ప్రజానాట్యమండలి వారిలో ఎంత ఉత్సాహం, ఉత్తేజం కల్గించిందో మనం చూడవచ్చు. ఆ వివరాలు యివి :

"ఆంధ్ర ప్రజానాట్యమండలి మద్రాసు శాఖ ప్రారంభోత్సవము రసికరంజని హాలులో 1947

ఫిబ్రవరి 24వ తేదీన శ్రీ ఎల్.వి. ప్రసాద్ (స్వతంత్ర ఫిలిమ్స్ డైరెక్టర్)గారి అధ్యక్షతన జరిగింది. శ్రీ వెంపటి రాధాకృష్ణ, శ్రీ కొండముది గోపాలరాయ శర్మగార్లు ప్రజానాట్యమండలి ఆశయాలు, అది చేసిన కార్యకలాపాలు, అభ్యుదయ కళల ప్రచార ఆవశ్యకత గురించి ఉపన్యసించారు.

తరువాత ఆచార్య ఆత్రేయగారు రచించిన పరివర్తన అనే నాటకం, ఆంధ్ర ప్రజానాట్యమండలి దళంవారు ప్రదర్శించారు. ప్రఖ్యాత నటకులైన డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావుగారు ప్రశంసించారు. నాటకానంతరం సినీమా నటకులు, యితర కళాభిమానులు రు. 700/- బహుమానంగా ప్రజానాట్యమండలివారికి యిచ్చారు.

## 14

# అపూర్వమైన ఆంధ్ర సాహిత్య పాఠశాలలు

బహుశా ఆంధ్రదేశంలోనే కాదు భారతదేశంలోనే ఇదివరకు ఎన్నడూ జరగని విధంగా అభ్యుదయ రచయితల సంఘాధ్వర్యాన, కమ్యూనిస్టు పార్టీ తోడ్పాటుతో రెండు సాహిత్య పాఠశాలలు జరిగాయి. ఆనాటి సాహితీ రంగంలో ప్రముఖులైన వారందరూ అధ్యాపకులుగా వచ్చారు. 1946 మే 11 నుండి జూన్ 10 వరకు నెల రోజులు గుంటూరు జిల్లా పెదపూడిలో జరిగిన ఈ పాఠశాలకు వచ్చినవారు, వారు చెప్పిన పాఠ్యాంశాలు ఎంతో ప్రాధాన్యత సంతరించుకున్నాయి.

శ్రీ కొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు పాఠశాల గురించిన తన అనుభవాలు చెబుతూ విద్యార్థుల గురించి, అధ్యాపకుల గురించి చక్కని విశ్లేషణ చేశారు. 57 మంది విద్యార్థులు, 19 మంది అధ్యాపకులు రోజుకు 7 గంటల చొప్పున పాఠాలు నేర్చుకున్నారు అని చెప్పారు.

పాఠశాలను ప్రఖ్యాత శిల్పకళావేత్త దేవీప్రసాద్‌రాయ్ చౌదరి ప్రారంభించారు. గిడుగు రామమూర్తిగారి పేర పాఠశాల ఆవరణ నిర్మించారు. బళ్ళారి రాఘవ పేర సింహద్వారం నిర్మించారు. ప్రిన్సిపాల్‌గా మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వ్యవహరించారు. ఆయన మాట్లాడుతూ ఇది ప్రజల విశ్వవిద్యాలయం అన్నారు. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు "మన సాహిత్యవేత్తలు ఎన్నాళ్ళనుండో కలలుగన్న సాహిత్య పాఠశాలకు ఈవేళ రూపం ఏర్పడింది" అన్నారు.

పెదపూడి పాఠశాలను సమీక్షిస్తూ "ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఇది సువర్ణాక్షరాలతో లిఖించదగిన విషయం" అని నిడదవోలు వెంకటరావుగారన్నారు. రెండు మూడు సంవత్సరాలలో ఈ పాఠశాల ఒక ప్రజా విశ్వవిద్యాలయం అయిపోతుందన్నారు. పాఠశాల నెల రోజులూ ప్రతీ ఉదయం నగర సంకీర్తన జరిగింది. గురజాడ దేశభక్తి గేయం, వేములపల్లి శ్రీకృష్ణ తెలుగోడా పెదపూడిలో మార్మోగిపోయాయి. పిల్లల నోటబట్టి వాళ్ళూ పాడటం మొదలుపెట్టారు. పాఠశాల విద్యార్థులు నోట్సులు వ్రాసుకొన్నారు. రోజూ రెండు గంటలు చొప్పున గోష్ఠులు నడిపారు.

వ్రాత పత్రికలు నడిపారు. కళా ప్రదర్శనలు నడిపారు. నమూనా పార్లమెంటులు నడిపారు. ఆ నెల రోజులు పెదపూడిలో ఒక పెళ్ళి జరుగుతున్నట్లుగానే అందరూ ఆనందోత్సాహాలలో మునిగిపోయారు. మాధవపెద్ది గోఖలే సహకారంతో చిత్రలేఖనం నేర్చుకున్నారు. సాంస్కృతిక ప్రదర్శనలకు చుట్టుపట్ల గ్రామాలనుండి మూడు నాల్గు వేలమంది హాజరయ్యేవారు.

ఆ మరుసటి సంవత్సరం 1947 ఏప్రిల్ 26 మొదలు గుంటూరు జిల్లా పల్లెకోనలో సాహిత్య పాఠశాల 20 రోజులు మాత్రమే జరిగింది. రెండవ పాఠశాలకు ఏర్పరచిన విద్యాలయ సమితి పేర్లు చూస్తే ఆనాడు అభ్యుదయ రచయితల ఉద్యమం ఎంతగా ఆంధ్ర సాహిత్య ప్రపంచాన్ని ఆకట్టుకోగల్గిందో అర్థమవుతుంది.

## పెదపూడి ఆంధ్ర సాహిత్య పాఠశాల అధ్యాపకులు

**పెదపూడి అరసం సాహిత్య పాఠశాలకు వచ్చిన అధ్యాపకులు :**

1. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, ఆంధ్రదేశ చరిత్ర.
2. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, ప్రాకృత భాషావాదము - ఆంధ్ర వాఙ్మయ చరిత్ర.
3. శ్రీ నిడదవోలు వెంకటరావుగారు, ఆంధ్ర సాహిత్య చరిత్ర.
4. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, భాషాతత్వశాస్త్రం.
5. శ్రీ చిలుకూరి నారాయణరావుగారు, ప్రాచీనాంధ్ర వైయాకరణుల భాషాదృష్టి, నవ్య సాహిత్య చరిత్ర, తెలుగు నుడికారం - సామెతలు.
6. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, ఆధునికాంధ్ర కవిత్వ రచన ( కొత్త పోకడలు.
7. శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, తెలుగు ఏకాంకిక.
8. శ్రీ అయల సోమయాజుల నరసింహశర్మగారు, రూపకములు.
9. శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు, చిన్న కథ - నవలా.
10. శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారు, కావ్య విమర్శ.
11. శ్రీ మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలేగారు, చిత్రకళ.
12. శ్రీ కొండముది గోపాలరాయశర్మగారు, నాటకాలు.
13. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు, ప్రాచ్య సాహిత్యం - అలంకారాలు.
14. శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు, ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు.
15. శ్రీ దర్శి చెంచయ్యగారు, గదర్ పార్టీ అనుభవాలు.

**పెదపూడి సాహిత్య పాఠశాల విద్యార్థులు :**

1. శ్రీ వి. వాలయ్యపంతులు, 4వ తరగతి బి.ఏ. (ఆనర్సు), ఆంధ్ర విశ్వవిద్యాలయం.
2. శ్రీ శ్రీరాం వేంకట భుజంగరాయశర్మ, బి.ఏ. (ఆనర్సు) ఆంధ్ర విశ్వవిద్యాలయం.
3. విద్వాన్ శ్రీ వెల్లంకి బ్రహ్మయ్యచౌదరి, కలవపాముల.

4. శ్రీ ఎన్.హెచ్. శాస్త్రి, భాషాప్రవీణ విద్యార్థి, తెనాలి - సంస్కృత కళాశాల.
5. శ్రీ ఎం. వెంకటరత్నం, భాషా ప్రవీణ విద్యార్థి, చిట్టిగూడూరు - సంస్కృత కళాశాల.
6. శ్రీ పూలకుంట సంజీవులు, గేయకవి, అనంతపురం జిల్లా.
7. శ్రీ తక్కెలపాటి తిప్పన్న, మైసూరు.
8. శ్రీ వారణాసి కోటేశ్వరశర్మ, తెనాలి - సంస్కృత కళాశాల.
9. శ్రీ ఆర్.ఎన్. సింహా, కథకుడు, ఏలూరు.
10. హిందీ విశారద శ్రీ వాసిరెడ్డి భాస్కరరావు, బెజవాడ.
11. శ్రీ నార్ల చిరంజీవి, కవి - కాటూరు.
12. శ్రీ గుమ్మడి సీతారామయ్య, భాషాప్రవీణ విద్యార్థి - రేపల్లె.
13. శ్రీ కె. వెంకటేశ్వరరావు, ఏలూరు, పశ్చిమగోదావరి.
14. శ్రీ వింతా వెంకటరెడ్డి, తేలప్రోలు.
15. శ్రీ ఎం.ఆర్.బి. నరసింహారావు, ఇంటర్ 2వ సం॥, పశ్చిమ గోదావరి.
16. శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, సుప్రసిద్ధ రచయిత - ఘంటసాల.
17. శ్రీ వంగపాటి ఉమామహేశ్వరరెడ్డి, ఇంటర్ 2 సం॥, జనార్దనపురం.
18. శ్రీ లింగుట్ల కోనేటప్ప, పరిశోధకుడు, ఛాయాపురం (గుంటకల్).
19. శ్రీ గుత్తికొండ సీతారామయ్య, విద్వాన్ ఫైనల్ - యలవర్రు (తెనాలి).
20. శ్రీ పోకా వెంకటేశ్వరరావు, కొవ్వూరు - సంస్కృత కళాశాల.
21. శ్రీ శ్రీరామకవచం వెంకటేశ్వరశాస్త్రి, తెనాలి - సంస్కృత కళాశాల.
22. శ్రీ రావిపాటి శ్రీరాములు, టీచర్ - పోతవరం (ఒంగోలు)
23. హిందీ విశారద శ్రీ జి. వెంకటరామయ్య, యడ్లపల్లి (తెనాలి)
24. శ్రీ కంచర్ల వెంకటప్పయ్య, విద్వాన్ ఫైనల్, కొలకలూరు (తెనాలి)
25. శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, ఆంధ్ర ప్రజానాట్యమండలి, బెజవాడ.
26. శ్రీ కాట్రగడ్డ నరసయ్య, బి.ఎస్.సి. విద్యార్థి, కాశీ విశ్వవిద్యాలయం.
27. శ్రీ ముక్కామల పురుషోత్తమరావు, ఆంధ్ర ప్రజానాట్యమండలి.
28. శ్రీ షేక్ నాజర్, 'బెంగాల్ కరువు, పల్నాటి యుద్ధం' రచయిత - పొన్నకల్లు, గుంటూరు.
29. శ్రీ ఆలూరు సూర్యప్రకాశరావు, తెనాలి.
30. సాహిత్య శిరోమణి, శ్రీ కొత్తపల్లి రంగారావు, అమృతలూరు (తెనాలి)
31. శ్రీ కోగంటి గోపాలకృష్ణయ్య, గేయకవి, ఆంధ్ర ప్రజానాట్యమండలి.
32. శ్రీ మాచినేని వేంకటేశ్వరరావు, కథకుడు, ఆంధ్ర ప్రజానాట్యమండలి.
33. శ్రీ సుంకర సత్యనారాయణ, 'ముందడుగు' నాటక కర్తలలో ఒకరు, బెజవాడ.
34. శ్రీ దేవభక్తుని రంగారావు, చిట్టిగూడూరు - సంస్కృత కళాశాల.
35. శ్రీ దేవభక్తుని పున్నారావు, గురజాల బోర్డు హైస్కూలు పండితుడు.

36. శ్రీ కె. చంద్రయ్య, పోతవరం (ఒంగోలు)
37. శ్రీ నటరాజన్ (శారద) తెనాలి.
38. శ్రీ కోసూరి పున్నయ్య, గేయకవి, కొత్తపాలెం.
39. శ్రీ యేపూరి రామకోటి, ఆంధ్ర ప్రజానాట్యమండలి.
40. శ్రీ కె.ఆర్. కృష్ణ, ఇంటర్ సీనియర్ - బాపట్ల.
41. శ్రీ బొల్లిముంత శివరామకృష్ణ, కథకుడు, తెనాలి.
42. సాహిత్య శిరోమణి శ్రీ దివి వీరభద్రాచార్యులు, పునాదిపాడు పండితుడు (కృష్ణా)
43. శ్రీ జాస్తి సత్యనారాయణ, చిట్టిగూడూరు సంస్కృత కళాశాల.
44. విద్వాన్ శ్రీ చదలవాడ వెంకటరామయ్య, పెడన - హైస్కూలు పండితుడు.
45. శ్రీ చదలవాడ బాపయ్య, పాంచాలవరం (తెనాలి)
46. శ్రీ పొందూరి సత్యనారాయణ, హెడ్మాస్టర్, పొందూరు - ప్రాథమిక పాఠశాల (ఒంగోలు)
47. శ్రీ జాస్తి సీతారామదాసు, బి.ఇ. విద్యార్థి, అన్నామలై విశ్వవిద్యాలయం.
48. భాషాప్రవీణ శ్రీమతి వసల సత్యవతీదేవి, నిడదవోలు.

## 15

## ఆంధ్ర జాతీయ గీతానికై కమ్యూనిస్టు పార్టీ విజ్ఞప్తి

ఆంధ్ర జాతీయకవి చిలకమర్తివారి సన్మానం, వారి స్వీయచరిత్ర ప్రచురణ, ప్రముఖ ఆంధ్ర చిత్రకారుడు దామెర్ల రామారావు చిత్రప్రదర్శన, మున్నగు రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘ ద్వితీయ మహాసభ మహత్తర సంఘటనలలో మరొక ముఖ్య సంఘటన ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ తరపున శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారు "ఆంధ్ర జాతీయగీతం కావాలి" అని మహాసభ వేదిక నుండి చేసిన ప్రకటన. ఆంధ్ర జాతీయ పునరుజ్జీవ కృషిలో కమ్యూనిస్టు పార్టీ ఎలా పెనవేసుకొనిపోయిందో, ఈ ప్రకటన విదితం చేస్తుంది. ఉత్తమ జాతీయగీతానికి రు. 116 బహుమానం ప్రకటిస్తూ సుందరయ్యగారు చేసిన ప్రకటన ఇలా ఉంది : ఆనాటి ఆంధ్రదేశ పరిస్థితులకు కమ్యూనిస్టు పార్టీ ఏవిధంగా స్పందించుతూవచ్చిందో ఈ ప్రకటన ప్రతిబింబించుతూంది. సుందరయ్యగారి ప్రకటన ఇలా వుంది :

### ఆంధ్ర జాతీయగీతం కావాలి

**ఉత్తమ గీతానికి రు. 116లు బహుమానము**

**తెలుగు కవి సోదరులారా!**

విశాలమైన ఆంధ్రభూమిలో దాదాపు 3 కోట్లమంది తెలుగు ప్రజలమున్నాము. రెండు వేలేండ్లకు మించిన ప్రాచీన సంస్కృతి మనది. "దేశభాషలందు తెనుగు లెస్స" అనిపించుకొన్నది

మన మాతృభాష. ఏ జాతి అయినా సగర్వంగా చెప్పుకోతగ్గ ఉజ్వలమైన చరిత్ర మన ప్రజలది. గోదావరి, కృష్ణ, పెన్న, తుంగభద్ర నదులు ప్రవహించే పవిత్రభూమి మనది.

అట్టి మన తెలుగుజాతి నేడు వెలవెలబోతూంది. మనకు ప్రత్యేక రాష్ట్రమైనా లేదు. ఆంధ్రభూమి మద్రాసు రాష్ట్రంలో కొంత, హైదరాబాద్ సంస్థానంలో కొంత, మధ్యరాష్ట్రం, మైసూరు సంస్థానాలలో మరికొంత - యీ విధంగా చీలిపోయివుంది. వివిధ ప్రాంతాలలోని తెలుగు ప్రజలందరికి మనమంతా ఒకే ఆంధ్రజాతి వారమనే చైతన్యం, ఉత్సాహం కలిగించే తెలుగు జాతీయగీతం మనకులేదు.

స్వతంత్ర భారతదేశంలో దోపిడీ, దారిద్ర్యం లేకుండా ప్రజలందరికీ సమానావకాశాలు యిచ్చే ప్రజారాజ్యాన్ని ఆంధ్రులం స్థాపించుకోవాలి. అప్పుడు మన తెలుగుగడ్డకు, ఆంధ్రజాతికి ఉజ్వలమైన భవిష్యత్తు వుంటుంది. మన దేశంలో ప్రవహించే నదీజలానికి తగిన ప్రాజెక్టులు నిర్మించితే, తెలుగుదేశమంతా సస్యశ్యామలమై ధనధాన్యాలతో అలరారుతుంది. ఆంధ్ర భూగర్భంలోవున్న లోహాదులను తవ్వి పరిశ్రమలు నిర్మించితే తెలుగుప్రజ ధన కనక వస్తు వాహనాలతో తులతూగగలదు.

పై భావాలను సూచించుతూ, చక్కని ఆంధ్ర జాతీయగీతం రచించాలని తెలుగు కవులను కోరుతున్నాను. గీతం పాడటానికి సులభంగా వుండాలి. తెలుగు నుడికారం ప్రతిబింబించుతూ వుండాలి. గీతం 30 పంక్తులకు మించి వుండకూడదు. ఉత్తమమైన గీతానికి రు. 116లు బహుమానం యివ్వబడుతుంది.

ఏది ఉత్తమగీతమో నిర్ణయించడానికి యీ క్రిందివారు ఒక కమిటీగా వుంటారు. 1. శ్రీ తెలికిచర్ల వెంకటరత్నంగారు 2. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు 3. శ్రీ అడివి బాపిరాజుగారు 4. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 5. శ్రీ కంభంపాటి సత్యనారాయణగారు 6. శ్రీ తుమ్మల వెంకట్రామయ్యగారు 7. శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు.

షరా : కవులు తాము రచించిన గీతాలను ఫిబ్రవరి నెలాఖరుకు చేరేలాగు క్రింది అడ్రసుకు పంప ప్రార్థన :

అడ్రసు
పుచ్చలపల్లి సుందరయ్య
ప్రజాశక్తి ఆఫీసు, బెజవాడ.

ఇట్లు విన్నవించు,
పుచ్చలపల్లి సుందరయ్య
4-1-1945

## ఆంధ్ర జాతీయ గీతం - ఎంపిక

ఆంధ్ర జాతీయ గీతం ఎంపిక జరిగినప్పుడు నాటి ప్రజాశక్తి పత్రికలో వెలువడిన ప్రకటన:

"ఆంధ్రుల ఔన్నత్యాన్ని చిత్రించేది, ఆంధ్రజాతిని ఉత్తేజపర్చేది, ఆంధ్రాభ్యుదయాన్ని కోరే వారందరికీ సమ్మతమైనది, ఒక ఆంధ్ర జాతీయగీతం మన తెలుగువారికి లేని లోపం నాకు కనిపిస్తుంది. మున్నెన్నడూ కనీ విని యెరుగనంతగా యీనాడు చైతన్యవంతులమవుతూవున్న మన తెలుగుజాతిని, ఉజ్జ్వల భవిష్యత్తుకు, ఐక్యాంధ్ర ప్రజాస్వామిక నిర్మాణానికి ఉత్తేజపర్చే

జాతీయగీతాన్ని రచించవలసిందిగా అభ్యుదయ రచయితలను అర్థిస్తున్నాను." అంటూ గత డిసెంబరు మాసంలో బెజవాడలో జరిగిన ఆంధ్ర అభ్యుదయ రచయితల ద్వితీయ మహాసభలో కామ్రేడ్ సుందరయ్య విజ్ఞప్తి చేశారు. ఉత్తమంగా పరిగణింపబడిన గీతానికి నూటపదార్లు కానుకగా, కమ్యూనిస్టు పార్టీ తరఫున సమర్పిస్తానన్నారు. ఉత్తమ రచన యేదో నిర్ణయించడానికి శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, శ్రీ అడివి బాపిరాజుగారు, శ్రీ తెలికిచర్ల వెంకటరత్నంగారు, శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు, శ్రీ కంభంపాటి సత్యనారాయణగారు, శ్రీ తుమ్మల వెంకట్రామయ్యగారు నియమింపబడ్డారు. సుందరయ్యగారు వాగ్దానం చేసిన రు. 116 తాము యిస్తామని శ్రీ పాటిబండ్ల రఘుపతిరావుగారు (జానకీపురం, నైజాం) తెలియజేశారు. కవులు తమ తమ రచనలను పంపవలసిన ఆఖరు గడువు జూన్ 30వ తేదీగా నిర్ణయింపబడింది. ఈ గడువులో మొత్తం 42 గేయాలు వచ్చాయి. వీటిలో ఉత్తమ రచనను నిర్ణయించడానికి 16-9-45న నిర్ణయకర్తల సమావేశం బెజవాడలో జరిగింది. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, శ్రీ అడివి బాపిరాజుగారు, శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు సమావేశానికి హాజరుకాలేకపోయారు. కాని వారి అభిప్రాయాలను ముందుగా తెలియజేశారు. వచ్చిన 42 గీతాలలో ఉత్తమ జాతీయ గీతాని కుండవలసిన లక్షణాలన్నీ పూర్తిగా దేనికీ లేవనీ, అయినప్పటికీ 3 గీతాలు బహుమతుల కర్హత సంపాదించినవనీ, నిర్ణయకర్తలు అభిప్రాయపడ్డారు. మొదటిది కొండేపూడి లక్ష్మీనారాయణగారు రచించినది; రెండవది "చంద్రరేఖ"గారు రచించినది; మూడవది ముక్కామల నాగభూషణంగారు రచించినది. ఆ మూడింటిని క్రింద ముద్రిస్తున్నాం. పాటిబండ్ల రఘుపతిరావుగారు వాగ్దానం చేసిన రు. 116 కొండేపూడి లక్ష్మీనారాయణగారికి ప్రథమ బహుమతిగా యివ్వబడతాయి. సుందరయ్యగారు మొదట వాగ్దానం చేసిన రు. 116లలో రు. 58లు "చంద్రరేఖ"గారికీ, రు. 58లు ముక్కామల నాగభూషణంగారికీ యివ్వబడతాయి. ఈ 3 గీతాలను యింకా ఉత్తేజకరంగా చేయడానికి పాఠకులు తమ అభిప్రాయాలు పంపవలసిందిగా కోరుతున్నాం. మీ సూచనలన్నీ అక్టోబరు 1వ తేదీకి ప్రజాశక్తి కార్యాలయానికి చేరాలి. ఉత్తమగీతాలుగా నిర్ణయింపబడినవాటినీ, పోటీ చేసినవాటిలో ముఖ్యమైన వాటినీ ఒక పుస్తకంగా ప్రకటించుతాం. - సం॥



**1.** పాడరా ఓ తెలుగువాడా! పాడరా ఓ కలిమిరేడా!

పాడరా మన తెలుగుదేశపు భవ్యచరితపు దివ్యగీతము ॥పా॥
యుగయుగంబులనుండి బంగరు గంగనిచ్చెడు గౌతమీ నది,
కోహినూరును కురుల సందున ముడిచి కులికిన కృష్ణవేణీ,
హొయలుగా రతనాల సీమను ఓలలాడిన తుంగభద్రా,
సొగసు గూర్చును తెలుగు తల్లికి, సుఖముగూర్చును తెలుగువారికి ॥పా॥

పాడుచును మన తెలుగు జోదుల ప్రతిభచాటిన వీరగాథలు,
ఆడుచును మన తెలుగుజండా పరువునిలిపిన మేలి ఘటనలు
పాడి పంటల పొంగిపొరలుచు దండిగా మన దేశముండగ
సాగిపోదము తెలుగుచరితపు వెలుగు జాడల వేగ మనమిక ॥పా॥
కదన రంగమునందు మెరసిన కాకతీయుల ఖడ్గతేజము,
వదరు శత్రువు నెదిరి పోరిన వనిత రుద్రమ యుద్ధపటిమ,
కొదమ సింగము పగిది నురికిన బాలచంద్రుని బాహుదర్పము,
పొంగజేయద మేనిరక్తం? ఉప్పొంగజేయద నీదు హృదయము? ॥పా॥
తెలుగు పలుకుల తేనెలొలికెను తిక్కనార్యుని కవితలోనా,
రాలుకరిగే త్యాగరాజునిరాగసుధలో మునిగె తెనుగూ
సొంపుగూర్చెను తెనుగు తల్లికి హంపి నగరపు శిల్పసంపద
భరత నాట్యపు భంగిమములో పల్లవించెను తెలుగు పరువము ॥పా॥
తెనుగుజాతికి నూత్న సంస్కృతి తీర్చిదిద్దిన కందుకూరీ,
తెనుగుభాషను ప్రజల భాషగ చేయ పోరిన గిడుగు పిడుగూ,
దేశమంటే మనుజులేనని తెలియజెప్పిన అప్పరాయడు
తెలుగుతల్లీ నోముపంటచె తేజరిల్లిన దివ్యతారలు ॥పా॥
పసిడి పండెడు మనదు దేశపు ఖనిజ సంపద లన్నిగూరిచి
భారి యంత్రాగారములను పాదుకొల్పగ కదలిపోదము,
ఒడలు తెలియని పరవశంబున కడలి జేరెడు నదుల జలముల
తెలుగు పొలముల మరలజేసీ, నిలుపుకొందము లక్ష్మినింటను ॥పా॥
పారతంత్ర్యము బాపి భారత భువిని భేదాల్ తొలగజేదము,
ఆంధ్రరాష్ట్రమునొంది మనమూ అలదికొందము వీరగంధము
మూడుకోట్ల తెలుగు బిడ్డలు ముక్తకంఠముతోడ నైక్యత
జయము జయమని తెలుగుతల్లికి విజయ గీతిక లాలపింపగ ॥పా॥

**- కొండేపూడి లక్ష్మీనారాయణ**

★ ★ ★

2. ఆంధ్రలక్ష్మి నీకు శుభము
వింధ్యాగ్ర మస్తకీ జయము
గోదావరీ కృష్ణ తుంగా తరంగిణులు
స్వాదు మృదులములు మా జీవన పథాలు;
పలనాడు చందోలు వంగోలు రంగాలు
ములుకు వారిన మాదు భూరిప్రతాపాలు ॥ఆంధ్ర॥

ప్రాతఃకిరణరాగ శోభ నీ తొలిసొమ్ము
స్వాతంత్ర్యలాస్య మోహనము నీ నిలయమ్ము
కవిభృంగ ఝుంకారకలిత మధుమంటపము
నవకళా కుసుమసిత సంతత వసంతమ్ము ॥ఆంధ్ర॥
చిలిపికోయిల గొంతుకలుపు చిరువులమాట
చలువరాల్ చలియించి పొరలుతీపుల పాట;
చలువరే తెలిజల్లు జిలుగు నీ రూపు
తొలిసంజ లొలికించు తళుకు నీ చూపు ॥ఆంధ్ర॥
గిలిగింతలకె పొంగి రతనాలు నవ్వెదవు
మాసస్యకోమలా, సకల ఖనిజామలా;
పులకించి నదియించి నిలువెల్ల కరగెదవు
మా దివ్య సౌందర్య వాహినీమయదేహి ॥ఆంధ్ర॥
కల కలల మోములో కళవళ మదేలనే?
కలల వాల్గనులలో కలత నిదురేలనే?
శారదేందు మయూఖ శకలాలు నీ సుతలు,
భారతీ సంస్కృతీ శిఖరాలు నీ సుతులు ॥ఆంధ్ర॥
తొలికైత చివురుపందిరి రాజమంద్రి
పలుకు వయ్యారంపు చిందు రాయలసీమ
కదలి గంతులువేయు కావ్యశిల ఎల్లోర
బౌద్ధపావన కళాహేల నాగార్జునము ॥ఆంధ్ర॥
విచ్చుకత్తుల వాడి రచ్చ మా చందోలు
చిచ్చురేగిన మండుకొండ మా పల్నాడు;
పగవారి యెదచీల్చి మగల మగలైనారు
నిగనిగల తెన్గుపస నిలిపి రాంధ్రప్రభులు ॥ఆంధ్ర॥
అమర హృదయజ్యోతి నర్పించితిమి తల్లి
సుమమృదు కరాంజలీమాల యిదిగోతల్లి;
నిరుపమ యశోమయీ, నిరత విజయాన్వయీ
శృంగార రూపిణీ, వాత్సల్య వాహినీ
ఆంధ్రలక్ష్మి నీకు శుభము
వింధ్యాగ్ర మస్తకీ జయము.

– 'చంద్రరేఖ'



3. తెలుగుతేజము దీప్తిజెందగ తెలుగు వెలుగులు దిశల నిండగ
తెలుగుతల్లిని గొలువ దీక్షతొ తరలిరావోయ్ తమ్ముడా॥
జీవనదులొ కృష్ణ గౌతమి శ్రీ పినాకిని తుంగభద్రలు
కులనగంబుల పగిది నొప్పెడు నల్లమలలును పాపికొండలు
ఘనవనంబులు గనులు మిక్కిలి గణుతి గాంచిన యోడరేవులు
మేల్మి బంగరు తెలుగుతల్లికి మేనిభూషలు తమ్ముడా॥
శకపురుషుడౌ శాలివాహను, శౌర్యసాహసులు చాళుక్యుల,
కాకతీయుల కదనతలముల కృష్ణరాయల జైత్రయాత్రల
అరిభయంకరులై, నిపుణులై అసమసాహస మెసగ వైరుల
గసిమసంగిన తెలుగు వీరుల ఘనత బాడర తమ్ముడా॥
సిద్ధ నాగార్జుని కొండ బ్రసిద్ధి పొందిన బౌద్ధశిల్పము
అమరకీర్తి విరాజితం బమరావతీ స్థూపాల శిల్పము
సరిగమల క్రమమెడలకుండగ స్వరము వలికెడు హంపి శిల్పము
తెలుగు శిల్పకళా ప్రపూర్ణత తెలుపుచున్నవి తమ్ముడా॥
ఆంధ్రభారత గ్రంథరచనా పండితుడు తిక్కన కవీంద్రుడు
మేటితంబుర మీటిరాగము లాలపించిన త్యాగరాజును
సరళపదములజేర్చి ముత్యపుసరులుగూర్చిన అప్పరావును
తెలుగుసాహిత్యంపు పట్టులతేనె జేర్చిరి తమ్ముడా॥
నవ్యవాఙ్మయ సృష్టికర్తయు నవ్యయుగ నిర్మాతయౌ వీ
రేశలింగము జూపినట్టి ప్రకాశమౌ మార్గముల నడచుచు
కులమతంబుల హెచ్చుతగ్గులు కూలద్రోసియు వెనుకబడిన ప్ర
జాభివృద్ధికి తోడుపడవలె జాగుసేయక తమ్ముడా॥
ఆంధ్రదేశము తెలంగాణా యందు భేదము లెంచకుమురా
ఎంచకుము సర్కారు రాయలసీమ జిల్లా లనెడుభేదము
పెంచవలెరా మూడుకోట్ల తెలుంగుప్రజ రాణించు ఐక్యత
కాంచవలె సత్కీర్తి సర్వప్రపంచమందున తమ్ముడా॥
గలగలా ప్రవహించు నదులకు కట్టవలెరా ఆనకట్టలు
జలాజలా పాటేటినీటిని మలుపవలె బంగరు పొలాలకు
చరాచరా వెదజల్లవలెరా రాజనపు రతనాలపైరులు
బిరబిరా మన పాడిపంటలు పొంగిపొరలగ తమ్ముడా॥
తీయవలెరా పొంగులెగయు నదీజలంబులనుండి విద్యుతు

త్రవ్వవలె భూగర్భమందలి వివిధ ఖనిజములన్ నెల
కొల్పవలె తక్షణమె యంత్ర పరిశ్రమలు పలుతావులన్ తుల
తూగవలె మనమెల్లరము సిరిసంపదలతో తమ్ముడా॥
జాగుసేయకురా ... ముందుకడుగిడరా ... భరతమాతకు స్వేచ్ఛగూర్చుమురా ... స్వ
తంత్ర ఆంధ్రప్రజాస్వామికము నిర్మించుమురా ... లోక
ప్రశాంతికై ప్రాపంచ ప్రజలతొ చేయిగలుపుమురా ...
లేవరా ... తెలుగుబిడ్డా ... లేవరా ... కళకాంతులన్ వెలుగొందరా ...
సిరిసంపదల తులదూగరా ... ఆంధ్రుల మహోన్నతి బాడరా॥

- ముక్కామల నాగభూషణం

## మరో రెండు ప్రఖ్యాత ఆంధ్ర జాతీయ గీతాలు

ఆంధ్ర జాతీయ గీతాలకోసం బహుమతి ప్రకటించడం, శ్రీ కొండేపూడి గీతం ప్రథమ బహుమతి పొందారు. చంద్రరేఖగారు, ముక్కామలగార్లు ద్వితీయ, తృతీయ బహుమతులు పొందారు. అదే సమయంలో (1945లో) మరో రెండు ప్రఖ్యాత గీతాలు వెలువడి అభ్యుదయ కవితా ఉద్యమానికీ, ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమానికి ఎంతగానో తోడ్పడి, విశేష ఖ్యాతి తెచ్చాయి. ఆనాడు ఈ గీతాలు ఆంధ్రదేశమంతటా మార్మోగాయి. తెలుగుజాతి భావసమైక్యతకు ఎనలేని విధంగా తోడ్పడ్డాయి.

అందులో శ్రీ వేములపల్లి వ్రాసిన తెలుగోడా! గేయం చక్కని స్వరకల్పనతో బహుజనాదరణ పొంది, ప్రతీ సభలోను "ఒన్స్‌మోర్" ప్రభంజనంతో ప్రఖ్యాతిపొందింది. (ఒక కమ్యూనిస్టు వ్రాశాడు గనుక - దీనిని ఆంధ్ర జాతీయ గీతంగా ప్రకటించడానికి తెలుగుదేశం పార్టీ వెనుదీసిందని ఇటీవల చెప్పబడుతున్న విషయం విదితమే.)

అలాగే శివయ్యగారు వ్రాసిన పలనాడు వెలలేని మాగాణిరా అన్న పాట శాతవాహన చక్రవర్తుల శౌర్యమిదే, బ్రాహ్మ్యమిదే క్షాత్రమన్న గర్జాఘోష - పలనాడునేకాదు యావదాంధ్రను ఉర్రూతలూపింది.

ఆనాడు కమ్యూనిస్టు ఉద్యమం తెలుగుజాతి చరిత్రను, సంస్కృతుల పూర్వవైభవాన్ని చాటుటకు తెలుగునాట తెచ్చిన సామాజిక, సాహిత్య విప్లవోద్యమాలకు ఈ గేయాలు ప్రతీకలుగా నిలిచాయి.

## తెలుగోడా!

చేయెత్తి జై కొట్టు తెలుగోడా!
గతమెంతొ ఘనకీర్తి గలవోడా!
సాటిలేనీ జాతి - ఓటమెరుగని కోట

నివురుగప్పి నేడు - నిదురపోతుండాది
జై కొట్టి మేల్కొలుపు తెలుగోడా!
గతమెంతొ ఘనకీర్తి గలవోడా!
వీర రక్తపు ధార - వారబోసినసీమ
పలనాడు నీదెరా - వెలనాడు నీదెరా
బాలచంద్రుడుచూడ ఎవరోడోయ్!
తాండ్ర పాపయగూడ నీవోడూ!
నాయకీ నాగమ్మ - మల్లమాంబ, మొల్ల
మగువ మాంచాలనీ - తోడబుట్టిన వోళ్ళె
వీర వనితలగన్న తల్లేరా
ధీరమాతల జన్మ భూమేరా
గతములో నీకీర్తి - కతలల్లి సెప్పారు
పసయేడ దాచావూ - వుసిలేకపోయెరా
బ్రతుకె బరువై యుంటి వీనాడూ
శతపోరి సాశించు తొలిపేరు
నాగార్జునుడి కొండ - అమరావతీ స్థూప
భావాల పుట్టలో - జీవకళ పొదిగావు
అల్పుడను కానంచు తెల్పావూ
శిల్పివంటివి దేశదేశాల
రాజ్యమంటే వీర - భోజ్యమన్నాడు మన
తిక్కనార్యుని మాట - ధీరులకు బాటరా
పూర్వ పౌరుషమెరిగి బ్రతకాలి
కార్యశూరులు నేడు కావాలోయ్
దేశమంటే వట్టి - మట్టి కాదన్నాడు
మనుషులన్నా మాట - మరువబోకన్నాడు
అమరకవి గురజాడ నీవోడు
ప్రజల కవితను బాడి చూపాడోయ్
రాయలేలిన సీమ - రతనాల సీమరా
దాయగట్టే పరులు - దారితీస్తుండారు
నోరెత్తి యడుగరా దానోడా
వారసుడ వీవెరా తెలుగోడా

కల్లోల గౌతమీ - వెల్లువల క్రిష్ణమ్మ
తుంగభద్రా తల్లి - పొంగి పారిన చాలు
ధాన్యరాసులె పండు దేశాన
కూడు గుడ్డకు కొదువలేదోయ్
పసిడి పాతర నీది - పరుల నోరూరెనోయ్
నీలో నీకేపెట్టి - నెత్తిచే యెట్టారు
దేశాన్ని దిగమింగి పోయినారోయ్
మోసాన్ని గుర్తెరిగి కాపాడోయ్
ఉత్తరాదీ మొదలు - దత్తమండలమంత
తెలగాణి ప్రాంతముతొ - చెలిమి గలిగించాలి
కలిసి మెలసి నేడు పోవాలోయ్
కలిమి బలిమి గూర్చుకోవాలి
ముక్కోటిబలగమోయ్! ఒక్కటై మనముంటె
యిరుగు పొరుగులోన - వూరుపేరుంటాది
తల్లి వొక్కటె నీకు తెలుగోడా
సవతి బిడ్డలపోరు మనకేలా
పెనుగాలి వీచింది - అణగారిపోయింది
నట్టనడి సంద్రాన - నావ నిలుచుండాది
చుక్కాని బట్టరా తెలుగోడా
నావదరి జేర్చరా మొనగాడా
స్వాతంత్ర్య భారతిలో - స్వేచ్ఛతో మన జాతి
లాయలాసలేని యా - కైలాసమౌతాది
చెయి గలిపి సాధించు స్వారాజ్యం
జయమంది భోగించు నీరాజ్యం

**- వేములపల్లి శ్రీకృష్ణ**

★ ★ ★

## పలనాడు వెల లేని మాగాణిరా!

శాతవాహన తెలుగు చక్రవర్తుల శౌర్య
మిదె బ్రాహ్మ్యమిదె క్షాత్రమన్న గర్జామోష
పులకలే ఎత్తించెరా పలనాటి

పౌరుషమ్మే పొంగెరా॥
బుద్ధ నాగార్జునుడి బోధ ముద్రాజ్యోతి
వర "మహాయానమై" వసుమతిని ప్రవహించి
హెచ్చుతగ్గులు సమసెరా పలనాట
విజ్ఞాన ప్రభ వెలిగెరా॥
తొలిసంజ దీక్షతో తెలుగు శిల్పులచేతి
పోగరలు మలిచిన బుద్ధయుగ జీవితము
నవశిల్ప రతనంబురా పలనాటి
నాగార్జునుడి కొండరా॥
వర్ణధర్మాలన్న ఉక్కుచట్టము పగిలి
మాలకన్నమదాసు మనసైన సుతుడుగా
వీరవైష్ణవ మొచ్చారా పలనాట
బ్రహ్మన్న "కలి" గీతలో॥
మగువ నాగమ్మతో మాయయుద్ధము వచ్చె
మగువ మాంచాలతా మగని రణమున కంపె
వీరవనితలు పుట్టిరీ పలనాట
శౌర్యముగ్గులు పెట్టిరీ॥
బాలచంద్రుడి కత్తిపదును మెరుపులు మెరిసి
తెరలి కారెంపూడి ధర్మ రణరంగాన
వీర రక్తము చిందెరా పలనాట
నాగులేర్లై పారెరా॥
బాలచంద్రుని కదన కౌశలము కథలల్లి
శ్రీనాథ కవిరాజు చంద్రవంకకు చెప్ప
ఎదకరిగి ప్రవహించెరా పలనాట
"ఎత్తిపోత"ల దూకెరా॥
కృష్ణరాయల సభా కవి దిగ్గజాలలో
"ఘటికా శతగ్రంథ కరణధుర్యం"డైన
భట్టుమూర్తే వెలసెరా పలనాట
ప్రౌఢశ్లేషలు పల్కెరా॥
కలిమి బలిమీగల్లు కర్షకుల సీమలో
కానికాలము వచ్చి కలహములు చెలరేగ
కుంపినీ వాడొచ్చెరా పలనాట

ఖైదుకొట్టులు కట్టిరా॥
దాస్యమూ దోపిడీ దారిద్రమూ హెచ్చి
పాడిపంటల మేలిబంగారు నాతల్లి
కరువు కాపురమయ్యెరా పలనాడు
కంటనీరే బెట్టిరా॥
ఒక్క సుముహూర్తాన ఉప్పొంగి భరతోర్వి
స్వాతంత్ర శంఖము సింహనాదము చేయ
మేరువై నిలచిందిరా పలనాడు
ముందుండి పోరిందిరా॥
కనెగంటి హనుమంతు కోరమీసము ద్రిప్పి
పలనాటి ప్రజలచే పన్ను లెగబెట్టించె
బలియిచ్చె హనుమంతునూ పలనాడు
పరప్రభుత్వపు గుండ్లకూ॥
ఆనాటి పౌరుషా లానాటి విక్రమా
లానాటి వైభవా లానాటి సంస్కృతు
లీనాటికీ చరితలో పలనాడు
విరచించె బంగారుతో॥
వెనుకతరములవారి వీరచరితల సిరులు
నార్పోసి త్యాగంపు నీర్పెట్టి పెంచరా
విరిసి సుఖములు పండురా పలనాడు
వెలలేని మాగాణిరా॥

\- పి.వి. శివయ్య

"ప్రతిజాతికి స్వాతంత్ర్యం
పరపీడా రాహిత్యం!!
ఇది మాత్రం ఇది మాత్రం
ఇది మాత్రం నిజమనవోయ్
వికసించే విధానమున
మకుటధారి మానవుడని!!"

\- దేవులపల్లి కృష్ణశాస్త్రి

# 16

# ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమం : విద్యార్థి, యువజన, మహిళా సంఘాల కృషి

అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి ద్వారానేకాక 1940-48 సంవత్సరాల మధ్య విద్యార్థి, యువజన, మహిళా సంఘాల ద్వారా ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనకు కమ్యూనిస్టు పార్టీ ఎడతెగని కృషి గావించింది. కమ్యూనిస్టు పార్టీ మహాసభల వేదికలనుండే కాక, ఆనాటి ప్రజాసంఘాల వేదికలనుండి ముఖ్యంగా విద్యార్థి, యువజన, మహిళా సంఘాల మహాసభల వేదికలనుండి కూడా విధిగా సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడుతూ వచ్చేవి.

## యువ పతాక

స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయ అన్నవి ఆనాటి విద్యార్థి, యువజన సంఘాల ఆశయాలుగా వుండేవి. ఈ ఆశయాలు మూడూ కలిసి వచ్చేటట్లు పాడుకోవడానికి వీలైన విధంగా కూడా ఒక గేయం వ్రాసి యివ్వవలసిందని తూర్పు గోదావరి జిల్లా విద్యార్థి సంఘ నాయకులు శ్రీ పి.ఎస్. శర్మ, పర్వతనేని వెంకటేశ్వరరావు తదితరులు కోరగా దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు తూర్పు గోదావరి జిల్లా ప్రథమ విద్యార్థి మహాసభకు (1937 డిసెంబరు 10, 11 తేదీలు) "యువ పతాకం" అనే గేయం వ్రాసియిచ్చారు. కృష్ణశాస్త్రిగారి మేనకోడళ్ళు వింజమూరి సీత, అనసూయలు ఆ గేయాన్ని మహాసభకు వచ్చి జండా ప్రతిష్ఠాపన సమయంలో పాడారు. 1939లో కాకినాడలో జరిగిన 16వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభకు కూడా వీరు వచ్చి ఈ గేయాన్ని పాడారు. ఆనాటి విద్యార్థి యువజనోద్యమాలు రాబోవు నవ సమాజ నిర్మాణానికి అరుణారుణ తారలుగా అరుణకాంతి ధారలుగా కృష్ణశాస్త్రిగారు అభివర్ణించిన తీరు, "యుగయుగాల పీడకలలు, స్వార్థము, మోసము తొలగిపోయి ముందు కలదు లోకానికి ముక్తి - అమరజీవరక్తి" అన్న ఆశాభావాన్ని స్ఫురింపజేసిన పద్ధతి ఎంతో ప్రశంసనీయంగా ఉంది. (చూడండి పేజీ 79)

## వైజ్ఞానిక కార్యక్రమాల ప్రాధాన్యత

1937లో గుంటూరులో 14వ రాష్ట్ర మహాసభ, 1939లో బెజవాడలో 15వ మహాసభ జరిగిన తరువాత విద్యార్థి ఉద్యమం కొంత సంఘటితపడిన తరువాత శారీరక, వైజ్ఞానిక కార్యక్రమాల ఆవశ్యకతను గుర్తించింది. కాకినాడలో 1939 సెప్టెంబరులో జరిగిన 16వ రాష్ట్ర విద్యార్థి మహాసభకు కార్యాచరణ సమాలోచన చేస్తూ డాక్టర్ కె. సోమయ్య ఇలా తెలియజేశారు.

"సభ్యులు విద్యార్థి సంఘాలలో విరివిగా చేరాలంటే లలితకళలు ఆచరణలో పెట్టాలి. ఇది కాన్ఫరెన్సు కాలంలో జరుపుటకు ప్రయత్నములు జరుగుతున్నవి కాని తక్కిన కాలంలో

ఆచరణలో పెట్టాలంటే "కల్చరల్ సెక్షన్" వేరే స్థాపించాలి.

"స్పోర్ట్సు, ఆటలు మన కార్యక్రమంలో లేకపోవుటచే వాటిలో అభిలాష కల్గిన విద్యార్థులు మన సంఘాలలో చేరుటలేదు. కనుక వీరి సానుభూతి సంపాదించాలంటే "జిమ్నాజియం" ఒకటి స్థాపించాలి.

బెజవాడ-కాకినాడ సభల మధ్య జరిగిన కార్యక్రమాన్ని సింహావలోకనం చేస్తే తేలినవి రెండు విషయాలు : ఒకటి - విద్యార్థి సంఘాల నభివృద్ధిపరచుటకై స్పోర్ట్సు, లలితకళలతో కూడిన విశాలమైన కార్యక్రమం కావాలి. వాటిద్వారా విద్యార్థులలో రాజకీయ చైతన్యం కల్గించుటకు పూనుకోవాలి. ఇది నిర్మాణ సమస్యలలో ప్రధాన విషయం."

ఈ దృష్ట్యానే కాకినాడలో జరిగిన 16వ రాష్ట్ర మహాసభలో ఆటలు, పాటలు, ఉపన్యాస పోటీలు, నాటకాలు మొదలగు కార్యక్రమాలు ప్రవేశపెట్టడం జరిగింది. శ్రీ ఎం.ఎన్. మూర్తిగారు రచించిన "ఏమి చేయాలి?" (వాట్ టు డు?) అనే సాంఘిక నాటకం ప్రదర్శనకు తయారు చేయబడింది. కాని ప్రభుత్వం అనుమతి ఇవ్వకపోవడంవలన చివరి నిముషంలో ప్రదర్శించ బడలేదు. వక్తృత్వ పోటీలు, ఆటల పోటీలు జరిగాయి.

బెజవాడలో 18వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభతోపాటు, విద్యార్థి వైజ్ఞానిక మహాసభ కూడా జరుపబడింది. (1941 నవంబరు) వైజ్ఞానిక మహాసభకు విజ్ఞానం పత్రికా సంపాదకులు శ్రీ కాళీపట్నం కొండయ్యగారు అధ్యక్షత వహించారు. మోటూరు రాధాకృష్ణ ప్రారంభించారు. గోపరాజు రామచంద్రారావు, విశ్వనాథ సత్యనారాయణ, తాపీ మోహనరావుగార్లు పాల్గొన్నారు. వక్తృత్వ పోటీలు తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ జరిగాయి. సంగీత పోటీలు, ఆటల పోటీలు కూడా జరిగాయి.

## కాకినాడ విద్యార్థి వైజ్ఞానిక సభ (కల్చరల్ కాన్ఫరెన్స్)

కాకినాడ 16వ రాష్ట్ర విద్యార్థి మహాసభ అనంతరం జరిగిన జిల్లా విద్యార్థి మహాసభలన్నీ వైజ్ఞానిక మహాసభలు కూడా జరుపనారంభించాయి. (కల్చరల్ కాన్ఫరెన్స్‌లను వైజ్ఞానిక సభలు అని ఆనాడు పిలిచేవారు. సాంస్కృతిక సభలు అనే పదం ఆనాటికి వాడుకలోకి రాలేదు.)

కాకినాడ పట్టణ విద్యార్థి సంఘాధ్వర్యాన 1940 జనవరిలో విద్యార్థి వైజ్ఞానిక మహాసభ జరిగింది. సుప్రసిద్ధ అభ్యుదయ కవి, స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ హరీంద్రనాథ్ చటోపాధ్యాయ మహాసభ ప్రారంభోత్సవం చేశారు. విద్యార్థులు దేశ స్వాతంత్ర్య సమరంలో పాల్గొనడమే కాక ప్రగతిశీల సాహిత్యం, కళల ద్వారా విద్యార్థి లోకాన్ని, ప్రజానీకాన్ని ఉత్తేజపరచాలని శ్రీ హరీంద్ర ఉద్బోధించారు. తాను రచించిన "కర్డ్ సెల్లర్" (గొల్లవాడు) ఏకపాత్రాభినయం ద్వారాను, ఇతర జాతీయ గీతాలను పాడి విద్యార్థులను ఉత్తేజపరిచారు. సాయంత్రం విద్యార్థులు ఏకాంక నాటికలు, ఇతర కళాప్రదర్శనలు యిచ్చారు. వింజమూరి సోదరీమణులు సీత, అనసూయలు వచ్చి విద్యార్థి గేయం యువ పతాక, ఇతర జాతీయ గీతాలు పాడారు. సభకు అనేకమంది విద్యార్థులు, లెక్చరర్లు కూడా హాజరయ్యారు. సభా నిర్వాహకుడు, పట్టణ విద్యార్థి సంఘ కార్యదర్శి అయిన పరకాల

పట్టాభి రామారావు కళా ప్రదర్శనల గురించి మాట్లాడుతుండగా స్టేజీమీదకు వచ్చి పోలీసులు అరెస్టు చేసి తీసుకుపోయారు. ఆ తరువాత కొంతసేపటికిగాని అదొక విచిత్రవేషమని తెలియక సభ అంతా ఒక్కసారి అల్లకల్లోలమైంది. ఈ వైజ్ఞానిక సభలు, ప్రదర్శనలు రాజకీయ చైతన్యంలేని విద్యార్థులను కూడా ఆకర్షించి, వారిని విద్యార్థి ఉద్యమంలోనికి తీసుకురావడానికి తోడ్పడ్డాయి.

## ఆంధ్ర అభ్యుదయ ఉత్సవాలు

కాకినాడ పి.ఆర్. కళాశాలలో 1940 జనవరి 29 నుండి మూడు రోజులు ఆంధ్రాభ్యు దయోత్సవాలు జరిగాయి. విద్యార్థి సంఘ నాయకులు శ్రీ పి.ఎస్. శర్మ, పరకాల పట్టాభి రామారావు మొదలైనవారు ఈ ఉత్సవాలను జయప్రదం చేయడానికి విద్యార్థులు విరివిగా పాల్గొనడానికి కృషి చేశారు. శ్రీ ఎం.ఎన్. మూర్తిగారు వ్రాసిన "జండా మా జాతికి జీవన మోయి, జననీ జన్మభూమికే వందనమోయి" అను గేయాన్ని పట్టాభి రామారావు పాడారు. ఇతర దేశభక్తి గేయాలను వింజమూరి సీత, అనసూయలు పాడారు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఉదయం సభలోనూ, దంటు సుబ్బావధానిగారు, కోదాడ రామకృష్ణయ్యగారు సాయంత్రం సభలలోనూ, ఆంధ్ర సాహిత్యం గురించి, ప్రత్యేకాంధ్ర రాష్ట్రం గురించి మాట్లాడారు. దంటు సుబ్బావధానిగారు పండితరాయలు గురించి ప్రత్యేకోపన్యాసం యిచ్చారు. మరుసటి రోజు సభలో బుర్రా శేషగిరిరావుగారు, మామిడిపూడి వెంకటరంగయ్యగారు, భావరాజు కృష్ణారావుగారు మాట్లాడారు.

మూడవరోజు సభలో చాలామంది ప్రముఖులు పాల్గొన్నారు. అందులో మల్లంపల్లి సోమశేఖర శర్మ, కొడాలి చంద్రమౌళీశ్వరరావు, అడవి బాపిరాజు, కోలవెన్ను రామకోటేశ్వరరావు మొదలైన వారున్నారు. వీరు ఆంధ్రుల చరిత్ర, సాహిత్యం, కళల గురించి మాట్లాడారు. అడవి బాపిరాజుగారు చిత్రకళా ప్రదర్శనానికి ప్రారంభోత్సవం జరిపారు. హఠయోగ ప్రదర్శనలు మున్నగునవి కూడా జరిగాయి. మొత్తం మీద ఆంధ్రాభ్యుదయోత్సవాలు, ఆ రోజుల్లో విద్యార్థులలో ఆంధ్రాభిమానాన్ని కల్గించడానికి ఆంధ్రుల ఉజ్వల చరిత్రను, సాహిత్యం, కళలను తెలుసుకోవడానికి, వారిలో దేశభక్తిని, జాతీయ చైతన్యాన్ని కల్గించడానికి తోడ్పడ్డాయని చెప్పవచ్చు. ప్రతీ సంవత్సరం జరిగే ఈ ఆంధ్రాభ్యుదయోత్సవాలలో విద్యార్థి సంఘ కార్యకర్తలు పాల్గొంటూ ఉండేవారు.

## హరీన్ చటోపాధ్యాయ ఏంకాక నాటిక "విగ్రహం" అనువాదం

దేశభక్తియుత గేయాలు, నాటికలు ఆ రోజుల్లో విద్యార్థుల్లో యువ రచయితలలో కల్గించిన ఉత్సాహానికి, ఉత్తేజానికి నిదర్శనం. హరీంద్రనాథ చటోపాధ్యాయ రచించిన "విగ్రహం" అనే గేయ నాటికకు ఆనాటి పి.ఆర్. కాలేజీ విద్యార్థి, యువ రచయిత అయిన శ్రీ ముప్పన చిన అంకయ్య సరళ వ్యవహారిక భాషలో చేసిన చక్కని తెలుగు అనువాదం నిదర్శనంగా చెప్పవచ్చు. దేవుని పేరుతో స్వార్థపర వర్గాలు, పూజారులు సామాన్య ప్రజలను ఎలా అజ్ఞానాంధకారంలో వుంచి, వారి శ్రమను దోచుకొంటున్నారో తెలిపే ఈ గేయ నాటిక ఇలా ప్రారంభమవుతుంది. ఈ నాటికను నాటి పార్టీ పత్రిక నవశక్తి 18-1-39వ తేదీ సంచికలో ప్రముఖంగా ప్రకటించింది.

ఏంకాక నాటిక - విగ్రహం - శ్రీ హరీంద్రనాథ చటోపాధ్యాయ అనువాదం శ్రీ ముప్పన చిన అంకయ్య, నవశక్తి 18-1-1939.

"దూపధూమములు
దీపజ్యోతులు
రాతి బొమ్మలకు
రంజన మిడునా
మాయలమారుల
మాగధ గీతులు
స్తోత్రపాఠకులు
శుష్కప్రియములు
శిలావిగ్రహము
చెవుల సోకునా?
దేవుని పేరను
జరిగే మోసము
దేవునికోసం
జరిగే నాశము
దేవుడే నిజముగ
తెలిసికొన్నచో
సిగ్గు చెందడా
చింతనొందడా?
అన్నెము పున్నెము
అసలే ఎరుగని
పేదల నెత్తురు
పీల్చి, క్రౌర్యమున
మతము పిచ్చితో
మటు మాయలతో
కపట నటనలతో
కలుష తాండవం
సలిసే లోకము
విశ్వనాథునకు
వేడుక యగునా?"

★ ★ ★

ఒక ముసలిది, యువతి, యువకుడు, గృహస్తు, గృహిణి, మిల్లుకూలి, ప్రజలు, పూజారి, కవి మొదలైన పాత్రల ద్వారా హరీన్ చట్టో, సమాజంలోని ఆర్థిక అసమానతలు, ప్రజల దారిద్ర్యం గురించి దేవునికి సూటి ప్రశ్నలు వేయిస్తాడు.

"ప్రభుడవంట, కృపారాశివంట
మాబోటు లాకటి మాడుచుండ
మచ్చరాడే, నీదు మహిమకు దేవ?
అయ్యయ్యో! ఇది ఏమి అన్యాయమయ్యా
కరువులేకాదు, రోగములేకాదు
కూడు గుడ్డకు నోచుకోనట్టి మమ్మే
తొలి ముద్దజేసి, యాకలి నోర్చుకొనుము
ఎండగాసినా, వానలెత్తి వచ్చినను
వరద వచ్చినను, సాగరమ్ము పొంగినను
ముందు మా గుడిసెలే మునుగును దేవ!
పేదలైనను నీకు బిడ్డలు కారే
ఏల దీనుల మొరలాలింపవు స్వామి?"

చివరకు ప్రజలు ఆ విగ్రహాన్ని కదిలించి, పెకలించి చూస్తే దానిక్రింద బంగారు నాణెములు కనబడతాయి. పేదలు, ఆ నాణెములను స్వాధీనపరచుకుంటారు. (తెర వాలుతుంది)

ప్రజా విప్లవానికి సూచనప్రాయంగా హరీంద్రనాథ చటోపాధ్యాయ 1939 ఆ ప్రాంతాలలో వ్రాసిన ఈ ఏకాంక నాటికను చాలా హృద్యంగా (ఆనాటికింకా అభ్యుదయ రచయితల ఉద్యమం ప్రారంభం కాలేదు.) శ్రీ ముప్పన చిన అంకయ్య (ఇంటర్ సీనియర్ విద్యార్థి - పెద్దాపురం) అనువదించిన తీరు విద్యార్థులలో, యువ రచయితలలో ఉద్భవించుతున్న అభ్యుదయ భావాలకు అద్దం పట్టిందని చెప్పవచ్చు. ఆనాటి నవశక్తి పత్రికను విద్యార్థులు విరివిగా చదువుతూండేవారు. నేషనల్ ఫ్రంట్, నవశక్తి స్టూడెంట్సు కాల్ పత్రికలలో వచ్చే రాజకీయ, ఆర్థిక, సాహిత్య వ్యాసాలు విద్యార్థులను ఉత్తేజపరిచేవి. అందులోని రచనలను అనువదించి కాలేజీ మాగజైన్‌లకు వ్యాసాలు వ్రాయడం జరిగేది. ఆనాటి విద్యార్థి పత్రిక "స్టూడెంట్స్ కాల్"లో జమీందారు దురాగతాలకు గురియైన పేద రైతు గాథ "అపరాధి" అను పేరుతో సేచ్ఛానువాదం చేసి పరకాల పట్టాభి రామారావు పి.ఆర్. కాలేజీ మాగజైన్‌లో ప్రచురించారు.

## జిల్లా మహాసభలలో

తూర్పు గోదావరి జిల్లా తృతీయ విద్యార్థి మహాసభ అమలాపురంలో 1941 ఫిబ్రవరి 7, 8, 9 తేదీలలో జరిగినప్పుడు జిల్లా విద్యార్థి వైజ్ఞానిక మహాసభ కూడా జరిగింది. శ్రీ అడవి బాపిరాజుగారు మహాసభను ప్రారంభించారు. ఆంధ్ర సాహిత్యం, కళలు గురించి మాట్లాడారు.

తూర్పు గోదావరి జిల్లా 4వ విద్యార్థి మహాసభ, దానితోబాటు విద్యార్థి వైజ్ఞానిక మహాసభ 1942 జనవరి 31, ఫిబ్రవరి 1 తేదీలలో రామచంద్రపురంలో జరిగింది. వైజ్ఞానిక మహాసభకు శ్రీ జటావల్లభుల పురుషోత్తం అధ్యక్షత వహించారు. ఆటలు, సాంస్కృతిక పోటీలు జరిగాయి.

అలాగే పలుచోట్ల విద్యార్థి సంఘాలు కడూఆ ఆటలు, పాటలు, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించ నారంభించాయి.

## వ్యవహారిక భాష - నవ్య సాహిత్య పరిషత్ సభలు

1936 డిసెంబరు, 1937 జనవరి ప్రాంతాలలో గుంటూరులో జరిగిన నవ్య సాహిత్య పరిషత్ సభలు - అందులో గిడుగు రామమూర్తిగారు వ్యవహారిక భాష గురించి చేసిన ఉపన్యాసాలు విద్యార్థులను ఎంతగానో ప్రభావితం చేశాయి. ఆనాడు ఎ.సి. కాలేజీలో తెలుగు అధ్యాపకులుగా ఉన్న తెలికిచర్ల వెంకటరత్నంగారు ఈ సాహిత్య సభల నిర్వాహకులు. శ్రీ వై.వి. కృష్ణారావు మొదలైన విద్యార్థి సంఘ ముఖ్యులు రెండు రోజులూ ఈ సభలకు హాజరయ్యారు.

వ్యవహారిక భాషకు - రాజకీయోద్యమాలకు గల సంబంధాన్ని గిడుగు రామమూర్తిగారు తమ మహోపన్యాసంలో తెలియజేశారు.

"పూర్వం మన దేశంలో ప్రజలను విజ్ఞానవంతులను చేయాలనే దృష్టిలేదు. ఆనాడు రాచరిక వ్యవస్థ వుండేది. విద్యాబోధన కొందరికే పరిమితం. ఆ పరిస్థితిలో గ్రాంథిక భాష వృద్ధి చెందింది.

మనమిపుడు ప్రజాస్వామ్య యుగంలో ప్రవేశిస్తున్నాము. ప్రతి పౌరుడు దేశ భవిష్యత్తు, తన భవిష్యత్తు ఆలోచించుకొని ఓటు చేయడం ఈ పద్ధతిలో మూలసూత్రం కనుక ప్రజాభాష ఉపన్యాస సంప్రదాయాలు అభివృద్ధి అవుతున్నాయి. కావాలి. ఇందుకు తగిన భాష వ్యవహారిక భాష. భవిష్యత్ ప్రజాస్వామ్య యుగానికి చెందినది నా వ్యవహారిక భాషా ఉద్యమం'' అని గిడుగు రామమూర్తిగారు చెప్పిన మాటలు, వారి చారిత్రక దృష్టి విద్యార్థులను ఎంతగానో ఆకర్షించాయి.

## యువజన మహాసభ సాంస్కృతిక వేదికపై బళ్ళారి రాఘవ

1943 నవంబరులో బాపట్లలో జరిగిన గుంటూరు జిల్లా యువజన వైజ్ఞానిక మహాసభను ప్రఖ్యాత నటులు శ్రీ బళ్ళారి రాఘవ ప్రారంభించారు. యువజన సంఘాలు వయోజన విద్యా ప్రచారం, మున్నగు కార్యక్రమాలనే కాక జానపద కళలను పునరుద్ధరించి నూతన ఇతివృత్తాలలో ప్రదర్శించుచున్నందుకు, సాంఘిక చైతన్యం పెంపొందించుచున్నందుకు యువజనోద్యమాన్ని శ్రీ రాఘవ ప్రశంసించారు. శ్రీ పులుపుల శివయ్య తదితరులు సభలో పాల్గొన్నారు. వేములపల్లి శ్రీకృష్ణ మహాసభను నిర్వహించారు.

## వయోజన విద్యా ప్రచారం - కల్చరల్ కార్యక్రమాలు

వయోజన విద్యా ప్రచార కార్యక్రమం చేపట్టవలసిన అవసరం ఏర్పడినప్పుడు సాంస్కృతిక కార్యక్రమాల ఆవశ్యకత విద్యార్థి సంఘాలకు మరింత ఏర్పడింది.

ప్రజల దైనందిన కష్టాలను ప్రతిబింబించే నాటకాలు, జాతీయ భావాన్ని పెంపొందించే హరికథలు మొదలైనవి ప్రదర్శించాలనీ, '10-12 మందితో ఏర్పడే దళంలో ఒక వైద్య విద్యార్థి, ఒక చిత్రకారుడు, ఒక పాటగాడు, ఒక ఫోటోగ్రాఫరు వుండాలని' 15-3-1939లో యర్రమిల్లి నరసింహారావు నవశక్తిలో ఆంధ్ర విద్యార్థుల వయోజన విద్యా ప్రచారం అన్న వ్యాసంలో తెలియజేశారు. ఆటలు, పాటలు ద్వారా గ్రామీణ ప్రజలను విద్యావంతులను, విజ్ఞానవంతులను చేయాలని తెలిపారు.

మద్రాసు విద్యార్థి సంఘం (ఎం.ఎస్.ఓ.) వయోజన విద్యా ప్రచార శిక్షణా శిబిరానికి ఒక సిలబస్‌ను 21-12-1938 నవశక్తిలో ప్రకటిస్తూ జాతీయ గీతాలు గ్రామీణ ఆటలు, ఏకాంక నాటకాల ప్రదర్శన మొదలైన కార్యక్రమాలను సూచించింది. మద్రాసులో వారం రోజులు శిక్షణ కూడా యిచ్చింది.

వయోజన విద్యా ప్రచారానికి ఆ రోజుల్లో అనేక గేయాలు కూడా రచించి ప్రచారంలోనికి తీసుకురావడం జరిగింది. చైనా విద్యార్థులు నడుపుతున్న వయోజన విద్యా ప్రచారం యొక్క విశిష్టతను కూడా ఈ గేయాలలో పేర్కొనబడింది. రాష్ట్ర విద్యార్థి సంఘ నాయకులలో ఒకరైన డాక్టర్ కె. సోమయ్య రచించిన పాట పేర్కొనదగినది.

"అన్నా! చదువుకొనగ రావన్నా!'' అన్న పల్లవితో ప్రారంభమయ్యే ఈ గేయం చాలా ఆకర్షణీయంగా ఉండేది. "గుడులే బడులు - గోడలే పలకలు, పాటలే పాఠాల్, మాటలే'', "చదువులు అన్న చదువుకొనగ రావన్నా'' అని రాత్రి బడులకు వయోజనులు రావాలని ఈ

పాట ఉద్బోధించేది.

ఈ పాటను ఢిల్లీలో 1942 మే 15న ఎ.ఐ.ఎస్.ఎఫ్. జరిపిన ఫాసిస్టు వ్యతిరేక సదస్సులో, పరకాల పట్టాభి రామారావు పాడటం, దానిని ఫిల్ము డివిజన్ వాళ్ళు ఇతర గేయాలతోపాటు చిత్రీకరించటం కూడ జరిగింది.

## కల్చరల్ క్లబ్‌ల నిర్మాణం

1939 రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం అయిన తరువాత విద్యార్థి ఉద్యమంపై ప్రభుత్వ తీవ్ర నిర్బంధ విధానం సాగినప్పుడు 1941 ఆ ప్రాంతాలలో పశ్చిమ గోదావరి జిల్లాలో విద్యార్థి సంఘాలను నిషేధించినప్పుడు విద్యార్థి కల్చరల్ క్లబ్‌లను బహిరంగ వేదికలుగా స్థాపించడం జరిగింది. ఈ కల్చరల్ క్లబ్‌ల ఆధ్వర్యాన వ్యాసరచన, ఉపన్యాసం పోటీలు, ఆటల పోటీలు, విచిత్ర వేషాలు, నాటకాల ప్రదర్శనలు మార్టేరు, తణుకు, భీమవరం, తదితరచోట్ల ఏర్పాటుచేసి, విద్యార్థులను విద్యార్థి సంఘాలలోకి సమీకరించడం జరిగింది.

మార్టేరులో 1941లో జరిగిన కల్చరల్ క్లబ్ కాన్ఫరెన్సుకు సుప్రసిద్ధ కవులు, రచయితలు అయిన కవికొండల వెంకటరావుగారిని ఆహ్వానించడం జరిగింది. విద్యార్థి ఉద్యమాన్ని కల్చరల్ క్లబ్ వైజ్ఞానిక కార్యక్రమాలను ఆయన ప్రశంసించుతూ మాట్లాడారు. డిటెన్షన్ విధానాన్ని విరశించుతూ జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరు పరకాల పట్టాభి రామారావు రచించిన "వడపోత" అనే నాటకాన్ని విద్యార్థులు ప్రదర్శించారు. డిటెన్షను పద్ధతిని అమలుచేసిన హెడ్మాష్టరును ఈ నాటిక ప్రదర్శనలో ఎత్తిపొడిచి అపహాస్యం చేయడం విద్యార్థులలో ఎంతో ఉత్సాహాన్ని రేకెత్తించింది. జిల్లాలో యితరచోట్ల కూడా "వడపోత" నాటకం ప్రదర్శనలు యిచ్చారు. ఇతర జిల్లాలకు కూడా ఈ నాటకం పంపబడింది.

# 17

# ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనం : గ్రంథ రచయిత స్వీయానుభవాలు

ఈ గ్రంథ రచయిత పరకాల పట్టాభి రామారావు అయిన నేను కమ్యూనిస్టు పార్టీ ఆంధ్రలో కొనసాగించిన జాతీయ పునరుజ్జీవనోద్యమంలో తనవంతు బాధ్యతను నిర్వహించి భాగస్వామ్యం వహించినందుకు ఎంతో గర్వపడుతున్నాను. నా జీవితంలో ఒక మహోత్కృష్టమైన కర్తవ్యాన్ని నెరవేర్చినట్లు భావిస్తున్నాను, సవినయంగా నా అనుభవాలను తెలియజేస్తున్నాను.

పశ్చిమ గోదావరి జిల్లా మార్టేరు హైస్కూలులో 5వ ఫారమ్ చదువుతూండగానే 1936లో విద్యార్థి ఉద్యమంలో చేరాను. 1937 డిసెంబరులో పాలకొల్లులో జరిగిన ఆంధ్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తృతీయ మహాసభ వలంటీరుగా పనిచేశాను. తర్వాత కాకినాడ పి.ఆర్. కాలేజీలో చదువుతూ పట్టణ విద్యార్థి సంఘ కార్యదర్శిగా, 16వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ కాకినాడలో (1939

సెప్టెంబరు 1, 2 తేదీలలో) జరిగినప్పుడు ఆహ్వాన సంఘ ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించాను. మహాసభను ప్రారంభించిన సుభాష్‌చంద్రబోస్‌గారి ప్రబోధంతో విద్యార్థులం యుద్ధ వ్యతిరేక సమ్మె నిర్వహించాము. (1939 సెప్టెంబరు 1వ తేదీన విద్యార్థి మహాసభ జరుగుతూండగానే రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది) యుద్ధ వ్యతిరేక ప్రచారంలో ముమ్మరంగా పాల్గొనడంతో బ్రిటిష్ ప్రభుత్వ నిర్బంధ విధానం ప్రారంభమై చదువుకు స్వస్తిచెప్పి అజ్ఞాతవాస జీవితంలో తూర్పు గోదావరి జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరుగా పనిచేశాను. 1939లో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా చేరాను. 1941 జూన్‌లో మా జిల్లా అయిన పశ్చిమ గోదావరి జిల్లాకు పార్టీ సభ్యత్వం మార్పించుకొని 1942 చివరి వరకు రహస్యంగా ఉంటూనే జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజరుగా బాధ్యతలు నిర్వహించాను. యుద్ధకాలంలో ప్రభుత్వం పశ్చిమ గోదావరి జిల్లా విద్యార్థి సంఘాన్ని నిషేధించింది. అందుచేత విద్యార్థి ఫెడరేషన్ పేరు బదులు బహిరంగ వేదికగా విద్యార్థి కల్చరల్ క్లబ్ పేరుతో జిల్లా విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించాను. పేరుకే కాక విద్యార్థి కల్చరల్ క్లబ్ ఆధ్వర్యాన, డిబేటింగ్ సొసైటీలు, వైజ్ఞానిక కార్యక్రమాలు, నాటికలు, నాటకాలు మొదలైన సాంస్కృతిక కార్యక్రమాలు విరివిగా నిర్వహించడం, తద్వారా అనేకమందిని విద్యార్థి కార్యకర్తలుగా తయారుచేయడం జరిగింది. ఈ సమయంలోనే విద్యార్థుల డిటెన్షన్ (పబ్లిక్ పరీక్షలకు పంపకుండా విద్యార్థులను డిటెయిన్ చేసేవారు) పద్ధతికి వ్యతిరేకంగా జరిపే ఆందోళనలో భాగంగా "వడపోత" అనే నాటికను రచించాను. ఈ నాటిక జిల్లాలోనేకాక యితర జిల్లాల్లో కూడా విద్యార్థులు అనేకచోట్ల ప్రదర్శించేవారు.

1943లో బహిరంగంగా వచ్చినప్పుడు అరెస్టయి విడుదలైన తరువాత జిల్లా యువజన సంఘ ఆర్గనైజరుగా 1946 వరకు పనిచేశాను. అనేక గ్రామాలలో యువజన సంఘాలను నిర్మించాము. యువజన సంఘం ప్రధానంగా ఆటలు, పాటలు, సాంస్కృతిక కార్యక్రమాలను ప్రధాన కార్యక్రమాలుగా నిర్వహించుతూ యువతలో దేశభక్తిని, జాతీయ భావాన్ని, సాంఘిక చైతన్యాన్ని కల్గించుతూ గ్రామీణ యువతలో బ్రహ్మాండమైన మార్పు తీసుకొనిరాగల్గింది. ఫ్యూడల్ ఆచార వ్యవహారాలకు, ఛాందసత్వానికి, బాల్య వివాహాలకు, నిర్బంధ వైధవ్యానికి, ముక్కుపచ్చలారని బాలికలను వృద్ధులకిచ్చి చేసే వివాహాలకు వ్యతిరేకంగా యువజన సంఘాలు పెద్ద యెత్తున ప్రచారం చేయడమేకాక, ఆచరణలో అటువంటి సాంఘిక దురాచారాలను, పురాతన కట్టుబాట్లను ఎదిరించి కార్యాచరణకు దిగేవారం. అంతకంటే ముఖ్యంగా యువకులలో త్రాగుడు, పేకాటలు, జూదం, కోడిపందాలు మున్నగు దురలవాట్లను మాన్పించి వారిని రాత్రిబడులు, ఆటలు, పాటల ద్వారా సన్మార్గంలోకి తెచ్చి ఆదర్శవంతులైన భావిపౌరులుగా చక్కదిద్దేవారం.

ఈ సందర్భంలోనే నేను "భావిపౌరుడు" అనే ఏకాంకికను రచించాను. ఒక యువజన సంఘ కార్యకర్త గ్రామంలో యువకులను సమీకరించి ఆదర్శపౌరులుగా తయారుచేయ బూనుకున్నప్పుడు ఎదుర్కొనే కుల హెచ్చుతగ్గులు, పెత్తందారీ వర్గాల కుల పెద్దల కట్టుబాట్లు

ప్రజలలో ఉన్న మూఢనమ్మకాలను ఎలా ఎదుర్కొని పోరాడాలో ఈ నాటిక ద్వారా తెలియజేశాను. నేటి ప్రఖ్యాత సినీనటుడు అల్లు రామలింగయ్య, సినీనటుడు చలం, ప్రముఖ నాటక రచయిత, తదుపరి సినీ రచయిత అయిన పినిశెట్టి శ్రీరామమూర్తి, పోకల నరసింహారావు, చేకూరి నారాయణరాజు వివిధ పాత్రలు ధరించారు. అప్పటికి వీరందరూ పాలకొల్లులో యువజన సంఘ కార్యకర్తలు. అల్లు రామలింగయ్య వేసిన మొదటి వేషం నేను వ్రాసిన భావిపౌరుడు నాటికలోనే. అలాగే సినీనటుడు చలం, నాటక రచయిత పినిశెట్టి శ్రీరామమూర్తి కూడా. "భావిపౌరుడు" నాటికను అనేకచోట్ల ప్రదర్శించాం.

నేను మా జిల్లా యువజన సంఘ కార్యదర్శిగా ఉండగానే నా శ్రీమతి పరకాల అహల్యాదేవి జిల్లా మహిళా సంఘ కార్యదర్శిగా పనిచేసేది. కమ్యూనిస్టు సభ్యులందరూ తమ యింట స్త్రీలను, భార్యలను, అక్కచెల్లెళ్ళను, తల్లులను మహిళా సంఘాలలో చేర్పించాలనీ, బహిరంగసభలకు విధిగా తీసుకురావాలని పార్టీ ఆదేశించింది. వీరేశలింగంగారు ఆ రోజులలో స్త్రీలను బహిరంగసభలకు తీసుకొనిరావడమే ఒక ఉద్యమంగా చేపట్టినట్లే కమ్యూనిస్టు పార్టీ కూడా స్త్రీలను ప్రజా జీవితంలోకి తీసుకొనిరావడం ఒక కార్యక్రమంగా తీసుకొంది. ఆ ఉత్తేజంతోనే నా శ్రీమతి పరకాల అహల్యాదేవిని, మా అక్కగారు గోపరాజు సీతాదేవిని, మా తమ్ముని భార్య సుశీలాదేవిని మహిళా సంఘ కార్యకర్తలుగా తీర్చిదిద్దడం జరిగింది.

1943-44 ఆ ప్రాంతాలలో కమ్యూనిస్టు పార్టీ నవయుగాంధ్ర నిర్మాతలు ప్రారంభించిన ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమాన్ని తన కర్తవ్యంగా తీసుకొంది. అందుకు నాందిగా కందుకూరి, గురజాడ, గిడుగు, కొమర్రాజు, కాశీనాధుని మున్నగు మహనీయుల వర్ధంతులను పెద్దయెత్తున జరుపబూనుకొంది.

1944 మే 27వ తేదీన యావదాంధ్రదేశంలోను వీరేశలింగం 25వ వర్ధంతిని జరపాలని ఒక సంయుక్త ప్రకటన జారీచేయడం జరిగింది. ఆ సంయుక్త విజ్ఞాపన, హితకారిణీ సమాజం, నవ్యసాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘంతోబాటు విద్యార్థి, యువజన, మహిళా సంఘాల తరపున కూడా జారీచేయబడింది. అప్పటి రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి శ్రీ తమ్మారెడ్డి సత్యనారాయణతోబాటు పశ్చిమ గోదావరి జిల్లా యువజన సంఘ కార్యదర్శిగా నేను, పశ్చిమ గోదావరి జిల్లా మహిళా సంఘ కార్యదర్శిగా నా శ్రీమతి పరకాల అహల్యాదేవి కూడా విజ్ఞాపన కర్తలుగా సంతకాలు చేసిన ఘనత, గౌరవం మాకు దక్కింది. ఆవిధంగా ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమాన్ని కమ్యూనిస్టు పార్టీ కొనసాగించిన మహోజ్వల కృషిలో మేము భాగస్థులవడం గర్వకారణంగా భావిస్తున్నాను (సంయుక్త విజ్ఞాపన వివరాలు యింతకు ముందు భాగాలలోనే ఉంది). వీరేశలింగం వర్ధంతి మా జిల్లాలో అనేకచోట్ల పెద్దయెత్తున జరిపాము. వీరేశలింగంగారి ప్రహసనాలను ప్రదర్శించాం. అలాగే గురజాడ, గిడుగు, కొమర్రాజు, కాశీనాధుని వర్ధంతులను మా జిల్లా యువజన సంఘం, మహిళా సంఘాల ఆధ్వర్యాన పెద్దయెత్తున జరిపి వారి సందేశాలను ప్రజల లోకి విరివిగా తీసుకువెళ్ళాం.

మా జిల్లాలో మహిళా సంఘాలను నిర్మించడానికి మా సోదరి గోపరాజు సీతాదేవి, శ్రీమతి అహల్యాదేవి వారాలతరబడి, నెలలతరబడి పర్యటించడం స్త్రీలలో ఎంతో చైతన్యం తీసుకురావడం, ముఖ్యంగా ఆ రోజులలో విపరీతంగా పాటించబడే ఘోషా పద్ధతి తొలగించి, స్త్రీలను సభలకు, సమావేశాలకు తీసుకురావడం పెద్దయెత్తున జరిగింది. ఈ కృషి ఫలితంగా జిల్లా మహిళా ఉద్యమంలో పరాకాష్ట అనదగిన విధంగా నవుడూరు ద్వితీయ మహిళా మహాసభ గొప్పగా జరిగింది.. వందలాది స్త్రీలు తొలిసారిగా ఘోషా వదలి (ముఖ్యంగా క్షత్రియ కుటుంబాల స్త్రీలు) ఈ సభకు వచ్చారు. (ఆనాటి చరిత్రాత్మకమైన వందమందిపైగా ఉన్న గ్రూపు ఫోటోను మా సోదరి శ్రీమతి గోపరాజు సీతాదేవి స్వీయచరిత్ర "జననీ జన్మభూమిశ్చ" నుండి ఇటీవల శ్రీమతి వోల్గా ప్రభృతులు తమ ప్రతిష్టాత్మకమైన ద్విభాషా సంచిక "మహిళావరణం"లో ప్రచురించారు.)

ఆ సభకు ప్రత్యేకంగా నేను "వెలుగులోకి" (Into the light) అనే నాటిక వ్రాశాను. ఈ నాటికను కావాలనే పౌరాణిక నేపథ్యంలో తయారుచేశాను. భూలోకంలో స్త్రీలు అవిద్య, అజ్ఞానం, బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం మున్నగు ఛాందస కట్టుబాట్లు, సాంఘిక దురాచారాల క్రింద మ్రగ్గిపోతున్నారని, సరస్వతి, పార్వతి, లక్ష్మీదేవి, సీత, సావిత్రి, దమయంతి మున్నగు దేవతాస్త్రీలు, పతివ్రతలు త్రిలోకసంచారి నారదుడు చెప్పగా వింటారు. ఇటువంటి సంఘ దురాచారాలు, కట్టుబాట్లు తమ కాలంలో లేవనీ, యుక్తవయస్సు వచ్చి సకల విద్యలు నేర్చిన తరువాత స్వయంవర పద్ధతి ద్వారా వివాహాలు చేసుకున్నామనీ, దమయంతి ద్వితీయ స్వయం వరం జరిపిన సంప్రదాయాన్నిబట్టి ఆ రోజుల్లో స్త్రీలకు పునర్వివాహ హక్కు కూడా ఉండేదని, అందుచేత భూలోకంలోకి వెళ్ళి అక్కడి స్త్రీలకు ఈ విషయాలన్నీ చెప్పవలసిందని నారదునికి వీరు చెబుతారు. ఈ నాటిక సభకు వచ్చిన సుమారు 3500 మంది స్త్రీ, పురుషులను ఎంతగానో ఆకర్షించింది. స్త్రీ దేవతలు, పతివ్రతల వేషాలు అహల్యాదేవి, భూపతిరాజు వెంకాయమ్మ, సంకు లక్ష్మీకాంతం, గోపరాజు సీతాదేవి, డేగల వెంకటరత్నమ్మ తదితర మహిళా సంఘ కార్యకర్తలు వేయగా, నారదుడు వేషం నేనే వేశాను. (నారదుడు వేషం ఇదివరలో 1939లో పి.ఆర్. కాలేజీ వార్షికోత్సవాలలో కూడా వేశాను.)

మా జిల్లాలో ప్రజానాట్యమండలి స్థాపించిన తరువాత అల్లు రామలింగయ్య, చలం, పినిశెట్టి - వీరికి నాయకుడుగా అప్పటి కమ్యూనిస్టు పార్టీ ఆర్గనైజరు శ్రీ పరకాల శేషావతారం కాశ్మీర్ విముక్తి పోరాటంపై నృత్యనాటిక వ్రాశాడు. పాలకొల్లు దేవునిహాలులో ఈ నృత్యనాటికను ప్రదర్శించాము. నేను నెహ్రూ వేషం వేశాను. మిగిలిన వేషాలు పైన తెల్పిన మిత్రులు వేశారు. శ్రీ శేషావతారం గరికిపాటి రాజారావుగారు చేసే సుత్తీ-కొడవలి నృత్యం చాలా బాగా చేశాడు. (శేషావతారం 1948-51 నిర్బంధకాలంలో పార్టీ విధానంతో విభేదించి వైదొలగి ఆ తరువాత కాంగ్రెస్‌లోకి వెళ్ళి, కాంగ్రెస్ శాసనసభ్యుడు, ఆ తరువాత పంచాయతీరాజ్ మంత్రి అయ్యాడు)

1942 క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో గాంధీజీ మొదలైన జాతీయ నాయకుల విడుదల, బెంగాల్ కరవు నివారణనిధి సమస్యలపై ప్రజలలో విరివిగా ప్రచారం చేయడానికి

జిల్లా విద్యార్థి సంఘ వైజ్ఞానిక దళం ఏర్పాటుచేశాము. పాటలు, నాటికలు, విచిత్రవేషాలు, ఉపన్యాసాల ద్వారా ఈ దళం భీమవరం తాలూకాలో ప్రచారం చేస్తూ ఎండగండి వెళ్ళింది. అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి శ్రీ చదలవాడ పిచ్చయ్య, బెంగాల్ కరువు సమస్యపై వ్రాసిన "ఆహుతి" అనే నాటిక, కోయవేషం, అల్లా కే నాం, గొల్లసుద్దులు మొదలైన విచిత్రవేషాలతో వీరు ప్రజలలో మంచి ప్రబోధం కల్గించేవారు. వీరిని కాంగ్రెస్ ప్రచారం చేస్తున్నారనే సాకుతో 1942 మే నెలలో బ్రిటిష్ ప్రభుత్వం దేశరక్షణ చట్టం కింద అరెస్టుచేసి స్పెషల్ మెజిస్ట్రేట్ కోర్టు భీమవరంలో ఆరు నెలలు విచారణచేసి ఆరు నెలలు కఠిన శిక్ష విధించి బళ్ళారి సెంట్రల్ జైలుకు పంపింది. ఆ విధంగా అరెస్టయిన విద్యార్థి కార్యకర్తలు 1. పరకాల రమణరావు 2. పరకాల శేషావతారం 3. వంక సత్యనారాయణ 4. భూపతిరాజు సుబ్బరాజు 5. నండూరి శ్రీరామారావు 6. పిట్టల సంజీవరావు 7. ఎండగండి పార్టీ సభ్యుడు పెనుమత్స సోమరాజుగార్లు. జైలునుండి వచ్చిన తరువాత వీరందరూ కమ్యూనిస్టు పార్టీ హోల్‌టైమర్సు అయ్యారు. ఆ విధంగా ప్రజానాట్యమండలి శాఖ ఏర్పడకపూర్వమే మా జిల్లాలో విద్యార్థి, యువజన, మహిళా సంఘాల ద్వారా కల్చరల్ కార్యక్రమాలు విరివిగా నిర్వహించాం.

ఆనాడు స్త్రీలలో విపరీతమైన మూఢనమ్మకాలు వ్యాపించి వుండేవి. ముఖ్యంగా ప్రసూతి - శిశుపోషణ విషయంలో చాలా మూఢనమ్మకాలు ఉండేవి. గ్రామాలలో శిక్షణ పొందిన మంత్రసానులు ఉండేవారు కాదు. ఎరుకలి మంత్రసానులు అనే నాటు మంత్రసానులు పురుళ్ళు పోసేవారు. తుప్పుపట్టిన చాకులతో పుట్టిన బిడ్డల బొడ్డు కోసేవారు. మూడో రోజుకు సెప్టిక్ అయి బిడ్డ చచ్చిపోతే "ఎన్నెమ్మ" అనే రాక్షసదేవత ఆహారంగా తినడానికి కొట్టుకొనిపోయిందనేవారు. అలాగే అపరిశుభ్ర మైన చేతులతో నాటుమంత్రసానులు యోనిలో చేతులుపెడితే మూడు నాల్గు రోజులకు ధనుర్వాతం (సూతికావాతం) క్రమ్మి బాలింతలు మరణించేవారు. ఈ విధంగా ఆ రోజుల్లో శిశు మరణాలు, బాలింత మరణాలు విపరీతంగా వుండేవి. అప్పటికి లేడీ డాక్టర్లు యించుమించు ఉండేవారు కాదు. మగ డాక్టర్లచే కాన్పు నిషిద్ధంగా ఉండేది. శిక్షణ పొందిన మంత్రసానులు చాలా అరుదుగా వుండేవారు. ఈ ఎన్నెమ్మ దేవత లోపలికి వస్తుందని పురిటిగదులలోకి శుభ్రమైన గాలి, వెలుతురు రాకుండా తలుపులు, కిటికీలు మూసి వుంచేవారు. బాలింతలకు వాతం కమ్ముతుందని పచ్చి మంచినీళ్ళు కూడా యిచ్చేవారు కాదు. అట్టి పరిస్థితులలో స్త్రీలలో ఈ మూఢనమ్మకాలను పోగొట్టడానికి, శాస్త్రీయ వైద్య పద్ధతులు తెలియజేయడానికి నేను "నాటుమంత్రసాని" అనే నాటికను వ్రాశాను. విజయవాడ వెళ్ళి డాక్టర్ అచ్చమాంబగారికి చదివి వినిపించాను. ఆవిడ "ప్రసూతి-శిశు పోషణ" అనే ప్రఖ్యాత గ్రంథం వ్రాశారు. అది ఆ రోజుల్లో లక్ష ప్రతులు అమ్ముడుపోయింది. నేను వ్రాసిన నాటికను డాక్టర్ అచ్చమాంబ, శ్రీ ముక్కామల నాగభూషణం, శ్రీ కొమర్రాజు వినాయక రావుగార్లు పరిష్కరించి ప్రదర్శనయోగ్యంగా చేశారు. అప్పుడు అభ్యుదయ రచయితల సంఘం వారు నడుపుతున్న

"తెలుగుతల్లి" మాసపత్రికలో (రాచమళ్ళ సత్యవతిదేవిగారు సంపాదకురాలుగా ఉంటూ అరసంవారికి యిచ్చారు) నా నాటిక ప్రచురించబడింది. నాటుమంత్రసాని నాటిక మా జిల్లాలోనే కాదు వివిధ జిల్లా మహిళా సంఘాలవారు కొన్ని వందలసార్లు ప్రదర్శించారు. ఎంతో ప్రజా ఆదరణ పొందింది. ఈ నాటికలో శ్రీమతి అహల్యాదేవి లేడీడాక్టర్ వేషం వేసేది. ఈ నాటికను ఎప్పుడో వీరేశలింగంగారు వ్రాశారని ఇటీవల సోదరి మోటూరు ఉదయం ఒక వ్యాసంలో వ్రాస్తే - అది వ్రాసింది నేనేనని ఆమెకు జ్ఞాపకం చేయవలసి వచ్చింది. ఆంధ్ర మహిళా ఉద్యమంలో ఈ నాటిక అంత ప్రఖ్యాతి పొందింది.

ఆరోజుల్లో పకీరు వేషం (అల్లా కే నాం), కోయ వేషం, పిట్టలదొర, అన్నాచెల్లెలు వేషం, గొల్లసుద్దులు సోదె మొ॥ విచిత్ర వేషాలు, నమూనా కోర్టు విచారణలు (దురభ్యాసాలపై, వృద్ధుల వివాహంపై) బ్లాక్‌మార్కెటీర్లపై యమధర్మరాజు కోర్టు విచారణలు మొ॥ అనేక రూపకాల ద్వారా సాంఘిక, రాజకీయ సమస్యలపై విస్తృత ప్రచారాన్ని విద్యార్థి, యువజన, మహిళా వేదికలద్వారా కొనసాగించాము. అన్నాచెల్లెలు వేషం నేనూ, నా శ్రీమతి అహల్యాదేవి వేసేవాళ్ళం. (బ్రహ్మపట్నం పోదమంటే చీకటేమిర అన్నయా - వేములపల్లి శ్రీకృష్ణ పాట). ఒకసారి మా జిల్లా వెలివెన్నులో బహిరంగసభ జరిగింది. జిల్లా మహిళా సంఘ కార్యదర్శిగా నా శ్రీమతి అహల్యాదేవి మహిళలకు ఉపన్యసించడానికి వెళ్ళింది. సాంస్కృతిక ప్రదర్శనలు యివ్వాలి. విచిత్రవేషాలు వేసేవారు రాలేదు. రాష్ట్ర కమ్యూనిస్టు నాయకులు కామ్రేడ్ పులుపుల శివయ్యగారు కొన్నాళ్ళు మా జిల్లాలో ఆర్గనైజరుగా పనిచేయడానికి వచ్చి వెలివెన్ను సభకు ప్రధాన ఉపన్యాసకులుగా వచ్చారు. అప్పటికప్పుడు అనుకొని అన్నాచెల్లెలు వేషాలు శివయ్యగారు, అహల్యాదేవి వేశారు. ఇలా యువజన మహిళా సంఘాల కార్యకర్తలు, కమ్యూనిస్టు నాయకులు సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొనేవారు.

## ఢిల్లీ అరసం కౌన్సిల్ సమావేశం

1942 మే 15వ తేదీన ఢిల్లీలో అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ జాతీయ రక్షన కన్వెన్షన్ జరిగింది. విద్యార్థి ఫెడరేషన్ వేదికమీద నుండి ప్రజాయుద్ధ నినాదాన్ని ప్రవేశపెట్టి ఆమోదింపజేయడానికి జరిగిన ఈ సదస్సుకు రాష్ట్ర విద్యార్థి ఫ్రాక్షన్ కన్వీనర్ కామ్రేడ్ ఎస్.వి.కె. ప్రసాద్ నాయకత్వాన నేను మరి ముగ్గురు కామ్రేడ్స్ ప్రతినిధులుగా వెళ్ళాం. సభలో జరిగిన వైజ్ఞానిక ప్రదర్శనలలో సమిష్టిగానం మున్నగు కార్యక్రమాల్లో పాల్గొన్నాము. యుద్ధ వ్యతిరేక విధానం నుండి యుద్ధ అనుకూలమైన వైఖరిని విద్యార్థి ఫెడరేషన్ తీసుకోవడంతో ప్రభుత్వ సమాచారశాఖవారు సుప్రసిద్ధ సినీ దర్శకుడు శాంతారామ్ ఆధ్వర్యాన న్యూస్ రీల్‌గా తీసి విడుదల చేశారు. డాక్టర్ సోమయ్య వ్రాసిన "అన్నా చదువుకొనగ రావన్నా గుడులే బడులు, గోడలె పలకలు" మున్నగు గేయాలు, ఫాసిస్టు వ్యతిరేక గేయాలు నేను పాడాను. అదే సమయంలో ఢిల్లీలో అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘ కౌన్సిల్ సమావేశం జరిగింది. ఆ సమావేశంలో నేను పాల్గొన్నాను. సమావేశ నిర్వాహకులు డాక్టర్ అబ్దుల్ అలీమ్ (లేదా డాక్టర్ అష్రాఫ్)

అనుకుంటాను. నేను ఆంధ్రలో జానపద కళలను నూతన యితివృత్తాలతో ఎలా పునరుద్ధరించుతున్నదీ వివరించి పాడి చూపాను. "మీ రాష్ట్ర అభ్యుదయ రచయిత శ్రీశ్రీని ఎరుగుదురా? అని డాక్టర్ అలీమ్ అడిగారు. పేరు బాగా తెలుసు. ఆయనను చూడలేదు అన్నాను. అడుగో ఆయనే శ్రీశ్రీ అని చూపారు. శ్రీశ్రీతో నా తొలి పరిచయం అలా జరిగింది. తరువాత ఆకాశవాణి ఢిల్లీ కేంద్రంలో తెలుగువారు శ్రీ కపిల కాశీపతిగారి ఆధ్వర్యాన కవితా గోష్ఠి జరిపించారు. శ్రీశ్రీ తన గేయాలు పాడి వినిపించారు. దేశచరిత్రలు తదితర గేయాలు నేను పాడి వినిపించాను.

## "తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవరు?"
## తాజ్‌మహల్ మీనార్‌పై నేను, శ్రీశ్రీ . . .

తిరుగు ప్రయాణం నేను శ్రీశ్రీ కలిసి చేశాం. అదే రోజు న్యూఢిల్లీ రైల్వేస్టేషన్‌లో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు ప్రయాణిస్తున్నారు, ఆయన వార్ధా వెడుతున్నారు. రాత్రికి మేము ఆగ్రాలో దిగాము తాజ్‌మహల్ చూడటానికి. ఒక విద్యార్థి మిత్రుని ఇంటిలో బసచేసి మరుసటి రోజు షాజహాన్ కోటను, తాజ్‌మహల్‌ను శ్రీశ్రీ, నేను సందర్శించాము. అప్పుడు, నాల్గువైపులా ఉన్న మినార్‌లు ఎక్కనిస్తున్నారు. ఎక్కిన తరువాత "తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?" అని పాడాను. నాతో ఆయన వంతపాడి ఎంతో ఆనందించారు. మినార్ ఎక్కినవాళ్ళు పెన్సిల్‌తోనో పెన్నుతోనో ఆ మినార్‌మీద పేర్లు వ్రాసే ప్రలోభంలో పడతారు. మేమిద్దరమూ ఆ ప్రలోభానికి లోనయ్యాము. ఆయన ఇటార్సీ, రాయపూర్‌ల మీదుగా విజయనగరం వెళ్ళిపోయారు. వెళ్ళిపోతూ ఢిల్లీలోనే వ్రాసిన "లేలే! రష్యా, రారా రష్యా, గర్జించు రష్యా, గాండ్రించు రష్యా'' అన్న గేయం నాకు యిచ్చి తుమ్మల వెంకట్రామయ్యగారికి అందజేయమన్నారు. నేను బెజవాడలో దిగి తుమ్మలగారికి అందజేశాను. అది అప్పటికే ప్రారంభమైన ప్రజాశక్తి వారపత్రికలో ప్రచురించారు. (4-11-1942 సంచికలో) శ్రీశ్రీతో కలిసి తాజ్‌మహల్ సందర్శించడం లేలే రష్యా ప్రఖ్యాత గేయం నాచేతిమీదుగా ప్రచురణకు యివ్వడం నాకు ఉజ్వల అనుభూతులుగా మిగిలిపోయాయి.

వేములపల్లి శ్రీకృష్ణ, శివయ్య ప్రభృతులు స్వతస్సిద్ధంగా కవులు కారు. కాని ఆనాటి ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమ స్ఫూర్తి వారికి యిచ్చిన ప్రేరణతో, ఉత్తేజంతో వారు అజరామరమైన రెండు గేయాలు "తెలుగోడా!, పలనాట వెలలేని మాగాణిరా!'' వ్రాశారు. అలాగే ఎందరో విద్యార్థి, యువజన నాయకులు స్వతస్సిద్ధంగా కవులు, కళాకారులు కారు. రాజకీయ నాయకులు కాని కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన జాతీయ పునరుజ్జీవన కృషితో, ప్రేరణతో ఆ తరువాత వారు కవులయ్యారు. అలాగే అనేకమంది విద్యార్థి, యువజన నాయకులు కవులు, కళాకారులు, సినీ దర్శకులు అయ్యారు. అసంఖ్యాకంగా కమ్యూనిస్టు కార్యకర్తలు జానపద కళాకారులయ్యారు. ఇది ఆనాడు కమ్యూనిస్టు పార్టీ సాధించిన గొప్ప విజయం.

## బాల సంఘాలు ఆనాడు యిచ్చిన స్ఫూర్తి

ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనలో ఆనాడు విద్యార్థి, యువజన మహిళా సంఘాల ద్వారానే కాక బాల సంఘాల ద్వారా కూడా కమ్యూనిస్టు పార్టీ ఎంతో కృషి చేసింది. ప్రజాశక్తి వారపత్రికలో "దొడ్డమ్మ" పేరుతో ఈ బాల సంఘాల కార్యక్రమాన్ని బహుశా చంద్రంగారు అనుకుంటాను తీర్చిదిద్దుతూండేవారు.

రాష్ట్రంలోనేకాక రాష్ట్రేతర ప్రాంతాలలో కూడా ప్రఖ్యాతివహించిన ఎండగండి బాలికల బుర్రకథ దళంలో కథకురాలు శ్రీమతి భూపతిరాజు సూర్యకాంతం చెప్పిన స్వీయానుభవాలు ఆసక్తిదాయకమైనవి.

ఆ రోజుల్లో మహిళా సంఘాలు, యువజన సంఘాలు స్త్రీలలో ఎంత చైతన్యం కల్గించాయంటే, ఘోషాలో వున్న స్త్రీలను బైటకి సభలు, సమావేశాలకు తీసుకురావడమేగాక, బాల సంఘాల ద్వారా గ్రామీణ బాలబాలికలలో దేశభక్తిని, జాతీయ భావాన్ని, సేవాభావాన్ని, క్రమ శిక్షణను నేర్పాయి. అంతేకాదు వారిలో ఉండే కళాభిజ్ఞత పెంపొందించి, అనేక జిల్లాల్లో పెద్దల బుర్రకథ దళాలేకాక బాలబాలికల బుర్రకథా దళాల్ని కూడా నిర్మించి వారిచే ఎంతో ప్రజారంజకమైన బుర్రకథలను చెప్పించేవారం. విచిత్రవేషాలను ధరింపజేసేవారం. నాటకాలను వేయించేవారం. అటువంటి బాలబాలికల బుర్రకథ దళాల్లో ఆనాడు ప్రఖ్యాతి చెందిన ఎండగండి (ప.గో. జిల్లా) బాలికల బుర్రకథ దళం ఒకటి. ఆనాటి బుర్రకథా దళంలో కథకురాలుగా ఉండి, వందలసార్లు బుర్రకథ చెప్పిన శ్రీమతి భూపతిరాజు సూర్యకాంతానికి ఆనాటి విశేషాలు వ్రాయవలసిందని కోరితే ఎంతో ఆసక్తికరమైన ఉత్తరం వ్రాసింది. ఆమె మాటల్లోనే ఆనాటి ఎండగండి బాలికల బుర్రకథ దళం చరిత్ర వినండి. శ్రీమతి సూర్యకాంతం యిలా వ్రాసింది :

"అది 1945వ సంవత్సరం. అప్పుడు జిల్లా యువజన సంఘ కార్యదర్శిగా ఉన్న పరకాల పట్టాభిగారు మా గ్రామం ఎండగండి వచ్చి యువజన సంఘం పెట్టడంతోపాటు మా పిల్లలందరినీ చేరదీసి బాల సంఘం పెట్టారు. "బాల సంఘ సభ్యులం, భరతమాత పుత్రులం" మొదలైన పాటలు నేర్పారు. మా గ్రామ బాలసంఘంలోని ముగ్గురు బాలికలకు నాకు, రమణ, సీతలకు బుర్రకథ నేర్పించారు. జిల్లా కమ్యూనిస్టు పార్టీవారు ఏర్పరచిన తాతయ్య బుర్రకథ దళంవారు మాకు కష్టజీవి, వీరేశలింగం, టాన్యా అనే కథలు నేర్పారు. మేమందరం క్షత్రియ కుటుంబాలకు చెందిన బాలికలం. ఘోషా విపరీతం. అటువంటి పరిస్థితుల్లో మహిళా సంఘ నాయకురాండ్రు భూపతిరాజు వెంకాయమ్మ, గోపరాజు సీతాదేవి, పరకాల అహల్యాదేవి, గోకరాజు వెంకాయమ్మ, సంకు లక్ష్మీకాంతం మున్నగువారు గ్రామగ్రామాన మహిళా సంఘాలు పెట్టి మహిళల్లో చైతన్యం కల్గించారు. ఘోషా మొ॥ సంఘ దురాచారాలను మాన్పించారు. ఈ మహిళా ప్రచారదళంలో ఒక బ్రాహ్మణ వితంతువు ధర్భా చెల్లమ్మగారు (గుండు చేయించుకున్న బోడెమ్మ) ఉండేది. నెత్తిమీద తెల్లటి సైనుపంచ ముసుగుతో ఆవిడ మహిళా సంఘ ప్రచారంలో పాల్గొనడం మాకు ఎంతో ఆశ్చర్యంగా, వింతగా ఉండేది. మహిళా సంఘంవారు ఏ గ్రామంలో సభ జరిపితే అక్కడకు వెళ్ళి మేము బుర్రకథ చెప్పేవారం. మా కథలో ఆనాడు స్త్రీలలో ఉన్న మూఢనమ్మకాలకు,

మూఢ ఆచారాలకు వ్యతిరేకంగా ప్రచారం చేసేవారం. "ప్రాణాచారం పడితే పిల్లలుడతారా? భుక్తశేషం తింటే ముక్తి వస్తుందా?" (ముక్కామల నాగభూషణంగారి పాట) మొదలైన పాటలు పాడేవాళ్ళం.

ఇలా మేము బుర్రకథలు చెబుతూంటే ఒక సమస్య వచ్చింది. మాలో సీత, వెంకటరమణలకు బాల్యంలోనే పెళ్ళిళ్ళు అయిపోయాయి. మేము మా బుర్రకథల్లో బాల్య వివాహాలను నిరసించుతూ వీరేశలింగంగారు చేసిన స్త్రీ పునర్వివాహాలు గురించి చెప్పేవాళ్ళం. వెంకటరమణ, సీతల "మెడలలో మంగళసూత్రాలు వేసుకొని" బాల్యవివాహాలు చేయకూడదని చెబుతుంటే నలుగురూ నవ్వేవారు. హేళన చేసేవారు. దీనితో ఆ ఇద్దరిచే మంగళసూత్రాలు తీయించి యింటిదగ్గరే పెట్టి, వేదిక ఎక్కి కథచెప్పేవాళ్ళం. ఈ విషయం వెంకటరమణ, సీత వాళ్ళ అత్తవారికి తెలిసింది. అసలే క్షత్రియ కుటుంబాలు. పెళ్ళయిన తరువాత మెడలోంచి మంగళసూత్రాలు తీసివేయడం అంటే వారి దృష్టిలో ఎంత అపరాధం, అమంగళం, అఘాయిత్యమో వేరే చెప్పనక్కరలేదు. పెద్ద గొడవ అయింది. దళంలోంచి ఈ యిద్దరిని మాన్పించడమా, ఏం చేయాలని? చివరకు ఏమైనా సరే ఈ ఆక్షేపణను త్రోసిపుచ్చి దళంలోనే ఈ యిద్దరిని ఉంచాలని ఆనాడు యువజన సంఘం, కమ్యూనిస్టు పార్టీ నిర్ణయించాయి. "మీ ఇంటికి (అత్తవారింటికి) వచ్చిన తరువాత మీ ఇష్టం. మా ఇంటివద్ద (పుట్టింట) ఉండగా మా ఇష్టం" అని చెప్పి ఆ అత్తవారిని సమాధానపరచడం జరిగింది.

ఆ తరువాత నేను ప్రజానాట్యమండలి రాష్ట్ర దళంలో చేరి గరికిపాటి రాజారావుగారి డైరెక్షన్‌లో "మాభూమి" నాటకంలో కమల పాత్ర వేసేదాన్ని. రాష్ట్రమంతటా మాభూమి ప్రదర్శనలు జరిగాయి. అహమ్మదాబాద్‌లో జరిగిన అఖిల భారత ప్రజానాట్యమండలి మహాసభలో పాల్గొనడానికి వెడుతూ షోలాపూర్, పూనా, బొంబాయి మొదలైన పట్టణాలలో "మాభూమి" ప్రదర్శనలు యిచ్చుకుంటూ వెళ్ళాం. అహ్మదాబాద్ సభకు బలరాజ్ సహానీ, కె.ఎ. అబ్బాస్ మొదలైన ప్రముఖులు వచ్చారు. మేము ఆంధ్రకు తిరిగి వచ్చేసరికి ప్రభుత్వం "మాభూమి" నాటకాన్ని నిషేధించింది.

ఆ విధంగా ఎండగండి బాలికల బుర్రకథ దళం చరిత్ర ప్రసిద్ధికెక్కింది. నేను ఇప్పుడు మనుమలను ఎత్తాను. కానీ ఈనాటికీ మా ఎండగండి బాలికల బుర్రకథ దళం చరిత్ర, ప్రజానాట్య మండలిలో కళాకారిణిగా నేను నిర్వహించిన పాత్ర నాకు గర్వకారణంగా వుంటాయి. ఇదంతా ఆనాడు మహిళా ఉద్యమం, కమ్యూనిస్టు ఉద్యమం ఇచ్చిన స్ఫూర్తి ఫలితం. ఇప్పటికీ నేను జాతీయ మహిళా వేదికద్వారా మహిళలకు చేయగల్గిన సేవ చేస్తూనే వున్నాను."

**- జననీ జన్మభూమిశ్చ ... శ్రీమతి గోపరాజు సీతాదేవి స్వీయచరిత్ర నుండి**

ఇలా అన్ని జిల్లాల్లోను బాలబాలికల బుర్రకథ దళాలు ఎన్నో ఆ రోజుల్లో గొప్ప సేవ చేశాయి. సాంఘిక దురాచారాలకు, ఛాందస కట్టుబాట్లకు వ్యతిరేకంగా గొప్ప ప్రచారం చేశాయి.

## విద్యార్థి గేయాలు

కాకినాడలో ప్రసిద్ధ నాటక రచయిత, కవి శ్రీ ఎం.ఎస్. మూర్తి వ్రాసిన "జెండా మా జాతికి జీవనమోయి" అన్న జండా పాట, పశ్చిమ గోదావరి జిల్లాలో స్వాతంత్ర్య సమరయోధుడు, సోషలిస్టు పార్టీ నాయకుడు అయిన శ్రీ ఇవటూరి శరభరాజు రచించిన మరొక విప్లవ గేయం "మ్రోగినదోయీ" ఆ రోజుల్లో విద్యార్థి సభలలో, సమావేశాలలో ఎంతో ప్రసిద్ధిపొందిన గేయాలుగా ప్రచారంలోకి వచ్చాయి.

అలాగే జాతీయ విప్లవకారుల గేయం "భయపడి చావుకు పారిపోకురా! చావు తప్పదిత సత్యమురా! ఆనందముతో మృత్యువు నెవ్వడు ఆహ్వానించునో వాడే వీరుడు!" అన్న గేయమూ, "సుమవాంఛ" అనే డాక్టరు కె. సోమయ్య హిందీ నుండి అనువదించిన గేయము, "అన్నమే పరబ్రహ్మంబని తెలియుడు, అన్నమే పరబ్రహ్మం" (ఇది హరీంద్రనాథ చటోపాధ్యాయ గేయానికి డా॥ సోమయ్య అనువాదం) అన్న గేయం కూడా ఆనాడు విద్యార్థులలో బహుళ ప్రచారంలోకి వచ్చాయి. ఈ పాటలను నేను గొంతెత్తి ఉత్తేజకరంగా పాడేవాణ్ణి. కొన్నింటికి స్వరాలు నేనే కట్టాను.

ఆ గేయాలలో ఈ రచయితకు జ్ఞాపకం ఉన్నంతవరకు క్రింద యివ్వబడినవి.

### మ్రోగినదోయీ!

(రచన : శ్రీ ఇవటూరి శరభరాజు)

మ్రోగినదోయీ!
మ్రోగినదోయీ! మ్రోగినదోయీ!
యువజన వీరకుమారా, వేగమే రావోయీ!
ఘణ ఘణ ఘణ ఘణ రణ ఘంటారావమీదే!
మ్రోగినదోయీ, మ్రోగినదోయీ!
గుండ్లు జొచ్చి మన గుండెల చిందే, రక్త ధారలన్
వ్రాయుదమోయీ, స్వతంత్ర్య భారత స్వచ్ఛ నామమును
పాడుదమోయీ! భావి భాగ్యమును ॥మ్రో॥
మనము చచ్చినా మన సమాధులే
పూలవనములై వెలయును ముందున
మన సమాధులే
మంగళకరమౌ భాగ్య భవనములు
భావి సంతతికి వేగమే రావోయీ! ॥మ్రో॥
(అసంపూర్తి)

## సుమవాంఛ

(అనువాదం : డాక్టర్ కె. సోమయ్య)

నే కోరలేదోయి
నీలవేణుల
నిండుకొప్పులో
దూరాలనీ
కులుకుచూ
మెప్పులు పొందాలనీ ॥నే కోరలేదోయీ॥
రారాజు శిరముపై
రాజిల్లగా కోరి
శంకరుని తలపైనను
నర్తించు సౌభాగ్యమే కోరనూ ॥నే కోరలేదోయీ॥
పూమాలలో చేరి
పూబోండ్ల
బిగువైన
పాలిండ్ల నాడాలనీ
యువకుల భావాలు
రేపాలనీ ॥నే కోరలేదోయీ॥
స్వాతంత్ర్య సమరాన
తనువు లర్పించేటి
వీరులేగెడు
త్రోవనూ ఓ దేవ!
విసిరివేయుము చాలునూ
ఓ దేవ
విసిరివేయుము చాలునూ ॥నే కోరలేదోయీ॥

## ఆకలి (భూకా భూక్)

హరీంద్రనాథ చటోపాధ్యాయ

అనువాదం : డాక్టర్ సోమయ్య

అన్నమే పరబ్రహ్మంబని
తెలియుడు
అన్నమే పరబ్రహ్మం ॥అన్నమే॥
పాలని పిల్లలు
ఏడ్చుచుండగా

తిండిలేక
భార్య పస్తుండగా
ఎవరికొరకు
ఈ హరి భజన?
ఎవరికొరకు
ఈ హరి భజన? ॥అన్నమే॥
(అసంపూర్తి)

## యువ పతాక!

ఆకాశము పాపట పొడుచు అరుణారుణ తార
ఏకాకి నిశీధి నడచు తరుణ కాంతి ధార
జయ పతాక - యువ పతాక!
వియదాపగ - వెడలు నౌక!
యుగ యుగాల పీడకలలు, సోయగ జేయు సంకెలలు
తెగనివి కావోయ్, మ్రోల ధగ ధగా **స్వతంత్ర విధా**
తాకాశము పాపట పొడుచు అరుణారుణ తార
ఏకాకి నిశీధి నడచు తరుణ కాంతి ధార!
జయ పతాక - యువ పతాక!
వియదాపగ - వెడలు నౌక!
అంతులేని ద్వేషము, విషరోషము, స్వార్థము, మోసము
పంతగించి నిలువవు, వైకుంఠ మిదే, **శాంతి విభా**
తాకాశము పాపట పొడుచు అరుణారుణ తార
ఏకాకి నిశీధి నడచు తరుణ కాంతి ధార!
జయ పతాక - యువ పతాక!
వియదాపగ - వెడలు నౌక!
ముందు గలదు లోకానకు ముక్తి, అమరజీవరక్తి
క్రిందు వెనుక గనక నడువుడందరు, **నభ్యుదయ విభా**
తాకాశము పాపట పొడుచు అరుణారుణ తార
ఏకాకి నిశీధి నడచు తరుణ కాంతి ధార!
జయ పతాక - యువ పతాక!
వియదాపగ - వెడలు నౌక!

**దేవులపల్లి కృష్ణశాస్త్రి**

(జనవరి 4, 1939 - నవశక్తి)

## లే లే లే రష్యా!

గర్జించు రష్యా
గాండ్రించు రష్యా
పర్జన్య శంఖం పలికించు రష్యా
దౌర్జన్య రాజ్యం ధ్వంసించు రష్యా
లేలే రష్యా
రారా రష్యా
వ్యక్తి స్వతస్సిద్ధ స్వాతంత్ర్యదాతా
పతిత నిర్గతిక ప్రపంచత్రాతా
భావికాల స్వర్ణభవన నిర్మాతా
లేలే రష్యా
రారా రష్యా
పుష్కిన్, గోగోల్, షెకోవ్, టాల్‌స్టాయ్
డోస్టోవస్కీ, గోర్కీ, కూప్రిన్
శిల్పసామ్రాట్టులై
జీవితం మథియించి
పాపపంకంనుండి పద్మాలు పుట్టించి
కార్మికస్వర్గాన్ని కలగన్న రష్యా
లేలే రష్యా
రారా రష్యా
మార్క్స్, ఎంగెల్స్
భావాల కోలాహలం
లెనిన్ లక్ష్యం
స్టాలిన్ సేద్యం
జ్వలించిన ఫలించిన సముజ్వలతేజం
యునైటెడ్ సోవియట్ సోషలిస్ట్ రాజ్యం
స్వాతంత్ర్య శత్రువుల గుండెల్లో బల్లెం
పరపీడనాపరుల ప్రాణాలభైరవి
లే లే లే రష్యా
రా రా రా రష్యా
ఈ అగ్నివర్షాలు
ఈ రక్తపాతాలు
ఎలాగూవచ్చాయి ఏమయితేకానీ,

సామ్యవాదంతో సమసిపోతాయి
ఈ సవనరంగంలో ఎగరనీ జీవాలు
ఈ సమరం తుదిచూడందే
ఇక నిలిచిపోరాదు
తిరుగులేని ప్రతిజ్ఞ తీసుకో రష్యా
లేలే రష్యా
రారా రష్యా
ఫాసిస్టు కూటాలు కట్టుకదుతున్నాయి
కుట్రలూ కూహకం చెలరేగుతున్నాయి
అసత్య ప్రచారపు రేడియోబాకా
రాజకీయాలలో రంకువేషాలు
మరఫిరంగులు తెచ్చి మందిచ్చి రష్యా
విమానబాహువులు విసురుతూ రష్యా
అనంత ప్రపంచం అంతటా నీవై
నీ గొడుగునీడల్ని సారించు రష్యా
స్వతంత్రత సమానత సాధించు రష్యా
లేలే రష్యా
రారా రష్యా
సుప్తకంకాళాలు మేలుకుంటున్నాయి
ప్రపంచం పడగెత్తి బుసకొట్టి లేచింది
కార్మికులు కర్షకులు తాడితులు, పీడితులు
కెరటాలుగా పొంగి తిరగబడుతున్నారు
ప్రపంచం నీకోసం పరిపక్వంగా ఉంది
కోటిగొంతులు నిన్ను కోరిరమ్మన్నాయి
కోటిచేతులు నిన్ను కౌగిలిస్తున్నాయి
సై అంటూ రష్యా
జై అంటూ రష్యా
లే లే లే రష్యా!
రా రా రా రష్యా!

శ్రీశ్రీ

(4-11-1942, ప్రజాశక్తి)

(ప్రపంచానికి హిట్లర్ ఫాసిజం ముప్పు తప్పించడానికి రెండు కోట్లమంది సోవియట్ ప్రజలు తమ ప్రాణాలు అర్పించిన మహాయుద్ధంలో సోవియట్ రెడార్మీ స్టాలిన్‌గ్రాడ్‌లో విజృంభించినవేళ ... నేడు సోవియట్ అదృశ్యమైనా, సోవియట్ ప్రజల మహోజ్వల త్యాగం అజరామరం)

# మరణ ఘోష!

అమెరీ లిన్లిత్గోల అమానుష ప్రతిష్టంభనం
మా ప్రాణాలతో ఆడిన చెలగాటం
ప్రపంచ ప్రజకొక కఠోరసాక్ష్యం
బంగరుపంటల భారత భువిలో
పొట్టకు పట్టెడు మెతుకే కరువై
మరణించాం! మేం మరణించాం!

అహో! మా మరణదూతలే, తిండిదొంగలు
శిశువుల రోదనలే జయభేరీగా
భార్యల మానాలే తమ పణముగ
మా ప్రాణాలే తమ అధికలాభముగ
దొంగ (ఉష్-నడి) బజారులో దోచినఫలితం
మరణించాం! మేం మరణించాం!

జానాబ్ జిన్నా! జానాబ్ జిన్నా!
కాంగ్రెసు లీగుల కలయిక కోసం
కావించిన కృషియేమో కాని!
కలకత్తాలో కాలిబాటలపై
హిందువులం-ముస్లింలం-ఒక్కటై
మరణించాం! మేం మరణించాం!

దేశభక్తులారా! బహుపరాక్!
జాతి నాయకుల జైలువిముక్తికి
జాతులమధ్యను సఖ్యత గూర్చి
తిండికరువును తీర్చుటకొరకై
కృషిచేయని మీ నిస్పృహ ఫలితం
మరణించాం! మేం మరణించాం!

దేశభక్తులను వెన్నునపొడిచీ
జాప్ బాంబులతో స్వేచ్ఛను దెచ్చే
పంచమాంగదళ పాపుల చర్యల
కాంగ్రెసుపేరిట చేసే మోసం!
ఘోరం! దేశద్రోహం! చాటుటకై

మరణించాం! మేం మరణించాం!

మాతృభూమి రక్షణ పోరాటంలో
వీరులవలె, మరణించే భాగ్యం
లేదని, ఆశాహృదితో, వ్యథతో,
దేశభక్తులను మేలుకొల్పుటకు -
ఆకలి! ఆకలి! అని ఘోషిస్తూ
మరణించాం! మేం మరణించాం!

**- పట్టాభి రామారావు**

(29-9-1943, ప్రజాశక్తి)

(బెంగాల్ భీకర కరవులో 40 లక్షలమందిపైగా మరణించినప్పుడు స్పందన.)

# 18

# సాంస్కృతిక శిక్షణా శిబిరాల వివరాలు - సంఘ సంస్కరణలు

కృష్ణాజిల్లా గండిగుంటలో 1942 ఏప్రిల్ 10 నుండి 25 వరకు జిల్లా యువజన, విద్యార్థి సంఘాల ఆధ్వర్యాన జరిగిన ఫాసిస్టు వ్యతిరేక ప్రజారక్షణ శిక్షణా శిబిరంలో 30 మందికి విమానదాడి రక్షణ, ప్రథమ చికిత్స, ఫాసిస్ట వ్యతిరేక ప్రచార పద్ధతులు, (పాటలు, బుర్రకథలు, నాటకాలు, ఫ్యాన్సీ డ్రస్ వగయిరా) ప్రపంచ రాజకీయాలు, రాజకీయ భూగోళం, డ్రిల్లు మున్నగునవి నేర్పారు. విద్యార్థులలో వారంతట వారే పాటలు, బుర్రకథలు వ్రాసుకొని సమిష్టిగా నేర్చుకొన్నారు. విమాన దాడి రక్షణ, మంటల నార్పుట, ప్రథమ చికిత్సలను కూడా అందరికీ నేర్పారు. డిబేట్లు కూడా జరిపారు. ఇందువలన ఉపన్యాసాలు చెప్పడం అలవాటు చేసుకోగల్గారు. 15 సెంటర్లలో దాదాపు నెలరోజులు ప్రజానురంజకంగా ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం కొనసాగించారు. గండిగుంట శిక్షణ శిబిరం రాష్ట్రంలో మొట్టమొదటిసారిగా జరిగిన శిబిరం. సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా రాజకీయ ప్రచార విధానానికి నాంది పలికింది. ఆ తరువాత ప్రజానాట్య మండలి ఉద్యమానికి ఇది పునాది వేసిందని చెప్పవచ్చు. బెజవాడలో కూడా శిక్షణా శిబిరం జరిగింది. 44 మంది విద్యార్థులు హాజరయ్యారు. ఈ గండిగుంట శిబిరంలో నేను పాల్గొన్నాను.

కృష్ణాజిల్లా యువజన విజ్ఞాన ప్రచార దళ శిక్షణా శిబిరం ముస్తాబాద్‌లో జూన్ 15తో జయప్రదంగా ముగిసింది. ముగింపు రోజున 500 మందితో బహిరంగ సభ జరిగింది. అజేయ చైనా, మాతృభూమి, హాస్యవేషాలు మొదలగు వేషాలవలన గ్రామీణ యువకులలో విద్యా, విజ్ఞానాలు వ్యాపించాయి. గోడ వార్తాపత్రికలు, వార్తాపత్రిక పఠన కేంద్రాలు, గ్రంథాలయాలు, ఊరూర వెలిశాయి. హరిజన వ్యవసాయ కార్మిక యువకులను కూడా యువజనోద్యమంలోకి తీసుకు రావడం వలన సవర్ణ యువకులలో అస్పృశ్యత పట్టింపులు సడలిపోయాయి. కులభేదాలు

మరిచిపోయి అన్ని కులాల, అన్ని తరగతుల యువకులు ఆటలు, పాటలులో పాల్గొనడం ద్వారా, అంతక్రితం గ్రామకక్షలలో, కొట్లాటలలో కొట్టుమిట్టాడే గ్రామాలలో ఐక్యతా భావం, గ్రామీణ ఆరోగ్య, వైద్య, పారిశుద్ధ్య సౌకర్యాలు, మొదలైనవాటి సాధనకు ఐక్య కృషి, సామరస్యం మొలకలెత్తాయి. యువతరంలో వచ్చిన ఐక్యత - గ్రామ పెత్తందార్ల మధ్య అనైక్యతను, తగువులను సమసిపోయేటట్లు చేసిన సందర్భాలు ఆ రోజులలో అనేకం.

## సాంఘిక సంస్కరణలు

ఆబ్దికాలకు, దినాలకు విపరీతంగా ఖర్చు చేయడం బదులు, ఆ డబ్బును మరే ప్రజోపయోగ కార్యాలకైనా వెచ్చించాలన్న ప్రబోధం ఫలితంగా ఆ దుబారాలు తగ్గించి, వ్యవసాయ కూలీలకు నూతులు త్రవ్వించడం, గ్రంథాలయానికి విరాళాలివ్వడం, పేదలకు భోజనాలు పెట్టడం మున్నగు పద్ధతులు అమలులోకి వచ్చాయి.

వరకట్నాలకు వ్యతిరేకంగా యువకులలో యువజన సంఘాలు తీసుకువచ్చిన ప్రబోధం ఫలితంగా అనేక వివాహాలు వరకట్నరహితంగా జరిగేవి. అనేకమంది యువకులు అందుకు ముందంజ వేసేవారు. ఆడంబరంతో, అట్టహాసాలతో మంత్రాలతో పెళ్ళిళ్ళ బదులు, పూలదండల పెళ్ళిళ్ళు పెద్ద యెత్తున అమలులోకి వచ్చాయి. ప్రేమించి వివాహాలు చేసుకోవడం ఆదర్శవంతంగా ఎంచబడేవి.

అంతవరకు స్త్రీలలో ఘోషా పద్ధతి ఎక్కువగా ఉండేది. యువజన సంఘాలు మహిళా సంఘాలు స్త్రీలను సభలకు, సమావేశాలకు తీసుకొని రావడం ద్వారా ఈ సాంఘిక దురాచారం చాలావరకు పటాపంచలైంది. ఇంటింటికి పుస్తకాలు అందించే కార్యక్రమాల ద్వారా స్త్రీలలో గ్రంథ పఠనాసక్తి పెంపొందింది.

వయోజన విద్యా ప్రచారంలో యువజన సంఘాలు నిర్వహించిన పాత్ర జాతీయ ఉద్యమ ప్రముఖుల ప్రశంసలను పొందింది. కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖ మున్నగు జిల్లాల్లో వందల కొలది రాత్రి పాఠశాలలు యువజన సంఘాలచే నడుపబడుతూ వుండేవి. (ఈనాటి అక్షర ఉద్యమానికి ఏనాడో యువజన సంఘాలు వరవడిపెట్టాయి.)

1944 ఆగస్టు 29న విజయవాడలో జరిగిన వయోజన విద్యా సభలో ఆంధ్ర ఉద్యమ నాయకులు దేశభక్తులు, దక్షిణ భారత వయోజన విద్యా ప్రచార సంఘాధ్యక్షులు అయిన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఇలా ప్రశంసించారు.

"మాలో ఏ కొద్దిమందిలోనో ఉండే అభిప్రాయాలను బహు జనాభిప్రాయంగా (యువజన సంఘాలవారు) మార్చగల్గారు. మాలాగ కేవలం పట్టణాల నుండి, కాలేజీల నుండి గాక, పల్లెలనుండి మీరు రావడంమూలాన, ప్రజలతో సన్నిహిత సంబంధం కలిగి వుండటం మూలాన ఈ కార్యక్రమం మరింత జయప్రదంగా నిర్వహించగలుగుతున్నారు. మీ యువశక్తికి ఎదురులేదు.

(ప్రజాశక్తి వారపత్రిక, 1944, ఆగస్టు 29)

## ప్రజలలో నూతన సంప్రదాయాలు

1940 దశకంలో ఆంధ్రదేశంలో పండుగల స్వరూపాలనే మార్చివేసిన ఘనత కమ్యూనిస్టు ఉద్యమానికి ఉంది. సంక్రాంతి పండుగకు కోడిపందాలు, జూదాలు, త్రాగుడు మొదలైన వినోదాలతో ఉండే ఆబాలగోపాలం - ఆటలు, పాటలు, కరువు నిధి వసూళ్ళు మొదలైన దేశభక్తియుత కార్యక్రమాలు వందలాది గ్రామాలలో బాల సంఘాలు, యువజన సంఘాలు అమలుజేయడం జరిగింది. దురభ్యాసాల నుండి యువతరాన్ని మరల్చి సాంఘిక ప్రయోజనం గల కార్యకలాపాల వైపు తీసుకురావడం జరిగింది. యడ్లపందాలు మొదలైనవి రైతాంగంలో వ్యాప్తి చేశారు. అన్ని కులాల యువకులు కలిసి మెలిసి ఈ ఆటలు, పాటలలో పాల్గొనడం జరిగేది.

ముఖ్యంగా అంటరానితనం పాటించకుండా హరిజన యువకులను చెడుగుడు మొ॥ ఆటలలోకి తీసుకొని వచ్చేవారు. విచిత్రవేషాలు మొదలైన సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా ప్రజలలో దేశభక్తిని, జాతీయ భావాల్ని రగుల్కొల్పేవారు. వీరేశలింగంగారి ప్రహసనాలను ప్రదర్శించి మూఢనమ్మకా లను, సాంఘిక దురాచారాలను పోగొట్టడానికి కృషి చేసేవారు. ఆ విధంగా గ్రామసీమలలో సాంఘిక సంస్కరణలను తీసుకురాగల్గారు.

(31-1-1945, ప్రజాశక్తి)

1943-44 నాటికి యువజనోద్యమం రాష్ట్రంలో 1200 గ్రామాలకు వ్యాపించింది. యువజన సంఘాలలో, బాల సంఘాలలో 40,000 సభ్యత్వం ఉందంటే ఎంత విస్తృత ప్రజా ఉద్యమంగా తయారైందో స్పష్టమవుతుంది. ఒక్క కృష్ణాజిల్లాలోనే 10,000 సభ్యత్వం ఉండేది. రాష్ట్రమంతటా యువజన సంఘాల ఆధ్వర్యాన 140 గ్రంథాలయాలు, 100 గ్రామాలలో రాత్రి పాఠశాలలు, 120 గ్రామాలలో ఆటల కార్యక్రమాలు జరుగుతుండేవి.

యువజనోద్యమం, బాల సంఘాలు గ్రామసీమలలో తెచ్చిన నూతన జీవితం గురించి 31-1-1945వ తేదీ ప్రజాశక్తి వారపత్రిక ఇలా వ్రాసింది :

"ఈ విధంగా ఆంధ్రభూమియందు శక్తి సమన్వితమైన నూతనత్వం ఆరంభమైంది. నూతన చైతన్యం ఆవరించింది. నిస్తబ్దత, నిర్వీర్యత, నిస్తేజం ప్రజలనుండి దూరమవుతున్నాయి. శతాబ్దాలుగా తమ సాంఘిక రాజకీయ దాస్యానికి కారణభూతమైన దురాచారాలకు, దుర్వ్యసనాలకు, కార్యశూన్యతకు, నిస్సహాయతకు, అనైక్యతకు స్వస్తిచెప్పి ప్రజలు చైతన్యవంతులవుతున్నారు."

1935 నుండి 1945 వరకు దశాబ్దం కాలంలో ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనకు జరిగిన కృషిలో ఆంధ్ర యువజనోద్యమం మహోజ్వల పాత్ర నిర్వహించింది అని ఈ చరిత్ర రుజువు చేస్తుంది.

సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక ప్రజాతంత్ర విప్లవంలో ఆనాడు యువజనోద్యమం అగ్రశ్రేణిలో నిలబడి తనపై నున్న చారిత్రక కర్తవ్యాన్ని నిర్వహించింది.

మూడవ భాగం

# 19

# రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో సాంస్కృతిక పునర్వికాసం

(సమాచారం లభించినంతవరకు)

రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలు, సర్కారు జిల్లాలతో పోల్చితే, వ్యవసాయార్థికాభివృద్ధిలో వెనుకబడి వుండటంవల్ల, రాజకీయ, సాంఘిక, విద్యా, విజ్ఞాన, సాంస్కృతిక రంగాలలో కూడా వెనుకబడే ఉండిపోయాయి. అందువల్లనే జాతీయ స్వాతంత్ర్య సమరంలోను, ఆంధ్రోద్యమంలోను నవయుగాంధ్ర నిర్మాతలైన కందుకూరి, గురజాడ, గిడుగు మున్నగువారు ప్రారంభించిన జాతీయ పునరుజ్జీవనోద్యమంలోను ఈ ప్రాంతాలు సమంగా ముందంజ వేయలేకపోయాయి. అందువల్లనే కమ్యూనిస్టు ఉద్యమంకూడా ఈ రెండు ప్రాంతాలలోను ఆలస్యంగా ప్రారంభమైంది. రాయలసీమ ప్రాంతంలో యువజన, విద్యార్థి, మహిళా ఉద్యమాలు 1940 దశకం తొలిదశలోకాని ప్రారంభం కాలేదు. తెలంగాణాలో 1940 దశకం మలిదశకంలోకాని ప్రజా ఉద్యమాలు ప్రారంభం కాలేదు. ఈ విషయం కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి జీవిత చరిత్రలో ఒక ప్రశ్నకు సమాధానం యిస్తూ, సర్కారు జిల్లాల్లో కృష్ణ, గోదావరి ఆనకట్టలు వచ్చి, నీటిపారుదల వ్యవసాయాభివృద్ధి, పాడి, పంటలు రావడంవల్లనే, విద్యా, విజ్ఞాన సాంస్కృతికరంగాల అభివృద్ధిలో ముందున్నాయి అని చెప్పారు. "కడప జిల్లా కమ్యూనిస్టు ఉద్యమ స్మృతులు - అరుణోదయం" అన్న గ్రంథంలో అక్కడ సాంఘిక, సాంస్కృతికోద్యమాలు ఎప్పుడు ఎలా ప్రారంభమైందీ వివరించబడింది. కడప జిల్లా కమ్యూనిస్టు ఉద్యమం ప్రథమ దశ (1942-43)లో రాజకీయ శిక్షణా తరగతుల దశకాగా, ఆ తర్వాత ప్రజా సంఘాలను ముఖ్యంగా కార్మిక, కర్షక వర్గాలను సంఘటితపరచడానికి పెద్దయెత్తున ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాలు సాగించిన దశ ఆ తరువాత సాంస్కృతికోద్యమాల దశ ప్రారంభమైంది. అరుణోదయం గ్రంథంపై సమీక్షలో ఈ గ్రంథ రచయిత వ్రాసిన విషయాలు :

### రాయలసీమలో

"కడప జిల్లాలో ఆర్థిక, రాజకీయ సమస్యలపై పోరాటాలేకాక అంటరానితనానికి, కుల హెచ్చుతగ్గులకు వ్యతిరేకంగా కమ్యూనిస్టు పార్టీ అనేక పోరాటాలు నడిపింది. జంతుబలులకు వ్యతిరేకంగా పోరాడింది.

సాంప్రదాయక వివాహ పద్ధతికి స్వస్తిచెప్పి పూలదండల పెళ్ళిళ్ళు, కులాంతర, మతాంతర

వివాహాలు జరిపించారు. అగ్రకులానికి చెందిన కమ్యూనిస్టు యువకులు అట్టడుగు కులానికి చెందిన యువతులను వివాహాలు చేసుకున్నారు.

కమలాపురం తాలూకాలో కమ్యూనిస్టు ఉద్యమానికి పురిటిగడ్డగా ప్రసిద్ధికెక్కిన గడ్డంవారిపల్లెలో 1952లో ఎన్నికల అనంతరం జరిగిన జిల్లా మహిళా మహాసభ స్త్రీలలో గొప్ప చైతన్యం తీసుకువచ్చింది.

కడప జిల్లాలో ముస్లిం జనాభా గణనీయ సంఖ్యలో వుంది. కమ్యూనిస్టు పార్టీ, యితర ప్రజా ఉద్యమాల ఫలితంగా ముస్లిం ప్రజానీకంలో ఎంతో ప్రభావం కల్గింది. భోజన ప్రతిభోజనాలే కాక హిందూ-ముస్లిం విభేదాలను ప్రక్కకునెట్టి వివాహాలు కూడా జరిగాయి. స్వామినాథరెడ్డి - దస్తగిరమ్మల వివాహం, కమ్మూ సాహెబ్ - శ్యామలాదేవి వివాహం, చలమారెడ్డి - ఒక వడ్డెర యువతితో వివాహం, గౌడ కులానికి చెందిన మలిశెట్టి రామకృష్ణయ్య - కృష్ణమ్మ అనే బ్రాహ్మణ యువతితో జరిగిన వివాహం ఇలా అనేక కులాంతర, మతాంతర వివాహాలు జరిగాయి.

అంతేకాదు, రాజకీయ పాఠశాలలకు హాజరైన ముస్లిం యువకులు కమ్మూ సాహెబ్, హుస్సేన్ బాబు మొదలైనవారు బుర్రకథలు, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొని ప్రజానీకంలో సాంఘిక, రాజకీయ చైతన్యాన్ని కల్గించడంలో గొప్ప పాత్ర నిర్వహించారు. భూస్వామ్య నాగరికత, కట్టుబాట్లు, ఫ్యూడల్ సంస్కృతులను ప్రక్కకునెట్టి ఒక నూతన సంస్కృతిని కమ్యూనిస్టు ఉద్యమం తీసుకురాగల్గింది.

కోస్తా జిల్లాలో నవయుగాంధ్ర నిర్మాతలు సంఘ సంస్కర్తలు అయిన కందుకూరి వీరేశలింగం, గురజాడ మున్నగువారు తెచ్చిన సాంఘిక సంస్కరణల ఉద్యమం, సాంస్కృతిక ఉద్యమాల వారసత్వాన్ని కమ్యూనిస్టు పార్టీ అందుకొని వాటిని కొనసాగించినట్లే రాయలసీమ ప్రాంతంలో ఫ్యూడల్ భూస్వామ్య సంస్కృతిని బ్రద్దలుకొట్టినదనడానికి కడప జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమ ప్రభావంతో జరిగిన ఈ సాంఘిక, సాంస్కృతికోద్యమాలు నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

కడప జిల్లాలో ఒకే కుటుంబానికి చెందిన అందులోనూ ముస్లిం కుటుంబానికి చెందిన కమ్మూ సాహెబ్, హుస్సేన్‌బాబు, శ్యామలగార్ల సాంస్కృతికదళం జిల్లాలోనేగాక, రాష్ట్రంలో, రాష్ట్రేతర ప్రాంతాలలో ఖ్యాతిగాంచింది. గురజాడవారి 'కన్యక' కథాగేయాన్ని జముకుల కథ రూపంలో మలచుకొని కమ్మూ సోదరులు యిచ్చిన వేలాది ప్రదర్శనలు ప్రజలను ఉర్రూతలూగించాయి.

అలాగే జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమ ప్రభావంతో రాచమల్లు రామచంద్రారెడ్డి, కేతు విశ్వనాథరెడ్డి, గజ్జల మల్లారెడ్డి, సొదుం జయరామ్, సొదుం రామమోహన్ మొ॥ అనేకమంది అభ్యుదయ రచయితలు, సాహితీ విమర్శకులు, కథా రచయితలు ఉద్భవించి సాహితీరంగాన్ని సుసంపన్నం చేశారు.

## తెలంగాణాలో

ఇక తెలంగాణా ప్రాంతంలో నైజాం నవాబు ఫ్యూడల్ నిరంకుశ రాజ్యం క్రింద జాతీయోద్యమమే ఆలస్యంగా ప్రారంభమైంది. 1920 దశకంలో ఆంధ్ర పితామహా మాడపాటి హనుమంతరావు, ప్రఖ్యాత పరిశోధకులు, గ్రంథ రచయిత శ్రీ సురవరం ప్రతాపరెడ్డి తదితరుల నాయకత్వాన ఆంధ్ర భాష, సాంస్కృతికోద్యమాలు ప్రారంభమయ్యాయి. ఆంధ్ర మహాసభ ఏర్పడింది. స్టేట్ కాంగ్రెస్ నాయకత్వాన 1930-32 ఉప్పు సత్యాగ్రహ కాలంనాటికి కాని నైజాం ప్రాంతానికి జాతీయోద్యమ "ఉప్పు" అందలేదు.

కమ్యూనిస్టు నాయకులు రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డిగారలు, డాక్టర్ చెలికాని రామారావుగారి ప్రోత్సాహంతో కాకినాడ వచ్చి ఉప్పు సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. 1940 దశకం రెండవ అర్ధభాగం నుండి ఆంధ్ర ప్రాంతం నుండి కమ్యూనిస్టు ఉద్యమం తెలంగాణా ప్రాంతానికి విస్తరించింది. సరిహద్దు గ్రామ ప్రాంతాలలో రాజకీయ శిక్షణా తరగతులకు తెలంగాణా కమ్యూనిస్టు నాయకులు హాజరయ్యారు. ఆ తరువాత వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా ప్రారంభమైన ఫ్యూడల్ వ్యతిరేక పోరాటం 1946 నాటికి రైతాంగ సాయుధ పోరాటంగా విజృంభించి చరిత్రాత్మక తెలంగాణా విముక్తి పోరాటంగా జరిగింది. ఈ ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంలో భాగంగానే దాని ప్రభావంతోనే తెలంగాణా ప్రాంతంలో సాంఘిక, సాంస్కృతికోద్యమాలు ప్రభవించాయి.

"ఈ పోరాటంలో పురుషులతో సమానంగా స్త్రీలూ పాల్గొన్నారు. అందువల్ల, పురుషులకంటే స్త్రీలు తక్కువవారని సమాజంలో తరతరాలుగా జీర్ణించియున్న భావాలకు వ్యతిరేకంగా ప్రచారం సాగించటం గ్రామ కమిటీలకు, సంఘానికి, పార్టీకి సులువైంది. గ్రామరాజ్య కమిటీలు, స్త్రీ పురుషులకు సమాన హక్కులున్నట్లు ప్రకటించాయి. అందుకోసం ఉద్యమం నిర్వహించాయి. గ్రామ పంచాయతీ కమిటీలకు స్త్రీలు ఎన్నుకోబడ్డారు. కుటుంబాల పరిస్థితులను గూర్చి, పరస్పర సంబంధాలను గూర్చి, స్థానిక ప్రజలకు బాగా తెలియటం సహజం. అందువల్ల గ్రామ కమిటీలు కుటుంబ తగాయిదాలను సామరస్యంగా పరిష్కరించటం, వారి మధ్య సామరస్యం సాధించటం, పరాయివాడి భార్యను లేవదీసుకుపోయి నందుకుగాను నష్టపరిహారం చెల్లించే సమస్యను ఆయా కేంద్రాలలో అమలులో వున్న సాంప్రదాయాల కనుగుణంగా పరిష్కరించటం, ఇష్టంలేని పెళ్ళిళ్ళను అంటే తమకిష్టంలేని వ్యక్తులను పెండ్లాడవలసిందిగా బాలికలను బలవంతం చేయటాన్ని అరికట్టటం, తగిన సందర్భాలలో విడాకులు మంజూరు చేయటం, నూతన దంపతులు గౌరవప్రదమైన జీవనం సాగించటానికి దోహదపడటం గ్రామ కమిటీలకు సాధ్యమయింది.

"గ్రామాలలో కుల విభేదాలు లోతుగా వేరూని యున్నాయి. ప్రభుత్వ వ్యతిరేక పోరాటంలో ప్రజలందరూ ఎలాంటి కుల వివక్షత లేకుండా కలసికట్టుగా పోరాడవలసి వచ్చింది. అందువల్ల

దీని తర్వాత అంటరానితనానికి వ్యతిరేకంగా పోరాడటం సులువైంది. గెరిల్లా దళాలలో సమానత్వం, పరస్పర గౌరవమూ ఖచ్చితంగా పాటించబడ్డాయి. ఈ ఆచరణవల్ల ప్రజల ఆలోచనలలో మార్పు వచ్చింది.

"దేవుళ్ళు, దయ్యాలు మొదలైన వాటిపై విశ్వాసం చాలవరకు తగ్గిపోయింది. ప్రత్యేకంగా యువజనులలో అది గణనీయంగా అంతరించిపోయింది.

"రాజకీయ ప్రచారం విస్తృతంగా సాగించబడింది. గ్రామ కమిటీలు, గ్రామ దళాలు మొదలుకొని ఆర్గనైజరు, గెరిల్లా దళాలవరకు ప్రతి ఒక్కరూ ప్రజా సమావేశాలలో ప్రతి సమస్యనూ వివరించుతుండేవారు. దీనితోపాటు బుర్రకథ, గొల్లసుద్దులు, ఉయ్యాల పాట, కోలాట పాట, భజన వంటి అనేక సాంస్కృతిక రూపాలు విరివిగా ఉపయోగించబడ్డాయి. ప్రతి సమస్యను గూర్చి, పోరాట సందర్భంగా జరిగిన పెద్ద సంఘటనలను గూర్చి, మృతవీరులను గూర్చి, శత్రువు జరిపిన అత్యాచారాలను గూర్చి, శత్రుపరాజయాలు మొదలైనవాటిని గూర్చి పాటలనేకం వ్రాయబడ్డాయి.

వీటి నన్నిటినీ వ్రాసింది బాగా చదువుకున్న రచయితలు కాదు. సామాన్య ప్రజలే. జానపదగేయాల రూపంలో స్వయంగా వాటిని అల్లుకున్నారు. అవి ఎంతో శ్రావ్యంగా వుండేవి. ప్రజానీకాన్ని ఉత్తేజపరిచేవి. కళాకారులు సయితం శిక్షణ పొందినవారు కారు. ప్రజలే సాంస్కృతిక దళాలుగా ఏర్పడి ప్రదర్శనలిస్తుండేవారు. ఈ కార్యక్రమాలు, ఈ పాటలు పాడటమూ నిర్ణీత సమయాలలోనో, నిర్ణీత స్థలాలలోనో గాక, ఎక్కడంటే అక్కడ, ఎప్పుడంటే అప్పుడు సాధ్యమైన చోటనెల్లా, అవసరమైనప్పుడెల్లా జరుగుతుండేవి. గెరిల్లా దళాలు, తమ సైనిక శిక్షణ పొందుతుండేవి.

"ఈ కార్యక్రమాలన్నింటినీ ప్రజలు గొప్ప ఆసక్తితోనూ, ఉత్సాహంతోనూ తిలకించుతుండేవారు. కొన్ని సమయాలలో, వారి ఉత్సాహమే వారిని కార్యక్రమంలోకి దించుతుండేది.

"పశువులగాచే కుర్రవాళ్ళు ఈ సాంస్కృతిక ప్రదర్శనలిస్తూండేవారు. మిలటరీ డ్రిల్లు కూడా చేసేవారు. తత్ఫలితంగా కొన్ని సందర్భాలలో తీవ్రమయిన ప్రమాదాలు సంభవించాయి.

"సూర్యాపేట తాలూకా, చిల్పకుంట గ్రామంలో ఈ గొడ్లుకాచే కుర్రవాళ్ళు ఒకసారి ఒక నాటకం ప్రదర్శించారు. వాళ్ళలో ఒకరు పేరుమోసిన దుష్టభూస్వామి జన్నారెడ్డి ప్రతాపరెడ్డిగాను, మరొకరు పేరుమోసిన రజాకారు అబ్బాస్ ఆలీగాను, మిగతావాళ్ళు గెరిల్లాలుగాను నటించారు. భూస్వాముల పాత్ర ధరించిన నటులు తీవ్రంగా దెబ్బలు తిన్నారు. అదే విధమైన నాటకాలు అనేకచోట్ల ప్రదర్శించబడ్డాయి.

"శత్రు దాడులు ఉధృతంగా సాగుతున్న తరుణంలో సయితం, వయోజన విద్యాకార్యక్రమం చేపట్టి, అమలుజరపబడింది. గ్రామ కమిటీలు, గ్రామ దళాలు తాము విద్యనభ్యసించడమేగాక, యితరులక్కూడా బోధించుతుండేవి. దళాలలోని నిరక్షరాస్యులనేకమంది, తదితరులు కొలది

మాసాల అనంతరం వార్తా పత్రికలు, పుస్తకాలు చదవగలిగేవారు. రాజకీయ చైతన్యం కారణంగా, అనేకమంది చదువుకొనటానికి ముందుకొచ్చారు. అతి స్వల్ప వ్యవధిలోనే చదువు నేర్చారు కూడా. దానినొక రాజకీయ కర్తవ్యంగా స్వీకరించినందుననే ఈ పని జయప్రదంగా నెరవేర్చగలిగారు."

"వీర తెలంగాణా విప్లవ పోరాటం - గుణపాఠాలు"
శ్రీ సుందరయ్యగారి గ్రంథం నుండి.

"తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటంలో ప్రజానాట్యమండలి వీరోచిత పాత్ర" పేరుతో డాక్టర్ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి తమ "ఆంధ్ర ప్రజానాట్యమండలి" గ్రంథంలో ఆనాటి సాంస్కృతిక పునరుజ్జీవన గురించి సవిస్తరంగా తెలియజేశారు.

వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా తొలి సాంస్కృతిక ప్రదర్శన జరిగింది. ఆ తరువాత సరిహద్దు గ్రామాలలో లెక్కలేనన్నిసార్లు "మాభూమి" నాటక ప్రదర్శనలు జరిగాయి. తిరునగరి రామాంజనేయులు వంటివారు స్వయంగా తెలంగాణా ప్రాంతానికి వెళ్ళి అనేక జానపద బాణీలలో రచనలు చేసి బుర్రకథలు, విచిత్రవేషాలు మొ॥ కళారూపాలలో అక్కడి యువకులకు తర్ఫీదు యిచ్చారు. సుంకర వ్రాసిన కష్టజీవి బుర్రకథగా, హరికథగా చెప్పేవారు. గొల్లసుద్దులు ఎంతో గొప్పగా చెప్పేవారు. సామాన్య ప్రజలనుండే సుద్దాల హనుమంతు మొదలైన కవులు, కళాకారులు బయలుదేరారు. మల్లు స్వరాజ్యం, శశిరేఖ, ప్రియంవద మొ॥ అనేకమంది మహిళలు ఈ సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొన్నారు. తెలంగాణాలో ఆ విధంగా ప్రజానాట్యమండలి వీరోచిత పాత్ర ధరించి తెలంగాణా విముక్తి పోరాటంలో ప్రముఖ పాత్ర వహించింది. "నైజాం సర్కారోడా, నాజీల మించినోడా" అన్న పాట, మల్లు స్వరాజ్యం ఉయ్యాల పాట మొదలైన తెలంగాణా అంతటా మార్మోగిపోయాయి. శ్రీ ఆవంత్స సోమసుందర్ వ్రాసిన "ఖబడ్దార్ నైజాం పాదుషాహై" అన్న పాట ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో ఆనాడు మార్మోగింది.

**నిజాం ఆంధ్ర రాష్ట్రంలో ఆంధ్ర జాతీయ పునర్వికాస ఉద్యమం 1945లో ఖమ్మంలో జరిగిన 12వ ఆంధ్ర మహాసభనాటికి ఒక ఉన్నతస్థాయికి వచ్చింది. ఆనాడు జరిగిన సారస్వత మహాసభ విశేషాలు ఆసక్తిదాయకమైనవి. సభా విశేషాలు ఇవి :**

## "ప్రజలపక్షాన వ్రాయడమే అభ్యుదయం"

నిజాం రాష్ట్ర 12వ ఆంధ్ర మహాసభ ఖమ్మంలో జరిగిన సందర్భంలో 29-4-1945న సారస్వత సభ జరిగింది. సభకు పండితులూ, కవులూ, రచయితలూ అనేకమంది విచ్చేశారు. శ్రీ అడివి బాపిరాజుగారు అధ్యక్షత వహించారు.

సభకు దత్తాత్రేయశర్మ, ఆళ్వారుస్వామి, కాళోజీ నారాయణరావు, మగ్దుమ్, తుమ్మల వెంకట్రామయ్య, సెట్టి ఈశ్వరరావు, దాశరథి కృష్ణమాచార్య, టి. లక్ష్మీనరసింహం, చిలుకూరి శ్రీరాములు, దింటకుర్తి భాస్కరరాజు, దేవేంద్ర వర్మాజీ, పైడి వెంకట్రావు, తిరు వెంగళాచార్య,

మరి పెక్కురు ప్రముఖులూ విచ్చేశారు.

దత్తాత్రేయ శర్మగారు సమావేశాన్ని ప్రారంభించుతూ ఇలా అన్నారు :

"సాహిత్యంలో మార్పు అవసరం. సమాజాన్ని ప్రబోధించే ఉద్బోధనా గేయాలు, గీతాల అవసరం ఎంతో ఉంది. నిజాం రాష్ట్ర సారస్వతం ఎంతో దుర్బలంగా వుంది. పూర్వపుటౌన్నత్యం తగ్గింది. భాషలో సాంకర్యం హెచ్చింది. భాషను సంస్కరించి అభివృద్ధిచేయటానికి ఇపుడిపుడే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ప్రజలలో కళాభిరుచి పెంపొందించాలంటే జానపద వాఙ్మయం పెంపొందించాలి. సింహగఢ్‌లో శివాజీ జానపదగేయాలతో ప్రజలను ఎలా ప్రబోధించాడో ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకోండి.

నిజాం రాష్ట్రంలోని వివిధ సాహితీసంస్థలు సాహిత్యాభివృద్ధికి తగు మార్గాలు వెదికి, తగిన ప్రోత్సాహమిస్తారని ఆశించుతూ విరమించుతున్నాను."

## సాహిత్యం ఒక ఆయుధం

తర్వాత అడివి బాపిరాజుగారు మాట్లాడుతూ ఇలా సెలవిచ్చారు :

"సారస్వతం, లలితకళలూ ప్రజలకు అత్యుత్తమ రీతిగా సేవచేస్తాయి. సేవచేయాలి. అవి ప్రజల పురోభివృద్ధికి పనిచేయాలి. పూర్వకాలంనుంచీ, చారిత్రకంగా కూడా ప్రజల కుపయోగించే అభ్యుదయకరమైన సారస్వతమూ, లలితకళలు వచ్చాయి. కాని అప్పుడప్పుడూ వెనక్కినడచిన ఘట్టాలున్నాయి. చీకటి ఆవరించిన రోజులూ ఉన్నాయి.

ఏ నాటిక వ్రాసినా, ఏ చిత్రం గీసినా, ఏ పద్యం వ్రాసినా, ఏ పాట పాడినా అది ప్రజాభివృద్ధికే దారితీయాలి. ప్రజలతో సంబంధంలేని సాహిత్యం వ్యర్థం.

సంస్కృతంనుండి తెనుగు చేయడంతోనే వన్నయాదులు తృప్తిపడలేదు. తెలుగులో ఉత్తమ కావ్య కృషికై ప్రయత్నించారు. కొందరీ అనువాదాలకే అడ్డుపెట్టారంటే విని ఆశ్చర్యపడతారు మీరు. తులసీదాస్ రామాయణాన్ని అనువదించితే ఎందరో పండితులు అడ్డువచ్చారు. మన తెలుగులో కూడా అలాంటి ఆటంకాలు ఏర్పడి వుండవచ్చు. భారతంతో తెలుగులో ఒక ఉన్నతస్థాయి ఏర్పడింది. ఆ తర్వాత దేశికవితాయుగం వచ్చింది. ఈ యుగంలో దేశీయత, దేశికవిత పెంపొందింది. పొలాల్లో పనిచేసే కృషికుని, నిత్యం కష్టపడే కార్మికుని జానపదాలు కొన్ని ఉత్తమ స్థితిలో వున్నాయి. వారి ప్రేమ, కష్టసుఖాలు ఆ గేయాలలో ప్రతిబింబించుతున్నాయి.

సాహిత్యం ఒక ఆయుధం. సంఘాన్ని మరమ్మతు చేయడానికి అది ఎంతైనా ఉపయోగిస్తుంది. పూర్వం ఒక కర్కోటకుడైన జమీందారుని రాక్షసకృత్యాలను కృష్ణదేవరాయల ముందు కూచిపూడి భాగవతులు నాటకరూపంలో ప్రదర్శించారట. రాయలచేత ఆ జమీందారుని శిక్షింపజేశారట. అందుచే సంఘ సంస్కారానికి చిన్న కథలు కూడా ఎంతో ఉపయోగపడతాయి. అందుకు నిదర్శనం రష్యా. ఇక పాటలూ పదాలూ విషయం, మాటల్లో చెప్పేదే ఉన్నదున్నట్లు పాటలుగా వ్రాస్తే, దానిలో పస వుండదు. వైచిత్రి వుండాలి. మనస్సుకు హత్తుకుపోయే లాలిత్యం,

సౌందర్యం, జానపద గేయాల్లో వుంది. "చల్ మోహనరంగా" లాంటి ప్రణయ గేయం, "మాకొద్దీ తెల్లదొరతనం" లాంటి రాజకీయ గేయాలకు సాహిత్యంలో శాశ్వత స్థానం ఏర్పడింది.

"నిజాం రాష్ట్రం వెనుకబడివుంది. ఆంధ్ర మహాసభ 12 ఏండ్ల కృషి ఫలితంగా ఇప్పుడు చైతన్యం హెచ్చుతుంది. ఇది అవకాశంగా తీసికొని అభ్యుదయ సారస్వతాన్ని రచించి ప్రచురించండి. ప్రజలు ఉత్తమ స్థితికి రావాలనే కాంక్షతో వ్రాసినపుడు మీరు ఉత్తమ కవిత వ్రాయగలరు. ఉత్తమ కవిత సర్వత్రా పూజనీయమౌతుంది. అపుడు దేశానికి మీరు నిర్దిష్టమార్గం చూపినవారౌతారు."

అనంతరం సెట్టి ఈశ్వరరావుగారు అభ్యుదయ సాహిత్యంపై ఇతరులకుగల కొన్ని అపోహలను సభికులముందు పెట్టి చర్చించమని కోరారు. అధ్యక్షులు ఆ అపోహలను తొలగించుతూ ప్రసంగించారు.

## ప్రజాకవిత

తర్వాత కవితాగోష్టి జరిగింది. ఇక్కడ చదివిన రచనలలో ఎక్కువమంది నాకర్షించి రంజింపజేసినవి, ప్రజా సమస్యలపైన వ్రాసినవే. ప్రజలతో నిత్యసంబంధం గల యువకులు వ్రాయడంచే, ప్రజల భావాలను, ఆవేదనలను, ఆశయాలను, ఆశలను సూటిగా స్పష్టంగా రమ్యంగా చెప్పగలిగారు.

అనేకులు జమీందార్ల దౌర్జన్యాలు, వరిగ క్షామం, ఆంధ్ర మహాసభ కర్తవ్యం, గ్రామ ప్రజల కడగండ్లు మొదలగు విషయాలపై చక్కని కవితను వినిపించారు. పి. వెంకటేశ్వరరావుగారు, "పాలోయమ్మ పాలు, నా దేహము దేశముపాలు" అనే పాట నిజాం రాష్ట్ర ప్రజల నిత్యజీవితం చక్కగా ప్రతిబింబించింది. అందుచేతనే ప్రతి చరణానికి హర్షధ్వానాలు చెలరేగాయి. కాళోజీ నారాయణరావుగారి "యుద్ధపిశాచం" ప్రపంచంలోని అభ్యుదయ శక్తులకూ, అభ్యుదయ నిరోధక శక్తులకూ గల భేదాన్ని గ్రహించక, నిరాశతోను, నిస్పృహతోను నిండిపోయి తన కర్తవ్యాన్ని మరచి, పురోగమించే ప్రపంచ శక్తులను అనుమానంతోను, అయిష్టతతోను చూస్తూ అందరికీ దూరమయ్యే కొందరు భారతీయుల దృక్పథం తెలియజేసింది. కాని, ప్రతి భారతీయుని దృక్పథం ఇదికాదు. అందుకు నిదర్శనం ఈ సభలో చదివిన తక్కిన రచనలే.

## అభ్యుదయ కవి

అభ్యుదయ కవీ, ఉర్దూ మహాకవీ అయిన మగ్దుం ఉపన్యాసం, నేటి కవుల కర్తవ్యాన్ని స్పష్టంగా చాటింది. కామ్రేడ్ మగ్దుం ఇలా ఉపన్యసించాడు :

"అభ్యుదయ సాహిత్యం అన్ని భాషలలోను సాగుతోంది. టాగూర్, ఇక్బల్, ప్రేమచంద్‌లు మా అభ్యుదయ సాహిత్య ఉద్యమాన్ని బలపరిచారు. అభ్యుదయం అంటే ఏమిటి అనేదానికి పెద్ద పెద్ద నిర్వచనాలు అవసరంలేదు. మీరు ప్రజల పక్షాన ఉంటారా - వారి వ్యతిరేకుల పక్షాన ఉంటారా? కష్టించే కార్మిక కర్షకుల పక్షం వహించుతారా? లేక వారిని పీడించేవారి పల్లకీలు

మోస్తారా? ప్రజలకోసం వ్రాయడం అభ్యుదయమంటాను. మన చేతులలో కలమనే కత్తి వుంది. దానితో ఎన్నో విజయాలు సాధించవచ్చు. స్వాతంత్ర్యం, సమానత్వం, ఐక్యత, శాంతి - వీటికోసం పోరాడేవాడే అభ్యుదయ కవి. రాజకీయాలలో అభివృద్ధి నిరోధకులతో పోరాడవలసి వచ్చినట్లుగానే మేం ఉర్దూలో అభ్యుదయ నిరోధకులతో పోరాడవలసివస్తోంది. కాని వారి సంఖ్య కొద్ది అవడం సంతోషించదగ్గ విషయం. నేను వెళ్ళిన ప్రతి ప్రాంతంలో ప్రజలకోసం, ప్రజల కష్టనివారణకోసం, ప్రజల భావి సౌఖ్యంకోసం ఆవేదన తెల్పే కవులే ఎక్కువ జనరంజకంగా ఉంటున్నారు.

"ఇదివరకు తిని కూర్చునేవారికే కవిత్వం. కాని నేడు కవిత ప్రజలలోకి చొచ్చుకుపోతున్నది. బెంగాల్‌లో ఒక సాహిత్యసభకు 20 వేలమంది వచ్చారంటే, బొంబాయిలో ఒక ఉర్దూ సాహిత్యసభకు 15 వేలమంది వచ్చారంటే అర్థమేమిటి? సాహిత్యచరిత్రలో ఈ విషయం అపూర్వం. ఇంతమంది ప్రజలెందుకు వచ్చారు. ఏ సుందరి అవయవ వర్ణనలో వినడానికి వారు రాలేదు. అలా వర్ణించినవారు వారి పరిహాసానికి గురి అయ్యారు. స్వాతంత్ర్యం, హిందూ-ముస్లిం ఐక్యత, మొదలైన విషయాలకు ప్రజలు ఆనందం వెలిబుచ్చారు.

"భాషలు వేరైనా నా నాలుక ఒకటే. మనం వెలిబుచ్చే అభిప్రాయాలు కూడా ఒకటే. అందుకని ఈ సాహిత్య సమావేశానికి హైద్రాబాద్ అభ్యుదయ రచయితల సంఘం తరపున అభివందనాలు తెలియజేస్తున్నాను."

రాజకీయాలలో వలెనే కార్మిక కర్షక ఉద్యమాలే అన్నింటిలోనూ ముందంజ వేస్తున్నాయి. ఈమధ్య ఉర్దూ సాహిత్యంలో బొంబాయి కార్మికులు అగ్రగాములుగా ఉంటున్నారు! మదనపూర్ కార్మికులు రచించిన గీతాలలాంటివి నేనింతవరకు వినలేదు. యు.పి.లోని ఒక రైతు ప్రపంచ వాస్తవికతను అతి చక్కగా చిత్రించాడు. "నేను నాగలి నడుపుతూ కవిత అల్లుతాను" అని అతడన్నాడు. ఇవీ నేను చూచిన కొన్ని సభల విశేషాలు. అన్ని ఉద్యమాలలో వలెనే పాత నాయకత్వం పోయి కొత్త నాయకత్వం వస్తోంది. కార్మిక, కర్షకులు కవితా జగత్తులో కూడ ఒక కొత్త పోకడ చూపెడుతున్నారు. ప్రతి భాషలోను కొత్త ప్రతిభ కన్పించుతోంది. ప్రజలు ప్రజాసాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. సృష్టించేవారికి దోహదమిస్తున్నారు. మన సంస్కృతిని ఉన్నతపథానికి తీసుకువెళ్ళి స్వాతంత్ర్య ధ్యేయానికి సమీపంగా లాక్కెళ్ళుతున్నారు. అధ్యక్షుని తుది వాక్యాలతో సభ ముగిసింది.

(గమనిక : రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల సాంస్కృతిక పునరుజ్జీవన సమాచారం అసంపూర్తి, అసమగ్రం అని పాఠకులు గుర్తించ ప్రార్థన)

నాల్గవ భాగం

# 20

# విహంగవీక్షణంతో... పర్యావలోకనం

సుమారు అర్ధ శతాబ్దం గడిచిన తరువాత ఆంధ్రదేశంలో జరిగిన ఈ చరిత్రను ఈనాడు ఇన్ని వివరాలతో ఎందుకు త్రవ్వి తీయవలసి వచ్చింది?

1942-48 సంవత్సరాల మధ్య ఆంధ్రదేశ చరిత్రను ఎవరైనా పరిశోధించితే సామాజిక, సాహిత్య, సాంస్కృతిక రంగాలలో అపూర్వమైన పరిణామం, అభివృద్ధికరమైన, విప్లవాత్మకమైన మార్పు, పురోభివృద్ధి గోచరిస్తుందని అక్షరాలా నిరూపించడానికే ఇది త్రవ్వితీయవలసివచ్చింది. నవయుగాంధ్ర నిర్మాతలు కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి, కొమర్రాజు లక్ష్మణరావు, కాశీనాధుని నాగేశ్వరరావు, మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి మున్నగు మహనీయులు ప్రారంభించిన ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమాన్ని నాటి కమ్యూనిస్టు ఉద్యమం చైతన్యయుతమైన కృషితో కొనసాగించిన దృశ్యం ఇందులో కనబడుతుంది. రాజకీయ విధానాలలో తప్పొప్పులు ఎలా ఉన్నా, గుర్తుపట్టలేనంతగా ఆంధ్రదేశాన్ని కమ్యూనిస్టులు మార్చివేశారని స్వాతంత్ర్య సమరయోధులు, ప్రఖ్యాత అభ్యుదయ రచయిత, కీ॥శే॥ మహీధర రామమోహనరావుగారు అన్న మాటలో అతిశయోక్తి ఏమీలేదని అనిపిస్తుంది. ఆంధ్ర ప్రజాజీవితంపై మార్క్సిజం ప్రభావం అన్న అంశంపై నాగార్జున యూనివర్శిటీవారు జరిపిన సదస్సులో మహీధరవారు నొక్కి వక్కాణించిన మాట యిది.

ఇంచుమించు ఆంధ్రదేశం మరిచిపోయిన నవయుగాంధ్ర నిర్మాతల మహత్తర సామాజిక, సాహిత్య, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ కృషి త్రవ్వితీసి తలకెత్తుకున్న ఆ ఘనత నిస్సంశయంగా ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమానికి చెందుతుంది. జాతీయ స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించిన జాతీయ కాంగ్రెస్ స్వాతంత్ర్య సమరానికే ప్రాధాన్యతనిచ్చి సాంఘిక సంస్కరణోద్యమాన్ని ముందుకు తీసుకొనిపోవడంలో అశ్రద్ధ చేసి, వీరేశలింగంగారు చేసిన హెచ్చరికను, "సంఘ స్థితి బాగుపడినకాని రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపూర్తిగా సద్వినియోగం చేసుకోజాలమని" చేసిన హెచ్చరికను అలక్ష్యం చేసిన దశలో, ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం, వీరేశలింగంగారు నిర్దేశించిన ఆ మహత్తర కర్తవ్యాన్ని నిర్వర్తించింది. "కొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు చిందేటట్లు" చేసింది. ప్రాచీన కళారూపాలన్నింటిని పునరుద్ధరించింది. ప్రాచీన సాహిత్యంలోని మంచిని గ్రహించి, ప్రజల వాస్తవిక జీవితాన్ని ప్రతిబింబించే నూతన సాహిత్యానికి, అభ్యుదయ సాహిత్యానికి అంకురార్పణ చేసింది. అభ్యుదయ సాహిత్యం, కళలు, సంస్కృతి అంటే ఏమిటో ఆచరణలో ప్రజానాట్యమండలి, సాంస్కృతిక ప్రదర్శనల ద్వారా చూపింది. హేమాహేమీలైన ఆంధ్ర సాహితీవేత్తలందరిని ఆలోచింపజేయడమేకాదు, వారి అపోహలను, దురభిప్రాయాలను

తొలగించడమే కాదు, వారిచే "సెహబాష్" అనిపించుకుంది. పెట్టుబడిదారీ నాగరికత, సంస్కృతిలోని దగుల్బాజీతనం చూసి, ఫ్యూడల్ సంస్కృతే గొప్పదని - వెనుకచూపు చూసే వేయిపడగల సాహితీవేత్త శ్రీ విశ్వనాథ సత్యనారాయణ వంటి దిగ్గంతులను సైతం "మాభూమి" నాటకంతో మురిపింపజేసి, పరవశులను చేసింది. అభ్యుదయ రచయితల ఉద్యమంలో, ప్రజానాట్యమండలి సాంస్కృతికోద్యమంలో పరాకాష్ట, పతాక సన్నివేశం అనదగిన మద్రాసు శాఖ అభ్యుదయ రచయితల సంఘ మహాసభ, ప్రజానాట్యమండలి సాంస్కృతిక మహోత్సవాలతో నాటి మద్రాసు మహానగరంలోని ఆంధ్ర ప్రజలను ఉర్రూతలూగించి, ఆంధ్రదేశ సామాజిక, సాహిత్య, సాంస్కృతిక రంగంలో ఏ మహత్తర పరిణామాలు, ఏ పురోభివృద్ధి సాధించబడుతున్నదో ప్రత్యక్షంగా చూపి, అక్షరాలా వారికి కనువిప్పు కలిగింది. మా సందేహాలన్నీ తీరిపోయాయి అని వారిచే అనిపించింది. ఈ ఉత్సవాలను చూడకపోతే, కలలో కూడా వూహించలేని ఈ మహత్తర అభ్యుదయాన్ని గమనించలేని స్థితిలోనే ఉండిపోయేవారమని వారు దిగ్భ్రాంతిని వెల్లడించేటట్లు చేసింది. బెంగాల్ కరవు బుర్రకథను చెప్పిన నాజరును, మహానటుడు గోవిందరాజుల సుబ్బారావుగారు కౌగలించుకొని "నాయనా! మరొక్కసారి వినిపించు" అని అంటూ మీరు మా కళ్ళు తెరిపించారు సుమా అని పరవశులైపోయిన ఘట్టం చాలు. ఆనాడు కమ్యూనిస్టు ఉద్యమం తెచ్చిన, కమ్యూనిస్టు ఉద్యమం సాధించిన మహత్తర సాంస్కృతిక విప్లవం గొప్పతనం ఏమిటో అర్థం చేసుకొనడానికి!

ఈ మహత్తర సాంఘిక, సాహిత్య విప్లవం సాధించడానికి, ఒక్క మాటలో ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమాన్ని ముందుకు తీసుకుపోవడానికి ఎంత ప్రతిఘటన, ఎంత అవహేళన, ఎంత అపోహ, ఎంత అపార్థం ఎదు... నవలసివచ్చింది? గతాన్నే అంటిపెట్టుకొని "వెనుకచూసిన కార్యమేమోయ్, మంచి గతమున కొంచమేనోయ్, మందగించక ముందుకడుగెయ్, వెనుకబడితే వెనుకనోయ్!" అన్న గురజాడ మహాకవి మాటలను విస్మరించినవారిని సుప్రసన్నులను చేసుకోడానికి ఎంత శ్రమించవలసివచ్చింది? ఇది కమ్యూనిస్టుల ప్రచార హోరు తప్ప మరేమీ కాదు అన్నవారిని సైతం మెప్పించి, ఔననిపించడానికి ఎంత కష్టపడవలసివచ్చింది? వివరంగా చెప్పాలంటే ...

అభ్యుదయ రచన, అభ్యుదయ కవిత్వం అంటే వర్గ ద్వేషాన్ని, వర్గ శత్రుత్వాన్ని ప్రేరేపించేదని, ఆకలి కవిత్వమనీ, రాజకీయ నినాదాల కవిత్వమనీ రకరకాల అపోహలు, దురభిప్రాయాలు ఆనాడు ఉండేవి. అభ్యుదయ రచయితలు ప్రాచీన సాహిత్యాన్ని పూర్తిగా త్రోసిపుచ్చుతారనీ, తుంగలో త్రొక్కుతారని, వారిది శిల్పం అక్కరలేని నినాదాల కవిత్వమనీ రకరకాల అభిప్రాయాలు వెలిబుచ్చుతూండేవారు. అభ్యుదయ రచనలతో, నాటకాలు, నాటికలు, జానపద కళారూపాలు నూతన ఇతివృత్తాలతో ప్రజానాట్యమండలి కళాకారులు ప్రదర్శనలు యివ్వడంతో ఇటువంటి వారందరికీ కనువిప్పు అయింది. ముందడుగు, పరివర్తన, మాభూమి నాటకాలు నాటి ఫ్యూడల్

నిరంకుశ వ్యవస్థ, వెట్టిచాకిరీ, రైతుల దుర్భర జీవిత పరిస్థితులు, చిత్రించిన వాస్తవిక జీవిత చిత్రణలు పండితులను, పామరులను, సాహితీవేత్తలను, కళాకారులను ఉర్రూతలూగించాయి. అభ్యుదయ కవిత్వం అంటే ఆకలి కవిత్వమని, నినాదాల కవిత్వమనీ హేళనచేసేవారి నోళ్ళు మూతలుపడ్డాయి. నాటకాలే కాదు ముఖ్యంగా బెంగాల్ కరువు బుర్రకథ, వీరేశలింగం బుర్రకథ, అల్లూరి సీతారామరాజు బుర్రకథ, కన్యక, పూర్ణమ్మ మున్నగు జముకుల కథలు మేధావులను, సాహితీవేత్తలను ఆశ్చర్యచకితులను చేశాయి. హృదయాలు ద్రవించి కన్నీటిధారలు ఉబికి వచ్చినవారు ఈ అభ్యుదయ కళా ప్రదర్శనలతో ఉత్తేజితులై, అభ్యుదయ రచన, అభ్యుదయ కళ అంటే ఏమిటో ప్రత్యక్షంగా చూసి, అనుభవించి, అనుభూతి చెందినవారు అసంఖ్యాకులు.

## మద్రాసు మహానగరంలో దిగ్విజయయాత్ర సాగించిన వేళ . . .

మద్రాసులో 1945 నవంబరులో ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ మద్రాసు శాఖ ప్రారంభోత్సవ సభలో జరిగిన అభ్యుదయ కళా ఉత్సవాలు మద్రాసు రాజధానీ నగరాన్ని పారవశ్యంలో ముంచెత్తించాయి. నగరంలో దిగ్విజయయాత్ర సాగించాయి. ఆనాటి ప్రదర్శనలను సమీక్షించిన విలేఖరి చెప్పినట్లు (14-11-1945 ప్రజాశక్తి) ఈ ప్రదర్శనలకు వచ్చిన లాయర్లు, డాక్టర్లు, యాక్టర్లు, సినీమా డైరెక్టర్లు, వర్తకులు, పత్రికాధిపతులు, జర్నలిస్టులు, పరిశోధకులు, జడ్జీలు, విద్యార్థులు, రేడియో గాయకులు పరమ సంభ్రమాశ్చర్యభరితులయ్యారు. ఇటువంటి నాటకాల్ని సాంస్కృతిక ప్రదర్శనలను ఎప్పుడూ చూడలేదన్నారు. చూడనివారు గొప్ప అవకాశం పోగొట్టుకున్నామని విచారించేవారు, మరోసారి ఆ నాటకాన్ని (ముందడుగు) వేసిచూపమనేవారు. "ఏడీ ఆ నాజరు" అని ఆయననను కౌగలించుకున్నవారు (డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావు గారు) ఇలా మద్రాసులోని మేధావివర్గాలు, కళాప్రియులందరూ ఉప్పొంగిపోయిన తీరుచూస్తే, ఆంధ్ర ప్రజా జీవితాన్ని అభ్యుదయ రచయితలు, ప్రజానాట్యమండలి కళాకారులు, వారి వెనుక కమ్యూనిస్టు ఉద్యమం ఎంత గొప్పగా ప్రదర్శించి సార్ధకత చెందిందో వేరే చెప్పనక్కరలేదు. ఆంధ్రదేశ గ్రామీణ ప్రాంతాలలో వస్తున్న ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక పరిణామాలు మద్రాసు రాజధాని నగరంలో ఉండే ఆంధ్రులలో చాలామందికి తెలియవు. ఆనాడు అభ్యుదయ రచయితల సంఘ శాఖ ప్రారంభోత్సవం, ఆనాటి సాంస్కృతిక ప్రదర్శనలు వీరికి కనువిప్పు కలిగించాయనడం నిస్సందేహం.

నవయుగాంధ్ర నిర్మాతలు అస్తమించిన తరువాత ఈ మహనీయుల వర్ధంతి సభలను ఇతరులు, ఇతరేతర సాహిత్య, కళా సంస్థలు ఎందుకు జరపకుండా ఉండిపోయారు? అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి, వారి వెనుక కమ్యూనిస్టు ఉద్యమమే ఈ నవయుగాంధ్ర నిర్మాతల జాతీయ పునరుజ్జీవనోద్యమాన్ని ఎందుకు కొనసాగించవలసివచ్చింది? స్వార్థ రాజకీయ చింతనతోనా? ఆనాడు అటువంటి దుష్ప్రచారం కమ్యూనిస్టు ఉద్యమంపై జరగలేదా? కాని వాస్తవం ఏమంటే భారత జాతీయ విముక్తి పోరాటాన్ని, సామాజిక విముక్తి పోరాటంగా

పెంపొందించాలనే నిర్దిష్ట జాతీయ లక్ష్యంతో అందుకు మార్క్సిస్టు అవగాహన యిచ్చిన సైద్ధాంతిక భూమికతో కమ్యూనిస్టు ఉద్యమం ఈ జాతీయ పునరుజ్జీవనోద్యమాన్ని కొనసాగించింది. అందుకే ఆంధ్ర ప్రజలు ఆనాటి కమ్యూనిస్టు ఉద్యమ కృషిని హర్షించారు. సాహిత్యాన్ని, కళలను ప్రజల జీవితంలో భాగంగా చేయాలనీ, అదే విధంగా సాహిత్యం, కళలు ప్రజాజీవితాన్ని ప్రతిబింబించాలనీ, సాహితీరంగంలో, కళారంగాల్లో ప్రజాయుగానికి కమ్యూనిస్టులు నాంది ప్రస్తావన చేశారు. అందుకే ఆనాడు కమ్యూనిస్టులకు ప్రజలు బ్రహ్మరథం పట్టారు.

ఆనాటి నవ్య సాహిత్య పరిషత్ కవులలో ప్రముఖులు ఆనాడు అభ్యుదయ రచన, అభ్యుదయ కళలు గురించి ముందు అనేక అపోహలు, అపనమ్మకాలు, సందేహాలు వెలిబుచ్చిన వారందరూ అభ్యుదయ రచయితల మహాసభలలో పాల్గొన్నప్పుడు ప్రజానాట్యమండలి ప్రదర్శనలు చూసినప్పుడు తమ అపోహలు, దురభిప్రాయాలను విడనాడారు. **తాము జరపలేకపోయిన నవయుగాంధ్ర నిర్మాతల వర్ధంతి సభలను, వారి సాహిత్య ప్రచురణలను అభ్యుదయ రచయితల సంఘంవారు వెలికితీసి జరుపుతున్నందుకు, వారి సాహిత్యాన్ని తిరిగి ఆంధ్ర ప్రజల దృష్టికి తీసుకువస్తున్నందుకు వేనోళ్ళ ప్రశంసించారు.** ఇదేదో సంకుచిత స్వార్థ రాజకీయ ప్రయోజనం కోసం కమ్యూనిస్టు పార్టీ వెనుకనుండి సాగిస్తున్నదన్న తమ అభిప్రాయాలు మార్చుకున్నారు. అరసం, ప్రజానాట్యమండలి వెనుక చోదకశక్తి కమ్యూనిస్టు పార్టీయేనని తెలిసిన తరువాత, తెలుసుకున్న తర్వాత కూడా - అభ్యుదయ సాహిత్యవేదిక మీదకు రావడానికి వీరు ఎంతమాత్రం శంకించలేదు. వెనుదీయలేదు. పెద్ద పెద్దలందరు పెద్ద సంఖ్యలోనే ఈ వేదికలమీదకు వచ్చారు.

## నవ్యసాహిత్య పరిషత్ వేదికపై జరిగిన భావజాల సంఘర్షణ

అభ్యుదయ రచయితల సంఘ ఆశయాలను, కార్యక్రమాన్ని హర్షిస్తూ, సమైక్య కృషి సాగించడానికి నవ్యసాహిత్య పరిషత్తు ముందుకు రావడానికి, విజయవాడ అరసం ద్వితీయ మహాసభకు శ్రీ తెలికిచర్ల వెంకటరత్నంగారు అధ్యక్షత వహించడానికి - ముందు నవ్యసాహిత్య పరిషత్తులో తీవ్రమైన భావజాల సంఘర్షణ, చర్చలు, వాదోపవాదాలు జరుగకపోలేదు.

1944 డిసెంబరు 23, 24వ తేదీలలో తెనాలిలో నవ్యాంధ్ర సాహిత్య పరిషత్తు 10వ వార్షికసభలు పెద్దయెత్తున జరిగాయి. శ్రీయుతులు రాయప్రోలు సుబ్బారావు, చింతా దీక్షితులు, కాటూరి వెంకటేశ్వరరావు, కోలవెన్ను రామకోటేశ్వరరావు, తెలికిచర్ల వెంకటరత్నం, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, కురుగంటి సీతారామయ్య, అడవి బాపిరాజు, జమ్ములమడక మాధవరామశర్మ, శ్రీరంగం శ్రీనివాసరావు ఈ సభలలో పాల్గొన్నారు.

శ్రీ సెట్టి ఈశ్వరరావుగారు ఈ మహాసభను సమీక్షించుతూ చెప్పిన ఈ మాటలు గమనించదగినవి : "తెనాలి విద్యావంతులలోను, పత్రికల ద్వారా ఆంధ్ర విద్యావంతులలోను, యీ మహాసభ కార్యకలాపాలు, ఆందోళనను, అలజడిని రేకెత్తించాయని చెబితే సత్యదూరం

కాదు. అభ్యుదయ రచయితల ఉద్యమంపై తీవ్ర వాదోపవాదాలు జరిగాయి. సభను ప్రారంభించిన శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు అభ్యుదయ సాహిత్యంమీద చాలా తీవ్రమైన ఆరోపణలు చేశారు. వారన్న మాటలు :

"రాజకీయ, సాంఘిక విప్లవ జ్వాలలు రగుల్కొలిపి వర్గద్వేషాన్ని పెంపొందించి, మరో ప్రపంచానికి దారితీసే కవిత్మమే కవిత్వమనీ, భగవంతుడు, భక్తి, ధర్మము, నీతి, వివాహము, కుటుంబం ఇవన్నీ సంఘంలో పై అంతస్తులవారు, క్రింది అంతస్తులవారిని అణచివేయడానికి ఏర్పడ్డ మోసాలు. వీటియందు వెర్రినమ్మకం కుదర్చడానికీ, వాల్మీకి నుండి నేటి వరకు కవులు, పండితులు తప్పుడు వ్రాతలు వ్రాసి ప్రజానీకానికి "డోపు" నల్లమందు మత్తెక్కించారు. సూక్ష్మంగా అభ్యుదయ రచయితల వాదం యిది. కన్నడంలో ప్రగతిశీల సాహిత్య రచయితలు ఇట్టివారే" అని కోలవెన్నువారు ఆరోపించారు.

సభపై సమీక్ష వ్రాసిన శ్రీ సెట్టి ఈశ్వరరావుగారు కోలవెన్నువారి ఆరోపణలను (3-1-1945, ప్రజాశక్తి) పూర్వపక్షం చేశారు. అభ్యుదయ రచయితలు వీరేశలింగం, కొమర్రాజు లక్ష్మణరావు, గురజాడ అప్పారావు, ధర్మవరం కృష్ణమాచార్యులు మొ॥ రచయితల వర్ధంతులు జరిపి వారిని విస్మరిస్తున్న ఆంధ్రజాతిని మేల్కొలిపారు. ఇది అందరూ ఎరిగివున్న విషయం అని చెబుతూ శ్రీ కోలవెన్నువారు, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు గారు వెలిబుచ్చిన అపోహలకు, ఆరోపణలకు గట్టి సమాధానం యిచ్చారు. కాని స్వయంగా శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారే కోలవెన్ను, కాటూరి మొదలైన వారికి చాలా సమర్థవంతంగా సమాధానం యివ్వడం గమనించదగింది.

## సంఘానికి - సాహిత్యానికి మధ్య గోడలు పడగొట్టాలి!

కృష్ణశాస్త్రిగారు తమ ప్రసంగంలో యిలా అన్నారు : "సంఘానికి సాహిత్యానికి మధ్య గోడలు మొలిచాయి. ఈ గోడలు పడగొట్టాలి ... కవులు తమ చుట్టూ గోడలు కట్టుకోకుండా, సంఘంతోబాటు అభ్యుదయదాయకమైన దారులలో నడుస్తూ దేశానికి సంఘానికి మేలుచేసే రచనలను చేసి తమ జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. **ఇంతవరకు నవ్యసాహిత్య పరిషత్తు నిర్దిష్టమైన ఒక కార్యక్రమంతో సంఘసేవ చేయకపోవడం శోచనీయం. ఇకమీదటనైనా ఇటువంటి నిస్తబ్దత నుండి మేల్కొని సంఘానికి, సాహిత్యానికి నవ్యసాహిత్య పరిషత్తు సేవ చేస్తుందని ఆశిస్తున్నాను"** అన్నారు.

ఇంతవరకు నవ్యసాహిత్య పరిషత్తుకు నిర్దిష్టమైన కార్యక్రమంతో సంఘం చేయలేక పోయిందని కృష్ణశాస్త్రిగారు ప్రత్యక్షంగా చెప్పడమేకాక, సంఘానికి సాహిత్యానికి మధ్య గోడలు మొలిచాయనీ, కవులు తమ చుట్టూ గోడలు కట్టుకోకుండా సంఘంతోపాటు అభ్యుదయ దాయకమైన దారులలో నడవాలనీ చెప్పడం ద్వారా అభ్యుదయ రచయితలు చూపుతున్న మార్గాన్ని మనం అనుసరించాలి సుమా అని పరోక్షంగా చెప్పనే చెప్పారు.

తెనాలిలో 1944 డిసెంబరు 23, 24 తేదీలలో నవ్యసాహిత్య పరిషత్తు సభలు జరిగిన

తరువాత అదే నెల చివరలో 29, 30, 31 తేదీలలో బెజవాడలో అరసం ద్వితీయ మహాసభ జరగడం, తెలికిచర్ల వెంకటరత్నంగారే మహాసభ అధ్యక్షపీఠం అధిరోహించడం, నవ్యసాహిత్య పరిషత్తు ప్రముఖులు అడవి బాపిరాజు మొదలైనవారందరూ పాల్గొనడం గమనించదగిన విషయం.

నవ్యసాహిత్య పరిషత్తు వేదికమీదనే కాక ఆ రోజుల్లో పలు సాహిత్య వేదికలపై ఇందుపై సుదీర్ఘ చర్చలు జరిగాయి.

బందరులో 1945 సెప్టెంబరు 9, 10 తేదీలలో జరిగిన సారస్వతోత్సవాల సభలో మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మాట్లాడుతూ "అభ్యుదయ రచయితల కృషి చాలా ఉత్తమమైంది. వారితరులను కూడగట్టుకొనేందుకు చేసిన కృషి విశేషం. అందరిని ఒకే తాటిపై నడిపే ఆదర్శం ఉండాలి. ఎన్ని విభేదాలున్నా ఒకరకమైన లక్ష్యం కావాలి. అట్టి లక్ష్యం కోసం కృషిచేస్తున్న అభ్యుదయ రచయితలకు ధన్యవాదాలు" అని తెలిపారు.

శ్రీ తెన్నేటి సూరి ప్రభృతులు తమ రచనలను చదివి వినిపించారు. వాగ్గేయకారులు హరినాగభూషణంగారు "మన దేశం ఎలా బాగుపడాలి, మన సంస్కృతి ఎలా ఔన్నత్యం పొందాలి? అని అభ్యుదయ రచయితలు కృషిచేస్తున్నారు" అని ఆశీస్సులందజేశారు.

1945 నవంబరు 3, 4 తేదీలలో మద్రాసులో అభ్యుదయ రచయితల సంఘ శాఖ నిర్మాణం సందర్భంలో జరిగిన మహాసభలు కూడా ఈ భావసంఘర్షణ జరిగిన విషయం విదితమే.

# 21

# నవ్యసాహిత్య పరిషత్తులో చీలిక : మితవాదుల నిష్క్రమణ

నవ్యసాహిత్య పరిషత్తులోని ప్రముఖులు అభ్యుదయ రచయితల వేదికమీదకు రావడంతో నవ్యసాహిత్య పరిషత్తులో లుకలుకలు ప్రారంభమయ్యాయి. మితవాద దృష్టికల్గినవారు నవ్యసాహిత్య పరిషత్తుకు రాజీనామా యిచ్చి విడివడి మళ్ళీ సాహితీ సమితిని పునరుద్ధరించి ఆ వేదికమీదకు వెళ్ళిపోవడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. అందుకు తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారు, కురుగంటి సీతారామయ్యగారు సారధ్యం వహించారు. కురుగంటివారు ఒకవైపున నైజాం నవాబును ఇంద్రుడు, చంద్రుడు అని పొగడుతూ, రాయప్రోలువారి సారధ్యం క్రింద 400 పేజీల గ్రంథాన్ని వెలయించినవారు అభ్యుదయ రచయితలను తెగనాడటంలో ఆశ్చర్యం ఏముంది? ఆనాటి పరిణామాలపై ప్రజాశక్తి వేసిన "కంచుకాగడా" చూడండి :

### కంచుకాగడా

### "చెప్పేవి శ్రీరంగనీతులు - చేసేది నైజాం పొగడ్త"

### సాహితీ సమితిలో కురుగంటివారి ప్రసంగం

గత నెల 26వ తేదీన తెనాలిలో సాహితీ సమితి వార్షికోత్సవం జరిగింది. చాలకాలం నుండీ నవ్యసాహిత్య పరిషత్తులో అంతర్భూతంగా సాహితీ సమితి వుండేది. నవ్య సాహిత్య

పరిషత్తులోని ప్రముఖులు కొందరు అభ్యుదయ రచయితలుగా పరివర్తనం చెందారు. దీనిని ఇష్టంలేనివారు సాహితీ సమితిని పునరుద్ధరించ పూనుకొన్నారు. "నవోదయ" పత్రికలో యీమధ్య జరిగిన రాద్ధాంత సిద్ధాంతాలు, యీ విషయాన్ని ఆంధ్రలోకానికి తెలియజేశాయి. స్థాపకులు శివశంకరశాస్త్రిగారు జారీచేసిన హుకుం ప్రకారం సాహితీ సమితి సభ్యులు యిష్టం వుండో లేకనో నవ్యసాహిత్య పరిషత్తునుండి రాజీనామా యిచ్చారు. కాని యీ సమావేశానికి అధ్యక్షత వహించిన "శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యుల"వారు "సాధికారంగా" యింకో తీరులో మాటాడుతున్నారు వినండి :

"ఆ రాజీనామాలకు విరోధంగాని, పోటీగాని కారణాలు కావని సాధికారంగా తెల్పుతున్నాను. వ్యక్తిగతంగా ఏ సాహిత్య సంస్థకైనా సేవ చేయటానికి సిద్ధంగా వున్నామని కూడా నొక్కి చెప్పుతున్నాను." (ఆంధ్రపత్రిక, డిసెంబరు 30)

ఇది "నొప్పింపక తా నొవ్వక తప్పించుక తిరుగు ధన్యుల" పద్ధతైనా కావచ్చు. లేదా "ప్రాణ విత్తమాన భంగమందు బొంకవచ్చు"నన్న అమూల్యోపదేశాన్ని శిరసావహించడమైనా కావచ్చు.

కాని ఏది యేమైనా సాహితీ సమితివారు యికముందు అవలంబిస్తామంటున్న విధానంలో ఆక్షేపణకు తావులేదుగాబట్టి, మనం సంతోషించవచ్చు.

* * *

సమాజంలో అభ్యుదయకరమైన ఉద్యమం యేదైనా వచ్చినప్పుడు, దానిమీద దుమ్మెత్తి పోయడం పాతవ్యవస్థకు రక్షకులమనుకునేవారు పరిపాటిగా చేస్తుంటారు. వీరేశలింగంగారి సంస్కరణోద్యమం విషయంలోనూ, గిడుగు, గురజాడల వ్యవహారిక భాషా ఉద్యమాల సందర్భం లోనూ యిది మనం కళ్ళారా చూచాం.

కాని అభ్యుదయకరమైన ఉద్యమాలు దుష్ప్రచారాలకు, పిల్లిశాపనార్థాలకూ నష్టం పొందని పరిస్థితి ఏర్పడినప్పుడు, పూర్వ సాంప్రదాయ సంరక్షకులు తమ ఎత్తుగడలను మార్చివేస్తారు. గత్యంతరంలేక కొత్తగా వచ్చిన అభ్యుదయకరమైన ఉద్యమానికి తామూ అనుకూలురమేనంటారు. కాని వెనుకనుండి గోతులు తియ్యడంమట్టుకు మానరు.

సాహితీ సమితి వార్షికోత్సవానికి అధ్యక్షత వహించిన కురుగంటి సీతారామయ్యగారూ యిదేపని చేశారు. "విజ్ఞానంతోబాటు సహృదయుడికి ఆనందం కూడా కలుగజేస్తేనేగాని సాహిత్యం సిద్ధించ"దనీ, విశ్వశ్రేయస్సు కావ్యప్రయోజనమనీ ఆయన అంగీకరించేరు. కాని వెంటనే ఒక అస్త్రం ప్రయోగించారు. .................... కూడద"ని యింకో బాణం. ఎవరో కవులమీద 144వ సెక్షను ప్రయోగించినట్టు పూర్వకవులు కూడా క్షామంగురించీ, దారిద్ర్యంగురించీ రాశారని చెపుతూ యిప్పుడు ప్రత్యేకంగా అభ్యుదయ సాహిత్యాన్ని నిర్బంధించనక్కర్లేదంటూ తేల్చేశారు. మీకు ఆరోగ్యం కావలెనా? ఈ బీడీలను త్రాగుడు" అనే ప్రచారంలాగా వుందట, అభ్యుదయ సాహిత్యం కావాలనడం. "సాహిత్యానికెంత నీచపరిస్థితి పట్టినదో అప్పుడు నాకు ద్యోతకమైం"దన్నారు. ప్రజాభ్యుదయాన్ని ఆటంకపర్చే సాంప్రదాయాలను విడిచిపెట్టి, పూర్వసాహిత్యంలో వున్న మంచి

సాంప్రదాయాలను అనుసరించాలంటూ, అభ్యుదయ రచయితల సంఘం పుట్టినప్పటినుండీ గోలపెడుతున్నప్పటికీ, అభ్యుదయ సాహిత్యం పని సాంప్రదాయాన్ని నిరశించడమేనన్నట్లు ప్రతి వెంగళప్ప తాను సాంప్రదాయాన్ని దూషించి ద్రష్టనని" అనుకొంటూ ఆత్మవంచన చేసుకుంటున్నాడని సిద్ధాంతం చేశారు.

నవ్యసాహిత్య ఉద్యమం ప్రారంభం అయ్యాక, యిప్పుడు కురుగంటి సీతారామయ్యగారు చేసినట్టుగానే, సనాతనులు ఆ ఉద్యమానికి తప్పుడు వ్యాఖ్యానాలు చెయ్యడం మనం మర్చిపోలేదు.

"భావం లేనిది సాహిత్యమే కానప్పుడు మళ్ళా భావకవిత్వం ఎందుకు? పవిత్రమైన సాహిత్యం భావకవుల మూలాన అపవిత్రం అయిపోతోంది.''

భావకవులు మన సాంప్రదాయాలను ధ్వంసం చేసేస్తున్నారు. పూర్వసాహిత్యాన్ని దూషిస్తున్నారు!

ఈ గోలపెట్టిన మహానుభావుల మాటల్లో యెంత నిజాయితీ వుందో, సాహిత్య చరిత్రకారులైన సీతారామయ్యగారికి చెప్పక్కర్లేదు. కాని నవ్యసాహిత్య పరిణామ రూపంగా అభ్యుదయ సాహిత్యం వచ్చేటప్పటికి అనవసరంగా తాను గాభరాపడి యితరులను గాభరాపెట్టడానికి ప్రయత్నించారు.

పరిస్థితులను అనుసరించి సాహిత్యం మారుతూవుంటుంది. ఆ పరిస్థితుల మార్పును సాహిత్యం ప్రతిబింబిస్తుంది. ఈ విషయాన్ని అర్థంచేసుకోక నిందించడం, తన లోపాల్నే సూచిస్తుందిగాని ఇంకే చెరుపు చెయ్యలేదు. అభ్యుదయ రచయితలను చవకబారు ప్రచారకులుగా లెక్కగట్టడం, హిందూమత పునరుద్ధారణకూ, ఆంధ్రభాషను కావ్యభాషగా చెయ్యడానికీ మహాభారత రచన ప్రారంభించారు. ఈ విషయాన్ని గ్రహించి పురోగమిస్తున్న రథచక్రాలకు అడ్డుపడటం మానుకోవాలి.

* * *

తమ కమ్యూనిస్టు వ్యతిరేకతను ప్రకటించి ప్రసిద్ధులు కావడానికి ప్రయత్నించే మహానుభావులు కొందరున్నారు. ఆ కూటంలో చేరడానికి కుతూహలం వున్నట్టుంది సీతారామయ్యగారికి.

నాజీ ఫాసిస్టు నియంతల చేతిలో విశ్వవిద్యాలయాలు ప్రచారకేంద్రాలుగా మారిపోయాయని, ఆంధ్ర విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసంతో ప్రధాని ప్రకాశంగారన్న మాటలను చెప్పి "కమ్యూనిస్టు నియంతల చేతులలో కూడ యింతేనని నేను పైమాటలకు ఊత యిస్తున్నాను" అని తమ వ్యక్తిత్వాన్ని ప్రకటించుకున్నారు.

ప్రపంచం అంతటికీ ఆదర్శవంతమైన దేశాన్ని నిర్మించుకున్న సోవియట్ ప్రజలపై యిది విషప్రచారం. కాని యీ విషయం పనిచేసేరోజులు గడిచిపోయాయి. దీనిపై చరిత్ర తన తీర్పును యిచ్చినప్పటికీ, అక్కడా యిక్కడా చర్చిల్ వంటివారూ సీతారామయ్యగారి వంటివారూ, యీ విషయంలో తమ నమ్మకాన్ని వదులుకోలేరు.''

పై గంభీర ప్రకటనచేసి సీతారామయ్యగారు మనకో అవకాశాన్నిచ్చారు. ఏమిటంటే ఒక

కోటిమంది తెలంగాణా ఆంధ్ర ప్రజలను నరకయాతనలు పెడుతూ, వారి విజ్ఞానాన్ని సంస్కృతినీ అణచివేస్తూ, కనీసం మాతృభాషయిన తెలుగులో విద్యాభ్యాసం చెయ్యడానికి కూడా అంగీకరించ లేదు నైజాం నవాబు. ఇటువంటి నైజాంను ఇంద్రుడవనీ, చంద్రుడవనీ తెగ పొగుడుతూ, "ఆదర్శ ప్రభువు" అన్న 400 పేజీల ఉద్గ్రంథాన్ని సీతారామయ్య భట్టాచార్యులవారు లిఖించారు. (దీన్ని హైద్రాబాదు ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రచురించింది. అధ్యక్షులు రాయప్రోలు సుబ్బారావుగారు పీఠిక వ్రాశారు.)

ఇటువంటి ప్రజాశత్రువులను "ఆదర్శ ప్రభువు"లంటూ ప్రచారం చెయ్యవద్దంటుంది అభ్యుదయ సాహిత్య. కాని అలా వద్దనువారిని చవకబారు ప్రచారకులుగా జమకట్టేస్తారు సీతారామయ్యగారు.

కమ్యూనిస్టు నియంతలచేతుల్లో విశ్వవిద్యాలయాలు ప్రచారక కేంద్రాలుగా మారిపోయా యంటూ చెప్పిన సీతారామయ్యగారు, తాము కొలువుచేస్తున్న నైజాం "ఆదర్శ ప్రభువు" పాలనలో విజ్ఞానం యెంత వికసిస్తున్నదో వారే చెప్పాలి."

'కంచుకాగడా' 8-1-1947, ప్రజాశక్తి

## "కామ్రేడ్ వీరేశలింగం"

ఆనాడు అభ్యుదయ రచయితల సంఘం, కమ్యూనిస్టు పార్టీలపై వేసిన అభాండాలకు మచ్చుతునక :

కాంగ్రెస్ ప్రముఖులు, గ్రంథ రచయిత అయిన శ్రీ దిగవల్లి వెంకట శివరావుగారు ఆనాటి ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో "కామ్రేడ్ వీరేశలింగం" అన్న వ్యాసం వ్రాస్తూ కమ్యూనిస్టులు వీరేశలింగంగారిని ఒక కామ్రేడ్‌గా చేసి, తమ రాజకీయ ప్రచారానికి వినియోగించుకుంటున్నారని అభాండాలు వేసి దుష్ప్రచారం చేశారు. వృద్ధులకిచ్చి వివాహాలు జరిపించిన సందర్భాలలో అట్టి యువతులు అట్టి వివాహాలను తెగతెంపులు చేసుకొని వచ్చి మహిళాసంఘాల ద్వారా, యువజనసంఘాల ద్వారా, కమ్యూనిస్టు పార్టీ ద్వారా పునర్వివాహాలు చేసుకుంటూంటే కమ్యూనిస్టులు ఆడవాళ్ళను ఎత్తుకొనిపోతున్నారని, చల్లపల్లి రాజా పత్రిక "ములుకోల" రొచ్చుగుంట ప్రచారం చేసేది. ఇటువంటి దుష్ప్రచారాలను ఆనాటి కమ్యూనిస్టు పార్టీ పత్రిక ప్రజాశక్తి తిప్పికొట్టి - వీరేశలింగం, గురజాడ మున్నగు మహనీయులు ప్రారంభించిన సాంఘిక, సాహిత్య విప్లవోద్యమాలను చిత్తశుద్ధితో కమ్యూనిస్టు కొనసాగించుతున్నారని నిరూపించేది. క్రమంగా ఇటువంటి దుష్ప్రచారకుల నోళ్ళు మూతబడ్డాయి.

## నవ్యసాహిత్య పరిషత్తు అరసం - సమైక్య కృషి

ఇంచుమించు అరసం ద్వితీయ మహాసభ నుండి ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే అంతకుముందు వీరేశలింగంగారి వర్ధంతి సమయం నుండి నవ్యసాహిత్య పరిషత్తు, అభ్యుదయ

రచయితల సంఘం జంటకవుల వలె సంయుక్తంగా కృషిచేయడం ప్రారంభించినారని చెప్పవచ్చు. "దేశాభ్యుదయ కాంక్ష నీకు-నాకు సమాన ధర్మం" అన్న మాటను తెలికిచర్ల వెంకటరత్నంగారు అంతకుముందునుంచే ఆచరణలో పెట్టారు. 1944 మే 27వ తేదీన వీరేశలింగం వర్ధంతిని ఆంధ్రదేశమంతటా జరపాలన్న సంయుక్త విజ్ఞాపనపై హితకారిణీ సమాజం, యువజన, విద్యార్థి, మహిళా సంఘాలవారితోపాటు నవ్యసాహిత్య పరిషత్తు కార్యదర్శిగా సంతకం పెట్టిన విషయం విదితమే.

1945 జులై 13వ తేదీన కొమర్రాజు లక్ష్మణరావుగారి వర్ధంతి జరుపవలసిందిగా నవ్యసాహిత్య పరిషత్తు కార్యదర్శిగా తెలికిచర్ల వెంకటరత్నం, అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శిగా తుమ్మల వెంకట్రామయ్యగార్లు సంయుక్త విజ్ఞాపన చేశారు. ఆంధ్ర జాతీయ గీతం కొరకు కమ్యూనిస్టు పార్టీ నాయకులు సుందరయ్యగారు చేసిన విజ్ఞాపన సందర్భంలో ఉత్తమ గేయం నిర్ణాయక కమిటీలో తెలికచర్లవారు ఉన్నారు. 1945 నవంబరు 30వ తేదీన ధర్మవరం కృష్ణమాచార్యులు, గురజాడ అప్పారావుగార్ల వర్ధంతి సభలను జరుపవలసిందిగా శ్రీ తెలికిచర్ల వెంకటరత్నం, శ్రీ తుమ్మల వెంకట్రామయ్య ప్రజానాట్యమండలి తరపున శ్రీ గరికిపాటి రాజారావుగార్లు సంయుక్త ప్రకటన చేశారు. విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావు వర్ధంతి సభలకు నవ్యసాహిత్య పరిషత్తు, అరసం సంయుక్త విజ్ఞాపన చేశాయి (4-4-1945). అలాగే గిడుగు వర్ధంతి (1945 మే 2), దామెర్ల రామరాయ వర్ధంతి (1945 ఏప్రిల్ 4) సభలకు ఉభయ సంఘాలు సంయుక్తంగా విజ్ఞాపన చేశాయి. ఈ విధంగా నాటి నవ్య సాహిత్య పరిషత్తు ప్రముఖులందరూ అభ్యుదయ రచయితల ఉద్యమంతో చేయి చేయి కలిపి ఆంధ్ర సాహితీ ప్రపంచంలో ఒక నూతన శకానికి నాంది ప్రస్తావన చేశారు.

## అభ్యుదయ సాహిత్య, సాంస్కృతిక వేదికలమీదకు వచ్చిన నాటి మహామహులు

"కమ్యూనిస్టులకు మీ స్వీయచరిత్ర ఇవ్వవద్దు. వాళ్ళు దానిని భ్రష్టుపట్టిస్తారు. అచ్చువేసి అమ్ముకొని డబ్బు యివ్వరు" అని కమ్యూనిస్టులపై లేనిపోనివి కల్పించి ఎవరో చెబితే ముందు సందేహించిన చిలకమర్తివారు ఆ తరువాత నిజానిజాలను గుర్తించారు. అభ్యుదయ రచయితల సంఘం యొక్క చిత్తశుద్ధిని, వారి నిజాయితీని గ్రహించారు. వారి పుస్తకం అమ్మగావచ్చే రాయితీని ముందుగానే పట్టుకొని నాటి అరసం నాయకులు శ్రీ చదలవాడ పిచ్చయ్య తదితరులు కాకరపర్రు వెళ్ళి చిలకమర్తివారికి యిస్తే - వారు నివ్వెరపోయారు. తాము వ్రాసిన స్వీయచరిత్ర అచ్చుకాకుండా, కాలగర్భంలో కలిసిపోతుందేమోనన్న భయసందేహాలు నివృత్తి అయిపోవడంతో చిలకమర్తివారి సంతోషానికి అవధులు లేకుండా పోయాయి. ఇది వారి స్వీయచరిత్ర "అవతారిక"లోను, "మరొకమాట"లో సవిస్తరంగా చెప్పుకొన్నారు. (ఈ చారిత్రికాంశాలు మరొకమారు జ్ఞప్తికి తేవడానికే వారి అవతారిక, మరొకమాట పూర్తి పాఠాలు యివ్వడం జరిగింది.)

నాటి బెజవాడ, గుంటూరులలో జరిగిన చిలకమర్తివారి సన్మానసభల వేదికమీదకు

నవయుగాంధ్ర నిర్మాతలు వీరేశలింగం, గురజాడ, గిడుగు, కొమర్రాజు, కాశీనాధుని వర్ధంతి సభల వేదికలమీదకు, సాహిత్య పాఠశాలల వేదికలమీదకు వచ్చిన మహామహులందరినీ చూస్తే ఈ సన్మానసభలు, వర్ధంతి సభలు ఎంత సార్థకత సంపాదించుకొన్నవో, ఎంతగా ఈ పెద్దలందరినీ కదిలించి, వూగించి, ఉత్తేజపరిచాయో అర్థమవుతుంది.

నాటి వేదికలమీదకు వచ్చిన మహామహులలో ఆనాటి జాతీయోద్యమ నాయకులు, లబ్ధప్రతిష్టులైన సాహితీమూర్తులు, కళావేత్తలు, చరిత్ర పరిశోధకులు ఉన్నారు. అందులో దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు, ప్రఖ్యాత మాలపల్లి నవల రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణగారు, శ్రీయుతులు అయ్యదేవర కాళేశ్వరరావు, బెజవాడ గోపాలరెడ్డి, డాక్టర్ ఆచంట లక్ష్మీపతి, దామరాజు పుండరీకాక్షుడు, కాళీపట్నం కొండయ్య, కట్టమంచి రామలింగారెడ్డి, చరిత్ర పరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, మారేమండ రామారావు, నిడదవోలు వెంకట్రావు, కవులు, ప్రసిద్ధ సాహితీవేత్తలు విశ్వనాథ సత్యనారాయణ, కాటూరి వెంకటేశ్వరరావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, గిడుగు సీతాపతి, ఆదిరాజు వీరభద్రరావు, కోరాడ రామకృష్ణయ్య, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, అడవి బాపిరాజు, ముద్దు కృష్ణ, శివశంకరశాస్త్రి, తెలికిచర్ల వెంకటరత్నం, పింగళి లక్ష్మీకాంతం, పాటిబండ మాధవశర్మ, జంధ్యాల పాపయ్యశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, భమిడిపాటి కామేశ్వరరావు, విస్సా అప్పారావు, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, దేశిరాజు కృష్ణశర్మ, పిలకా గణపతిశాస్త్రి, శ్రీశ్రీ, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి, బుర్రా సుబ్రహ్మణ్యం, టంగుటూరి సూర్యకుమారి, కొమ్మూరి పద్మావతి, మల్లవరపు విశ్వేశ్వరరావు, ప్రముఖ కళాకారులు, సినీదర్శకులు, సినీనటులు, రంగస్థల నటులు గూడవల్లి రామబ్రహ్మం, గోవిందరాజుల సుబ్బారావు, నీలం రాజశేషయ్య, సినీ దర్శకుడు, నటుడు నారాయణరావు మొదలైన వారందరూ ఉన్నారు. రానివారెవ్వరు? అంటరానివారెవరంటే మా వెంటరానివారే ... అన్న సూక్తి జ్ఞప్తికి వస్తుంది.

## జాతీయోద్యమానికి-కమ్యూనిస్టు ఉద్యమానికి మధ్య పెద్ద గండి ఏర్పడిన స్థితిలో . . .

ఇక్కడ గమనించవలసిన ముఖ్యాంశం ఏమంటే అభ్యుదయ రచయితల సంఘం వెనుక, ప్రజానాట్యమండలి వెనుక వున్నది కమ్యూనిస్టు పార్టీయేనని వీరందరికి తెలియనిది కాదు. ఆనాడు కమ్యూనిస్టు పార్టీ ప్రజాయుద్ధ నినాదంతో ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడటమే ప్రధాన రాజకీయ కర్తవ్యంగా భావించి యుద్ధవ్యతిరేక వైఖరికి స్వస్తిచెప్పి యుద్ధ అనుకూల వైఖరి తీసుకొని క్విట్ ఇండియా ఉద్యమానికి దూరంగా ఉందన్న విషయమూ విదితమే. ఒకరకంగా ప్రధాన జాతీయ ప్రవంతికి కమ్యూనిస్టు పార్టీ ఎదురీదుతున్న సమయం అది. "మీరు బ్రిటిష్ ప్రభుత్వ ఏజంట్లు, జాతీయ వ్యతిరేకులు" అని కమ్యూనిస్టులపై నిందా ప్రచారమేకాదు విపరీతమైన దుష్ప్రచారం జరుగుతున్న రోజులు. ఈ విధంగా జాతీయోద్యమానికి, కమ్యూనిస్టు ఉద్యమానికి పెద్ద గండి ఏర్పడిన పరిస్థితి అది. అయినప్పటికీ కమ్యూనిస్టు పార్టీ ఆనాడు ఆంధ్ర జాతీయ

పునరుజ్జీవనానికి, సామాజిక, సాహిత్య రంగాల వికాసానికి తలపెట్టిన మహోన్నత, దేశభక్తియుత కార్యక్రమం, విద్యార్థి, యువజన, మహిళా తదితర ప్రజారంగాల ద్వారా ఆంధ్ర ప్రజా జీవితంలోకి చొచ్చుకొనిపోయి, నీటిలో చేపవలె ప్రజలమధ్య ఉండి వారి దైనందిన జీవిత సమస్యల పరిష్కారానికి చేసిన అకుంఠిత కృషి ఆంధ్ర ప్రజల మన్ననలను పొందింది. అదే ఆనాటి దేశభక్తులందరి, జాతీయోద్యమ ప్రముఖులతో సహా అందరి ఆదరాభిమానాలను ప్రశంసలను సంపాదించగల్గింది. కమ్యూనిస్టు పార్టీ రాజకీయ విధానాలతో విభేదించుతున్నవారు సైతం వారు సాంఘిక, సాహిత్య, సాంస్కృతిక రంగాల పునరుజ్జీవనకు చిత్తశుద్ధితో గావించుతున్న కృషికి ముగ్ధులుకాకుండా ఉండలేకపోయారు.

బెజవాడలో **1944** డిసెంబరు **29, 30, 31** తేదీలలో జరిగిన అరసం ద్వితీయ మహాసభ వేదికమీదకు రాష్ట్ర కమ్యూనిస్టు నాయకులు శ్రీ సుందరయ్యగారు సరాసరి కాలిడి ఆంధ్ర జాతీయ గీతం కొరకు విజ్ఞప్తి చేస్తే, ఆనాటి హేమాహేమీలైన ఆంధ్ర కవులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, అడవి బాపిరాజు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, తెలికిచర్ల వెంకటరత్నంగార్లతో సహా ఉత్తమ గీత నిర్ణాయక కమిటీలో ఉండడానికి ముందుకు వచ్చారంటే - ఆంధ్ర ప్రజా జీవితంలోకి కమ్యూనిస్టులు ఎంతగా చొచ్చుకొనిపోయారో, ఆంధ్ర ప్రజల ప్రయోజనాలకోసం అంకిత భావంతో కృషిచేస్తున్న విషయం ఎంతగా నాటి పెద్దలను ఆకర్షించిందో విదితమౌతుంది.

## భావకవులలో వచ్చిన భావపరివర్తన

తెనాలిలో **1943**లో జరిగిన ఆంధ్ర అభ్యుదయ రచయితల మొదటి మహాసభల లగాయతు రెండవ, మూడవ, నాలుగవ మహాసభల వరకు ఆంధ్ర సాహిత్య రంగంలో జరిగిన పరిణామాలను చూస్తే, ముఖ్యంగా నవ్యసాహిత్య పరిషత్తులోని కవులలో, ప్రప్రధానంగా భావకవులుగా లబ్ధప్రతిష్ఠులైనవారిలో వచ్చిన భావపరివర్తన ఎంత ప్రముఖమైనదో స్పష్టంగా ద్యోతకమవుతుంది.

తెనాలిలో జరిగిన మొదటి మహాసభకు తాపీ ధర్మారావుగారు అధ్యక్షత వహించారు. ఇంచుమించు నవ్యసాహిత్య పరిషత్తు కవులు ఎవరూ పాల్గొనలేదు. త్రిపురనేని గోపీచంద్, జి.వి. కృష్ణారావుగార్ల వంటి "ప్రొలికల్ట్" కవులు ముందు ఆహ్వానసంఘంలో ఉండటానికి అంగీకరించారు గాని సభలకు రాలేదు.

**1944** డిసెంబరులో బెజవాడలో ద్వితీయ మహాసభ కాలానికి వచ్చేసరికి నవ్యసాహిత్య పరిషత్తు కవులు యించుమించు అందరూ అభ్యుదయ రచయితల సంఘ వేదికమీదకు వచ్చారు. అప్పటికి అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి కేవలం ఫాసిస్టు వ్యతిరేక ప్రజాయుద్ధ నినాదాలకు కార్యక్రమాన్ని మాత్రమే కాక - ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమ కర్తవ్యాలను చేపట్టి - నవయుగాంధ్ర నిర్మాతల కృషిని కొనసాగించే కార్యక్రమాన్ని స్వీకరించింది. వారి రచనలను బైటికితీసి, వారి వర్ధంతులను జరిపి, వారి ఉద్యమ కర్తవ్యాలను ఆంధ్రదేశం మూలమూలలకు తీసుకొనిపోవ నారంభించింది. ఆంధ్ర జాతీయ కవి చిలకమర్తివారి స్వీయచరిత్ర

ప్రచురణ వారి సన్మానంతో ఈ బృహత్తరమైన కృషికి నాందీ ప్రస్తావన జరిగింది.

అందుచేతనే బెజవాడ అరసం రెండవ మహాసభకు సాక్షాత్తు నవ్యసాహిత్య పరిషత్తు ప్రధాన కార్యదర్శి శ్రీ తెలికచర్ల వెంకటరత్నంగారే అధ్యక్షత వహించారు. వారి ఉపన్యాసమంతా అభ్యుదయ రచయితల సంఘ ఆశయాల వివరణకు, వారిపై ఉన్న అపోహల తొలగింపునకే కేంద్రీకరించారు. ఉపన్యాస ప్రారంభంలో వారు అన్న మాటలు "అభ్యుదయ రచనలకు మార్గం సుగమం చేసిన వీరేశలింగం, గురజాడ అప్పారావు మొదలైన మార్గనిర్మాతలను భక్తితోను, ఆదరంతోను స్మరించుకొందాము. దేశాభ్యుదయ కాంక్ష, విశ్వశ్రేయస్సు సంపాదనము, రచనకు బీజముగా ఉండవలెనని రచయితలు గమనించక, కవిత్వము సంకుచిత మార్గాలుపట్టి నీరసించియున్న సమయంలో యీ మార్గదర్శకులు తమ జీవితాలను ధారపోసి తమ ఆశయాలు ఆచరణలో పెట్టి కృతకృత్యులైనారు.

**అభ్యుదయ రచయితలు దక్షతతో ఆ మహనీయుల సందేశమును దేశం నలుమూలలా వ్యాపింపజేస్తున్నందుకు చాలా సంతోషము** ... సాహితీ సమితి, కవితా సమితి, వాఙ్మయ సమితి, విజ్ఞాన సమితి సాహిత్య మండలి మరెన్నో సమాజాలు తెలుగు భాషకు సేవ చేశాయి ... **మన పూర్వుల నుండి సంక్రమించిన ఆస్తిపాస్తులతో నేడు అభ్యుదయ రచయిత రంగప్రవేశం చేస్తున్నాడు** ... దేశంలో కూడు గుడ్డలకే కరువు. దుర్భరత్వము, దారిద్ర్యము, రోగము, పీల్చి పిప్పిచేస్తున్నవి. ఈ పరిస్థితులలో కర్తవ్య పాలన భారము కొంతవరకు తనమీద పెట్టుకొని అవతరిస్తున్నాడు అభ్యుదయ కవి"... "నేను అగ్రసోదరునిగా ఈ సభకు వచ్చాను. మీకు కాదగిన ప్రయోజనం ఏదైనా ఉంటే చేయడానికి సంసిద్ధుడను. దేశాభ్యుదయ కాంక్ష నీకు నాకు ఉన్న సమాన ధర్మం" అని తమ ఉపన్యాసాన్ని తెలికిచర్ల వెంకటరత్నం ముగించారు.

## ఉత్తేజితులైన దేవులపల్లి కృష్ణశాస్త్రి, అడవి బాపిరాజుగార్లు

అభ్యుదయ రచయితల ఉద్యమం, ప్రజానాట్యమండలి ప్రదర్శనలు ఆనాటి కవులపై ముఖ్యంగా భావకవులపై కల్గించిన ప్రభావం, వారిలో తీసుకొనివచ్చిన భావపరివర్తన అడవి బాపిరాజు, కృష్ణశాస్త్రి మొదలైనవారిలో మరింత ప్రస్ఫుటంగా కనబడుతుంది.

బెజవాడలో 1944 డిసెంబరు చివర జరిగిన అభ్యుదయ రచయితల సంఘ ద్వితీయ మహాసభ సందర్భంలో జరిపిన దామెర్ల రామరాయ చిత్రకళా ప్రదర్శనను ప్రారంభిస్తూ శ్రీ అడవి బాపిరాజుగారు చెప్పిన మాటలు గమనించదగినవి. వారిలా అన్నారు :

"ఇప్పుడు దేశమంతా చిత్రకళా, శిల్పం, కవిత్వం మొదలైన విజ్ఞాన విశేషాల్లో ఉదాత్తమైన భావాలు తరంగితాలై ముంచెత్తుతున్నాయి. అనేక రకరకాల అభిప్రాయాలు ప్రచారంలో వున్నై. వాద ప్రతివాదాలు చెలరేగుతున్నాయి. విమర్శనలూ, ఆత్మవిమర్శనలూ జరుగుతున్నాయి. మంచిదే! మా పూర్వులు మమ్ములను ఆడిపోసుకున్నారు. మీకిప్పుడు మాపై అసంతృప్తిగా వుంది. ఈమధ్య ఒక మిత్రుడు 'బెంగాల్లో కరువు విలయతాండవం చేస్తూంటే, మీరొక్క వాక్యమైనా

వ్రాయరే'మన్నాడు. ఆ విషయంలో హృదయం స్పందించని కవి, దానిని గురించి చక్కగా వ్రాయలేడు. అంతేకాని, అది కళావస్తువు కాకకాదు. కవికి లోకంతో సంబంధం కలిగినకొద్దీ అతనికి అనుభూతి కలుగుతుంది. అతని హృదయం లోకానుగుణంగా స్పందిస్తుంది. బెంగాలు విషయంలో నా హృదయం చలించలేదంటే నాలో ఏదో కొంత లోపం ఉండితీరాలి. అలాంటి హృదయ స్పందనంపొంది మీరు (అభ్యుదయ రచయితలు) యిచ్చిన సందేశమే అభ్యుదయ మార్గం. మీరంతా ప్రజాభ్యుదయ రచనలు చేయండి. వట్టి చర్చలు చేసి లోకానికి సాధించిపెట్టగలిగిందేమీ లేదు."

"బెంగాల్ కరువు విషయంలో నా హృదయం చలించలేదంటే నాలో ఏదో కొంత లోపం ఉండితీరాలి" అని అడవి బాపిరాజుగారు ఆత్మావలోకన చేసుకోవడమే కాక "అలాంటి హృదయ స్పందన పొంది మీరు యిచ్చిన సందేశమే అభ్యుదయమార్గం" అని ప్రశంసించారంటే వారిలో ఎంత ఉత్తేజం, ఎంత భావపరివర్తన కల్గిందో, కల్గుతున్నదో విదితమౌతూంది.

1945 ఏప్రిల్ 29వ తేదీన ఖమ్మంలో నిజాం రాష్ట్ర 12వ ఆంధ్ర మహాసభ సందర్భంలో జరిగిన సారస్వత సభకు శ్రీ అడవి బాపిరాజుగారు అధ్యక్షత వహిస్తూ, "సాహిత్యం ఒక ఆయుధం, సంఘాన్ని మరమ్మతు చేయడానికి అది ఎంతైనా ఉపయోగపడుతుంది. ఏ నాటిక వ్రాసినా, ఏ చిత్రం గీసినా, ఏ పద్యం వ్రాసినా, ఏ పాట పాడినా అది ప్రజాభివృద్ధికి దారితీయాలి. ప్రజలతో సంబంధంలేని సాహిత్యం వ్యర్థం" అన్నారు.

బాపిరాజుగారిలో వచ్చిన భావపరివర్తన ఎంత విస్పష్టంగా ఉన్నదో వేరే చెప్పనక్కరలేదు. **గురజాడవారు తెలుగు సాహిత్యరంగంలో ప్రారంభించిన హేతువాద యుగానికి దూరమైపోయి భావ కవితామార్గంలో చాలాకాలం పయనించి ప్రజలకు, ప్రజాజీవితానికి, ప్రజాజీవిత సమస్యలకు ప్రతిస్పందించలేకపోతున్నామని ప్రముఖ భావకవులైన వీరు గుర్తించిన విషయం ఈ మాటలలో ద్యోతకమవుతుంది.**

## "రానున్న విధానంలో మానవుడే మకుటధారి" - దేవులపల్లి

భావకవితా చక్రవర్తి అనదగిన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిలో వచ్చిన ఈ భావపరివర్తన మరింత స్పష్టంగా కనిపిస్తుంది. 1937 డిసెంబరులో జరిగిన తూర్పు గోదావరి జిల్లా విద్యార్థి మహాసభకు విద్యార్థి పతాకపై "స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం" అన్న ఆశయాలను చిత్రించే "ఆకాశము నొసట పాడుచు అరుణారుణతార" అన్న మకుటంతో కృష్ణశాస్త్రిగారు గేయం వ్రాసి యిచ్చారు. అది ఎంతో ప్రఖ్యాతి వహించింది.

రాజమండ్రిలో 1945 డిసెంబరు 31, 1946 జనవరి 1, 3 తేదీలలో జరిగిన ద్వితీయ రాష్ట్ర అరసం మహాసభకు అధ్యక్షత వహిస్తూ కృష్ణశాస్త్రిగారు యిలా అన్నారు :

"పీడించేవాళ్ళు, పీడించబడేవాళ్ళు వున్న ఈ వర్గ సమాజం ఉండాలని ఎవరూ కోరరు. **రానున్న విధానంలో సాధారణ మానవుడే మకుటధారి.** పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటించేవారు

ఎప్పుడూ అభ్యుదయవాదులు కాజాలరు. ధనిక సమాజం పోవాలనుకోవడమే అభ్యుదయం. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయం. "ఆకలిదప్పులకు, అనేక బాధలకు గురి అయిన కోటానుకోట్లమంది పీడిత ప్రజలు, శ్రమజీవులు నాకండ్ల ఎదుట కనిపిస్తుండగా, నేను ప్రతికూలంగా ఎలా వ్రాయగల్గుతాను. వారి కష్టమే నా కష్టంగాను, వారి సమస్యే నా సమస్యగాను తీసుకొనే తీరుతాను. నేను ప్రజల్లో లీనమైపోగల్గినప్పుడు, వారి భాషలోనే వారి సమస్యలను చిత్రిస్తాను."

"మద్రాసులో జరిగిన అరసం నాల్గవ మహాసభ నాటికి (1947 జనవరి) ఆ మహాసభ ఆహ్వాన సంఘ కార్యదర్శిగా యావత్తు సభ నిర్వహణ బాధ్యతలను వహించడమేగాక అభ్యుదయ రచయితల ఉద్యమం మహోన్నత శిఖరాలను అందుకున్నదనీ, ఈ సంఘం గురించి నిన్నటివరకు - నేటివరకు అపోహలతో ఉన్నవారు సహితం వచ్చి ఇందులో పాల్గొనటమే దీనికి పెద్ద ఆశీర్వచనం" అని కృష్ణశాస్త్రిగారు తన నిశ్చిత అభిప్రాయం వెలిబుచ్చారు. "రచయితలు అధోగతిలో ఉండి ఏమీ పట్టించుకోకుండా ఉంటే, ప్రజలు ముందుకెట్లా నడుస్తారు? ... పేదవాళ్ళకు ఎన్నో సమస్యలున్నాయి. వాళ్ళు దారిద్ర్యంలోను, అజ్ఞానంలోను పడి కుమిలిపోతున్నారు. వాళ్ళ గోడు ఎవరు చెబుతారు? వాళ్ళు చెప్పుకోలేరు. మనం చెప్పాలి ... చెప్పటం మనకే చేతకాకపోతే వాళ్ళకి చేతనవుతుందా? "మనని ధనవంతులు, అధికారులు వచ్చి వీపు చరచనక్కరలేదు. సామాన్య ప్రజలు వినేటట్టు మనం పలికితేచాలు ... ఇటువంటి అభిప్రాయాలు ఈ సమావేశంలో ప్రకటించబడినాయి. ఇటువంటి విశ్వాసాలమీదే అభ్యుదయ రచయితలు ఇల్లు కట్టుకున్నారు."

ఈ నాల్గవ మహాసభలో అభ్యుదయ రచయితల గొంతు వినబడలేదన్న ఒక విమర్శ వస్తే - ఈ సభ విశేషాలను సమీక్షించిన శ్రీ కొడవటిగంటి కుటుంబరావు "కృష్ణశాస్త్రిగారు ఆఖరున చేసిన ఉపన్యాసమే అభ్యుదయ రచయితల గొంతు ... అది విన్న తర్వాత అనేకమంది సభికులలో కొత్త చైతన్యం వచ్చింది" అని ఉద్ఘాటించడం గమనించదగింది.

1945 జనవరి 12వ తేదీన పిఠాపురంలో జరిగిన త్యాగరాయ నవరాత్రి మహోత్సవాల సభలో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మాట్లాడుతూ అభ్యుదయ సాహిత్యం రావలసిన ఆవశ్యకతను మరింత నొక్కి చెప్పారు. సాహితీరంగంలో ఈ పరిణామం సహజంగానే వచ్చిందని చెబుతూ ఆయన ఇలా అన్నారు :

"... ఈ రోజున సాహిత్యంలో గొప్ప విప్లవం వచ్చింది. మా తరంవారం ముందు తరంవారిని నిలదీసి ప్రశ్నించాం. అదేమీ అంత ఉన్నతమైన సాహిత్యం కాదని ఢీకొన్నాం. గెలిచాం. అలాగే ఈవేళ యువకులు మమ్మల్ని ప్రశ్నిస్తున్నారు ప్రజలకు కావలసిన సాహిత్యం సృష్టించమంటున్నారు. మార్పు కావాలంటున్నారు. యుద్ధం, కరువు దేశంలో గొప్ప సంచలనాన్ని కల్గించాయి. కవి వీటిని చూస్తూ సహించగలడా? ప్రస్తుతం మనం అవసరమైన కొన్ని వంతెనలు నిర్మించాలి. శాంతి సమయంలో గొప్ప తాజమహల్‌ను మనం కట్టుకోవచ్చు. నవ్యసాహితీపరులందరికీ వేవడే

చెప్పాను. చెబుతూ వస్తున్నాను. మనం నిలువుగా గోపురాలవలె పెరగడం నేర్చుకున్నాం. అంటే వ్యక్తులు మాత్రం. ఇక అడ్డంగా మైదానాల మాదిరి మనం పెరగాలి. అంటే పదిమందిని కలుపుకోవాలి. ప్రజలలోకి చొచ్చుకుపోవాలి. ప్రజలు నిర్మించిన ప్రతీ నిర్మాణమూ మహోన్నతమైనది. అభ్యుదయ రచయితలు ప్రజల రచయితలు. వారు యువకులనీ, గొప్ప సాహితీ అనుభవం వారికి లేదనీ మనం నిరసించుతూ కాలం గడిపితే మనం శవాలకంటే ఏ విషయంలోనూ గొప్పవాళ్ళం కాము. మనకు జీవం ఉండదు. యువ రచయితలు వాళ్ళ సాహిత్యం పాడుకుంటూ ప్రజల భుజాలమీద చేతులువేసి నడుచుకొని ముందుకు పోతారు. ఐర్లాండులో ఒక్క నాటకం స్వాతంత్ర్యాన్ని సాధించిపెట్టింది. సాహిత్యంలో అభ్యుదయ వచ్చినప్పుడు, సంగీతంలోనూ అభ్యుదయం వచ్చి తీరుతుంది. వచ్చి తీరాలి ... పాటలోని భావం బాణంవలె ఎర్రగుండెకు తగిలి రక్తాన్ని చిమ్మించాలి. అంత సన్నిహితంగా భావాన్ని అందివ్వాలి. కేవలం కుస్తీ సంగీతం నిష్ప్రయోజనం. ప్రజల కష్టసుఖాలు సంగీతంలో చెప్పాలి. కూలివాడు ఈ రోజున నాకు కూలి చాలదంటున్నాడు. కర్షకుడూ అంతే. వారి అనుభూతిని పాటలు పాడితే దేశంలో మహాచైతన్యం వస్తుంది. దేశీయులలో స్వాతంత్ర్య పిపాసను లేవనెత్తే, ముందుకుపోయే సంగీతం కావాలి. అభ్యుదయ సాహిత్యం వస్తున్నట్లే అభ్యుదయ సంగీతం కూడా వచ్చి తీరాలి."

- ప్రజాశక్తి, 24-1-1945

కృష్ణశాస్త్రి, అడవి బాపిరాజుగార్లలోనే కాదు మద్రాసు మహాసభకు హాజరైన అనేకానేకమంది సుప్రసిద్ధ రచయితలలో నూతన భావాలు ప్రస్ఫుటంగా వ్యక్తమయ్యాయి.

# 22

# అదొక స్వర్ణయుగంకాదా?

**నాల్గవ అభ్యుదయ రచయితల సమావేశం గురించి సుప్రసిద్ధ అభ్యుదయ రచయిత, కథకుడు శ్రీ కొడవటిగంటి కుటుంబరావు వ్రాసిన సమీక్ష చదివితే, ఆయన చెప్పినట్లు వాళ్లేళ్ళ కాలంలో అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి ఆంధ్రదేశంలోని అగ్రస్థాయి సాహితీవేత్తలను, కళావేత్తలను తన వేదికమీదకు ఎలా తీసుకొనిరాగల్గిందీ అర్థమవుతుంది. కమ్యూనిస్టు పార్టీ కొనసాగించిన జాతీయ పునర్వికాస ఉద్యమం ఒక శిఖరాగ్ర స్థాయినెలా అందుకొన్నదీ విదితమౌతుంది. ఆనాటి సభలు ఆంధ్రదేశంలో ఒక స్వర్ణయుగానికి నిదర్శనమని చెప్పుకోవచ్చు. ఈ మహాసభలపై శ్రీ కొ.కు. వ్రాసిన ఈ సమీక్ష చదవండి :**

## కొ.కు. సమీక్ష

"మద్రాసు మహానగరంలో జనవరి 17, 18, 19 తేదీలలో (1947) త్యాగరాయనగరు వాణీమహలులో ఆంధ్ర అభ్యుదయ రచయితల సమావేశం - కాదు, ఉత్సవం - జయప్రదంగా జరిగింది.

ఇది నిజంగానే ఉత్సవం. ఎందుచేతనంటే, దీనివెనుక మద్రాసులోని ఆంధ్ర ప్రముఖులనేకులున్నారు. దీని ముందు ఆంధ్రదేశంలో వున్న మహాకవు లెందరో ఉన్నారు. న్యాయమూర్తి గోవిందరాజాచారిగారు అధ్యక్షులుగానూ, రామానుజరావు నాయుడు, నార్ల వెంకటేశ్వరరావు, నీలంరాజు శేషయ్య, దేవులపల్లి కృష్ణశాస్త్రి, తాపీ ధర్మారావునాయుడుగార్ల వంటి పెద్దలు సభ్యులుగానూ, ఆహ్వాన సంఘం ఏర్పాటయినప్పుడే, ఈ ఉత్సవానికి గట్టి పునాది ఏర్పడింది.

రేణుకా పిక్చర్సు నిర్వాహకులు చిత్తూరు నాగయ్యగారూ, స్వతంత్ర ఫిలిమ్సు నిర్వాహకులు కోవెలమూడి ప్రకాశరావుగారి వంటి ఉదారులూ ఆహ్వానసంఘ సభ్యులకు ఊతమిచ్చి అనేక విధాల తోడ్పడి, ఈ ఉత్సవం విజయవంతంగా కొనసాగటానికి ఆధారాలు కల్పించారు.

ఆహ్వానసంఘ కార్యదర్శి కృష్ణశాస్త్రిగారి తియ్యని పిలుపుకు వశులైతేనేమి, అభ్యుదయ రచయితలమీద పెరుగుతూ వస్తున్న అభిమానంవల్ల నైతేనేమి, దేశంలో వున్న ప్రముఖ రచయితలు ఉత్సవంలో పాల్గొనడానికి వచ్చారు. కారణాంతరాలచేత రాలేని పెద్దలు ఆశీస్సులు పంపారు. పిలుపునకు సమాధానా లివ్వనివారిని ఒక చేతివేళ్ళమీద లెక్కించవచ్చు.

పిలకా నరసింహమూర్తిగారు అవ్యవధిగానే అయినా, చిత్రకళా ప్రదర్శనం ఒకటి ఏర్పాటుచేసి, ఈ సమావేశానికి శోభ కలిగించటానికి పూనుకున్నారు. మొక్కపాటి కృష్ణమూర్తిగారు మొదలయిన ఆంధ్ర చిత్రకారుల చిత్రాలు తెప్పించారు. చిత్రకారులు కూడా వచ్చారు.

న్యాయమూర్తి రాజమన్నారుగారు ఈ ఉత్సవానికి సారధ్యం ఒప్పుకున్నారు. క్వాజా అహమ్మద్ అబ్బాస్‌గారు ఉత్సవాలను ప్రారభించటానికి ఒప్పుకున్నారు. నెల్లూరు ... నాటక సంఘంవారూ, కృష్ణా, గుంటూరు మండలాల వైజ్ఞానిక దళాలవారూ ప్రదర్శనాలిచ్చి ఈ ఉత్సవానికి తోడ్పడటానికి అంగీకరించారు. మద్రాసు పట్టణంలో ఉన్న విద్యార్థి సంఘాలలో నుంచి వాలంటీర్లు ముందుకొచ్చారు.

అభ్యుదయ రచయితల సంఘం గర్వించటాని కింతకంటే ఏంకావాలి? ఈ ఉత్సవాలు జయప్రదం కావటానికి ఇంతకంటే ఏంకావాలి?



మొదట తెనాలి, తరవాత బెజవాడ, క్రిందటేడు రాజమండ్రి, ఇప్పుడు మద్రాసు -

సమావేశానికి సమావేశానికీ అభ్యుదయోద్యమం ముందడుగు వేస్తున్నది. ఏయేటికాయేడు కొత్తగా వచ్చిన పెద్దలీ ఉత్సవాలలో పాల్గొంటున్నారు. సాహిత్యం సంకుచిత దృష్టితోగాక ఉదాత్తంగానూ, ఉన్నత సాంఘికాశయాలతోనూ, ప్రజలపరంగానూ, అభ్యుదయకరంగానూ ఉండాలనే భావం సాహితీపరులకు కొత్తది కాదు. కాని ఈ ఆశయాలకు దోహదంచేసి కృషిచేసిన సాహిత్య సంస్థలన్నిటికన్నా అభ్యుదయ రచయితల సంఘం ముందుకు పోయింది. కనుకనే మూడేళ్ళలోపుగా ఈ సంఘం దేశంలో ఇంతగా చర్చలను రేపి, ఇంతమంది రచయితలను కూడగట్టుకుని, తెలుగుతల్లి పత్రికనూ, అభ్యుదయ పత్రికనూ ఇంత విజయవంతంగా నడిపి,

అభ్యుదయ ప్రచురణలు సాగించుతూ, ఈనాడు దేశంలో ఉన్న మేటిరచయితలను ఈ ఉత్సవాలకు రప్పించుకున్నది.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు. వేదుల సత్యనారాయణశాస్త్రిగారు, పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, భమిడిపాటి కామేశ్వరరావుగారు మొదలైన పెద్దలు ఈ వేదికమీద కొత్తగా నిలబడి, వివిధ విషయాలను గురించి తమ అభిప్రాయాలు ప్రకటించారు.

**వీరందరూ ఒక్కసారిగా అభ్యుదయ రచయితలతో ఏకమైపోకపోవటానికి కారణాలున్నాయి. అభ్యుదయ రచయితల కార్యక్రమంతోటీ, ఆశయాలతోటీ, పూర్తి పరిచయం ఉన్న రాజమన్నారు, గోవిందరాజాచారిగార్ల వంటి పెద్దలకూ, ఇవాళే దీని విషయం తెలుసుకోవటం ప్రారంభించిన పెద్దలకూ తేడా వుంది.**

**అదీకాక, ఈ నాలుగేళ్ళుగా అభ్యుదయ రచయితల సంఘం అనేకవిధాల దుష్ప్రచారానికి గురియయి ఉన్నది. ఈ దుష్ప్రచారం సాగించినవారంతా స్వార్థపరులనీ, అజ్ఞానులనీ అనటానికి కూడా వీలులేదు. ఇందులో అనేకమంది కార్యాచరణతో నిమిత్తంలేకుండా తమ సందేహాలన్నిటినీ తాత్త్వికంగానే నివృత్తి చేసుకోవాలని ప్రయత్నించేవారున్నారు. "ఏది అభ్యుదయ సాహిత్యం?" అంటే సమాధానం చెప్పి ఒప్పించటం తేలికకాదు. "అభ్యుదయ సాహిత్యం ఏది?" అంటే నన్నయభట్టు నాటినుంచి నేటివరకూ సమాజంతోపాటు నడిచిన సాహిత్యం చూపవచ్చు.**

తెలుగులో అభ్యుదయ సాహిత్యానికి తొమ్మిది వందల ఏళ్ళ వయసు. అభ్యుదయ రచయితల సంఘం వయసు నాలుగేళ్ళు మాత్రమే. ఈ నాలుగేళ్ళ కాలంలోనే ఈ సంఘం పత్రికలు నడిపింది, పుస్తకాలు ప్రచురించింది. గిడుగు రామమూర్తి, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు మొదలైన మహనీయుల వర్ధంతులు జరిపి ప్రత్యేక సంచికలు కూడా ప్రకటించింది. కిందటి సంవత్సరంనుంచీ ఏటా సాహిత్య పాఠశాల నడపడానికి ఉద్యమించింది.

దేశంలో ఉన్న రచయిత లందరూ ఈ ఉద్యమంలో చేరి కృషి చేసినకొద్దీ ఈ ఉద్యమం సమగ్రమవుతుంది. ఈ ఉద్యమానికి ప్రాణ ప్రతిష్ఠ సరిగా జరిగిందనటానికి నిదర్శనం నానాటికీ ఇందులోకి పెద్దలు రావటమే.



"ఈ సమావేశానికీ నవ్య సాహిత్య పరిషత్సమావేశానికీ తేడా ఏమిటి?" అని కొందరడిగారు. ఉపన్యాసకులకు టైము చాలలేదు. ఆహ్వానాలు పంపినవారికే చోటు చూపవలసివచ్చింది. వైజ్ఞానిక ప్రదర్శనాలు కూడా క్లుప్తీకరించవలసి వచ్చింది. పోను పోను, ఈ ఇబ్బంది జాస్తి అవుతుంది. ఈ సమావేశాలకు అసంఖ్యాకులైన ప్రజలు రావాలి. ఆధునిక అభ్యుదయ రచనలు వినాలి. వాటి ప్రదర్శనాలు చూడాలి. దేశంలో ఉన్న ప్రఖ్యాత రచయితలతో పరిచయం చేసుకోవాలి!

వారి అభిప్రాయాలు వినాలి. సాహిత్యం కొద్దిమందికే ననే అభిప్రాయం రచయితలలో పోతున్నట్టే, ప్రజలలో కూడా అంతరించి, ఈ సమావేశాలు తమకొరకే ననే అభిప్రాయం ప్రజాసామాన్యంలో విస్తరించాలి. ఈ విషయం అభ్యుదయ రచయితల సంఘం గుర్తించి, ముందు సమావేశాలు ఆదర్శవంతంగా జరపాలి. "మరో రెండు సంవత్సరాలకు చూడండి, ఈ ఒక్క సంస్థే దేశంలో నిలబడి వుంటుంది" అన్నా రొకరు. ఇదే జరిగితే అభ్యుదయ రచయితల సంఘంమీద చాలా పెద్ద భారం పడుతుంది.

(కొ.కు. "అభ్యుదయ - మద్రాసు మహాసభ ప్రత్యేక సంచిక" 1947 మార్చి నుండి)

# 23

# జాతీయ పునరుజ్జీవనం : చంద్రంగారి ప్రధాన పాత్ర

ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనకు కమ్యూనిస్టు పార్టీ చేసిన కృషిలో రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ అగ్ర నాయకులలో ఒకరైన మద్దుకూరి చంద్రశేఖరరావుగారు (చంద్రంగారు) ప్రధాన పాత్ర వహించారు. 1942-48 మధ్య ఆంధ్ర దేశ సాహితీ ప్రపంచంలో వచ్చిన ఈ మహత్తర పరిణామాలను, అంతకుముందు తెలుగు సాహిత్యంలో వచ్చిన పరిణామాలను తొలిసారిగా మార్క్సిస్టు దృక్పథంతో, గతితార్కిక భౌతికవాద దృష్టితో వీక్షించిన వారు కమ్యూనిస్టు జర్నలిజానికి పితామహులైన మద్దుకూరి చంద్రశేఖరరావుగారు. వీరేశలింగం, గురజాడ, గిడుగు, కొమర్రాజు మున్నగు ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమ వైతాళికుల రచనలను వారు, నిర్వహించిన పాత్రను తెలుగు ప్రజలకు తిరిగి పరిచయం చేసిన ప్రముఖులు చంద్రంగారు. నాటి ప్రజాశక్తిలోను, అభ్యుదయ, తెలుగతల్లి పత్రికలలోను ఇందుకై వారు అనేక వ్యాసాలు వ్రాశారు. 1944 మేలో వీరేశలింగంగారిపై, వారి సాంఘిక, సాహిత్య సంస్కరణోద్య మాలపై ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ ప్రత్యేక (మే 27) సంచికలో ఒక బృహత్తర వ్యాసం వ్రాశారు. కురుగంటి సీతారామయ్యగారు వ్రాసిన "నవ్యాంధ్ర సాహిత్య వీధులు" గ్రంథ సమీక్ష చేశారు (1944 మార్చి అభ్యుదయ రచనల సంపుటి). రాయిస్టులు - సాహిత్యం (1944 డిసెంబరు తెలుగుతల్లి సంచిక), ఆంధ్ర సాహిత్యంలో కొత్తపోకడలు (1944 అక్టోబరు "అభ్యుదయ" సంచిక), తెలుగుతల్లి హృదయావేదనలు (1952 జనవరి "సందేశం") వ్యాసాలు ఈ 42-48 మధ్యకాలంలో వారు వ్రాశారు. ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమం - కమ్యూనిస్టు పార్టీ కృషిలో చంద్రంగారిదే ప్రధాన పాత్ర అని చెప్పవచ్చు. ఇటు అభ్యుదయ రచయితల సంఘానికి, అటు ఆంధ్ర ప్రజానాట్యమండలికి వారు మార్గదర్శకత్వం వహించారు. పార్టీ తరపున ఈ రెండు రంగాలను తీర్చిదిద్దారు.

అందుచేతనే 1974 ఆగస్టు 22వ తేదీన విజయవాడ విశాలాంధ్ర కార్యాలయంలో జరిగిన చంద్రం సంస్మరణ సభలో అప్పుడు భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శిగా ఉన్న చంద్ర

రాజేశ్వరరావుగారు మాట్లాడుతూ "తెలుగుదేశ సాంస్కృతిక పునరుజ్జీవనకు కమ్యూనిస్టు పార్టీ జరిపిన కృషిలో చంద్రంగారు ప్రముఖ పాత్ర వహించార"ని ఉగ్గడించారు. రాజేశ్వరరావుగారు ఇంకా ఇలా అన్నారు : "జాతీయోద్యమ సంప్రదాయాలను, నవయుగాంధ్ర వైతాళికుల సంప్రదాయాలను కమ్యూనిస్టు ఉద్యమంలోకి తీసుకురావడంలో చంద్రంగారు చాలా పెద్ద పాత్ర వహించారు. ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమానికి మొదటి నుండి ఒక ప్రత్యేకత వుంది. ఇది ఇతర రాష్ట్రాలలో లేదు. కేరళ వంటి కొన్ని రాష్ట్రాలలో వుంది. ఏమిటంటే భారతదేశం యొక్క నాగరికత గురించేకాక ఆంధ్రరాష్ట్ర ప్రజల యొక్క నాగరికత, సంస్కృతి, సాహిత్యం మున్నగువాటిపట్ల ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమం మొదటినుండీ శ్రద్ధ తీసుకుంది. చంద్రంగారికి సాహిత్యంలో ప్రవేశం ఉండటంవలన, ఆ సంప్రదాయాలు వారికి బాగా తెలియడంవల్ల ఆయన దీంట్లో చాలా పెద్ద పాత్ర నిర్వహించారు. ఈ విధంగా ఆన ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమానికి చాలా ప్రత్యేకమైన సేవ చేశారు" అని రాజేశ్వరరావుగారు ఈ సందర్భంలో చెప్పారు.

"ప్రజా పోరాట రంగస్థలి - ఆంధ్ర ప్రజానాట్యమండలి" అన్న తన గ్రంథంలో కళాప్రపూర్ణ డాక్టర్ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు చంద్రంగారి కృషి గురించి ఇలా తెలిపారు :

"ఆంధ్ర భాషకు, సంస్కృతికి వికాసం కల్గించిన వీరేశలింగం, గురజాడ, గిడుగు రామమూర్తిగారలను గురించి అంతకుముందు ఎవరికీ పెద్దగా తెలియదు. అలాంటివారి సంస్కరణ ఉద్యమాల గురించి, ఆనాడు మద్దుకూరి చంద్రశేఖరరావుగారు, తాను దీర్ఘంగా అధ్యయనం చేసిన విషయాలను, అభ్యుదయ రచయితలు ముందుకు తీసుకుపోయారు. ప్రజానాట్యమండలి, గురజాడ దేశభక్తి గేయాన్ని, పూర్ణమ్మకథ, కన్యక కథ గేయాలను, కన్యాశుల్కం నాటకాన్ని వెలుగులోకి తీసుకొనివచ్చారు.

(ప్రజాపోరాటాల రంగస్థలం, ఆంధ్ర ప్రజానాట్యమండలి, పేజీ 42)

ప్రఖ్యాతివహించిన "మాభూమి" నాటకం రచనలో, రిహార్సలలో చంద్రంగారు ఎంతగానో తోడ్పడ్డారు. ప్రజానాట్యమండలి ప్రదర్శనలను, ఇతివృత్తాలను తీర్చిదిద్దారు.

# 24

## అనుబంధం - 1

## "పది, పదిహేనేళ్ళలో కమ్యూనిస్టులు తెలుగు సమాజాన్ని గుర్తించలేనంతగా మార్చివేశారు!"

### - మహీధర రామమోహనరావు

**1934** ప్రాంతాలలో దేశంలో పలుముఖాలుగా సోషలిస్టు శక్తులు ఆంధ్రలో విస్తరిస్తున్న ఒక పార్టీగా రూపొందాయి. 1934-35లలో సోషలిస్టు సిద్ధాంతం ప్రచురణ కుద్యమించిన మా అన్నదమ్ములం 1935 అక్టోబరులో కమ్యూనిస్టు పార్టీలో సభ్యులం అయ్యాం. మేమేకాదు, ఆ ప్రథమ దీనాలలో కమ్యూనిస్టు పార్టీవేపు చేరిన తెలుగు యువతలో అత్యధిక భాగం జాతీయ కాంగ్రెస్ నడుపుతున్న ఉద్యమాలలోంచి వచ్చినవారే. ప్రధానంగా గాంధేయవాదం ప్రభావమూ, ప్రత్యక్షంగానో పరోక్షంగానో సమాజ సంస్కరణోద్యమంతో సంబంధాలు గల వారూనే. కార్యకారణ సంబంధాలను బోధిస్తూ ప్రపంచ గతిక్రమాన్ని గురించి మార్క్సు చెప్పిన సూత్రాల అవగాహనలో వారు సంఘ సంస్కరణోద్యమాన్ని కొత్త దృష్టిలోంచి చూశారు. ఆ కొత్త దృష్టి వారిలోని సమాజ సంస్కరణాభిలాషకు క్రియాశీల ఉత్తేజాన్ని ఇచ్చింది. ఆ ఉత్తేజంతో, యువరక్తపు వేడిలో, జాతీయోద్యమం ఉద్దీపింపచేసిన **త్యాగోత్సాహంతో వారు, పది పదిహేనేళ్ళలో తెలుగు సమాజాన్ని గుర్తించరానంతగా మార్చివేశారు.**

ఇళ్ళల్లో పెద్దవారిని, తల్లిదండ్రులను, గ్రామాలలోని కట్టుబాట్లను కూడా ధిక్కరించి ఈ యువకులు తమ భార్యలను కూడా తమతోపాటు కార్యరంగంలోనికి తెచ్చారు. పార్టీ కొత్త కేడరును తయారుచేసుకొనేందుకు నాయకత్వంతో వేసవి పాఠశాలలను నడిపింది. ప్రజాసమస్యల పరిష్కారానికై సమిష్టి కార్యాచరణను ప్రోత్సహించారు. అందుకై గ్రామాల్లో ప్రజా సంఘాలను నిర్మించారు. రైతు సంఘాలు, వ్యవసాయ కూలీ సంఘాలు, మహిళ, యువ, చివరికి బాల సంఘాలు, వీనికి వత్తాసుగా రచయితలకు సంఘం. కళాకారులకు సంఘం. ఈ పనుల వత్తాసుతో దేశ సమస్యలమీద సామాన్య ప్రజలను స్పందింపజేసి, త్యాగస్ఫూర్తిని కలిగింపగలిగారు. బెంగాల్ కరువు రోజుల్లో అక్కడికి ధాన్యం గ్రామాలలో పోగుచేసి పంపారు. తిండిలేక, ప్రజాసేవలో నీరసపడి రోగపడిన పార్టీ కేడరును తీసుకువచ్చి శిబిరాలలో వారిని పోషించి బాగుచేసి మరల పంపారు. (బందరు శిబిరం)

స్త్రీ విద్యను ప్రోత్సహిస్తూ తమ చెల్లెళ్ళనూ, కూతుళ్ళను విద్యాలయాలకు తెచ్చారు. వారిని ఉద్యోగాలకు ప్రోత్సహించారు. అన్నింటికన్నా ప్రధానమైనది వివాహ విధిలో వారు ప్రవేశపెట్టిన మార్పు. సభాముఖంలో వధూవరులచేత ప్రమాణాలు చేయించడంతో వివాహ విధి ముగుస్తుంది.

ప్రారంభ సంవత్సరాలలో వివాహ విధి కాలాన్ని పొడిగించేందుకు ఉపన్యాసాలు వుండేవి. వివాహ వ్యవస్థ పుట్టు పూర్వోత్తరాలు - వివాహ విధిలో వివిధ ఆచారాల పుట్టుపూర్వోత్తరాల గురించి విధిగా ప్రసంగాలుండేవి. ఆర్థిక మాంద్యము ఫలితంగా కాలుచేతులు ఆడని పరిస్థితులు దేశంలో వుండడంచేత ఖర్చు తగలకుండా సులభంగా తేలిపోయే ఈ దండల పెళ్ళి లేక మీటింగు పెళ్ళి పద్ధతికి ఒక విధంగా జనం ఎగబడ్డారు. కమ్యూనిస్టులు కానివారు కూడా యీ పద్ధతికే వోటు నివ్వడంతో ఈనాటికిదే పద్ధతిని అనుసరించబడుతూంది. ఇటీవల కాలంలో డబ్బున్నవాళ్ళు పందిళ్ళకూ, అలంకారాలకీ, విందులకీ విపరీత వ్యయం చేస్తున్నా, వివాహ వ్యవధీ, పద్ధతి మాత్రం దండల పెళ్ళి పద్ధతికే కట్టుబడి వుంటున్నాయి.

యుద్ధకాలంలో నిత్యావసర వస్తువుల పంపకంలో సహకార సంస్థల్ని ప్రోత్సహించారు. ప్రభుత్వపు వ్యవహార పద్ధతులకు ఫలితంగా మరమ్మతులకు నోచుకోకుండా పోతున్న కాలువలు, మురుగు కాలువల మరమ్మతులను జనసమీకరణతో పూర్తిచేశారు.

ఈ విధంగా సర్కారు రాయలసీమ జిల్లాలలో కమ్యూనిస్టు పార్టీ మార్క్సిస్టు సిద్ధాంతాల ప్రభావంతో అంతవరకూ సమాజంలో సహజ క్రమంలో విస్తరిల్లుతున్న ఫ్యూడల్ వ్యతిరేక సంస్కరణలను చారిత్రక పరిజ్ఞానంతో త్వరితపరిచారు. తాము ముందుండి దారితీశారు. పది పదిహేనేళ్ళలో తెలుగు సమాజపు స్వరూపమే కాదు, సంస్కారం కూడా మారిపోయింది. సమాజాన్ని వెనక్కి లాగి పట్టుతున్న కులవ్యవస్థ నామమాత్రావశిష్టం అయింది. అంతర్వర్ణ వివాహాలను జనం తప్పుపట్టే స్థితి పోయింది. ఆడపిల్లలు మగవాళ్ళతో సమంగా ఉన్నత విద్య పొందుతున్నారు. ఉన్నతోద్యోగాలు చేస్తున్నారు. దేశ విదేశాలలో స్వతంత్రంగా జీవిస్తున్నారు. సాహిత్య పీఠాల నెక్కుతున్నారు. రచయిత్రులుగా రాణిస్తున్నారు. సాహిత్యం స్వరూపం కూడా మారిపోయింది. మానవత్వం, సర్వసమానత్వం, ప్రజాతంత్ర స్వభావం జీవిత ధర్మాలుగా ముందుకు వచ్చాయి. కులం పెద్దరికాలు, సాంప్రదాయికాచారాల సర్వ ప్రాధాన్యం వెనక్కిపోయాయి.

తెలంగాణా జిల్లాలలో నిజాం వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక సాయుధ పోరాటానికి కమ్యూనిస్టు పార్టీ నడుంకట్టింది. దేశకాల పరిస్థితుల ప్రభావంతో 1945 వరకూ ఆ జిల్లాలలో సాగుతుండిన విద్యా, సాంస్కృతిక సంస్కరణోద్యమం ఆర్థిక సంస్కరణోద్యమంగా పరివర్తన పొంది, భూమి సంబంధాలపై తిరుగుబాటుగా విస్తరించింది. ఈ ఫ్యూడల్ వ్యతిరేక పోరాటం సాయుధ రూపం ధరించింది. ఆ పోరాటాలు అనేకమంది కవుల్నీ కథా రచయితల్ని, నవలల్ని, నాటకాల్ని ముందుకు తెచ్చాయి.

1948 నాటి వరకూ జరిగిన ఈ పరివర్తనలకు మార్గదర్శకత్వం, నాయకత్వం ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టు పార్టీలది కాని, ఒక్కమారుగా కమ్యూనిస్టు పార్టీ ఈ రంగాలన్నింటినుంచి దూరమయింది. పెద్దరికం కోల్పోయింది. అదేకాదు, ఆ ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక సంస్కర ణోద్యమాలనుంచి పూర్తిగా అదృశ్యమయింది. దేశంలోని రాజకీయ పార్టీలలో ఒకటయింది.

"తెలుగు సంస్కృతి-మార్క్సిజం ప్రభావం"

నాగార్జున విశ్వవిద్యాలయం సదస్సులో మహీధర రామమోహనరావు, 1992

## 25

అనుబంధం - 2

# 19వ శతాబ్దపు సాంస్కృతిక పునరుజ్జీవన వారసత్వాన్ని స్వీకరించిన కమ్యూనిస్టు ఉద్యమం

- డాక్టర్ వకుళాభరణం రామకృష్ణ

"19వ శతాబ్దపు సాంస్కృతిక పునరుజ్జీవన వారసత్వాన్ని, అందులో వుండే ప్రధానాంశాల్ని కమ్యూనిస్టు ఉద్యమం స్వీకరించింది...

కమ్యూనిస్టు పార్టీ ఎజెండా మాత్రం పరిమితమైన ఎజెండా కాదు. అది చాలా విస్తృతమైన, విశాలమైన ఒక ఎజెండా. దేశ స్వాతంత్ర్యం ఒక్కటే దాని ధ్యేయం కాదు, రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాహిత్యం, కళలు, స్త్రీ పురుష సంబంధాలు, విద్య, ప్రజా ఉద్యమాలు, చరిత్ర, తత్వశాస్త్రం మొదలైన అన్ని రంగాలలో కమ్యూనిస్టు పార్టీ తన ప్రత్యామ్నాయ కార్యక్రమాన్ని ప్రజల ముందుకు తీసుకువచ్చింది.

ఇది చాలా జాగ్రత్తగా ఆలోచించి రచించిన ఒక భవిష్యత్ ప్రణాళిక. ఈ అంశాలన్నీ కమ్యూనిస్టు పార్టీ ఉద్యమంలో భాగంగా వున్నాయి. అయితే ఇందులోని అంశాలు అంతకుముందు వచ్చిన రాజకీయ ఉద్యమాలలో కూడా వున్నాయా లేదా అని అనవచ్చు. అయితే, 19వ శతాబ్దంలో వచ్చినటువంటి మేధావులు, సంస్కర్తలు, జాతీయోద్యమంలో వచ్చినటువంటి జాతీయ బూర్జువా వర్గం (ఈ పదం వాడుతున్నందుకు క్షమించాలి - పెట్టుబడిదారీ వర్గం అని అయినా అనవచ్చు.) వెనుకున్నదానికంటే, ఆశించినదానికంటే కమ్యూనిస్టు పార్టీ ఈ అన్ని రంగాలలో ముందుకు పోయింది.

ఉదాహరణకు స్త్రీ పురుష సంబంధాలు సమాజంలో ఏ విధంగా వుండాలి అనే విషయంలో కమ్యూనిస్టు పార్టీ ఏమి చెప్పిందో చూద్దాం. సిద్ధాంతపరంగా ఈ విషయంలో కమ్యూనిస్టులు ఏమి చెప్పారో తెలుసుకోవాలంటే పుచ్చలపల్లి సుందరయ్యగారు వ్రాసిన "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అనే పుస్తకం ఒకసారి చూడండి. ఇది 1946లో వ్రాసిన పుస్తకం. దీని టైటిల్ కూడా చూడండి. దాని శీర్షిక "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" ఇదే నినాదం 1952 ఎన్నికలలో కూడా కమ్యూనిస్టు పార్టీ యిచ్చింది. విశాలాంధ్రలో ప్రజారాజ్యం అన్న ప్రతిపాదన ఒక్క కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమంలో తప్ప ఆంధ్రరాష్ట్రంలో ఏ యితర రాజకీయ పార్టీ ఎన్నికల ప్రణాళికలో లేదు. ఆంధ్ర ప్రజలందరూ ఏకమై ఒక రాష్ట్రాన్ని ఏర్పరచుకోవాలి అన్న నినాదం ఏ యితర రాజకీయ పార్టీ యివ్వలేదు. ఈ విషయాన్ని అప్పుడు నిర్ద్వంద్వంగా చెప్పిన మరొక రాజకీయ పార్టీ ఏదీ లేదు.

## "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" నినాదం, దాని విశిష్టత

ఆంధ్ర దేశంయొక్క ఐక్యత, ఆంధ్ర ప్రజలు నివసించే మూడు ప్రాంతాలు కలిసి ఒక రాష్ట్రం ఏర్పరచాలనే ప్రతిపాదన తమ ఎన్నికల ప్రణాళికలో చేసిన పార్టీ కమ్యూనిస్టు పార్టీయే తప్ప మరొకటి లేదు. దీనికి విశాలాంధ్ర అని కమ్యూనిస్టులు పేరు పెట్టారు. విశాలాంధ్రలో రావలసినటువంటి ప్రజారాజ్యం గురించి ఒక కమ్యూనిస్టు నాయకుడు ఎంత గొప్ప బ్లూప్రింటు (నమూనా ప్రణాళిక) తయారుచేశారంటే ఎక్కడో దర్శి తాలూకాలో మారుమూలనున్న ఒక వాగు సంవత్సరానికి పది నెలలు నీరు వుండని దోర్నపు వాగు (అక్కడే మా స్వగ్రామం (పాకల) వుంది)కు అడ్డంగా ఒక కట్టగట్టి, అక్కడ కనుక నీటిని ఆకట్టుకొన్నట్లయితే అక్కడ వున్న రైతులకు ఇది ఉపయోగపడుతుంది అన్నంతటి సూక్ష్మమైన వివరంతో సమా మొత్తం ఆంధ్రదేశం యొక్క ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక భవిష్యత్ ప్రణాళికను విశాలాంధ్రలో ప్రజారాజ్యం అన్న పుస్తకంలో ఆయన వ్రాశాడు. అందులో స్త్రీ పురుష సంబంధాల గురించి, స్త్రీలకు కావలసిన హక్కుల గురించి కూడా వ్రాశారు.

ఒక సోషలిస్టు సమాజంలో వుండే స్త్రీల ప్రసూతి సెలవు మొదలు విడుకుల హక్కుల వరకు స్పష్టంగా వ్రాశారు. విడాకులు ఏ పరిస్థితులలో తీసుకోవచ్చు, విడాకుల హక్కు ఏ విధంగా తీసుకోవచ్చు అన్న విషయాలదాకా వ్రాశారు. దానితో మీరు ఒప్పుకోవచ్చు విభేదించవచ్చు. చాలా విప్లవాత్మకంగా వున్నాయని అనుకోవచ్చు లేదా చాలా మితవాద ధోరణిలో వున్నాయని అనుకోవచ్చు కాని కమ్యూనిస్టు పార్టీకి ఒక ప్రత్యామ్నాయమైన ప్రణాళిక అందులో వుంది. ఎందుకంటే 19వ శతాబ్దంలోగానీ లేదా 20వ శతాబ్దంలోగానీ జాతీయోద్యమంలోగాని రానటువంటి ఒక బ్రహ్మాండమైన మార్పు, ప్రాపంచిక దృక్పథంలో, కమ్యూనిస్టు ఉద్యమ ప్రాపంచిక దృక్పథంలో వచ్చింది."

## చరిత్ర అధ్యయనంలో ప్రధాన సూత్రం

"డబ్భై సంవత్సరాల క్రితం ఈ దేశంలో బయలుదేరిన కమ్యూనిస్టు ఉద్యమం నేడు ఏ స్థితిలో ఉంది? కమ్యూనిస్టు ఉద్యమం సాధించిన కృషి ఏమైనా ఉన్నదా? అది జాతికిచ్చిన ఫలితం, ప్రయోజనం ఏమైనా ఉన్నదా? దేశంలో, ఈ సమాజంలో కమ్యూనిస్టు ఉద్యమం యొక్క సందర్భ ఔచిత్యం (Relavance) నేడు ఏమైనా ఉన్నదా? ప్రపంచం నేడు ఏకప్రపంచంగా మారిపోయిన పరిస్థితుల్లో, సోషలిస్టు శిబిరం లేక సోషలిస్టు ప్రపంచం కుప్పకూలిపోయిన పరిస్థితుల్లో ఇంకా కమ్యూనిస్టు పార్టీకి, కమ్యూనిస్టు సిద్ధాంతానికి రోజులున్నాయా? ఈ సిద్ధాంతానికి నూకలు చెల్లిపోలేదా? అనే ఒక చర్చ కూడా తీవ్రంగా జరుగుతోంది ... ఆంధ్రదేశానికి సంబంధించినంత వరకు కమ్యూనిస్టు ఉద్యమం జాతి పునరుజ్జీవనానికి ఏవిధమైన కృషి చేసింది? అన్న విషయం పరిశీలించడానికి వీలవుతుంది.

... ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం గురించి, అది తీసుకువచ్చిన పునరుజ్జీవనాన్ని

గురించి చెప్పుకుంటున్నామంటే ఈవేళ కమ్యూనిస్టు ఉద్యమం ఈ స్థితిలో ఎందుకు ఉన్నదీ అన్న విషయం అర్థంచేసుకోడానికి కూడా ఈ చర్చ ఉపయోగపడుతుంది. చరిత్ర అధ్యయనంలో ఒక ప్రధాన సూత్రం గతాన్ని తర్కించడం, గతాన్ని పరీక్షించడం, వర్తమానాన్ని అర్థం చేసుకోడానికి ఇది అవసరం అని మనం చెప్పుకుంటాం. గతాన్ని తెలుసుకోడానికి కాదు. వర్తమానాన్ని తెలుసుకోడానికి గతాన్ని తెలుసుకుంటాం. గతాన్ని గురించిన పరిజ్ఞానం మనకు లేకపోయి నట్లయితే ఈవేళ ఈ స్థితిలో వర్తమానం ఎందుకున్నది? అన్న విషయం అర్థంకాదు. దీనిని అర్థంచేసుకొని భవిష్యత్తు కూడా కొన్ని బాటలు వేసుకోడానికి అవకాశం ఉంటుంది. అయితే ఇది ఈ మొత్తం ఉద్యమం యొక్క మంచిచెడ్డలు, దానికుండే వెలుగు నీడలు కూలంకషంగా చర్చించడానికి యిప్పుడు వీలులేదు. కాబట్టి రేఖామాత్రంగా ఈ ఉద్యమం అసలు ఎందుకు వచ్చింది? దాని చారిత్రక అవసరం ఏమిటి? అన్నది పరిశీలించాలి.

"ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమంలో కమ్యూనిస్టు ఉద్యమం నిర్వహించిన పాత్ర"
ఏటుకూరి బలరామమూర్తి ప్రథమ వర్ధంతి స్మారకోపన్యాసం, 1997 ఏప్రిల్ 3వ తేదీ
డాక్టర్ వకుళాభరణం రామకృష్ణ, కమ్యూనిజం, 1997 మే

## 26

**అనుబంధం-3**

# తెలుగు సాహితీరంగంలో స్వర్ణయుగాన్ని స్థాపించిన అభ్యుదయ సాహిత్యోద్యమం

### ఒక పర్యాలోకనం

**- తుమ్మల వెంకటరామయ్య**
(అరసం నిర్మాతలు)

అభ్యుదయ సాహిత్యోద్యమం మన దేశంలో ఆవిర్భవించి అర్ధ శతాబ్ది కాబోతోంది. తెలుగు సాహితీ క్షేత్రంలో వేరూని నాలుగు దశాబ్దాలు దాటింది. సుదీర్ఘ చరిత్ర వొక్కటే అభ్యుదయ ఉద్యమానికి 'కితాబు' కాదు. గతకాలపు ఘనకీర్తి మాత్రమే కాదు. తిరుపతిలో 1985 సెప్టెంబరు 14, 15వ తేదీలలో జరిగిన ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం తొమ్మిదవ మహాసభలు ఈ విషయాన్నే రుజావు చేశాయి. అభ్యుదయ సాహితీ స్రవంతి జీవనదిలాంటిది. అది అణగారిన ప్రజల హృదయావేదనల్ని ప్రతిబింబించింది. రైతుల కడగండ్లకు, కార్మికుల కష్టాలకు స్పందించిన కవులు, "అన్నా కూలీ లేకము కావలెరా" అని అన్నారు. "ఆకలి మంటచె మలమలమాడే అనాథలంతా లేవండోయ్" అని మేల్కొల్పారు. "ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా" అని నినదించారు. "రైతు భజన"లు చేశారు. అలా పీడిత తాడిత హృదయావేశంతో పరవళ్ళు

తొక్కుతూ "మహాప్రస్థానం" చేసిన అభ్యుదయ కవితా స్రవంతి 'నయాగరా' జలపాతంలా ఉరికింది. ఉన్నత పర్వత శిఖరాల నుండి దూకిన జలపాతం మైదానాలలో గంభీరంగా పరిణతిచెందిన మాతృమూర్తిలా ప్రవహించింది. ఈ ప్రవాహోదకంలో చెత్తా, చెదారం చేరలేదా? మురికినీరు పారలేదా? ఇవన్నీ సంశయాత్ముల సందేహాలు. నిజమే. ఐతే వీరు చూచేది బొరుసు మాత్రమే, బొమ్మకాదు.

అభ్యుదయ సాహిత్యానికి చరిత్ర వుంది. వీరేశలింగం, గురజాడ, గిడుగుల అపూర్వ సేవను విడమర్చి తెలియజేసి సాహితీరంగంలో స్వర్ణయుగాన్ని స్థాపించింది. దీనుల, హీనుల, పతితుల బాధాసర్పదష్టులను మేల్కొల్పే వైతాళిక పాత్ర నిర్వహించింది. స్వాతంత్ర్య సాధనలో సామాజిక న్యాయ సముపార్జనలో సమరశీల పాత్ర వహించింది. మానవ కల్పిత క్షామాలకు బలియైపోతున్న బెంగాల్, విశాఖ, రాయలసీమ క్షుధార్తుల హృదయ వేదనలకు స్పందించింది. భూస్వామ్య, జమీందారీ, నిజాం సంస్థాన, తెలంగాణా రజాకార్ల పీడనకు, హింసకు గురియైన అమాయక ప్రజలలో చైతన్యం రగిల్చి మహోద్యమ నిర్మాణానికి తన వంతు కర్తవ్యాన్ని నెరవేర్చింది. ఇవన్నీ నిజమే కాని ... అంటూ కుశంకలు వెలిబుచ్చేవారిని కుటిలబుద్ధులని కొట్టిపారవేయలేము. సంఘ సంస్కర్తయైన వీరేశలింగంగారిని సంస్మరించినందుకే, "మంచి గతమున కొంచమేనోయ్" అన్న గురజాడ అడుగుజాడలో నడిచినందుకే, ప్రజలకు అందుబాటైన వ్యావహారిక భాష కావాలన్న గిడుగును అనుసరించినందుకే - అభ్యుదయ రచయితలను ఆనాడు తెగనాడారు. ఈనాడూ తిట్టిపోసేవారు లేకపోలేదు.

"అదంతా నిజమే కాని, మీ కాలం చెల్లిపోయింది. మీ యుగం చచ్చిపోయింది" అంటూ సాహితీ విమర్శక వైద్యులు కొందరు బయలుదేరారు. వీరు ఈ వైద్యశాస్త్రంలో పట్టభద్రులో కాదో మాకు తెలియదుగాని, ఈనాడు కుప్పతెప్పలుగా వెలుస్తున్న నాటువైద్యులు - అభ్యుదయ సాహిత్యం నాడిని పరీక్షించడానికి తయారవుతున్నారు. బతికుండగానే శవాలగదిలో పారవేయమనే నిర్లక్ష్యపు డాక్టర్లులా ప్రవర్తిస్తున్నారు. "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా" అంటూ తిర్యక్ దృష్టితో చూచే మరికొందరు "మీ తర్వాత దిగంబర కవిత వచ్చింది. ఆ తర్వాత విప్లవ రచయితల ఉద్యమం వచ్చింది. ఆ పిమ్మట వచన కవిత్వం, ఈనాడు మినీ కవిత్వం వచ్చాయి. ఇవన్నీ ఒకదానికంటే మరొకటి అభ్యుదయకరమైన"వంటూ కొత్త పరిణామవాద సూత్రాలు వల్లిస్తున్నారు. ఈ భాష్యకారులకు కావలసింది తాజా సరుకుతో తాదాత్మ్యత చెందటం. భేష్ అని మెచ్చుకొని వీపు చరిచి, సెహబాష్ అని అనిపించుకోవటం. ఏ ఉద్యమానికైనా ప్రాణం ప్రజ. ఆ ప్రజల మనోభీష్టాలను గాఢంగా పరిశీలించగల నిశితదృష్టి, వివేచన, తాత్విక సిద్ధాంతం ఉండాలన్న అవగాహన లోపించడంవల్లనే ఈ విమర్శకులు యిలాంటి భ్రమ ప్రమాదాలకు లోనౌతున్నారు. ఆయా సంక్లిష్టదశలలో ఉద్భవించిన సాహిత్య ఉద్యమాలను ఒక్క కలంపోటుతో కొట్టిపారవేయడం మా ఉద్దేశం కాదుగాని, అభ్యుదయ సాహిత్య ఉద్యమానికి షాక్ ట్రీట్‌మెంట్ ఇచ్చామనుకొన్న

దిగంబర కవులు, వారి అనంతర కవులు ఏమయ్యారు? తాము నమ్ముకొన్నవారు తమ ఆశల్ని వమ్ముచేశారంటూ వాపోవలసిన స్థితికి వచ్చారు.

"ఇది ముసలి యెద్దు. నడుం విరిగిపోయింది. ఇక కదలలేదు. మెదలలేదు" అనే ధోరణిలో ఎద్దేవా చేసిన ప్రముఖులు తమ ముఖాల్ని ఎంత మంచి అద్దంలో చూసుకొన్నా కనబడేది ముక్కలు ముక్కలైన ప్రతిబింబమే. పగిలిన అద్దంలో చూచినా మరింత వికృత రూపమే. అలా అని మా సహచరులను గేలిచేయడం మా ఉద్దేశం కాదు. పారతంత్ర్యంలో పడి వున్నప్పుడు స్వాతంత్ర్య సాధనకై కృషిచేసి వారి సహకారాన్ని కోరింది అభ్యుదయ రచయితల సంఘం. ప్రపంచానికి ఫాసిస్టు ప్రమాదం వాటిల్లిన రోజుల్లో ఉద్భవించిన అభ్యుదయ రచయితల ఉద్యమం ఉత్తమ సాహితీ సంస్కృతుల పరిరక్షణకు కంకణం కట్టింది. ఆనాడు సమాజ రుగ్మతలను తెలుసుకొన్న వాస్తవికతావాదులతో కూడా చేయి కలిపింది. పరిస్థితులు మరింత పరిణతిచెందిన ఈనాడు సోషలిస్టు వాస్తవికత ధ్యేయంగా అభ్యుదయ రచయితల సంఘం ఒక ఉద్యమంగా ప్రణాళికాబద్ధంగా పురోగమించుతోంది.

తిరుపతి మహాసభలో అభ్యుదయ రచయితలు నిర్వహించిన సదస్సులు పరస్పర అభిప్రాయ అవగాహనకు తోడ్పడతాయి. ప్రాచీన, ఆధునిక, సమకాలీన సాహితీ ధోరణులనేగాక, విభిన్న ధోరణులు కూడా అది ప్రతిబింబించవచ్చు. ఐతే అవి కేవలం చర్చకు మాత్రం పరిమితం. మహాసభలో చేసిన తీర్మానాలూ, అభ్యుదయ పత్రిక పునరుద్ధరణ నిర్ణయమూ, పాత కొత్తల మేలు కలయికతో సంఘ పునర్నిర్మాణమూ, అభ్యుదయ రచయితల సాహిత్య ఉద్యమానికి పునరంకితమవుతున్న దీక్షా, నానాటికీ దిగజారుతున్న మానవ విలువల పరిరక్షణకు తోడ్పడుతుంది. అన్నిటికన్నా మన మనుగడకే ప్రమాదం వాటిల్లిన అణుయుగంలో ప్రపంచ శాంతి స్థాపనకై జరిగే కృషికి సహాయపడుతుంది. మానవుడే మహనీయుడు అన్న లక్ష్యంతో, అణగారిన ప్రజల నుద్ధరించే చైతన్యకృషికి, సమసమాజ స్థాపనకు కలిసి రావలసిందిగా అభ్యుదయ రచయితల సంఘం సోదర రచయితలను ఆహ్వానించుతున్నది.

(ది 21-9-85 'విశాలాంధ్ర')

అయిదవ భాగం

## 27

# 1948 తరువాత ... ఏం జరిగింది?

**1947** జనవరి మద్రాసు అరసం మహాసభ - సాంస్కృతికోత్సవ జైత్రయాత్ర సమయానికి ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనలో కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన మహోజ్వల పాత్రలో అదొక స్వర్ణయుగం అని పిలువదగిన స్థితినందుకున్న తరువాత ఏమైంది? ఏం జరిగింది?

త్వరితగతిని ఆంధ్రదేశ రాజకీయ పరిణామాలు, ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీ అనుసరించిన రాజకీయ విధానాలు మారిపోనారంభించాయి.

1947 జనవరి 22వ తేదీన మద్రాసు ప్రభుత్వం ప్రకాశం ముఖ్యమంత్రిగా ప్రజారక్షణ ఆర్డినెన్సుపేర ఒక నిరంకుశ ఆర్డినెన్సు జారీచేసి కమ్యూనిస్టు పార్టీపై దాడి ప్రారంభించింది. 1947 జనవరి 30వ తేదీన రాష్ట్రవ్యాపితంగా కమ్యూనిస్టు నాయకులను, ప్రజాసంఘాల నాయకులను అరెస్టు చేసింది. 1948 ఏప్రిల్ 22న ప్రజాశక్తి దినపత్రికను ప్రభుత్వం నిషేధించింది. మొగల్రాజపురంలోని ప్రజాశక్తి కార్యాలయాన్ని, లైబ్రరీని పోలీసులు ధ్వంసంచేసి, కార్యాలయంలో పోలీసు క్యాంపు పెట్టారు. 1948 మే నెలలో "మాభూమి" నాటకం నిషేధించబడింది.

### నిషేధాలకు, నిర్బంధకాండకు ఖండన

పలువురు కాంగ్రెస్‌వారే గాక, పలువురు ప్రముఖులు, ఆనాటి పత్రికలు (ఒక్క ఆంధ్రపత్రిక మినహా), ప్రజాసంఘాలు ఈ నిషేధాజ్ఞలను, నిర్బంధకాండలను ఖండించాయి. ప్రకాశం ఆర్డినెన్సును తీవ్రంగా ఖండిస్తూ ప్రకటనలు చేశాయి.

ఆంధ్ర ప్రజానాట్యమండలి కార్యదర్శి శ్రీ వెంపటి రాధాకృష్ణ (8-2-47, ప్రజాశక్తి) గిడుగు సీతాపతి కొడవటిగంటి కుటుంబరావు ప్రభృతులు (9-2-47, ప్రజాశక్తి) ప్రకాశం ఆర్డినెన్సును తీవ్రంగా ఖండిస్తూ ప్రకటనలు చేశారు.

అయితే ఈ ఆర్డినెన్సులు, అరెస్టులు, నిషేధాజ్ఞలు ఎందుకు జరిగాయి? ఏ పరిణామాలు ఇందుకు దారితీశాయి? నాటి ప్రభుత్వానికి ఈ అవకాశం ఎలా వచ్చింది? దీని పర్యవసానం ఏమైంది? ఎక్కడకు దారితీసింది? అన్న విషయాలు చారిత్రక దృష్టితో ఆత్మపరిశీలన - వస్తుగత దృష్టితో పరిశీలించడం అవసరం.

1947 ఆగస్టు 15న వచ్చిన స్వాతంత్ర్యావతరణకు ముందు స్వాగతం పలికినా, ఆరు నెలలు తిరగకముందే ఇది నిజమైన స్వాతంత్ర్య కాదనీ, బూటకపు స్వాతంత్ర్యమనీ, ఇది సామ్రాజ్య వాదులతో జాతీయ బూర్జువావర్గం రాజీ మాత్రమేననీ కమ్యూనిస్టు పార్టీ అభిప్రాయపడింది.

ఈలోగా నైజాం ఫ్యూడల్ రాజరిక నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రారంభమైన

సాయుధ రైతాంగ పోరాటం ఉచ్ఛస్థాయి నందుకుంది. 1948 సెప్టెంబరులో యూనియన్ సైన్యాలు పోలీసు యాక్షన్ జరిపి హైద్రాబాద్ సంస్థానాన్ని భారత యూనియన్‌లో విలీనం చేసుకోవడం జరిగింది. 1948 ఫిబ్రవరిలో కలకత్తాలో జరిగిన రెండవ పార్టీ కాంగ్రెస్, భారతదేశ విప్లవదశ గురించి పొరపాటు అంచనాకు వచ్చింది. బూర్జువా ప్రజాతంత్ర విప్లవం - సోషలిస్టు విప్లవం రెండూ కలిసి మిళితమైపోయి ఒకేసారి సాగించవలసిన విప్లవ దశ వచ్చిందని నిర్ణయించింది. (Inter-twining of two revolutions) ఆమేరకు రణదివే థీసిస్‌ను మహాసభ ఆమోదించింది. ఇది రష్యా పంథాగా పేరుపెట్టారు. (1948-50) సారాంశం ఒకటే నెహ్రూ నాయకత్వాన ఉన్న భారత జాతీయ బూర్జువా ప్రభుత్వాన్ని సాయుధ పోరాటం ద్వారా కూలదోయాలి.

ఇదే సమయంలో తెలంగాణా సాయుధ పోరాటం ఆంధ్రకు విస్తరించాలని నిర్ణయించారు. తెలంగాణాను యోనాన్‌తో (చైనా రెడార్మీ తొలి విప్లవ స్థావరం) పోల్చుకొనడం జరిగింది. నెహ్రూను చాంగ్ కైషేక్‌తో పోల్చడం జరిగింది. రష్యా పంథా కాదు, చైనా పంథా మనం అనుసరించాలని పార్టీ అభిప్రాయానికి వచ్చింది. (1950-51) ఈ రెండు పంథాలు తప్పేనని ఆ తరువాత చరిత్ర తీర్పు చెప్పింది. పార్టీ ఆత్మవిమర్శ చేసుకొంది కూడా.

ఎప్పుడైతే భారత కమ్యూనిస్టు ఉద్యమం ఈ అతివాద దుందుడుకు విధానాలను అవలంబించడానికి నిర్ణయించిందో కమ్యూనిస్టు ఉద్యమంపై తీవ్ర నిర్బంధ విధానం అమలుజరపడానికి ప్రభుత్వానికి అవకాశం వచ్చింది. కమ్యూనిస్టు ఉద్యమాన్ని తుడిచిపెట్టాలని హోంమంత్రి సర్దార్ పటేల్ ఆజ్ఞలు జారీచేశాడు. గొప్ప ప్రజా ఉద్యమంగా, కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయ శక్తిగా అభివృద్ధిచెందిన ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం ఈ అతివాద దుస్సాహసిక విధానాలతో చిందరవందర అయింది. 1948-51 మధ్య వందలాది కమ్యూనిస్టు గ్రామాలు నిర్బంధకాండ, బీభత్సంతో నాశనం అయిపోయాయి. 1935-36 నుండి ఎన్నో త్యాగాలతో, ఎంతో దక్షతతో నిర్మించుకొన్న ప్రజా రంగాలు, రైతు, వ్యవసాయ కార్మిక, విద్యార్థి, యువజన, మహిళా, బాల సంఘ ఉద్యమాలు ఛిన్నాభిన్నమయ్యాయి. ఈ మహత్తర ప్రజా ఉద్యమాలతోబాటే, పార్టీ పనుపున పార్టీ ప్రోత్సాహంతో, ప్రోద్బలంతో నిర్మించబడిన అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్య మండలి, సాంస్కృతిక ఉద్యమాలు తీవ్ర సంక్షోభానికి గురి అయ్యాయి. పార్టీ నాయకత్వాన కొనసాగించబడిన ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమం భగ్నమై తిరోగమనముఖం పట్టింది. అభ్యుదయ సాహిత్య, సాంస్కృతికోద్యమాలవైపు వచ్చిన ఎందరో కమ్యూనిస్టేతర రచయితలు, కళాకారులు మనకు దూరమైపోవడమే కాదు, కొందరు వ్యతిరేకమైపోయారు. "కమ్యూనిస్టు ఉద్యమం నవయుగాంధ్ర నిర్మాతల వారసత్వాన్ని స్వీకరించింది. కాని ఆ తరువాత గాడి తప్పింద"ని సహృదయులు, సానుభూతిపరులు, శ్రేయోభిలాషులు భావించే పరిస్థితులు ఏర్పడ్డాయి. సంవత్సరాల తరబడి ఎంతో కష్టపడి అభ్యుదయ రచయితల సంఘం ద్వారా, ప్రజానాట్యమండలి ద్వారా ప్రజాసంఘాల ద్వారా ఆంధ్రలో తీసుకొనివచ్చిన సాంఘిక, సాహిత్య

విప్లవం దెబ్బతినిపోయింది. పార్టీకి చెందిన అభ్యుదయ రచయితలు, ప్రజానాట్యమండలి కళాకారులు దిక్కులేని పక్షులుగా చెల్లాచెదురయ్యారు. ఎక్కువమంది సినీరంగానికి వలస వెళ్ళిపోయారు.

ఆంధ్రదేశంలో ఎన్నో త్యాగాలతో నిర్మించబడిన కమ్యూనిస్టు ఉద్యమం ఈ విధంగా తీవ్ర సంక్షోభంలో పడిపోవడంతో, కమ్యూనిస్టు ఉద్యమమే కాదు, కమ్యూనిస్టు ఉద్యమం సువిశాల జాతీయ దృక్పథంతో నిర్మించతలపెట్టిన "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" ఉద్యమం కూడా తీవ్ర ఆఘాతానికి, తీరని నష్టానికి గురి అయింది. ఆంధ్రదేశంలో రావలసిన ప్రజాతంత్ర పురోగమనం నాశనమైపోయింది. కమ్యూనిస్టు ఉద్యమానికి పట్టిన ఈ సెక్టేరియన్ దుందుడుకువాద గ్రహణం ఆంధ్రదేశ భవిష్యత్తుమీద కూడా ప్రసరించింది.

ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమానికి పట్టిన ఈ గ్రహణం గురించి కమ్యూనిస్టు ఉద్యమ కురువృద్ధులలో ఒకరైన శ్రీ మహీధర రామమోహనరావుగారు, తెలంగాణా పోరాట మహాయోధ రావి నారాయణరెడ్డిగారు ఏమని అభిప్రాయపడ్డారో చూద్దాం.

అభ్యుదయ రచయితల ఉద్యమ నిర్మాత తుమ్మల వెంకట్రామయ్యగారు 1987లో మృతిచెందారు. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘంవారు ప్రచురించిన "తుమ్మల సాహిత్యం'' గ్రంథంలో "ధన్యజీవి తుమ్మల'' అన్న వ్యాసంలో మహీధర రామమోహనరావుగారిలా అన్నారు :

### అరసాన్ని దాని బ్రతుకు అది బ్రతికేటట్లు వదిలామా?

"అభ్యుదయ రచయితల సంఘాన్ని నిర్వహిస్తున్నదీ, దాని పత్రిక అభ్యుదయను నడుపుతున్నదీ తుమ్మలయే. ఆ మనిషి సంస్కారవంతుడు. సౌమ్యుడు. మృదుభాషి కనుక ఆంధ్రలోని అన్ని ఛాయల రచయితల ఆదరాభిమానాల్ని సంపాదించేరు. చిలకమర్తి, పంచాగ్నుల వగైరా వృద్ధతరం నుంచి దేవులపల్లి, తెలికచర్ల వంటి మధ్యవయస్కులు, శ్రీశ్రీ, ఆరుద్ర వంటి తరుణ వయస్కుల వరకూ అభ్యుదయ రచయితల సంఘాన్ని అభిమానించడానికి తుమ్మలయే కారణం. ఆ రోజులలో అభ్యుదయ రచయితల సంఘానికి పిచ్చయ్యగారు కార్యదర్శిగా వుండేవారు. ఆయన మంచి కార్యనిర్వాహకుడు. అయితే పెద్ద హడావిడి మనిషి. ఆయన "ఆకలి, ఆకలి మండే ఆకలి, నరములన్నిటి నమిలే ఆకలి'' అంటూ వ్రాసిన గీతమే అభ్యుదయవాదుల కవిత్వాన్ని "ఆకలి కవిత్వం"గా ఎద్దేవా చేయడానికి మూలకారణం అయింది.

"1948 ఫిబ్రవరి చివరలో(కలకత్తా రెండవ పార్టీ కాంగ్రెస్) భారత కమ్యూనిస్టు పార్టీ దేశంలో కొత్తగా ఏర్పడిన జాతీయవాద ప్రభుత్వం మీద యుద్ధప్రకటన చేసింది. దానితో భారత ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది. దానిమీదనూ, దాని అనుబంధ సంస్థలమీదనూ దాడులు జరిపింది. అంతవరకూ ఆ సంస్థ యెడలా, దాని కార్యకలాపాల యెడలా అభిమానం ప్రకటించి, దాని పక్కనే నిలబడ్డ వారిలో కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలు 1940 నాటినుంచీ, ప్రత్యేకించి

1942 ఆగస్టు నుంచీ దేశ ప్రజలలో దానియెడ అనుమానాలను రేకెత్తిస్తున్నాయి. అభ్యుదయ రచయితల సంఘాన్ని కమ్యూనిస్టు పార్టీ అనుబంధ సంస్థగానే వారు జమకట్టేరు. కాదని చెప్పుకొనేందుకు అవకాశం లేకపోవడంకన్నా, పార్టీ నాయకత్వం ఆ అవకాశం కలిగించదలచు కోలేదన్నది వాస్తవం. దేవులపల్లి వగైరాల బూర్జువావర్గ కవితలమీద గట్టి ఎదుర్కోలు నివ్వకపోయారని సుందరయ్యగారు ఓ సర్క్యులరు జారీచేసిన విషయం ఇక్కడ గుర్తువస్తూంది. **రాష్ట్ర పార్టీ నాయకత్వం అరసాన్ని దాని బతుకు అది బతికేటట్లు వదలదలుచుకోలేదు.** ఫలితంగా ఓ.పి.డి.ఆర్. మొదలైన సంస్థల విషయంలో ఈనాడు తెలుగు ప్రజ కనబరుస్తున్న విరామయ దృష్టినే ఆనాడు మనయెడ - అభ్యుదయ రచయితల సంఘం యెడ కనబరిచేరు. ఆ విధంగా పలకరించేవాడు లేకపోవడాన్ని గొప్ప విప్లవ విజయంగా భావించి గర్వపడ్డాం అంటే అతిశయోక్తికాదు. కాకుంటే అటువంటి పరిస్థితి యెందుకు వచ్చిందనే ఆలోచన సంఘ నాయకత్వానికేనా కలగకపోయేదా? తప్పుడు భావాలు అంత గాఢంగా మన మెదడులకి ఎక్కేయి.''

(తుమ్మల సాహిత్య గ్రంథం, 1990)

కామ్రేడ్ మహీధర 1948 ఫిబ్రవరి కలకత్తా పార్టీ కాంగ్రెస్ చేపట్టిన సెక్టేరియన్ పంథా ఫలితంగా, పార్టీ ప్రజాసంఘాలు ఎలా వినాశనానికి గురి అయిపోయాయో చెప్పడంతోబాటు ఒక ప్రధాన నిర్మాణ సమస్యను లేవనెత్తారు. ప్రజాసంఘాలను కమ్యూనిస్టు పార్టీ నిర్మించవచ్చు కాని అవి పార్టీ అనుబంధ సంఘాలు కావు. ప్రజాసంఘాలలో అన్ని రాజకీయాభిప్రాయాలు కల్గినవారూ ఉండవచ్చు. కమ్యూనిస్టు వ్యతిరేకులు కూడా ఉంటే వుండవచ్చు. కమ్యూనిస్టులు నాయకత్వంలో ఉండవచ్చు. అయినప్పటికీ అవి ప్రజాతంత్ర సంస్థలు తప్ప పార్టీ సంస్థలు కావు. **ఈ అవగాహన పార్టీకి లేకపోవడంవలన అభ్యుదయ రచయితల సంఘాన్ని "దాని బ్రతుకు అది బ్రతికేటట్లు వదలదలచుకోలేదు"** అని మహీధర స్పష్టం చేశారు.

ఇదే తుమ్మల సాహిత్యం గ్రంథంలో శ్రీ మహీధర "అభ్యుదయ రచయితల సంఘం - సమస్యలు - సూచనలు'' అన్న మరో వ్యాసం కూడా వ్రాశారు. అందులో ఇదే నిర్మాణ సమస్యను ఆయన మరింత విశదంగా లేవనెత్తారు. (ఇది పులుపుల శివయ్య సాహితీ పురస్కార ప్రసంగం)

"1947 ఆగస్టు వరకు అరసం కార్యకర్తలు అరసం కమ్యూనిస్టు పార్టీ అనుబంధ సంస్థ అన్న ముద్రను ఎంత కాదనడానికి ఎన్ని వాదనలు చేసినా - 1947 ఆగస్టున స్వాతంత్ర్యం రాలేదని కమ్యూనిస్టు పార్టీ చెప్పడంతో, కేంద్రంలో ఏర్పడిన జాతీయ ప్రభుత్వంమీద సాయుధ పోరాటం ప్రారంభించడంతో ... కమ్యూనిస్టు పార్టీ ధోరణులనుండి అరసం ఏమాత్రం ఎడంగా ఉండడానికి ప్రయత్నించకపోవడంతో ఆ ముద్ర తొలగలేదు. అరసం తన ఉద్యమపు హద్దులు (Para metres) నిర్ణయించుకోడానికి ప్రయత్నించలేదు. ఫలితంగా అరసం కూడా (కమ్యూనిస్టు పార్టీవలె) జాతీయవాద ప్రవాహంనుండి వేరుపడిపోయింది. మాతృసంస్థ అయిన కమ్యూనిస్టు పార్టీలాగే అదీ చిద్రుపలైంది.''

(1989 నవంబరు 14న గుంటూరులోపులుపుల శివయ్య సాహితీ పురస్కారం స్వీకరిస్తూ మహీధర చేసిన ప్రసంగం, తుమ్మల సాహిత్య గ్రంథం, 1990 ప్రచురణ).

దీని సారాంశం ఒక్కటే అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి సంస్థలను స్వతంత్ర ప్రజాసంస్థలుగా, అన్ని రాజకీయాభిప్రాయాలు కల్గినవారి సంస్థగా ఆరోజుల్లో మననిచ్చి ఉంటే - కమ్యూనిస్టు పార్టీలాగే ప్రభుత్వ నిర్భంధానికి గురియయి వుండేదికాదు. కమ్యూనిస్టు పార్టీ నుండి దూరంగా ఉండి తన బ్రతుకు తాను బ్రతికేది. ఆవిధంగా బ్రతకనిచ్చి వుండవలసింది అని కామ్రేడ్ మహీధర ప్రభృతుల అభిప్రాయం. వాస్తవం కూడా అదే.

## ప్రభుత్వ నిర్బంధ విధానంవల్ల జరిగిన భీభత్సం

ఆనాటి పరిణామాలను శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి తన గ్రంథం "ప్రజాపోరాటాల రంగస్థలం - ఆంధ్ర ప్రజానాట్యమండలి"లో పేర్కొన్నారు. కమ్యూనిస్టు పార్టీ అవలంబించిన సెక్టేరియన్ పోకడల ఫలితంగా తమపై ప్రభుత్వ నిర్బంధ విధానం ఎలా విరుచుకుపడింది ఇలా వివరించారు :

"1948 మేలో మద్రాసు నగరంలో మాభూమి నాటకం ప్రదర్శింపబడటమూ, అదే సందర్భంలో సీతారామరాజు బుర్రకథను నాటి కాంగ్రెస్ మంత్రుల సమక్షంలో బాంక్వెటింగ్ హాలులో ప్రదర్శింపబడి వారితో పారితోషికాలు అందుకోవడం జరిగింది.

"అయితే అంతకుముందే టంగుటూరు ప్రకాశం ముఖ్యమంత్రిగా వున్న కాంగ్రెస్ ప్రభుత్వం అల్లూరి సీతారామరాజు బుర్రకథను నిషేధించింది.

"ఆ నిషేధాన్ని సవాలుచేస్తూ మాభూమి నాటకం మంత్రులముందు ప్రదర్శించిన మరునాడే అదే బాంక్వెటింగ్ హాలులో కాంగ్రెస్ మంత్రులనూ నగరంలోని మేధావులనూ ఆహ్వానించి నిషేధించిన సీతారామరాజు బుర్రకథను మహిళా బుర్రకథ కళాకారిణులైన కొండేపూడి రాధ, తాపీ రాజమ్మ, వీరమాచనేని సరోజిని మొదలైనవారితో ప్రదర్శింపచేశారు.

"ఆ కథను విన్న కాంగ్రెస్ మంత్రులు ఉత్తేజంతో ఉర్రూతలూగిపోయారు. మహిళలు ఇలాంటి కథను చెప్పటం వారిని ఆశ్చర్యచకితుల్ని చేసింది. సీతారామరాజును గురించి వారికి సరిగా తెలియని ఎన్నో విషయాలను బుర్రకథ ద్వారా విని ఆనందపడిపోయారు.

అప్పుడు రాజారావుగారు ముందుకు వచ్చి కథను మీరు ఆసాంతం విన్నారు. వివిధ ఘట్టాలలో ఉత్తేజితులై ఆనందించారు. ఇప్పుడు చెప్పండి. ఇందులో నిషేధించతగినదేమున్నదని ప్రశ్నించారు.

ఆనాడు మంత్రులుగా వున్న కళా వెంకట్రావు, బెజవాడ గోపాలరెడ్డి మొదలైన వారందరూ బుర్రకథనూ, ఆ సాహిత్యంలోని అందచందాలనూ, చెప్పినతీరునూ సీతారామరాజు త్యాగనిరతినీ కొనియాడి 116 రూపాయలను బహూకరించి నిషేధాన్ని తొలగిస్తామని వాగ్దానం చేశారు.

ఇలా మద్రాసులో రాష్ట్ర దళం, కృష్ణాజిల్లా దళం ప్రదర్శనలు జరుగుతుండగానే

మంత్రులముందు అల్లూరి సీతారామరాజు బుర్రకథ చెపుతూ వుండగానే ప్రకాశం ముఖ్యమంత్రిగా వున్న ఆనాటి కాంగ్రెస్ ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది. (ప్రకాశం ఆర్డినెన్సు) మద్రాసులో ప్రదర్శనలు ముగించుకుని కళాకారులు విజయవాడ ప్రయాణమౌతున్న సమయంలో ఈ వార్త తెలిసింది. ఈ ప్రభావం ప్రజానాట్యమండలి కళాకారులమీద కూడా పడుతుందేమోనని ఆందోళనచెందారు. అర్ధరాత్రిలోగా ఏదైనా రహస్య స్థావరానికి చేరాలనుకున్నారు.

వెంటనే కొంతమంది తమిళనాడు కమ్యూనిస్టు పార్టీ సెక్రటరీ వెంకటరామన్ బంధువులున్న టి.నగర్ ఉస్మాన్‌రోడ్‌లో వున్న ఇంటిలో చేరిపోయారు.

మరికొందర్ని పుచ్చలపల్లి సుందరయ్యగారి తమ్ముడు రామచంద్రారెడ్డి ఒక అంబులెన్సును తెప్పించి జార్జిటవున్‌లో వున్న కన్యకాపరమేశ్వరి సత్రంలో చేర్చారు. అయితే కమ్యూనిస్టు నాయకుల్ని మాత్రమే అరెస్టు చేయగా రాష్ట్ర దళ సభ్యులందరూ విజయవాడ చేరుకున్నారు. తదనంతరం ఇలాంటి సంఘటనలు ఎన్నో జరిగాయి.

ఆవిధంగా 1948 సంవత్సరం మేలో మద్రాసులో మాభూమి నాటకాన్నీ, వీరేశలింగం బుర్రకథనూ, ఇతర జానపద కళారూపాలనూ ప్రజానాట్యమండలి ప్రదర్శించింది.

ఈ ప్రదర్శనానికి ఎందరో మేధావులూ, రచయితలూ వచ్చి అభినందించారు. ఇదే ప్రదర్శనాన్ని నార్ల వెంకటేశ్వరరావులాంటి పత్రికా సంపాదకులూ, గోపీచంద్, ఎల్.వి. ప్రసాద్, కె.వి. రెడ్డి, బి.యన్. రెడ్డి లాంటి సినీ దర్శకులూ మొదలైన వారందరూ చరిత్రాత్మకమైన నాటకంగా కీర్తించారు. మాభూమి నాటకాన్ని మంత్రులు ప్రశంసించిన నాలుగు మాసాలకు కాంగ్రెస్ ప్రభుత్వం నిషేధించింది.

ఎంతో గొప్పగా నాటకాన్ని పొగిడి వ్రాసిన పత్రికలుగానీ, బహుమానాలను ఇచ్చిన మంత్రులు గానీ, అభిప్రాయాలు ప్రకటించిన మేధావులుగానీ ఈ నిషేధాన్ని గూర్చి పల్లెత్తు మాట కూడా మాట్లాడలేకపోయారు. ఆనాటి పరిస్థితులు ఎంత నికృష్టంగా వున్నాయో దీనిద్వారా తెలుసుకోవచ్చు.

**- మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి**

**"ప్రజాపోరాటాల రంగస్థలం, ఆంధ్ర ప్రజానాట్యమండలి" గ్రంథంలో, 1999**

ప్రజానాట్యమండలిపై రెండవ పార్టీ కాంగ్రెస్ యొక్క దుష్ఫలితాలు గురించి కామ్రేడ్ రావి నారాయణరెడ్డిగారు తమ స్వీయచరిత్రలో వ్రాసిన విషయాలు గమనించదగినవి. ఆయన ఇలా వ్రాశారు :

## ప్రజానాట్యమండలిపై రెండో పార్టీ కాంగ్రెస్ యొక్క దుష్ఫలితాలు

"1948వ సంవత్సరంలో జరిగిన రెండో పార్టీ కాంగ్రెస్ యొక్క తీవ్రమైన దుష్ఫలితాలు ప్రజా కళాకారుల ఉద్యమాలపైన కనిపించాయి. ప్రజా కళాకారుల ఉద్యమమైన ప్రజానాట్య మండలిని ఈ దుష్ఫలితాలు విచ్ఛిన్నం చేశాయి.

ఆ రోజుల్లో కృష్ణాజిల్లాకు చెందిన ప్రతిభ గల కళాకారులు ప్రజానాట్యమండలిని ఏర్పరచు

కున్నారు. ప్రజా రాజకీయ సమస్యలపైన నాటకాలు ప్రదర్శిస్తూ ప్రజల్లో ఎంతో చైతన్యం కలిగిస్తూ ఉండేవారు. బుఱ్ఱకథల్లాంటి గ్రామీణ కళలను కూడా అభ్యుదయపరంగా ప్రదర్శించి ప్రజల్లో చైతన్యం కలిగించడం ఈ మండలి ధ్యేయం.

వీరు ఆ రోజుల్లో ప్రదర్శించే నాటకాలలో "మాభూమి" నాటక మొకటి. తెలంగాణా పోరాటానికి సంబంధించిన ఈ నాటకం ఊరూరా జయప్రదంగా ప్రదర్శింపబడుతూ ఫ్యూడల్ దోపిడీకి అద్దంపట్టేది. కృష్ణాజిల్లా సరిహద్దు గ్రామాల్లో ప్రదర్శింపబడితే రెండువైపుల నుండి ప్రజలు 20 లేక 30 వేల సంఖ్యలో హాజరయ్యేవారు. ఈ నాటక ప్రదర్శనకు చాలాసార్లు నేను ఉపన్యాసకునిగా వెళ్ళేవాడిని. ఉపన్యాసం తర్వాత పోరాట ఖర్చులకోసం విరాళాలివ్వమని విజ్ఞప్తి చేసేవాడిని. ఆశ్చర్యకరంగా కొన్ని వేల రూపాయల విరాళాలు అప్పటికప్పుడు ప్రోగయ్యేవి. స్త్రీలు బంగారు నగల్నితీసి విరాళంగా సమర్పించేవారు. ఇతరములైన ఇంకెన్నో వస్తువులు విరాళంగా వచ్చేవి. ఆ వస్తువులన్నింటిని అప్పటికప్పుడు వేలంవేస్తే ఎంతో డబ్బు వచ్చేది. ఈ మాభూమి నాటకాన్ని రెండు దళాలు ప్రదర్శించేవి. ఒకటి కృష్ణాజిల్లా దళం, రెండోది రాష్ట్ర దళం. ఈ రెండు దళాలు ప్రజల్లో రాజకీయ చైతన్యాన్ని ఆ రోజుల్లో పెద్దయెత్తున కల్గించాయి.

అయితే రెండో పార్టీ కాంగ్రెస్ తర్వాత ముఖ్యంగా పోలీస్ ఆక్షన్ తరువాత కాంగ్రెస్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తెలంగాణాలోనే కాకుండా మద్రాసు రాష్ట్రంలో కూడా నెహ్రూ ప్రభుత్వాన్ని కూల్చడం కోసం గెరిల్లా పోరాటమనే ఒక ఉన్మాద కార్యక్రమాన్ని కమ్యూనిస్టుపార్టీ చేపట్టింది. ఈ పోరాటం కారణంగా తెలంగాణాలోనే కాకుండా ఆంధ్రప్రాంతంలో కూడా ఎంతోమంది కామ్రేడ్స్ హత్యకావింపబడ్డారు. ఈ కార్యక్రమం ప్రజానాట్యమండలి కళాకారులపైన విపరీత రాజకీయ వత్తిడి కలిగించింది. ఫలితంగా కళాకారులంతా ఈ నాటక రంగాన్ని వదిలి మద్రాసుకు వెళ్ళి సినిమా రంగంలో చేరిపోయినారు. ఇలా రెండో పార్టీ మహాసభవల్ల ప్రజానాట్యమండలి విచ్ఛిన్నమైపోయింది.

- "నా జీవితపథంలో" రావి నారాయణరెడ్డి స్వీయచరిత్ర నుండి

## ఆత్మహత్యాసదృశమైన అతివాద ధోరణి

1948 కలకత్తా పార్టీ కాంగ్రెస్ నిర్ణయం రాజకీయంగా ఎంత ఆత్మహత్యాకరంగా పరిణమించిందో కామ్రేడ్ రావి నారాయణరెడ్డిగారు ఇలా వివరించారు :

అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ మహాసభ 1948 ఫిబ్రవరిలో కలకత్తాలో జరిగింది. ఈ మహాసభ నిర్ణయాలు పరిస్థితులన్నింటినీ తల్లకిందులు చేశాయి. భారతదేశం అంతటా విప్లవ సంక్షోభం ఏర్పడిందనీ, బూర్జువాజీకి వ్యతిరేకంగా విప్లవ పరిస్థితులున్నాయనీ, 1947లో వచ్చినది నిజమైన స్వాతంత్ర్యం కాదనీ, అది కేవలం అధికార మార్పిడి మాత్రమేననీ, ఇప్పటికీ భారత కాంగ్రెస్ నాయకులు సామ్రాజ్యవాదుల తొత్తులుగా వున్నారనీ, విప్లవం పట్టణాలనుంచి పల్లెలకు వ్యాపిస్తుందనీ - ఇలాంటి హానికరమైన తీర్మానాలను చేశారు.

పోలీసు చర్య అనంతరం ఈ అతివాద నిర్ణయాల దుష్ఫలితాలు వెంటనే కనబడ నారంభించాయి. పార్టీ పోరాటాన్ని కొనసాగించాలని నిర్ణయిస్తే, ప్రజలు దాన్ని తిరస్కరించారు. పోరాటాన్ని కొనసాగించాలన్న అభిప్రాయం కొందరు వ్యవసాయ కూలీలు, బీద రైతులకు ఉండేది. కాని మధ్యతరగతి, ధనిక రైతుల వ్యతిరేకతవల్ల వారేమీ చేయలేకపోయారు. ఇలాంటి సాయుధ పోరాటాలలో ప్రజల సామాన్య సానుభూతి మాత్రమే సరిపోదు. ప్రజల ప్రత్యక్ష, పరోక్ష సహకారం లేనిదే గెరిల్లా పోరాటం కొనసాగదు అనేది గెరిల్లా పోరాట సిద్ధాంతంలో ప్రధాన సూత్రం. ఈ ప్రధాన సూత్రాన్ని ఆనాడు విస్మరించారు.

పోలీసు చర్య తర్వాత మరొక సిద్ధాంతం ముందుకు వచ్చింది. అది చైనా మార్గం. చైనాలో వలెనే భారతదేశంలో కూడా విప్లవం జరుగుతుందని, అక్కడి దీర్ఘకాల పోరాటం లాగానే ఇక్కడ కూడా దీర్ఘకాల పోరాటం సాగుతుందని, అట్టి దీర్ఘకాల పోరాటానికి మన పార్టీ సిద్ధం కావాలనీ ఆదేశాలు అందించారు. ఒక్క తెలంగాణాలోనేకాక, భారతదేశం అంతటాకూడ సాయుధ గెరిల్లా పోరాటానికి పరిస్థితులు అనుకూలంగా వున్నాయని అంచనా వేశారు. ఈ విప్లవం పల్లెలనుండి పట్టణాలకు పాకుతుందని అన్నారు. ఈ విధంగా భారత చైనాలకు లేనిపోని పోలికలను చూపడం ఏవిధంగా తప్పో, తర్వాత ఎంతటి కష్టపరిస్థితులను ఎదుర్కొనవలసివచ్చిందో, దానివల్ల ఎలాంటి దుష్పరిణామాలు కలిగాయో చరిత్ర నిరూపించింది.

- అదే స్వీయచరిత్రలో

# 28

# 1947లోనే పడ్డ సెక్టేరియన్ బీజాలు . . .

అభ్యుదయ రచయితల ఉద్యమంపై కమ్యూనిస్టు పార్టీ అతివాద ధోరణుల ఛాయలు 1947 ఆగస్టు స్వాతంత్ర్యానికి ముందే ప్రారంభమయ్యాయి.

ఏది అభ్యుదయం, ఏది అభ్యుదయ రచన? అన్న చర్చలు యింటా బయటా జరుగుతున్న రోజులలోనే పార్టీ నాయకత్వంలో ఈ విషయమై భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. భౌతికవాదాన్ని అంగీకరించినవారే అభ్యుదయవాదులు, వారి రచనలే అభ్యుదయ రచనలు అన్న వాదన ఒకవైపున, విశాల మానవతావాదాన్ని, సామాజిక శ్రేయస్సును కాంక్షించేవారు సైతం అభ్యుదయవాదులే. వారివి అభ్యుదయ రచనలే అన్న వాదం మరొకవైపున పార్టీలో తలెత్తాయి.

అభ్యుదయ రచయితల ఉద్యమ నిర్మాత శ్రీ తుమ్మల వెంకట్రామయ్యగారు 1945 నవంబరు 3, 4 తేదీలలో జరిగిన అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ ప్రారంభోత్సవ సభలో మాట్లాడుతూ ఇలా అన్నారు :

"అభ్యుదయ రచయితల సంఘంలో మానవ అభ్యుదయ లక్ష్యసిద్ధికై కృషిచేసే వారందరూ ఉండవచ్చును. రచయితలలో వైవిధ్యం ఉండవచ్చు అంతేకాదు, దిమ్మిసకొట్టిన కడ్డీలా అందరూ

ఉండాలని మా అభిప్రాయం కాదు. వైవిధ్యం ఉన్నప్పుడే హేతువాదం పురోగమనం వుంటుంది. ఏకలక్ష్యంతో పనిచేసేవారంతా దీనిలో వుండవచ్చు. పూర్వంలోని ఔన్నత్యం గ్రహించకపోతే ఈనాడు మనమీ స్థితిలో వుండము. ఆకలి కవిత్వం మాత్రమే వ్రాయాలనీ, ప్రేమ కవిత్వం వ్రాయకూడదనీ అభ్యుదయ రచయిత అంటారనడం హాస్యాస్పదం. రచయిత అన్నవాడు అనేక సన్నివేశాలలో అనేకమంది వ్యక్తుల మనఃప్రవృత్తులను చిత్రించుతాడు. అందుచేత అటువంటి రసం అవసరం. అటువంటి రసం అనవసరం అని అనరు. ప్రజలను ఉత్తేజపరచి చైతన్యవంతులను చేయడమే ప్రజలకు అభిరుచి కల్పించి వారి అంతస్సును పెంపొందించుటే మా ఆశయం."

అదే సభలో చదలవాడ పిచ్చయ్యగారు మాట్లాడుతూ ఇలా అన్నారు :

"పూర్వ సాహిత్యంలోని ఔన్నత్యాన్ని గ్రహించి, పూర్వ సంస్కృతిలోని ఉత్తమ సంప్రదాయాలను అలవరచుకొని, అభివృద్ధి నిరోధకులను నిరాకరిస్తూ కృషిచేయటం తమ ఆశయమన్నారు. సారస్వతాన్ని ప్రజాజీవితంతో సన్నిహితపరచి రచన సాగించాలన్నారు. కనుకనే తాము వీరేశలింగం, గురజాడ మొదలగు యుగపురుషుల సందేశాలను ప్రజలకు అందజేస్తున్నామని అన్నారు. సాహిత్యం ఎలా పరిణతిచెందుతూ వచ్చిందీ తెల్పి, అభ్యుదయ రచయితల సంఘంలో వివిధ రాజకీయ అభిప్రాయాలవారున్నారనీ, ఉండవచ్చుననీ తెలిపారు. రాజకీయ సాంఘిక ఉద్యమాలు సారస్వతంపై కల్గించిన ప్రభావాన్ని వివరించారు."

**- మద్రాసు శాఖ అరసం మహాసభ, 1945 నవంబరు 3, 4 తేదీలు**

అభ్యుదయ రచయితల ఉద్యమ నిర్మాతలు ఆనాడు ఫాసిజానికి, సామ్రాజ్యవాదానికి, అభివృద్ధి నిరోధకులకు, స్వార్థపరవర్గాలకీ, అసాంఘిక శక్తులకు వ్యతిరేకంగా అటు నవ్య సాహిత్య పరిషత్తులోనివారిని, భావకవులను, జాతీయ భావాలు, దేశభక్తి కల్గిన రచయితలందరిని అభ్యుదయ రచయితల వేదికమీదకు తీసుకొని రావడానికి, అరసం గురించిన అపోహలు తొలగించడానికి అరసాన్ని ఒక సువిశాల జాతీయ వేదికగా, సామాజిక శ్రేయస్సు కోరేవారందరి వేదికగా రూపొందించడానికి ఈ విధంగా ఎడతెగని కృషిగావించుతూన్న సమయంలో అభ్యుదయ రచయితల ఉద్యమానికి హానికల్గించే అతివాద పెడధోరణులు పార్టీలో తలెత్తాయి.

అందుకు 1947లో కామ్రేడ్ సుందరయ్యగారు జారీచేసిన పార్టీ సర్క్యులర్ ప్రబల ఉదాహరణ. ఈ సర్క్యులర్ గురించి ఈ గ్రంథ రచయిత పరకాల పట్టాభి రామారావు "తుమ్మల సాహిత్యం" గ్రంథంలో చేసిన విమర్శ దిగువ యివ్వబడింది. (శ్రీ మహీధర కూడా సుందరయ్యగారి సర్క్యులర్ ప్రసక్తి తెచ్చిన విషయం విదితమే.)

## అభ్యుదయ రచయితల ఉద్యమానికి హానికల్గించిన అతివాద పెడధోరణులు-ఒక పరిశీలన

"అభ్యుదయ రచయితల ఉద్యమం 1943-1948 మధ్య కాలంలో వివిధ రాజకీయ సిద్ధాంత ధోరణులకు సంబంధించిన రచయితల నందరిని అభ్యుదయ రచయితల సంఘ వేదికమీదకు

తీసుకురావడంలో కృతకృత్యమైంది. కాని 1947 ఆగస్టు స్వాతంత్ర్యం గురించి, ఆ తరువాత పరిణామాల గురించిన అంచనాలో కమ్యూనిస్టు పార్టీ అవలంబించిన అతివాద పెడధోరణుల పోకడల ఫలితం అభ్యుదయ రచయితల ఉద్యమం మీదపడి దాని విశాల ఐక్యతను భంగపరచింది. అభ్యుదయ రచయితల ఉద్యమంలో కలసివచ్చిన రచయితలకు కమ్యూనిస్టు రచయితలకు మధ్య ఇది విభేదాలకు, అనైక్యతకు దారితీసింది. కమ్యూనిస్టులుకాని యితర రచయితలపట్ల, వారి అభిప్రాయాలపట్ల అభ్యుదయ రచయితల సంఘం ఎటువంటి వైఖరి అవలంబించాలి? అనే విషయంలో ఇది వ్యక్తమైంది. 1947లో వెలువడిన అభ్యుదయ పత్రిక సంచికలపైన, కామ్రేడ్ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు ఆ రోజుల్లో రాసిన "ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు" వ్యాసాలపైన, కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారు పార్టీ సర్క్యులర్ల రూపంలో చేసిన విమర్శలు ఆనాటి సెక్టేరియన్ దృక్పథానికి మంచి ఉదాహరణలు. రాజమండ్రిలో జరిగిన ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ గురించి సుందరయ్యగారు తన విమర్శనల్లో ఇలా అన్నారు :

"అభ్యుదయ ఐదవ సంచికలో (1947) అభ్యుదయ రచయితల నాల్గవ సమావేశంలోని వ్యక్తుల ఉపన్యాసాలు వేశారు. ఆ ఉపన్యాసాలన్నీ చదివితే అనవసర మీమాంస చర్చగా కనబడుతుంది. సభావేదికపైన ఆ పెద్దలందరూ అభ్యుదయ రచనలంటే ఏమిటో తమ అభిప్రాయం చెప్పుకోనివ్వడం అవసరం. వానినన్నింటిని పొడుగుగా మాస పత్రికలో అభ్యుదయ రచయితల పత్రికలయినా వేయడం అవసరం. వారి అభిప్రాయాలను సమీక్షచేస్తూ, క్లుప్తంగా ఉపన్యాస భాగాలు సంగ్రహించి సమీక్షలోనే చూపెడితే సరిపోయేది.

- 1947 పార్టీ సర్క్యులర్, పుచ్చలపల్లి సుందరయ్య "ఏరిన రచనలు"
పేజీ 96, ప్రజాశక్తి బుక్‌హౌస్, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-2

శ్రీ సుందరయ్యగారు ఉద్దేశించింది రాజమండ్రిలో జరిగిన మూడవ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభలో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రభృతులు ప్రసంగాల గురించి. మహాసభకు ఆహ్వానించిన పెద్దల ఉపన్యాసాలను అభ్యుదయ పత్రికలో అదేపనిగా వేయకూడదని సుందరయ్యగారు అభ్యంతరం చెప్పడానికి కారణం, ఆనాడు కమ్యూనిస్టుల అభిప్రాయాలకు ఆ పెద్దలు భిన్నమైన అభిప్రాయాలు వెలిబుచ్చడమే. సభకు ఆహ్వానించిన వారి ఉపన్యాసాలను సెన్సార్ చేయాలనే వైఖరి ఆనాటి సెక్టేరియన్ పోకడ పర్యవసానమేనని వేరుగా చెప్పనక్కరలేదు.

అదే, సుందరయ్యగారి సర్క్యులర్‌లో ఈ విమర్శ చూడండి :

"పిలకా గణపతిశాస్త్రిగారు (అభ్యుదయలో) ఇలా వ్రాస్తున్నారు : అభ్యుదయ రచయితలు ఒక గిరిగీసి రచయితలందరూ దానిని అవలంబించాలని ఎప్పుడూ అనరు. వారికి కావలసినది విశాలమైన విశ్వశ్రేయస్సు. విశ్వశ్రేయస్సుకు విరుద్ధమైనది ఏ ప్రణాళిక అయినా వారికి అనంగీకారమే. భౌతికవాదమే అంగీకరించాలని కాని, ఆదర్శవాదమే అంగీకరించాలనికాని ఒక నియమం ఏదీలేదు. అయితే విశ్వశ్రేయో దృష్టి మాత్రం చాలా ముఖ్యం. దీనితో (ఈ అభిప్రాయంతో) కమ్యూనిస్టు రచయితలు ఏకీభవించరు. **ఇది వర్గాతీతమైన (నానక్లాస్) ధోరణి.**

ఈ ధోరణి అందరూ అభ్యుదయ రచయితలమనుకొని, అందరి రచనలు అభ్యుదయ రచనలే అనే ధోరణికి దారితీస్తుంది. **విశ్వశ్రేయస్సుకు మార్గం ఆదర్శవాదం ద్వారా కాదు (ఐడియలిజం). భౌతికవాదాన్ని అంగీకరించి, వివిధ వర్గాలుగా విభజించబడిన ప్రజలలో పీడితవర్గం తరఫున నిలబడి, వారిలో ఒక భాగమై, రచయిత పోరాడగల్గినట్లయితే విశ్వశ్రేయస్సుకు, ప్రజాభ్యుదయానికి దారితీస్తాయి."**

**"అభ్యుదయ రచయితల సంఘంలో పనిచేసే కమ్యూనిస్టు కామ్రేడ్స్ తమ ఈ మూలసిద్ధాంతాలు వదలివేశారు కాబట్టే,** వారు అందరికీ ముందుండి మెట్టుమెట్టుకూ మరింత అభ్యుదయకర మార్గాన్ని సూచించడానికి బదులు అందరినీ కలుపుకొని రావాలనే ఆవేదనలో అందరికన్నా వెనుకబడిన అభ్యుదయ రచయితలను సమర్థించడానికి దిగజారుతున్నారు.''

- అదే సర్క్యులర్‌లో సుందరయ్యగారు, పేజీ 100

అంటే భౌతికవాదం అంగీకరించితేనే విశ్వశ్రేయస్సు, ఆదర్శవాదం విశ్వశ్రేయస్సుకు మార్గం కాదు - అని అభ్యుదయ రచయితల సంఘం గిరిగీసుకొని కూచోవాలన్నమాట.

**ఫాసిస్టు వ్యతిరేకత, సామ్రాజ్యవాద వ్యతిరేకత, దేశ స్వాతంత్ర్యం, ప్రజాతంత్రం, ప్రజాభ్యుదయం, అభ్యుదయ రచయితల సంఘం ప్రధాన లక్ష్యం. ఈ ప్రధాన లక్ష్యాలకు అనుగుణంగా ఉన్నవారు ఆదర్శవాదం, భౌతికవాద దృక్పథాలతో నిమిత్తం లేకుండా అందరూ నాడు అభ్యుదయ రచయితల ఉద్యమంలోకి వచ్చారు.**

అభ్యుదయ రచయితల సంఘాన్ని - కమ్యూనిస్టు రచయితల సంఘంగాగాక, నిజంగా అభ్యుదయాన్ని ఆశించే రచయితల సంఘంగా తయారుచేయాలంటే ... ఆదర్శవాదం, భౌతికవాదం కొలబద్దలతో కొలవాలనడం సరియైనదా? కాదు. కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వానికి, అభ్యుదయ రచయితల సంఘ సభ్యత్వానికి ఒకే గీటురాయి పెట్టాలనే ఇటువంటి సెక్టేరియన్ వైఖరివలన, ఆనాడు అభ్యుదయ రచయితల ఉద్యమాన్ని అన్ని రాజకీయ అభిప్రాయాలు కల్గిన సమైక్య విశాల ఉద్యమంగా ముందుకు తీసుకొనిపోవడానికి కామ్రేడ్ తుమ్మల తదితరులు చేసిన సమన్వయ కృషికి హాని కల్గింది. ఆ తరువాత 1948-50ల మధ్య అరసం, ప్రజానాట్య మండలి ఉద్యమాలు తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొన్న విషయం విదితమే. కామ్రేడ్ తుమ్మల ఈ వైరుధ్యాల మధ్య, పార్టీ ఆంతరంగిక సంక్షోభం మధ్య చిక్కుకొని నిస్సహాయ స్థితిలో పడ్డారు. పనిచేయక తప్పిందికాదు.

- పరకాల పట్టాభి రామారావు, తుమ్మల సాహిత్య సంచిక,
అరసం ప్రచురణ 1990

## 29

# చిత్తశుద్ధితో కమ్యూనిస్టు పార్టీ చేసుకొన్న ఆత్మవిమర్శ

1953 జూన్ 8-14 తేదీలలో తణుకులో జరిగిన రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ 5వ మహాసభ "1948 జనవరి నుండి 1952 జనవరి వరకు ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ ఆత్మవిమర్శన రిపోర్టు" అనే డాక్యుమెంటును ఆమోదించింది. అందులో పార్టీ అవలంబించిన విధానాలు అతివాద, దుందుడుకు విధానాలనీ, ఇందువలన ప్రజలకు దూరమయ్యామనీ, పార్టీ తీవ్రంగా నష్టపోయిందనీ ఆత్మవిమర్శ చేసుకుంది. విప్లవదశ గురించిన అంచనా తప్పనీ, వ్యూహం, ఎత్తుగడలు తప్పనీ రష్యా మార్గం, చైనా మార్గం అని యాంత్రికంగా అనుసరించామనీ అంగీకరించింది. పార్టీ సెక్టేరియన్ సుడిగుండంలోపడి కొట్టుకుపోవడం జరిగిందనీ, కలకత్తా కాంగ్రెస్ నుండి (1948 ఫిబ్రవరి) సెక్టేరియన్ రాజకీయాలతోను, దుందుడుకు నినాదాలతోనూ కొనసాగాము అని ఆత్మ విమర్శన చేసుకుంది. అలాగే 1955 మధ్యంతర ఎన్నికలలో పార్టీ తన బలాన్ని అధిక అంచనా వేసుకొని సరియైన ఐక్యసంఘటన ఎత్తుగడలను అవలంబించడంలో విఫలమై తీవ్రమైన పరాజయం పాలైందని కూడా పార్టీ ఆత్మవిమర్శ చేసుకొంది.

కమ్యూనిస్టు పార్టీకి అతి ముఖ్యమైన ఆయుధం ఆత్మవిమర్శ. దీనిని ఈ రెండు సందర్భాల లోను పార్టీ చిత్తశుద్ధితో అమలుచేసింది.

(ఆంధ్ర ఎన్నికలపై కేంద్ర కమిటీ తీర్మానం, న్యూఢిల్లీ 28-3-1955)

### అరసం - ప్రజానాట్యమండలి పునర్నిర్మాణం

1948-52 సంక్షోభ సమయంలో సినీమారంగానికి వెళ్ళిన ప్రజానాట్యమండలి కళాకారులు, అభ్యుదయ రచయితలు సినీరంగంలో అనేక అభ్యుదయకర మార్పులు తీసుకొనివచ్చారు. పుట్టిల్లు, రోజులు మారాయి, పల్లెటూరు, షావుకారు ఇంకా ప్రగతిశీల భావాలు ఇతివృత్తాలు గల అనేక సినీమాలను నిర్మించారు. కమ్యూనిస్టు పార్టీని మరిచిపోకుండా 1955 మధ్యంతర ఎన్నికలలో ప్రజానాట్యమండలి కళాకారులు ఆంధ్రదేశమంతా అనేక ప్రదర్శనలు యిచ్చి అశేష ప్రచారం చేశారు. శాంతి ఉద్యమంలో కృషి చేశారు. మూకాభినయం మొ॥ అనేక నూతన కళారూపాలను అభివృద్ధి చేశారు. అనేకమంది సినీ దర్శకులుగా, నటీనటులుగా పేరొందారు. ఆ వివరాలన్నీ శ్రీ మిక్కిలినేని తమ గ్రంథంలో తెలియజేశారు.

అభ్యుదయ రచయితల సంఘం తిరిగి 1955లో పునరుద్ధరించబడింది. ప్రజానాట్యమండలి 1974లో పునరుద్ధరించబడింది. కాని మళ్ళీ కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన విభేదాలవలన అరసం ముక్కలై విప్లవ రచయితల సంఘం ఏర్పరచబడింది. మళ్ళీ విరసం అనేక గ్రూపులుగా విడిపోయింది. ఎవరికి వారే నిజమైన నికార్సైన విప్లవ రచయితలమని అనుకుంటూ ఎవరి కుంపటి వారు ఏర్పరచుకొనడం జరుగుతూంది. తెలుగు సాహితీరంగం సినీమారంగం కూడా లెక్కలేనన్ని

విపరిణామాలకు లోనైయ్యాయి. నేడు అశ్లీల సినీమాలు, టి.వి. సీరియల్స్, క్షీణ సంస్కృతి, వ్యాపార సంస్కృతి రాజ్యమేలుతున్నాయి.

## 30

## పూర్వవైభవం సాధించాలంటే . . .

1934 నుండి 1948 వరకు పది, పద్నాలుగు సంవత్సరాల కాలంలో ఆంధ్రదేశంలో ఒక ప్రత్యామ్నాయ రాజకీయశక్తిగా అభివృద్ధిచెందిన కమ్యూనిస్టు ఉద్యమం, ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనకు మహోజ్వల కృషి గావించి, ఆంధ్ర ప్రజల, మేధావుల, రచయితల, కళాకారుల మన్ననలు పొందిన ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం, తన స్వీయ మానసిక ధోరణితో అవలంబించిన సెక్టేరియన్ పంథాలవలననే 1948-52 సంవత్సరాల మధ్య ఛిన్నాభిన్నమైంది. ఎవరికీ తీసిపోని త్యాగాలు చేసినప్పటికీ, అపరిపక్వ సిద్ధాంత, రాజకీయ విధానాల వలననే తీవ్రంగా నష్టపోయింది. తాము నమ్మిన సిద్ధాంతంకోసం ఎంతోమంది కమ్యూనిస్టు యోధులు తమ ప్రాణాలు అర్పించారు. తమ రక్తం ధారపోశారు. అటు జాతీయోద్యమంలోను, ఇటు కమ్యూనిస్టు ఉద్యమంలోను కమ్యూనిస్టు దేశభక్తులు చేయని త్యాగం అంటూలేదు. పార్టీకోసం, ప్రజా ఉద్యమాల నిర్మాణంకోసం జీవితాలను అంకితం చేశారు. పార్టీకోసం తమ ఆస్తులు అమ్మి యిచ్చారు. కామ్రేడ్స్ సుందరయ్య, రాజేశ్వరరావులు భూస్వామ్య కుటుంబాల నుండి వచ్చినవారైనప్పటికీ నిస్వార్థ త్యాగధనులుగా, నిరాడంబర ప్రజాసేవకులుగా మహోన్న తాదర్శాలుగల మహామనీషులుగా కమ్యూనిస్టు గాంధీలుగా పేరు గాంచి ఆదర్శ ప్రజాజీవితానికి వరవడి దిద్దారు. అలాగే తెలంగాణా కమ్యూనిస్టు ఉద్యమాన్ని ఆంధ్ర కమ్యూనిస్టు నాయకులే నిర్మించారు. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావు, సర్వదేవభట్ల రామనాథం, మగ్దుం మొహియుద్దీన్, రాజబహదూర్‌గౌడ్ తదితర కమ్యూనిస్టు నాయకులు, తెలంగాణా సాయుధ విప్లవ నేతలుగా విప్లవ చరిత్ర నిర్మించారు. ఇంత మహత్తర త్యాగ సంప్రదాయాల వలననే, ఆత్మబలిదానం, ఆదర్శాల ఫలితంగానే 1952 జనరల్ ఎన్నికలలో కమ్యూనిస్టులు అఖండ విజయం సాధించారు. కమ్యూనిస్టులను నాశనం చేయదలచిన కాంగ్రెస్ పాలకులు 1952 జనరల్ ఎన్నికలలో మట్టికరిచారు. కాటూరు, ఎలమర్రులలో ప్రజల గుడ్డలూడదీసి గాంధీజీ విగ్రహం చుట్టూ నగ్నప్రదర్శనలు చేయించిన మహాపాపానికి ఆంధ్ర ప్రజలు వీరికి అక్షరాలా "రాజకీయ మరణశిక్ష" విధించారు. ఆంధ్ర జిల్లాల్లో కమ్యూనిస్టు పార్టీ ప్రథమ పార్టీగా ఎన్నికైంది. తెలంగాణా ప్రాంతంలో కూడా కమ్యూనిస్టులు అత్యధిక సంఖ్యలో గెల్పొందారు. రాజకీయాధికారం కమ్యూనిస్టుల హస్తగతమయ్యే పరిస్థితి వచ్చింది. కాని కమ్యూనిస్టు పార్టీ మళ్ళీ అవలంబించిన పొరపాటు ఎత్తుగడల వలన కాంగ్రెస్ నాయకులు అవలంబించిన కుటిల రాజకీయ ఎత్తుగడలు, కుతంత్రాల వలన కమ్యూనిస్టులు అధికారంలోకి రాలేకపోయారు.

ఇన్ని రాజకీయ పొరపాట్లు చేసినప్పటికీ అతివాద దుందుడుకు విధానాలు అవలంబించి నప్పటికీ అందువలన కమ్యూనిస్టు పార్టీ తీవ్రంగా నష్టపోయినప్పటికీ 1953లో ప్రత్యేకాంధ్ర రాష్ట్రంకోసం 1956లో విశాలాంధ్ర రాష్ట్ర నిర్మాణంకోసం ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమం అద్వితీయ పోరాటం చేసింది. తెలుగుజాతి సమైక్యత కోసం పట్టువిడుపులులేని పోరాటాలు సాగించింది. నందికొండ (నాగార్జునసాగర్), శ్రీశైలం తదితర ప్రాజెక్టులకోసం ఎడతెగని ఆందోళన చేసింది. "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" పేరిట ఆంధ్రదేశానికి ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి పంథాను ఏనాడో ఆంధ్ర ప్రజల ముందుంచిన ఘనత కమ్యూనిస్టు పార్టీదే.

అయితే తిరిగి 1955 మధ్యంతర ఎన్నికలలో అది సరియైన ఐక్య సంఘటన, ఎత్తుగడలు అవలంబించలేకపోవడంవలన రాజకీయ అధికారాన్ని హస్తగతం చేసుకొనే దశనుండి, ఘోరపరాజయంపాలైంది. 1952 ఎన్నికలలో వచ్చిన మెజారిటీని కోల్పోవడమేకాక మైనారిటీ రాజకీయ పార్టీగా నెట్టివేయబడింది.

అప్పటినుండి పార్టీలో తీవ్ర రాజకీయ సిద్ధాంత విభేదాలు తలయెత్తాయి. చివరకు 1964 వచ్చేసరికి పార్టీ రెండు ముక్కలైంది. మాతృసంస్థనుండి చీలిపోయినవారు మార్క్సిస్టు పార్టీగా ఏర్పడ్డారు. ఆ తరువాత 1968లో మార్క్సిస్టు పార్టీనుండి నక్సలైట్ నాయకులు చీలిపోయారు. నక్సలైట్ ఉద్యమం నేడు ఎన్ని చీలకలైందో ఎవరూ చెప్పలేరు.1948-51 అతివాద, దుందుడుకు, దుస్సాహసిక విధానాలకు వారు వారసత్వం వహిస్తున్నారు.

ఈ విధంగా బెంగాల్, కేరళలతోబాటు భారత కమ్యూనిస్టు ఉద్యమంలో అగ్రశ్రేణి స్థితికివచ్చిన ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం చీలికలు వాలికలు అయింది.

భారత జాతీయ విముక్తి పోరాటంలో ఎవరికీ తీసిపోని త్యాగాలు చేసినప్పటికీ, భారతదేశ విశిష్ట పరిస్థితులకు మార్క్సిజాన్ని అన్వయించడంలో, లెనిన్ కలోనియల్ థీసిస్‌ను అనుసరించి, భారతదేశ పంథాను రూపొందించుకోవడంలో అడుగడుగునా వైఫల్యం చెందడంవలన, దేశంలో ప్రధాన ప్రతిపక్షంగా ఉండే స్థితిని, ప్రత్యామ్నాయ రాజకీయ ప్రతిపత్తిని కోల్పోయింది. కమ్యూనిస్టు ఉద్యమ అనైక్యత, వామపక్ష బలహీనతకు, మితవాద, మతవాద శక్తుల బలాధిక్యతకు దారితీసింది. దేశం నేడు అర్థ ఫాసిస్టు స్వభావంగల బి.జె.పి. కూటమి చేతుల్లోకి పోయింది.

## అసంపూర్తిగా నిలిచిపోయిన ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమం

1940 దశకంలో ఏ చారిత్రక నేపథ్యంలో నవయుగాంధ్ర నిర్మాతలు ప్రారంభించిన ఆంధ్ర జాతీయ పునరుజ్జీవన కృషిని కమ్యూనిస్టు ఉద్యమం కొనసాగించిందో అట్టి చారిత్రిక నేపథ్యం యించుమించు అలానే ఉండిపోయిందని చెప్పవచ్చు. మార్క్సిస్టు పరిభాషలో చెప్పుకోవాలంటే సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక పోరాట కర్తవ్యాలు అసంపూర్తిగానే ఉండిపోయాయి. జాతీయ ప్రజాతంత్ర విప్లవదశ పరిపూర్తికాలేదు. సామ్రాజ్యవాదం కొత్తరూపంలో బహుళజాతి కంపెనీల రూపంలో నయావలస దోపిడీ కొనసాగిస్తోంది. ప్రపంచీకరణ సరళీకృత ఆర్థిక

విధానాలతో స్వదేశీ, విదేశీ గుత్త పెట్టుబడిదారీ వర్గాలు దేశ స్వావలంబనను, స్వతంత్ర ఆర్థిక విధానాన్ని ధ్వంసం చేస్తున్నారు. వ్యవసాయ రంగం తీవ్ర సంక్షోభంలో పడింది. నిరక్షరాస్యత, నిరుద్యోగం తాండవిస్తున్నాయి. కుల, మత తత్వాలు, మూఢనమ్మకాలు పెరుగుతున్నాయి.

ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమ కర్తవ్యాలను కమ్యూనిస్టు పార్టీ 1940 దశకంలో ఎక్కడవరకు కొనసాగించిందో అక్కడే ఉండిపోయాయి. నేడు పెట్టుబడిదారీ క్షీణసంస్కృతి, అశ్లీల సినీమాలు, టి.వి. సీరియల్స్ యువతను తప్పుదోవపట్టిస్తున్నాయి. మాదకద్రవ్యాలతో యువత జోగుతున్నారు. గుడి, బడి అన్న విచక్షణలేకుండా బార్‌లు వెలుస్తున్నాయి. వరకట్న హత్యలు, ఆత్మహత్యలు, గర్భస్థ ఆడశిశువుల భ్రూణహత్యలు, స్త్రీలపై అత్యాచారాలు పెచ్చుపెరుగుతున్నాయి. విద్యారంగం ప్రైవేటీకరణతో బడా వ్యాపారంగా మారిపోతూంది. విద్య కాషాయీకరణ చేయబడుతూంది. చరిత్ర, సంస్కృతి తత్వశాస్త్రం మొ॥ సామాజిక శాస్త్రాలు విద్యారంగం నుండి నిష్క్రమిస్తున్నాయి. విద్యార్థులకు, యువకులకు దేశం, సమాజం, దేశభక్తి సామాజిక కర్తవ్యాలతో ఎట్టి ప్రమేయం లేకుండాపోతోంది. మరోవైపు దేశంలో అవినీతి, అక్రమార్జనలు, ఆడంబరాలు, అట్టహాసాలు మితిమీరిపోతున్నాయి. సామాజిక విలువలు, నైతిక విలువలు క్షీణించిపోతున్నాయి.

ఒకనాడు ప్రతీ గ్రామంలో బాల సంఘం, యువజన సంఘం, మహిళా సంఘం, వ్యవసాయ కార్మిక, రైతు సంఘాలతో సకల జీవనరంగాలలో ఉద్యమాల స్ఫూర్తి ఉండేది. నేడు అట్టి ప్రజాతంత్ర ప్రగతిశీల ఉద్యమాల స్ఫూర్తి లేకుండాపోయింది. అసాంఘిక శక్తులు ఒకవైపు, ఉగ్రవాదం మరొకవైపు విజృంభించుతున్నాయి. ఇట్టి పరిస్థితులలో కమ్యూనిస్టు ఉద్యమం, వామపక్ష శక్తులు సమైక్యం కావటం తక్షణ కర్తవ్యం.

ఆంధ్రదేశంలో తిరిగి కమ్యూనిస్టు ఉద్యమం, వామపక్షశక్తులు ఐక్యమై ప్రత్యామ్నాయ రాజకీయ శక్తిగా పునరుజ్జీవించినప్పుడే ఆంధ్రప్రదేశ్ పురోభివృద్ధి, విశాలాంధ్రలో ప్రజారాజ్యం అనే మహోన్నత లక్ష్యం సాధనకు మార్గం సుగమమవుతుంది. అభివృద్ధిలో ప్రాంతీయ అసమానతలవలన తెలుగుజాతి సమైక్యతకు పదేపదే ఏర్పడుతున్న విపత్తులు కూడా అప్పుడే తొలగిపోగలవు.

"విశాలాంధ్రలో ప్రజారాజ్యం" వలె ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధిపంథాను ఆంధ్ర ప్రజలముందు ఉంచగల్గే స్థితికి కమ్యూనిస్టు ఉద్యమం రాగల్గాలి. అప్పుడే ఒకనాడు ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనలో కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన మహోజ్వల పాత్రను తిరిగి కొనసాగించే శుభపరిణామం ఏర్పడగలదు.

# 31

అనుబంధం - 4

# పొరబడిన ఆంధ్ర రచయితలకు కమ్యూనిస్టు పార్టీ బహిరంగలేఖ

**1948-52** తీవ్ర నిర్బంధ కాలంలోను, అటుతర్వాత 1955 మధ్యంతర ఎన్నికలలోను కమ్యూనిస్టులపైన, అభ్యుదయ రచయితలపైన, ప్రజానాట్యమండలి కళాకారులపైన స్వార్థపరవర్గాల కొమ్ముకాసిన మితవాద పత్రికలవారు ముఖ్యంగా రామనాధ గోయంకా బాకా పత్రిక ఆంధ్రప్రభ తీవ్ర దుష్ప్రచారం చేశారు. కమ్యూనిస్టులు అధికారంలోకి వస్తే బోల్షివిక్ పెనుభూతం దేశాన్ని మ్రింగి వేస్తుందని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు చేసిన అపచారానికే వంత పలికారు. వ్యక్తి స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం నాశనమైపోతుందని భయోత్పాతం కల్గించారు. నార్ల వెంకటేశ్వరరావుగారి సంపాదకత్వాన ఆంధ్రప్రభ "కమ్యూనిస్టులు అధికారంలోకి వస్తే వృద్ధులను చంపివేస్తారు. స్త్రీలను జాతీయం చేస్తారన్నంత నీచ ప్రచారానికి దిగింది. రోజుకొక కార్టూన్ వేసింది.

ఆంధ్రపత్రిక తరపున నాటి సంపాదకుడు శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు, ఆంధ్రప్రభ తరపున శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, కాంగ్రెస్‌వాదుల తరపున శ్రీ మోటూరి సత్యనారాయణగారు ఆంధ్రదేశంలోని 150 మంది రచయితల, కళాకారుల సంతకాలను ఒక ఉద్యమంగా సేకరించి ఒక సంయుక్త విజ్ఞాపన ప్రకటింపజేశారు. కమ్యూనిస్టులు అధికారంలోకి వస్తే వ్యక్తి స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం నశించిపోతాయని ఈ ప్రకటనలో భయోత్పాతం సృష్టించారు. ఒకనాడు అభ్యుదయ రచయితల సంఘ వేదికపైకి, ప్రజానాట్యమండలి వేదికపైకి వచ్చి వారి కృషికి ప్రశంసలు కురిపించిన అనేక మంది ప్రముఖ కవులు, కళాకారులు కూడా ఈ భయోత్పాత వాతావరణంలో కొట్టుకునిపోయి సంతకాలు పెట్టారు. శ్రీశ్రీపైన, అభ్యుదయ రచయితల పైన అనేక రకాల దుష్ప్రచారానికి, అభాండాలకు ఈ సంయుక్త ప్రకటన తావిచ్చింది.

ఈ సంయుక్త ప్రకటనకు నాటి ప్రముఖ అభ్యుదయ రచయితలలో ఒకరైన శ్రీ నార్ల చిరంజీవిగారి బహిరంగలేఖ ద్వారా కమ్యూనిస్టు పార్టీ తగు సమాధానం యిచ్చింది. తెలుగు సాహితీ సాంస్కృతిక రంగాలలో యాంటీక్లైమాక్స్ అనదగిన ఈ ఘట్టాన్ని శ్రీ చిరంజీవి లేఖ బహిర్గతం చేస్తుంది. 1948-52 మధ్య, 1955 మధ్యంతర ఎన్నికల సందర్భంలో కమ్యూనిస్టు పార్టీ అవలంబించిన సెక్టేరియన్ పంథా, కమ్యూనిస్టు వ్యతిరేకులకు, స్వార్థపరవర్గాల బాకా ప్రచారకులకు పెద్ద ఆయుధంగా దొరికింది. దీని రాజకీయ లోతుపాతులు తెలిసో, తెలియకో

ఈ దుష్ప్రచారాల ప్రభావానికి గురి అయిన సాహితీవేత్తలు రకరకాల అనుమానాలకు, అపోహలకు గురి అయి సంతకాలు పెట్టారు. ఆనాడు అభివృద్ధికరవాదులకు, అభివృద్ధి నిరోధకులకు జరిగిన భావ సంఘర్షణను ఈ (1955, ఫిబ్రవరి) బహిరంగలేఖ తెలియజేస్తున్న దృష్ట్యా పూర్తిపాఠం పాఠకుల ముందుంచుతున్నాను.

ఈ సంయుక్త ప్రకటనతో తన కెట్టి సంబంధం లేదని శ్రీ ఆరుద్ర ఆ సందర్భంలో ఒక బహిరంగ ప్రకటన చేసిన విషయం విదితమే.

చారిత్రిక ప్రాధాన్యత కల్గిన ఈ బహిరంగలేఖ దిగువ యిస్తున్నాను.

# 32

# బహిరంగలేఖ

## మహాకవి శ్రీశ్రీ ప్రతిభా దర్పణంపై మసిపూయజూసే పత్రికా వ్యాపారుల "ప్రజాస్వామ్యానికి" అర్థం ఏమిటి?

### ప్రజాస్వామ్యాన్ని హఠాత్తుగా ప్రేమిస్తూన్న రచయితలకు శ్రీ నార్ల చిరంజీవి లేఖ

('మా లక్ష్యం' అంటూ రచయితల ప్రకటనను ఒక దానిని పంపుతూ దానితోపాటు ఈ క్రింది లేఖను కూడా నాకు పంపారు. దీనికి కింద ప్రకటించిన సమాధానాన్ని 1955 ఫిబ్రవరి 7వ తేదీన శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారికి పంపాను. నేటి ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికలలో ఈ లేఖలో ప్రకటించిన వారి పేర్లు మాత్రమేగాక అనేకమంది పేర్లు ఉదహరించబడినాయి. రచయితలు తమకు తాముగా ఈ ప్రకటన చేయలేదనీ, ఇందుకు కొందరు పనిగట్టుకొని సంతకాల ఉద్యమం ప్రారంభించారని క్రింది లేఖవల్లనే తెలుస్తూంది. ఇంతేగాక, మోటూరి సత్యనారాయణ, నార్ల వెంకటేశ్వరరావు, ఆంధ్రపత్రిక సంపాదకుడు పండితారాధ్యుల నాగేశ్వరరావుగారలీ సంతకాల సేకరణకు పూనుకొన్నారని తెలుస్తూంది. ఎన్నికలలో కాంగ్రెస్ పక్షాన్ని బలపరిచే తమ ప్రయత్నాలకు అనువుగా ఈ ప్రకటనను ఉపయోగించుకొంటున్నారనేది నేటి ఆంధ్రప్రభ సంపాదకీయం, ఆంధ్రపత్రిక వ్యాఖ్య నిదర్శనం. ఈ ప్రకటన వెనకనున్న రాజకీయాల్ని ఇప్పటికైనా తెలుసుకోవలసిందిగా రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాను. - రచయిత)

### పద్మరాజుగారి లేఖ

అయ్యా!

ప్రస్తుత క్లిష్ట పరిస్థితులలో మన సంప్రదాయములను, సంస్కృతిని, వ్యక్తి స్వాతంత్ర్యమును సంరక్షించుకొనుచు, నూతన సమాజ నిర్మాణము సాగించవలెనుగదా! ఈ తరుణములో ఆంధ్ర రచయితలు, కళాకారులు కూడా ప్రజలకు తమ మనస్సులను వ్యక్తపరచవలెనుగాని, ఊరకుండుట భావ్యముకాదు. కనుక, మిత్రులము కొందరము, ఒక చిన్న ప్రకటన తయారుచేసి,

తెలుగు రచయితల, కళాకారుల పేర వెంటనే ప్రకటించుట అవసరమని తలచి, మీ ఆమోదము కొరకు దీనిని పంపుచున్నాము. వెంటనే అనగా తిరుగు టపాలో ఆ ప్రకటనపై మీ దస్కతుపెట్టి, క్రింద పేర్కొనబడిన చిరునామాకు పంపగోరుచున్నాము.

ఇట్లు
భవదీయులు,

విశ్వనాథ సత్యనారాయణ, గిడుగు వెంకట సీతాపతి, తుమ్మల సీతారామమూర్తి, వేదుల సత్యనారాయణశాస్త్రి, పిలకా గణపతి శాస్త్రి, చక్రపాణి, ద్వారం వెంకటస్వామి నాయుడు, బి.యన్. రెడ్డి, ఎ. నాగేశ్వరరావు, న్యాయపతి కామేశ్వరమ్మ, శివలెంక శంభుప్రసాద్, పండితారాధ్యుల నాగేశ్వరరావు, దేశిరాజు వెంకటకృష్ణ శర్మ, బోయి భీమన్న, చిత్తూరు నాగయ్య, దేవులపల్లి కృష్ణశాస్త్రి, చామకూరు సత్యనారాయణ, న్యాయపతి రాఘవరావు, దుగ్గిరాల రాఘవ చంద్రయ్య, జి. జాషువా, నార్ల వెంకటేశ్వరరావు.

పాలగుమ్మి పద్మరాజు,
శ్రీరంగం నారాయణబాబు
కార్యదర్శులు,
సిమ్లా హౌస్, హబీబుల్లా రోడ్,
త్యాగరాయనగర్, మద్రాసు-17

**నా జవాబు**

శ్రీయుత పాలగుమ్మి పద్మరాజుగారికి,

నమస్తే. సోదర రచయితనని మన్నించి, నా ఆమోదం నిమిత్తం తాము ప్రకటన పత్రమును పంపినందుకు సంతోషిస్తున్నాను.

సంతకం బదులు జవాబు వ్రాయవలసివచ్చింది.

కడచిన మూడు దశాబ్దాలలోను ఎన్నో సాహిత్య సంస్థల చావు పుట్టుకలను మనం చూశాం. అనేక సాహితీ సభలు తయారుచేసిన తీర్మానాలనూ, చేసిన నిర్వచనాలనూ విన్నాం.

నాడూ నేడూ కూడా కొత్త జీవశక్తుల్ని నింపుకొంటూన్న వాళ్ళు మాత్రమే ముందుకు వెళుతున్నారు. వెళతారు. భీరువులు వెనకనుంచి వెనుకనే అదృశ్యులవుతున్నారు.

ఐతే, ఇన్నాళ్ళు గడిచాక, ఈ తరుణంలో ఏర్పడిన 'క్లిష్ట పరిస్థితుల' కారణంగా 'మన సాంప్రదాయములను, సంస్కృతిని, వ్యక్తి స్వాతంత్ర్యమును సంరక్షించుకొనుచు నూతన సమాజ నిర్మాణమును సాగించుకోడానికి', మనం 'ప్రజలకు మన మనస్సులను వ్యక్తపరచ'కుండా 'ఊరుకోవడం భావ్యంకాదు' కనుక అందుకు 'కొందరు మిత్రులు' కలసి ఒక 'చిన్న ప్రకటన' తయారుచేసి 'ఆంధ్ర రచయితల, కళాకారుల పేర ప్రకటించవలసిన అవసరం' ఏర్పడిందన్న సంగతి నేనూ గుర్తిస్తున్నాను.

ఇంతకు ముందే ఈ 'చిన్న ప్రకటన' విషయంలో బాధ్యులైన వారందరిపట్ల నాకు వ్యక్తిగతంగా అత్యుత్తమ గౌరవం ఉంది. వారి వారి కళాసాధన గురించి ఎంతో గాఢాసక్తి ఉంది. ఆంధ్ర జాతీయ వికాసానికి, అభివృద్ధికి కొందరు చేసిన కృషి చారిత్రాత్మకమైనది. కాబట్టే, 'ఈ క్లిష్టపరిస్థితుల్లో' ప్రజలకు మన మనస్సును వ్యక్తం చేయబోయేముందు, పెద్దలైన మీ అందరి ఎదుట కొన్ని విషయాల్ని నేను నివేదింపదలచాను. ఆంధ్రసీమలో నేను కళ్ళారా చూసి మనసారా అనుభవించి ఆ విషయాన్ని నిస్సంకోచంగా మీ ఎదుట ఉంచుతాను. అలాంటి విషయం ఇది.

ఇప్పుడు ఏర్పడిన క్లిష్టపరిస్థితుల రూపురేఖలు ఏమిటో తేలవలసియుంది. కాని, ఇంతకు ముందే సంతకం చేసిన కొందరు పెద్దలకు మాత్రం ఈ క్లిష్టపరిస్థితుల లోతుపాతులు పూర్తిగానే తెలిసినట్లు నాకు తోస్తోంది.

ఎందుచేతనంటే వారి చేతుల్లో దినపత్రికలున్నాయి. చిన్న ప్రకటనలో ఉల్లేఖించిన అంశాలన్నింటిని గురించి వారు తమ ప్రచార సాధనాల ద్వారా తీవ్ర ప్రచారంలోకి తెచ్చారు. ఇంకా తెస్తున్నారు. వారి ప్రసార సరళినిబట్టి "క్లిష్టపరిస్థితులు" అన్నదానికి అంతరార్థం ఏమిటో తేలిపోయింది. వారి సంతకాల సరసనే మీ అందరి సంతకాలు ఉన్నాయి కనకా, ఈ ప్రకటన బాధ్యత మీ మీదా ఉంది కనకా, వారు కొన్నాళ్ళుగా చేస్తున్న పని ఏమిటో పరిశీలించి ఆలోచించమని నేను మిమ్మల్ని కోరుతున్నాను.

ఆధునిక సాహిత్యంలో శ్రీశ్రీ ఒక నవశకాన్ని ప్రారంభించారని సర్వులూ పేర్కొన్నవారే. మనమందరం శ్రీశ్రీని ఒక యుగకర్తగా స్వీకరించాం. "శ్రీశ్రీ కనక మరో దేశంలో పుట్టి ఉన్నట్లయితే నోబెల్ ప్రైజ్ పొంది ఉండేవాడు" అని బందరు నవ్య సాహిత్య పరిషత్తు కవితా గోష్ఠిలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీశ్రీని గురించి అన్న మాట లివి.

ఆ శ్రీశ్రీని గురించి, సంతకాలు పెట్టిన పత్రికా యజమానులు యీనాడు సాగిస్తున్న వేటకూ, (ఇంతకన్న తీవ్ర శబ్దం దొరకనందుకు విచారిస్తున్నాను.) వారూ, మీరూ కలిసి తయారు చేసిన ప్రకటన పత్రికా హంశాలకూ ఎలాంటి సంబంధ బాంధవ్యం ఉందో తెలుసుకో గోరుతున్నాను.

పత్రికా సంస్థలవారు శ్రీశ్రీమీద సాగిస్తున్న ఈ వేట - భారతీయ సంప్రదాయాలకు కాని, సంస్కృతికి కాని అనుగుణమైనదేనా? యోచించవలసిందని నేను అడుగుతున్నాను.

యూదుల్ని హింసించిన వారి 'జాతీయతత్వాని'కీ,
నీగ్రోలను మంటల్లో తోసి చంపేవారి 'ప్రజాస్వామ్యానికీ',
కీట్సు మరణానికి బాధ్యులైనవారి 'నాగరికతకూ',
పర్యాయమీ వేట.
పాశవికతకు ప్రతిబింబమీ వేట.
ఇంతకన్నా నీచాన్నీ, క్షుద్రత్వాన్నీ మనం వినబోము, చూడబోము.

## మన సంప్రదాయాలకూ, సంస్కృతికీ, ప్రజాస్వామ్యానికీ చిచ్చుముట్టించిననాడు మీరేల మౌనం వహించారు?

మన సోదర రచయితలపట్ల పత్రిక వ్యాపారులిలా అత్యాచారాలు సాగిస్తుండే తదితర పెద్దలు, సంస్కృతీప్రియులూ ఎందుకు మౌనం వహించారో తెలుసుకోగోరుతున్నాను.

పాపాలకు వడిగట్టిన వ్యాపారులు సాగించే అత్యాచారాలను ఎదుర్కొనే బాధ్యత లేదా? రచయితల మాన మర్యాదలను, ఆత్మగౌరవాన్ని నిల్పవలసిన బాధ్యత మన అందరిమీద లేదా? ఉంది.

ఆ పెద్దలతోపాటే ఆంధ్ర రచయితల, కళాకారుల పేర ప్రజలముందు నించునే ముందు మీరొక పర్యాయము ఈ విషయాన్ని యోచించవలసిందిగా సవినయంగా మనవిచేస్తున్నాను.

న్యాయాన్యాయ వివేచన సభాపరిశీలనకు వచ్చినప్పుడు తెలిసి నిజాన్ని ప్రకటించకపోతే దోష ఫలితాన్ని సభికులు సైతం పంచుకోవలసి వస్తుందని విదురుడు చెప్పాడు. ఇది భారత నీతి. ఈ నీతికి విరుద్ధంగా మౌనం ధరించటంలో అర్థం ఏమిటి? యుగకర్తగా భావించిన మన రచయితపై పత్రికా వ్యాపారులు సభ్యతా సందర్భంలేని వేట సాగిస్తుంటే భారతీయాదర్శ ప్రియులైన మీరందరు కిమిన్నాస్తిగా ఊరుకోవటం భావ్యమా? తిలా పాపం తలా పిడికెడు పట్టే ఉద్దేశ్యమా?

'మేధా స్వాతంత్ర్యం మానవ సహజహక్కు అనీ, విభిన్న సిద్ధాంతముల యెడ గౌరవ సహన భావములపై ఈ స్వాతంత్ర్యపు మనుగడ ఆధారపడి యున్నదనీ, వ్యక్తిని ఒక వర్గముకాని, ఒక పక్షముకాని, వ్యాపార సంస్థకాని, ప్రచార వ్యవస్థకాని అణచివేయని సంఘములోనే సారస్వతము కళలు వర్థిల్లగలవు. మానవాత్మ స్వాతంత్ర్యము క్లిష్టము. సునిశితము. దానికి సంరక్షణ లేనిచో ఉత్తమ కళావిర్భావము దుస్సాధ్యము' అని లక్ష్యంగా నిర్వచిస్తున్నారు. కాని ఆ లక్ష్యల సర్వ నాశనానికే తలపడి తమ వ్యాపారంగా దీన్ని సాగిస్తున్నారు మన పత్రికా యజమానులు. శ్రీశ్రీకి జాతీయత లేదని, నిజాయితీకి దాసుడని, విజాతీయతకు దాసుడని ఇంకా ఏవేవో కుళ్ళు ప్రచారాల ద్వారా వీరు ప్రయత్నిస్తున్నారు. వీరి చర్య మనలోని రచయితను, మన సాహిత్యాన్ని అవమానించేదిగా లేదా?

## శ్రీశ్రీపై దుష్ప్రచారం

శ్రీశ్రీకి జాతీయత లేదనే వీరి పిచ్చి వాగుడుకి మన జవాబు లేదా? జవాబీయవలసిన జవాబ్దారీ మనకు లేదా?

1948 ఆగస్టులో భారత స్వాతంత్ర్యావతరణ సందర్భంలో వెలువడిన రచనలన్నీ గమనించండి. శ్రీశ్రీ "మహా సంకల్పం" రచన పరిశీలించండి. శ్రీశ్రీ రచన ఒక్కటి మాత్రమే మహోన్నత జాతీయాదర్శానికి ప్రతిబింబంగా నిలబడగలిగింది. దీన్ని వినేందుకు చెవులు, చదివేందుకు కళ్ళూ లేకపోయాయా వీరికి?

పూజ్య బాపూజీ నిర్యాణం చెందినప్పుడు ఆశేతుహిమాచల పర్యంతం కవులు రచనలు చేశారు. భారతీయాత్మ స్పందనకు ప్రతిగా శ్రీశ్రీ రచించిన "సంభవామి యుగే యుగే" రచన వంటిది. మన తెలుగులోనే కాదు, మరే ప్రాంతీయ భాషలో సైతం వెలువడలేదు. ఈ సత్యాన్ని గుర్తించని అంధులేనా నేడు ఆదర్శాన్ని వల్లించేందుకు సిద్ధమవుతున్నారు?

శ్రీశ్రీని ద్రష్టగా దార్శకునిగా చూచేందుకు పై రెండు ఉదాహరణలే చాలు.

రేడియోలు, పత్రికలు ఇచ్చే ముష్టి దానధర్మాలకు ఆశించి చెక్కభజనలు చేసే కిరాయి రచనలకూ, మానవోన్నతమూర్తిగా నించున్న శ్రీశ్రీ రచనలకు తేడా గుర్తించనివాళ్ళేనా శ్రీశ్రీమీద వేట సాగించేది?

శ్రీశ్రీ చేసిన నేరం ఏమిటి? పత్రికా వ్యాపార పారంగతులు చేస్తున్న దానికి సబబుందా?

ఏ జాతీయత శ్రీశ్రీని పురికొల్పి పై అత్యుత్తమ రచనలు చేయించిందో, అలాంటి విశ్వజనీనాదర్శం, మానవ ఔన్నత్యం, కరుణ శ్రీశ్రీలో మూర్తీభవించాయి. ఎల్లల గొడవ, భాషా భేదం ఆయనలో లేవు.

'ఆసియా ఆసియా వాసులదే' అన్న నినాదం మరుగున జపాను సాగించిన ఫాసిస్టు చర్యల్ని రవీంద్రులు నిర్ద్వంద్వంగా ఖండించారు. జపాను కవి నగూచీకి రవీంద్రులు ఖచ్చితమైన సమాధానాన్ని పంపారు.

ప్రపంచ మానవ సంస్కృతిపై ఫాసిజం తన పడగ విప్పి కాటేస్తూంటే, దాన్ని నిర్మూలించమని 'లేలే రష్యా' అని శ్రీశ్రీ సోవియట్ రష్యాను ఆహ్వానించారు. ఫాసిస్టులు ప్రపంచానికి, మానవ నాగరికతకూ ఎలాంటి ప్రమాదం తెచ్చారో ప్రతివారికీ తెలుసు. ప్రపంచ ప్రజలందరి శత్రువుగా ఫాసిజం విజృంభించింది. దాని మృత్యు బంధనాలనించి మానవ సంస్కృతిని తప్పించడంలో సోవియట్ రష్యా అగ్రగామిగా నిలిచింది. ప్రపంచ ప్రజాక్షేమ నిమిత్తం తన అశేష సంపదను, సంతానాన్ని త్యాగం చేసింది సోవియట్ రష్యా. మానవతా ప్రియులందరూ నాడు సోవియట్‌కి జేజే లర్పించారు. ఆ సత్యాన్ని గుర్తించిన కవులు కనకనే స్వర్గీయ అడివి బాపిరాజుగారు 'విజయ రష్యా' గేయం రచించారు. శ్రీశ్రీ 'లేలే రష్యా' గేయం రచించారు.

అంతేకాదు.

సోవియట్ రష్యా సాధించిన 'మానవ ఔన్నత్యాన్ని ప్రదర్శించే విద్య' గురుదేవులు రవీంద్రునికే ఉత్తేజాన్ని ఇచ్చింది. 'మానవుడు మానవుడుగా జీవించే తావు యిదే. ఆ విద్యనే విజ్ఞానాన్నే యిక్కడ సాధిస్తున్నారు' అని అన్నారు రవీంద్రులు. 'మాస్కో లేఖలు' పుస్తకంలో రవీంద్రులు సోవియట్ సాధించిన విద్యను గురించి వేనోళ్ళ ప్రశంసించారు. ఆయన తాను భారతదేశంలో సాధించదలచిన లక్ష్యాలకు రూపురేఖలను స్పష్టంగా తీర్చిదిద్దుకున్నది ఆ సోవియట్ సందర్శనంలోనే.

ప్రభాత .......నిలాలకు పులకలెత్తి, సూర్యోదయ కాంతిలో మెరసే ప్రతిచోటునీ, బాటనీ మనుగడనీ తమదిగా చేసుకుంటారు మహాకవులు. వారి హృదయాలలో ఇరుకులూ, ఇరులూ

ఉండవు. విశ్వగోళ పరిమితి గల హృదయాలు వారివి. కనుకనే రవీంద్రులుకాని, శ్రీశ్రీకాని సోవియట్ విద్యావిధానాల్నీ, విద్యామందిరాల్నీ ప్రశంసించారు. ఉత్తేజితులయ్యారు.

ఈ యథార్థాల్ని చాటడమేనా శ్రీశ్రీ చేసిన నేరం?

సంస్కృతీ ప్రియులైన మీ అందరి సంతకాల ప్రక్కనే భారతీయాదర్శాలకు నడుం బిగించామని ఆషాఢభూతి పద్ధతిని చెబుతూ, రెండోవైపు శ్రీశ్రీ ప్రతిభాదర్పణంమీద తారు పూయడానికి ప్రయత్నిస్తున్నవారి సంతకాలూ వున్నాయి.

కాబట్టి, మిమ్మల్ని ఇందులో అంతరార్థాలు, రహస్యాలు ఏమున్నాయో తేల్చి చెప్పమని కోరుతున్నాను.

ఈ సంగతి యిలా వుంచండి. చిన్న ప్రకటనలోని హంశాల విషయం గురించి కొంత చెప్పనివ్వండి.

ఒక హంశం : శిష్ట సభా ప్రజాస్వామ్య పరిపాలనను పరిరక్షించుకోవాలనిన్నీ.

రెండో హంశం : నియంతృత్వంపట్ల - అది వామపక్ష నియంతృత్వమైనగాని, లేక తద్వ్యతిరేకుల నియంతృత్వమైనగాని పూర్తిగా విముఖులమనిన్నీ ప్రకటిస్తున్నారు. నిజమే. ఈ సందర్భంలోనే మీ ఎదుట కొన్ని విషయాలు నివేదిస్తాను. బ్రతుకుబాటలో ఏది 'ప్రజాస్వామ్యం' అయిందో మీరే యోచించగలరు.

'శిష్ట ప్రజాస్వామ్యవాదు'లనీ, 'జాతీయత'కు గుత్త అధికారులనీ భావింపబడిన మన నేతలు 'ప్రజాస్వామ్య' 'సంస్కృతి' గురించి కొంత వినండి.

## జాతీయ కవికి అమృతాంజనంపై గేయాలు వ్రాయవలసిన దౌర్భాగ్యం

స్వర్గీయ గరిమెళ్ళ సత్యనారాయణగారిని గురించి ఒక పర్యాయం సమాలోచించండి. 'మాకొద్దీ తెల్లదొరతనం' గేయం రచించారు. జాతీయోద్యమంలో భాగస్వామి అయ్యారు. జైలుకు వెళ్ళారు. మనం అందరమూ, చరిత్రతోపాటు ఆయన్ని జాతీయ కవిగా గౌరవించాం!

జాతీయకవి జీవితంలో యెన్ని అగచాట్లు పడిందీ మనలో ప్రతి వొకరికీ తెలుసు. అనారోగ్యం, దారిద్ర్యం ఆయన్ని చంపాయి.

మన ప్రజాస్వామ్య నేతలు మంత్రి పదవులు పట్టారు. రాజకీయ లబ్ధి పేర పొలాలు పంచుకొని పట్టాలు పుచ్చుకున్నారు. కాని, మన జాతీయ కవికి ఒక సెంటు పొలమైనా ఇవ్వలేకపోయారు. కనీసం బ్రతుకుతెరువు చూపలేకపోయారు. పట్టభద్రుడై జాతీయోద్యమ భాగస్వామియై, జాతీయ కవిగా నిల్చిన సత్యనారాయణగారు తన బ్రతుకుని ఎలా వెళ్ళతీసిందీ మన అందరికీ తెలుసు.

జాతీయకవిని మన్నించి గౌరవించడం చేతకానివారేనా శిష్టులూ, ప్రజాస్వామ్య వాదులూను? వీరి హయాములోనేనా కవులకూ, కళాకారులకూ అన్నోదకాలు, ఆనందసౌఖ్యాలు లభిస్తాయని మనం ఆశించేది? జాతీయ కవికే స్థానంలేని ప్రజాస్వామ్యంలో 'ఆస్థానకవి' పదవీ విషయంలో ఈ శిష్టులు జరిపిన తతంగం అందరికీ తెలుసు. 'ఆస్థానాలు ప్రజాస్వామ్యంలో ఉండ'వని అందరం ఆశించాం. కాని ఆస్థానాలు కల్పించి నాటకమాడారు. రద్దు చేశామన్న 'ఆస్థానాల్లో'

ఈ రోజున ప్రజా ప్రతినిధులుగా జమీందార్లను నిలబెట్టి కొత్తరకం 'శిష్ట ప్రజాస్వామ్యానికి' నివాళు లెత్తబోతున్నారు.

నేతల సంగతి అలా ఉంచండి. జాతీయకవికి, ప్రకటనపై సంతకాలు చేసిన వ్యాపార సంస్థలవారు చేసిన బహుమానం ఏమిటో ఆలోచించండి. ఆ జాతీయ కవిని 'అమృతాంజనం' మీద గీతాల్ని రాయించే స్థితికి తెచ్చారు. జాతీయతనీ, కవుల ఆత్మనీ అణాపైసల్లోకి మార్చి తంబుచెట్టీ స్ట్రీట్‌లో భూస్థాపితం చేశారు. ఆ పెద్దలేనా యీనాడు భారత జాతీయ సంస్కృతిని గురించీ, మేధా స్వాతంత్ర్యం గురించీ ధర్మపన్నాలు చెప్పడానికి ముందుకు వస్తున్నారు? ఆ అర్హత వారికి ఉందా?

జాతీయ నేతలు, జాతీయ వ్యాపార పారీణులు జాతీయకవికి కల్పించిన 'సుఖశాంతి' విషయం అలా ఉంచండి.

'శ్రేయోరాజ్యం' పేర, 'శిష్ట సభా ప్రజాస్వామ్యం' పేర ఈ ఏడేళ్ళ పరిపాలనలో మన సంస్కృతికీ, నాగరికతకూ జరిగిన మంచిచెడ్డల్ని పరిశీలించండి.

ఇందులో నా సొంత గొడవ కొంత చెప్పుకోక తప్పడంలేదు. ఐనా అవసరం కలిగినపుడు అయినవారి ఎదుట చెప్పుకోకపోతే ఎలాగ?

## కాటూరులో 'ప్రజాస్వామ్యం'

సంతకాలు పెట్టినవారిలో ఒకరు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు. నాదీ ఆయనదీ ఒకటే ఊరు. దాని పేరు కాటూరు.

ఆ గ్రామస్తుణ్ణి, రచయితనూ అయిన నాపట్ల, నా గ్రామ ప్రజలపట్ల మన జాతీయ నేతలు తీసుకున్న చర్యలు ప్రజాస్వామ్యమో, మరొకటో మీరు యోచించండి. వారు ఏయే నేరాల నిమిత్తం ఈ చర్యలు తీసుకున్నారో ఇప్పటికయినా నాకు తెలిస్తే సంతోషిస్తాను.

1. రెండు వేల రూపాయల ఖరీదు మించిన నా ప్రాచీన ఆధునిక ఆంధ్ర సంస్కృత గ్రంథాలన్నీ ధ్వంసం చేయబడ్డాయి. కవికి రచనలు ప్రాణప్రదాలని మీ అందరికీ అనుభవమైన విషయం. పదివేల సంఖ్యా పరిమితిగల కావ్యాలు, భగవద్గీత, వివేకానంద మున్నగు అనేకానేక అనువాద గ్రంథాలు, మరికొన్ని వేల పేజీల వచన రచనలు - ఇవన్నీ అముద్రిత రచనలే - మొత్తం నాశనం చేయబడ్డాయి. శ్రీ గురజాడ మహాపురుషుని అముద్రిత రచన 'ఋతుశతకం' వ్రాతప్రతి కూడా నాశనం చేయబడింది. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం సంపుటాలు, గాంధీ, నెహ్రూ ఆత్మకథలు, కాంగ్రెసు చరిత్ర, మరి కొన్ని నవజీవన ట్రస్టు వారి గ్రంథాలు మున్నగు ఉత్తమ గ్రంథాలను పచారీ దుకాణాల్లో అమ్మేశారు. నాకున్న కొద్దిపాటి ఆస్తిపాస్తుల్ని ధ్వంసం చేశారు. నా యింటి తలుపుల్ని నెలరోజులుగా తెరచివుంచి వల్లకాడు చేశారు.

ఈ సంఘటనవల్ల మన జాతీయ నేతలకు కవులపట్ల గల గౌరవాభిమానాలను కొలుచుకోమంటారా? యోచించమని మనవి.

2. 89 ఏళ్ళ వయస్సున్న నా ముదుసలి తండ్రిని అనేకసార్లు నిర్బంధించి హింసించారు.

ఆత్మాభిమాని అయిన రైతు కనక ఈ అవమానభారాన్ని సహించలేక ఆయన ఆ దిగులుతోనే మరణించారు.

ఏ నేరం నిమిత్తం ఈ హింసా విధానం మన 'ప్రజాస్వామ్యవాదులు' అవలంబించారో వారి 'ప్రజా పరిపాలనకు' ప్రతిబింబమేమో మీరు ఆలోచించి చూడవలసిందని మనవి చేస్తున్నాను.

3. కాటూరు గ్రామ ప్రజానీకం ఎలాంటిదో, వారి గౌరవ మర్యాదలు ఎలాంటివో శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారికి తెలుసు.

ఆంధ్ర రైతాంగానికి ప్రజానీకానికి ఆత్మాభిమానం ప్రథమ లక్షణమని అందరెరిగినదే. అలాంటి మానధనులైన గ్రామీణ ప్రజల్ని 16-7-49న ఈ 'ప్రజాస్వామ్య పరిపాలకులు' ఏం చేశారో వినండి.

నాటి తెల్లవారుజామున ఐదారు వందలమంది సైనికులు గ్రామాన్ని చుట్టుముట్టారు. వయో భేదాన్ని పాటించకుండా ప్రతి మగవాణ్ణి పట్టి తన్నుకుంటూ వీధులగుండా నడిపించి ఒకచోటికి చేర్చారు. రెండువేల ఎనిమిది వందలమంది పైచిలుకు మగవారిని ఇలా చేర్చారు. వారిని మూడు తరగతులుగా విభజించారు. 350 మందిని ప్రత్యేకించి విడదీసి వారిని కొన్ని వందలమంది సైనికులు కలిసికట్టుగా కర్రలతో బాదారు. అది ఎలాంటి కొట్టుడో తెలియాలంటే నాటి యీ బాదుడులో రెండుబళ్ళకు పైచిలుకు ములుగర్రలు విరిగి ముక్కలయ్యాయి. అవి కాక లాఠీల సంఖ్య అతీతం. అప్పటికే స్పృహతప్పి పడిపోతూన్నవారిని మొత్తం దిగంబరుల్ని చేశారు. మర్యాదని కాపాడుకుందామని చేతులు అడ్డంపెట్టుకున్న వారినల్లా తిరిగి చేతులు నలగగొట్టారు. ఆ తర్వాత వారందరినీ పంక్తులుగా నిలబెట్టించి, చేతుల్ని నిలువుగా పైకెత్తించారు. ఆ పంక్తులకు వెనక రైతుల ఇల్లాండ్రను, తల్లులను కొందరిని పట్టి తెచ్చి నిలబెట్టారు. వారి వెనుకనే మిగిలిన వేలాది ప్రజల్ని తగిన దెబ్బలు వడ్డించి నిలబెట్టారు. ఈ దిగంబరుల ఊరేగింపును దాదాపు మూడు గంటలపాటు సాగించారు. పైకెత్తిన చేతుల్ని దింపనీయలేదు. 'పోలీసు రాజ్యానికి జై' 'గాంధీజీకీ జై' (పాపం శమించుగాక!) అనే నినాదాలు ఇవ్వమని నిర్బంధించి అనిపించి హింసించారు. ఆఖరున ఊరిమధ్యనున్న బాపూజీ విగ్రహంచుట్టూ ప్రదక్షిణం చేయించి మధ్యాహ్నం రెండు గంటలకు శవప్రాయులైన జనాన్ని వదిలివేశారు.

ఈ సంఘటన గురించి చాల చాల క్లుప్తంగానే చెప్పాను. నేనీ వాక్యాలు వ్రాస్తున్నపుడు నాటి 'దిగంబర' దృశ్యాలు కళ్ళముందు మెదుల్తున్నాయి. కారుణ్యానికీ, మానవతకూ నిలయాలు మీ హృదయాలు. మీరూ నావలెనే ఆనాటి దృశ్యాల్ని ఊహించగలరు.

మిమ్మల్ని ఒకటే ప్రశ్న అడుగుతున్నాను. ఇది ఏ నాగరికతకు, ప్రజాస్వామ్యానికి చిహ్న ప్రాయమో ఆలోచించి చెప్పగలరా?

మానవ సంస్కృతీ శ్రేయోకాంక్షులైన మీ అందరికి నిజానికి ఈ విషయాలు తెలుసు.

శ్రేయోరాజ్య లక్ష్యాలకు అపచారం జరిగిన ఆ రోజులలో మీరే కారణంచేత గొంతెత్తి నిరసించ లేకపోయారో చెప్పండి.

ప్రజల ఆత్మాభిమానాల్ని మంటగలిపిన ఆ నియంతృత్వ నీతిని ఖండించేందుకు మీ

రెందుకు సిద్ధపడలేదో వివరించండి.

భారతీయ సంప్రదాయాలకూ, సంస్కృతికీ, ప్రజాస్వామ్య జీవితాలకూ చిచ్చు ముట్టిస్తూంటే మీ కంఠం మూగవడిందే కారణంచేత? సమాధాన మివ్వండి.

'గాంధారి ఆవేదన' (దీన్ని తెలుగు చేసినవారు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు. ఆయన మంత్రిగా ఉన్న కాలంలోనే యీ దిగంబర కాండ జరిగింది. సాహితీ ప్రియులూ, రసజ్ఞులూ అయిన శ్రీవారికి, తామనువదించిన రచనలోని మహాకవి ప్రబోధం కూడా మరపుకు వచ్చింది కాబోలు.) అందులో, అరణ్యావాసానికి తరలిపోయే తరుణంలో ద్రౌపది గాంధారి అనుమతి పొందడానికి వెళ్ళింది.

"తల్లీ నువ్వెక్కడ ఉంటే అక్కడ విజయం ఉంటుంది. నీ బట్టలు ఊడదీసి నా బిడ్డలు అమంగళాన్ని నెత్తినెత్తుకున్నారు. అవమానభారంతో వెళ్ళుతున్నావు. నిజానికి నీవు విజయంతో మాత్రమేకాక, నా కోడళ్ళ పసుపు కుంకుమలను కూడా తీసుకుపోతున్నావు..." అన్నది గాంధారి. ఒక మానవతి వలువలు ఊడ్చిన ఫలితంగా పరిణమించిన దేమిటో ప్రతివారికి తెలుసు.

ఇంతేకాదు.

4. తేలప్రోలు గ్రామంలో 'వేమన గ్రంథాలయం' ఉంది. అంత చక్కని గ్రంథాలయం ఈ మా ప్రాంత గ్రామాల్లో ఎక్కడా లేదు. ఎక్కడా దొరకని పత్రికలు, పుస్తకాలు, ఇక్కడ లభించేవి. అంతచక్కని నిర్వహణ చూచి అనేకులు ముగ్ధులయ్యారు. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారివంటి మహనీయుల ప్రశంసకు పాత్రమయిన గ్రంథాలయ మది. ఆ విశిష్ట గ్రంథాలయం నామరూపాలు లేకుండా ధ్వంసం చేయబడింది.

ఇది ఏ సంస్కృతికి నమూనాగా మీరు భావిస్తున్నారో తెలుసుకోగోరుతున్నాను.

## సాహిత్యాన్ని చలిమంటల పాలుచేసినవారేనా సంస్కృతీ పరిరక్షకులు?

5. ఆంధ్రదేశంలోని ఉత్తమ ప్రచురణ సంస్థల్లో ఒకటిగా 'ప్రజాశక్తి ప్రచురణాలయం' ప్రసిద్ధి చెందింది. రెండున్నర సంవత్సరాలలోనే ఈ సంస్థ మూడువందల పైచిలుకు వివిధ గ్రంథాలను ప్రచురించింది. అపూర్వచరిత్రను నిర్మించింది. ఈ సంస్థ అనేక విజ్ఞాన, రాజకీయ, ఆర్థిక గ్రంథాలతోపాటు ఆంధ్ర జాతీయ వికాసాభివృద్ధికి దోహదమిచ్చే పెక్కు రచనలను ప్రకటించింది. ఆంధ్రమహాపురుషుల రచనలను, జీవితాలను ప్రచురించింది. శ్రీ కందుకూరి, శ్రీ గురజాడ, శ్రీ గిడుగు, శ్రీ చిలకమర్తి మున్నగు మహనీయుల జీవితచరిత్రల్ని ప్రకటించి ఆంధ్ర మహాజనులకు ఎంతో సేవ చేసింది.

ఆ సంస్థనూ, సంస్థకుసంబంధించిన ప్రచురణలనూ, ముద్రణ పరికరాలనూ, ప్రత్యేక గ్రంథాలయమునూ, దాదాపు రెండు లక్షల రూపాయల ఖరీదు చేసే ఆస్తినీ ధ్వంసం చేశారు. లారీలతో ఆ గ్రంథసంచయాన్ని తెచ్చి నడిరోడ్డుమీద చలిమంటలు వేశారు.

ఈ విధానం నీతీ, సంస్కృతికీ సంబంధించినదేనా?

ఇంతేకాదు.

6. మీలో చాలమందికి శ్రీ సుంకర సత్యనారాయణగారి పేరు తెలిసే ఉంది. ఆయన 1930-32 సత్యాగ్రహోద్యమాలలో పాల్గొని, లాఠీదెబ్బలకు గురియై, జైలుశిక్ష అనుభవించారు. ఆయన నాటకాలు తెలుగునాట, వెలుపల ప్రదర్శింపబడి వేనోళ్ళ పొగడబడ్డాయి. వారు రచించిన నాటకాలు చూచి మన 'ప్రజాస్వామ్య నేతలే' విరాళాలిచ్చారు. కాని, ఆయన్ను నెత్తురు కక్కేటట్లు కొట్టి, ఆయన అముద్రిత రచనలనూ, తులసీ రామాయణం మున్నగు గ్రంథాలను నాశనంచేసి, హింసించడానికి ఆ ప్రజాస్వామ్య నేతలే బాధ్యులు.

అంతేగాదు.

7. శ్రీ సుంకరతోపాటు సోదర రచయిత శ్రీ వాసిరెడ్డి భాస్కరరావుగారినీ అలాగే హింసించి నిర్బంధించారు. ఆయన రెండేళ్ళుగా శ్రమించి రచించిన 'సారస్వతచరిత్ర' వ్రాతప్రతిని ధ్వంసం చేశారు.

8. ఈ విధంగానే 'అనేక గ్రంథాలను రచించిన' కారణంగా శ్రీ తుమ్మల వెంకటరామయ్య గారిని (ఇది డిటెన్షన్‌కు ప్రభుత్వం తెలిపిన కారణం) డిటెయిన్ చేశారు. అలాగే శ్రీ అవసరాల సూర్యారావు, శ్రీ కోగంటి గోపాలకృష్ణయ్య, మున్నగువారిని డిటెయిన్ చేశారు.

అలాగే శ్రీ గంగినేని మున్నగు రచయితలను జైల్లో కుక్కారు.

ఈ రకంగా కవుల, కళాకారుల గొంతు నులిమి ప్రజావాణిని వినబడనీయరాదని ప్రయత్నించారు. ఆంధ్ర సంస్కృతికి కళాశీలుర జీవితాలకు, ప్రజల స్వాతంత్ర్యానికి జరిపిన అపచారాల్లో సహస్రాంశమయినా చెప్పలేకపోతున్నాను. లేఖలో అవన్నీ చెప్పడం కష్టంగూడా.

ఈ విధమయిన దమననీతి భారతీయాదర్శాలకు, భారతీయ సంస్కృతికి, మేధా స్వాతంత్ర్యానికి పూర్తిగా విరుద్ధమైంది. ఈ దారుణ హింసాకాండ ప్రజాస్వామ్యానికి గొడ్డలిపెట్టు. శ్రేయోరాజ్య లక్ష్యాలకు ఎదురుద్రేటు.

ఈ అత్యాచారాలన్నీ మీకు తెలుసు. అయితే, ఆనాటి 'క్లిష్టపరిస్థితి'కన్నా మించిన 'క్లిష్ట పరిస్థితి' వేరే ఉండదనీ, ఉండబోదనీ మీకు తెలుసు. కాని ఆ క్లిష్టపరిస్థితులలో ఒక్కుమ్మడి కళా సంస్కృతులమీద దెబ్బపడుతున్న స్థితిలో, ప్రజల స్వాతంత్ర్యానికి భంగం కలిగిన స్థితిలో భారతీయాత్మకు విరుద్ధంగా హింసావిధానం చెలరేగినప్పుడు మీ అందరి కంఠాలు ఎంచేత మార్మోగలేదు? ఎందుకని మూగపడిపోయాయి? ఆనాటి క్లిష్టపరిస్థితులకంటే నేడు జాతికీ, స్వాతంత్ర్యానికీ, సంస్కృతికీ, ఏ ఘోరప్రమాదం జరుగబోతోందని 'క్లిష్టపరిస్థితులని' పేర్కొన్నారో మనసు విప్పి చెప్పగలరా?

దారుణ దమననీతి పాలించిన ప్రబుద్ధులకు వారి దౌష్ట్యాలకు స్వస్తి జరగబోవడమేనా 'క్లిష్ట పరిస్థితి'.

నాడు 'దరిద్రులమైన' మామీద అత్యాచారాలు జరుగుతూంటే లేని ఆదుర్దా, కదలిక ఇవాళ మీలో కదలడానికీ, ప్రకటనలు జారీచేయడానికీ మూలకారణమేమిటి?

అనేక క్లిష్టపరిస్థితులలో ఆంధ్ర ప్రజలు అద్భుత చైతన్యాన్ని ప్రదర్శించారు. తమ సంస్కృతిని జాతీయాదర్శాల్ని రక్షించుకోవడంలో ప్రజలకు తగిన వివేచన ముందని నా గాఢవిశ్వాసం.

నాగార్జున శిల్పాల్ని తరలించే వేళ తమకుతామై ఆందోళన చేశారు ప్రజలు.

రాష్ట్రాన్ని సాధించుకోవడంలో, సంస్కృతీ విరోధులైనవారిని తొలగించి విజయాన్ని సాధించుకోవడంలో ఆంధ్రప్రజలు ఇతర్ల సలహాలకోసం వేచియుండలేదు. తమ మార్గాన్ని తాము ఏనాడో ఎంచుకున్నారు. కవితాభాషలో మీరు పొదిగిన 'క్లిష్టపరిస్థితులు' అన్న మాటకు సరాసరి అర్థం ఈనాడు జరగబోతున్న ఎన్నికలే కనక అయినట్లయితే ఆ విషయంలో ఆంధ్ర ప్రజలు స్థిరచిత్తంతో మహత్తర సత్యాన్ని రుజువు చేయబోతున్నారు.

డాక్టర్ రాధాకృష్ణగారు అన్నట్లే వ్యక్తిని ఏ వర్గమూ, ప్రచార సంస్థా, వ్యాపార సంస్థా అణచిపెట్టలేని - ఒక కొత్త సమాజ నిర్మాణానికే ఆంధ్ర ప్రజలు తయారవుతున్నారు. వర్గాల దోపిడీ, వ్యాపారుల పీడన, ప్రచార సంస్థల వొత్తిళ్ళనీ అరికట్టి సుఖశాంతుల్ని నెలకొల్పబోతున్నారు.

నియంతృత్వం అంటే ఏమిటో, ఏది ప్రజాస్వామ్యమో ఇప్పటికే ఆంధ్ర ప్రజలకు తెలుసు. ఇవాళ కొత్తగా 'నియంతృత్వం' పేరుబెట్టి 'బూచి'ని చూపించి జడిపించడానికి ఆంధ్ర ప్రజలు అమాయకులు గారు.

'చిన్న ప్రకటన'ద్వారా మనసుల్ని ప్రజలకు వ్యక్తం చేయదలచిన పెద్దలందరూ 'క్లిష్టపరిస్థితులు' ఏర్పడిన ఈ తరుణంలో మన ఆంధ్రదేశంలోనే వున్నట్లయితే నాకీ లేఖ వ్రాయవలసిన అగత్యం కలిగేదికాదు. ఎవరి శ్రేయస్సును కాంక్షించి, ఎవరి కర్తవ్యాలను గురించి మీరింతగా కలవరపడుతున్నారో వారి జన్మభూమిలోనే నిలబడి లక్ష్యసిద్ధికై కృషి చేయవలసింది. స్వర్గీయ గిడుగు రామమూర్తిగారు పెట్టిన ఒరవడి వుంది కదా? ఆయన పర్లాకిమిడి వదలిరాలేదా?

'ఆకర్ణాంత విశాలలోచను'డైన సరే గోడవతలనున్న వస్తువు దృగ్గోచరం కానట్టే మదరాసులో ప్రచార సంస్థల్లో, వ్యాపార సంస్థల్లోనివారు వారెంత ఘనులైనప్పటికీన్నీ - ఆంధ్ర సీమ రూపరేఖా విలాసాలను గుర్తించడం తగని కష్టం సుమండీ!

## న్యాయాన్యాయాల మధ్య యుద్ధం

క్లిష్టపరిస్థితులని చెప్పబడే ఆంధ్రలోని ఎన్నికలు ఎవరెవరో వ్యక్తులమధ్య జరుగుతున్నదికాదు. **న్యాయాన్యాయాలకు - సత్యాసత్యాలకు - ధర్మాధర్మాలకు - జనన మరణాలకు** మధ్య సాగుతూన్న పోరాటం యిది. ఎవరి ప్రమేయమనేది లేకుండానే ప్రజలు న్యాయాన్ని, సత్యాన్ని, ధర్మాన్ని, జననాన్ని వరింపబోతున్నారు.

మారుపేర్లతో న్యాయాన్ని దాచలేరు. అబద్ధాలతో సత్యాన్ని నిర్మూలించలేరు. రక్తప్రవాహాలతో ధర్మాన్ని ముంచెత్తలేరు. గావుకేకలతో జననాన్ని, సృష్టిని నిరోధించలేరు.

సూర్యోదయం ఎలాంటి అనివార్య సత్యమో, నూతన సమాజ నిర్మాణమూ అలాంటి సత్యమే.

మీ సంస్కృతీ కళాజీవనం పట్ల నా కెంతో గాఢవిశ్వాసం ఉంది. మీరు దూరాన నిలచి చూచి హితవు గరపడం కన్నా సత్యాన్ని పరిశీలించి ప్రజలకు సరైన మాట చెప్పాలని మనవి చేస్తున్నాను.

ఇక్కడి రచయితల, కళాకారుల, ప్రజల పక్షాన గౌరవనీయులైన సంస్కృతీ ప్రియులైన మిమ్మల్నందరినీ ఆంధ్రదేశానికి రావలసిందిగా ఆహ్వానిస్తున్నాను.

ఒకసారి పర్యటించి వెళ్ళండి. రండి.

ఈ ఏడేళ్ళ ప్రజాస్వామ్య పరిపాలనలో మన సంస్కృతికీ, మేధాస్వాతంత్ర్యానికీ, జాతీయాదర్శాలకూ, నీతికీ, నిజాయితీకి బాగే జరిగిందో ఓగే జరిగిందో నిష్పక్షపాతంగా విచారిద్దాం. నేను నివేదించిన సంఘటనలు, వాటి నిజానిజాలు ఏమిటో నిగ్గు తేలుద్దాం. నిజమేదో గ్రహించి దాన్ని నిర్భయంగా ప్రకటిద్దాం.

ఆ విధంగా ఆంధ్ర ప్రజల మధ్య మనం రచయితలు, కళాకారులం పర్యటించిన తర్వాత మన మనసుల్నీ, ప్రకటనల్నీ ప్రజలముందు ఉంచుదాం. ఆ రోజున - "నియంతృత్వానికి విముఖులమని మాత్రమేకాదు, నియంతృత్వం ఎక్కడ ఏ రూపంలో మొలకెత్తినా దాన్ని నిర్మూలించడంలో ప్రజలకు మన కళా సంపదల్ని వినియోగించుదాం, అని శపథం చేద్దాం.

"విశిష్ట ప్రజాస్వామ్య పద్ధతులతో సర్వ శ్రేయోరాజ్యాన్ని రూపొందించి పరిరక్షించడంలో మన కర్తవ్యం మనం అచంచలంగా నిలబడి నెరవేర్చుదాం.

"కవుల్నీ, కళల్నీ కొనివేసే సంస్థల్నీ, వ్యాపార సంస్థల్నీ, వర్గాల్నీ అరికట్టి ప్రతి ఒకరి మేధాస్వాతంత్ర్యాన్ని కాపాడుదాం. ఇవన్నీ నెరవేర్చడానికి, ఇది ప్రజల ముందు వ్యక్తం చెయ్యడానికి ముందు మీరు ఆంధ్ర ప్రజల మధ్య పర్యటించి కొన్ని వాస్తవిక స్థితిగతుల్ని గ్రహించవలసి ఉందని తిరిగి మనవి చేస్తున్నాను.

మీలో తమ తమ జీవితాల్ని ఆంధ్ర సంస్కృతీ వికాసాభ్యుదయానికి అంకితం చేసినవారున్నారు. ఆంధ్ర చరిత్రను పునరుజ్జీవింపచేయడానికి కృషి చేసినవారున్నారు. అంచేతనే మీ ఎదుట మనవి చేస్తున్నాను.

మీరు కోరుతున్నది 'సర్వే జనా స్సుఖినోభవంతు' అయినట్లయితే, మీరు వాంఛించేది ప్రజాభ్యుదయమే అయితే, మీరు కాంక్షించేది జాతీయాదర్శ లక్ష్యసాధన అయినట్లయితే తప్పకుండా ఇక్కడకువచ్చి ప్రజలముందు పర్యటించవలసి వుంటుందని మనవి చేస్తున్నాను.

అందుకు మీ సంసిద్ధతని తెలియజేస్తారని గాఢంగా విశ్వసిస్తున్నాను.

ఇవేవీ జరుగకుండా - ఒకచేత్తో ఏవేవో లక్ష్యాలను ప్రకటిస్తూ, మరో చేత్తో రచయితల మేధాస్వాతంత్ర్యాన్నీ, గౌరవాల్నీ మలినపరచే పత్రికా వ్యాపారుల, వ్యాపార సంస్థల యజమానుల సంతకాల సరసనే నేను సంతకం పెట్టి కోట్లాది ప్రజలకూ, సాహితీప్రియులకూ అవమానకరంగా ప్రవర్తించలేను. నన్ను నేను వంచించుకోలేను.

భవదీయుడు,

**నార్ల చిరంజీవి**

(విశాలాంధ్ర, 9-2-1955)

## సమాప్తి



# సంఘమిత్ర ప్రచురణలు

**జననీ జన్మభూమిశ్చ...**

గోపరాజు సీతాదేవి స్వీయచరిత్ర

(50 సంవత్సరాల మహిళా ఉద్యమ అనుభవాలు-జ్ఞాపకాలు)

వెల : రు. 25/-

**జాతీయ స్వాతంత్ర్యోద్యమం - జాతీయ పునరుజ్జీవనోద్యమం తెలుగు పత్రికా రంగం**

రచన : పరకాల పట్టాభి రామారావు

(స్వాతంత్ర్య సమరయోధులు)

వెల : రు. 50/-

**భారతీయ తాత్వికచింతనపై జాతీయోద్యమ ప్రభావం**

రచన : పరకాల పట్టాభి రామారావు

వెల : రు. 30/-

**ఇది బుద్ధునిపై అపవాదుకాదా?**

**కూచిపూడివారి దశావతారముల శబ్దంపై చర్చావేదిక**

నిర్వహణ : సంపాదకత్వం : శ్రీ పరకాల పట్టాభి రామారావు

వెల : రు. 20/-

**స్త్రీ విముక్తి ఉద్యమం నాడు-నేడు-రేపు**

రచన : సంకలనం : శ్రీ పరకాల పట్టాభి రామారావు

(ఆంధ్రప్రదేశ్ మహిళాసమాఖ్య తరపున)

వెల : రు. 20/-

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్**

విజ్ఞానభవన్, బ్యాంక్‌స్ట్రీట్

హైద్రాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలలోను



1944 డిసెంబరు 30వ తేదీన బెజవాడ రామమోహన్ లైబ్రరీ హాలులో జరిగిన జాతీయకవి చిలకమర్తి లక్ష్మీనరసింహం సన్మానసభ, స్వీయచరిత్ర బహూకరణ దృశ్యం. ( వేదికపై ఆశీనులైనవారి వివరాలు 19వ పేజీలో) 10-1-1945 ప్రజాశక్తి నుండి



**1947 జనవరి 17,18,19 తేదీలలో మద్రాసులో జరిగిన ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ ఆహ్వానసంఘ అధ్యక్షులు శ్రీ గోవిందరాజాచారి, సభా ప్రారంభకులు కె.ఎ. అబ్బాస్, సభాధ్యక్షులు శ్రీ పి.వి. రాజమన్నార్**

-1947 మార్చి అభ్యుదయ - మహాసభ ప్రత్యేకసంచిక

# ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమ వైతాళికులు



కందుకూరి వీరేశలింగం



గురజాడ అప్పారావు



గిడుగు రామ్మూర్తి



మాడపాటి హనుమంతరావు

# ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమ వైతాళికులు



కాశీనాధుని నాగేశ్వరరావు



కొమర్రాజు లక్ష్మణరావు



సురవరం ప్రతాపరెడ్డి



దామెర్ల రామరాయ

# నవ్యసాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల ఉద్యమ రథసారథులు



తెలికిచర్ల వెంకటరత్నం



దేవులపల్లి కృష్ణశాస్త్రి



అడవి బాపిరాజు



తాపీ ధర్మారావు

# నవ్యసాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల ఉద్యమ రథసారథులు



తుమ్మల వెంకట్రామయ్య



చదలవాడ పిచ్చయ్య



కొడవటిగంటి కుటుంబరావు



మహీధర రామమోహనరావు